


# రామాయణంలో విశేషాలు



డా॥ జి.వి. పూర్ణచంద్

Surya
BOOKS



# రామాయణంలో విశేషాలు

- డా॥ జి.వి.పూర్ణచంద్

Edition : 2006



Price : **Rs. 50-00**

*Publishers :*

**Victory Publishers**

**Regd. Off :** # 11-16-32(a), Singarajuvari St.,
Kothapet, Vijayawada - 1. Ph : 5563733

**Admn. Off :** # 29-28-40, Dasarivari Street,
Suryaraopet, Vijayawada - 2.
Ph : 5513734, 5513735



11

# అంకితం



శ్రీ లంక వెంకటరమణ

చరిత్ర పరిశోధకులు

ఆంధ్రప్రభ విశ్రాంత పాత్రికేయులు

సన్నిహితులు

**శ్రీ లంక వెంకటరమణకు**

సగౌరవంగా....

**- డా॥ జి.వి. పూర్ణచంద్**

# రామాయణ రసతరంగాలు

"ఈ ప్రపంచం అంతా ఎప్పుడూ తిన్న అన్నమే తింటోంది. తన రుచి, తన బతుకూ తనవే కాబట్టి! చేసిన సంసారమే చేస్తోంది - తనదైన అనుభూతి తనది కాబట్టి !

మళ్ళీ ఇదే రామాయణం దేనికీ అంటే... తలచిన రాముణ్ణే తలచుకొంటున్నాను - నా భక్తిరచనలు నావి కాబట్టి" - అంటారు విశ్వనాథవారు.

"రాసిన రాముడి కథనే రాశాననిపించుకోవడం వృథాప్రయాస -" అనికూడా అంటారు. కాబట్టి రామకథని కొత్తగా రాయాలనే తపన విశ్వనాథ వారితో సహా కవులందరికి సహజంగానే వుంటుందన్నమాట !

"ఎవ్వరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే-?" అని కంకంటి పాపరాజుగారు రామకథలోని నవ్యరీతిని విశ్లేషిస్తారు.

ఆదికవి వాల్మీకి రాముడి కథని ఒక ఆదర్శప్రాయమైన మానవుడి వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించే పాత్రగానే చిత్రించాడు.

*వెయ్యి రామాయణాలు :*

రామకథలు ఎన్ని వున్నాయో లెక్కలేదంటాడు గోస్వామి తులసీదాసు - తన "రామచరిత మానస"లో !

అసలు, రామకథలెన్ని వున్నాయి ? వెయ్యికిపైగానే వున్నాయని పండితులు లెక్కగట్టారు. చైనా, జపాన్, లావో, మలేషియా, సింహళం, థాయ్, టిబెట్, బాలి, కంబోడియా, ... భారత్ ఉపఖండంలోని దేశాలన్నింటిలోనూ రామకథలు విస్తారంగా ప్రచారంలో వున్నాయి.

ఎవరి కథ వారిది. ఎవరి కథనం వారిది !

వాల్మీకి భారతీయులకు ఆదికవి ! రామాయణం ఆదికావ్యం... అయినా, రామకథ వాల్మీకి స్వయంగా సృష్టించింది కాదు కదా ! నారదుడు వివరిస్తేనూ, బ్రహ్మ ప్రేరేపిస్తేనూ తాను దీని రచనకు పూనుకొన్నట్టే వుంది. చతుర్వింశతి సహస్రి అంటే 24 వేల శ్లోకాలతో దీన్ని రచించాడట !

ఆ తర్వాత అనేక రామాయణాలు సంస్కృత భాషలోనూ వెలిశాయి. ఇతర స్థానిక భాషల్లో కూడా వెలిశాయి. మహాభారతంలోనే రామాయణానికి సంబంధించిన అనేక వృత్తాంతాలు కన్పిస్తాయి. అధ్యాత్మ రామాయణం, అద్భుత రామాయణం వంటివి కూడా వున్నాయి. జైనులు రాసిన రామకథలు, ఇతర విదేశీయులు రాసిన రామకథలూ ఉన్నాయి.

సీతాదేవి రావణుడి కూతురని, మండోదరికి పుట్టిన తనయ అనీ చెప్పే కథలు ఇలా అవతరించినవే ! రావణాసురుడు తుమ్మినప్పుడు ఆయన ముక్కులోంచి సీతాదేవి పుట్టిందనే కథకూడా వుంది. అచ్చం ఆయన పోలికతోనే వున్నదనడానికి ఆయన ముక్కులోంచి వూడిపడిందంటాం మనం. ఈ తెలుగు నానుడి బహుశా ఈ కథవలనే పుట్టి వుంటుంది !

వస్త్రం అదేగాని, కుట్టిన విధానంలో తేడాలున్నట్లు, వాల్మీకి రాసిన రామకథనే తీసుకొని, వాల్మీకి అడుగుజాడల్లోనే వివిధ కవులు, వివిధ కాలాలలో, వివిధ రకాలుగా రామకథని మలిచి రాసుకున్నారు.

**రామాయణ రచనా కాలం :**

రామాయణ రచన ఎప్పుడు జరిగిందనే విషయం మీద వివిధ పరిశోధకులు చెప్పిన అభిప్రాయాలు ఇలా వున్నాయి -

1. డా॥ జాకోబీ : క్రీ.పూ. 6-8 శతాబ్దాల మధ్య.
2. హెచ్. జాకోబీ : క్రీ.పూ. 1-2 శతాబ్దాల మధ్య.
3. యం. వింటర్నిజ్ : క్రీ.పూ. 3వ శతాబ్ది.
4. ఎ. వెబర్ : క్రీ.శ. 3-4 శతాబ్దాల మధ్య.
5. ఎ.ఏ. మెక్డోనేల్ : క్రీ.పూ. 7వ శతాబ్ది.
6. ఎ.బి. కెయత్ : క్రీ.పూ. 3వ శతాబ్ది కన్నా కొద్దిగా ముందు.

ఎక్కువమంది పరిశోధకులు బుద్ధుడు, వర్ధమాన మహావీరుల తర్వాతే రామాయణం గ్రంథస్థం అయ్యిందని అంగీకరించారు.

పాణిని, పతంజలి, చరకుడు వీరి కాలానికి కూడా రామాయణం రచించబడలేదనేది వీరి ఊహ.

***సంస్కృత భారతంలో రామోపాఖ్యానం :***

మహాభారతం-రామాయణం కన్నా ముందా, తర్వాతా అనే విషయం మీదకూడా పండితుల మధ్య ఏకాభిప్రాయం లేదు. రామాయణంలో మహాభారత ప్రస్తావనలు పెద్దగా కన్పించవుగానీ, మహాభారతంలో కనీసం యాభైచోట్ల రామాయణం విశేషాలు కన్పిస్తాయి. మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పిన రామోపాఖ్యానం కన్పిస్తుంది. అందులో కొన్ని ప్రత్యేక అంశాలున్నాయి -

1. దశరథుడు సంతానం కోసం పుత్రకామేష్ఠి చెయ్యలేదు.
2. జనకుడుకి సీత కూతురేగాని, భూమిని దున్నేటప్పుడు దొరికినది కాదు.
3. గుహుడు, అత్రి మహామునుల ప్రస్తావన లేదు.
4. కైకకి ఒక వరం మాత్రమే కోరుకొనే అవకాశం వుంది. మూడు వరాలు కాదు.
5. విరధుడు, అగస్త్యుడు, శబరి కథలు ఇందులో లేవు.
6. వాలి సుగ్రీవుల యుద్ధం ఒకేసారి జరిగింది.
7. లక్ష్మణుడు కుంభకర్ణుణ్ని చంపాడు.
8. ఇంద్రజిత్తు 'శక్తి' ఆయుధం లక్ష్మణుడిని తాకలేదు. లక్ష్మణుడు మూర్ఛపోలేదు.
9. హిమాలయాలలోనుంచి ఎలాంటి మందుమొక్కనీ హనుమంతుడు తీసుకురాలేదు.

10. శీల నిరూపణ కోసం సీత అగ్నిప్రవేశం చేయలేదు.

11. శాంతి పర్వంలో రజకుడు సీత శీలం గురించి లోకువగా మాట్లాడిన సంఘటన కన్పిస్తుంది.

12. అరణ్య, శాంతి, స్వర్గారోహణ పర్వాలలో రామావతార ప్రశస్తి కన్పిస్తుంది.

## వాల్మీకి రామాయణం కన్నా ముందే ఇతర రామాయణాలు :

బుద్ధుడి తర్వాతి కాలానికి చెందిన వాడు వాల్మీకి అనేది ఎక్కువమంది పరిశోధకులు అంగీకరిస్తున్న విషయం అని ముందే మనం చర్చించాం.

బుద్ధుడి తర్వాత బౌద్ధ జాతక కథలు వెలువడ్డాయి. పాళిభాషలోని ఈ జాతక కథల్ని ప్రొఫెసర్ ఇ.బి. కోవెల్, డబ్ల్యు.హెచ్.డిరూస్‌లు ఇంగ్లీషులోకి అనువదించారు. దశరథుడి జాతక కథా కూడా అందులో వుంది. ధర్మపాద, సుత్తానుపాద గ్రంథాల ఆధారంగా డా॥ వెబర్ ఈ దశరథ జాతకథలోని దశరథుడు క్రీ.పూ. 5వ శతాబ్దివాడుగా భావించాడు.

కథలో కొద్దిపాటి భిన్నత్వం వున్నప్పటికీ, వాల్మీకి రామాయణానికి ఈ దశరథ జాతక కథ మూలకథగానే డా॥ వెబర్ భావించాడు.

రామాయణ కథకు సంబంధించి - అనామకజాతకం, దశరథ జాతకం, దశరథ కథనం అని మూడు జాతక కథలు వున్నాయని వాటిలో దశరథ జాతకం ప్రముఖమైందని కొందరంటారు.

1. బౌద్ధ జాతక కథలో దశరథుడు కాశీరాజు.
2. ఆయనకు రామపండితుడు, లక్ష్మణుడు అనే ఇద్దరు కొడుకులు, సీత అనే ఇంకో కూతురు వున్నారు. 16వేల మంది భార్యల్లో మొదటి భార్యకు కల్గిన సంతానం వీళ్ళు.
3. మొదటి భార్య చనిపోతే ఇంకో భార్యని చేసుకొన్నాడు. ఆమెకు భరతుడు కలిగాడు దశరథుడు ప్రేమకొద్దీ ఆమెకో వరం ఇచ్చాడు.
4. భరతుడికి ఏడేళ్ళు వచ్చాక తన వరం తీర్చమని భరతుడి తల్లి అడిగింది.
5. ఈ రెండో భార్య వత్తిడికి తట్టుకోలేక, మొదటి భార్య సంతానం రామలక్ష్మణుల్ని, సీతని పొరుగు రాజ్యానికి గాని, అడవులకు గాని వెళ్ళి కొన్నాళ్ళు వుండి తను మరణించిన తరువాత తిరిగి రమ్మని తండ్రి దశరథుడు కోరాడు.
6. జ్యోతిష్యులు 12 ఏళ్ళవరకూ జీవిస్తావని చెప్పడంతో దశరథుడు 12 ఏళ్ళ తర్వాత వారిని రాజ్యానికి తిరిగి రమ్మని చెప్పాడు.
7. చెల్లెలు సీత అన్నలిద్దరూ దుఃఖిస్తూ హిమాలయాలకు వెళ్ళారు. అక్కడ పూరిగుడిసెలలో నివసిస్తూ, కందమూలాలు తిని జీవించారు.
8. దశరథుడు 9 ఏళ్ళకే మరణించాడు. రాణి, భరతుడికి పట్టం కట్టవలసిందిగా ఆదేశించింది. కానీ, రాజపురోహితులు అందుకు అంగీకరించలేదు.

9. చేసేది లేక భరతుడు అన్నగారిని తీసుకురావడానికి హిమాలయాలకు వెళ్ళాడు.
10. 12 ఏళ్ళకు తిరిగి రమ్మని తండ్రి ఆదేశం కాబట్టి, ఇంకా మూడేళ్ళ వరకూ రాజ్యానికి రానని చెప్పాడు రామపండితుడు.
11. భరతుడి కోరిక మీద తన చెప్పుల్ని ("తిన్-పాదుకా") ఇచ్చి వాటి సహాయంతో పాలించవలసిందిగా చెప్పాడు రాముడు.
12. పాదుకల్ని సింహాసనం మీద వుంచాడు భరతుడు.

రాజ్యపాలనలో ఏమైనా తప్పు జరిగితే, ఈ చెప్పులు రెండూ ఒకదానికొకటి కొట్టుకునేవట ! పాదుకలతో పాటు సీత, లక్ష్మణులు మాత్రం రాజ్యానికి తిరిగి వచ్చేశారట.

తాను రాముడిననీ, తన తండ్రి శుద్ధోదనుడే దశరథుడనీ, మహామాయ దశరథుడి మొదటి భార్య అనీ, యశోధర సీత అనీ, శిష్యుడు ఆనందుడు భరతుడనీ బుద్ధుడు చెప్పినట్లు ఈ జాతకకథ వర్ణిస్తుంది.

ఇందులో, రాజ్యానికి తిరిగి వచ్చాక రాముడు సీతని పెండ్లాడినట్లుంది !

చెల్లిని పెళ్ళాడే వైపరీత్యం అలవాటుగా వున్న జాతులు ఉండి వుండేవేమో తెలియదు.

వాల్మీకి ఇలాంటి దోషాలన్నింటినీ పరిహరించి అద్భుతమైన కథని పండించాడు.

బౌద్ధానికి, బ్రాహ్మణులకూ మధ్య వైరం సంభవించిన కాలంలో క్రీస్తుపూర్వం చివరి శతాబ్దాల్లోనో, క్రీస్తుశకం తొలి శతాబ్దాలలోనో ఈ జాతక కథని తీసుకొని, దాన్ని విస్తరించి, బౌద్ధుల్ని ఇందులో రాక్షసులుగా చిత్రించి వుంటారని, వాల్మీకి రామాయణం ఈ విధంగా విస్తరించి వుంటుందనీ. జె.టి. వీలర్ అనే పండితుడు రాశాడు. ఇవన్నీ మనం అంగీకరించి తీరాల్సిన విషయాలు కావాలని లేదు. కానీ, విషయ అవగాహన కోసం వాటిని ప్రస్తావించవలసి వస్తోంది ! అంతే !

***<u>జైన రామాయణంలో మరిన్ని విరుద్ధ విశేషాలు :</u>***

జైనులు కూడా రామకథని రాశారు. వాల్మీకి కాలానికి జైన ధర్మాలు బాగా విస్తరించే వున్నాయి.

జైన రామాయణాలు రెండు ఉన్నాయి. విమల సూరి రాసిన పద్మచరితం, గుణభద్రుడు రాసిన ఉత్తర పురాణం. వీటిలో రామలక్ష్మణులు, రావణుడు కూడా జైన మతస్థులే. వానరులు, విద్యాధర జాతికి చెందిన వారనీ, వారిజండా మీద కోతి బొమ్మ ముద్రించి వుంటుందనీ, జైన రామాయణాలు చెప్తున్నాయి.

రావణుడి మెడలో వజ్రాల దండ వ్రేలాడుతూ వుంటుందని, ఈ వజ్రాల్లోంచి రావణుడి తల పది తలలుగా కన్పించేదని, అందుకని దశగ్రీవుడు, దశకంఠుడు అనే పేర్లు వచ్చాయట.

ఇంద్రుడు, వరుణుడు, యముడు, జైన రామాయణం ప్రకారం దేవతలు కారు, ఇరుగుపొరుగు రాజులు.

ఒక శ్రవణుడి చెల్లెలు చంద్రనఖి కూతుర్ని హనుమంతుడు పెళ్ళి చేసుకొన్నాడు.

చంద్రనఖి భర్త ఖరుడు. ఖరదూషణులనే రాక్షసుల్లో ఈ ఖరుడొకడు. అతని కూతుర్ని హనుమంతుడు పెళ్ళాడటం ఒక విశేషం ఈ కథలో!

వాలి తన తమ్ముడు సుగ్రీవుణ్ణి జైన మతంలో చేర్పించాడు.

దశరథుడికి నల్గురు భార్యలున్నారు. నాలుగో భార్య "సుప్రభ"కు పుట్టినవాడే శత్రుఘ్నుడు.

దశరథుడి కొడుకు వలన, జనకుడి కూతురి వలన తనకు చావు వుందని తెలిసి రావణుడు వారి తలలు నరికి తెమ్మని విభీషణుణ్ణి పంపాడట ! దశరథుడు జనకుడు ఈ విషయం తెలిసి, తమ స్థానంలో తమ విగ్రహాల్ని నిలబెట్టించారట ! విభీషణుడు, నిర్దయగా ఆ విగ్రహాల తలలు నరికి సముద్రంలోనికి వెళ్ళి పడేలాగా విసిరేశాడట.

రాముడికి మరో ముగ్గురు, లక్ష్మణుడికి పదకొండుమందీ భార్యలున్నట్లు ఈ జైన రామాయణంలో రాసి వుంది.

వెదురు కట్టెలు నరుకుతూ లక్ష్మణుడు పొరబాటున శంబుకుడి తలను నరికాడట.

మారీచుడు, సుబాహుడు పాత్రల ప్రవేశం ఏదీ ఈ రామాయణంలో కన్పించదు. రావణుడే సింహంలాగా అరిచి రాముడిని బైటకు రప్పించాడు.

సుగ్రీవుడి 13 మంది కూతుర్లను రాముడు పెళ్ళి చేసుకున్నాడు.

హనుమంతుడు, రావణుడు మంచి స్నేహితులు. లంకా సుందరిని హనుమంతుడు వివాహం చేసుకున్నాడు.

లక్ష్మణుడు సముద్రుడి కూతుర్ని పెళ్ళాడాడు.

లక్ష్మణుడిని నారాయణుడిగాను, రావణుణ్ణి ప్రతినాయకుడిగానూ ఈ జైన రామాయణం చిత్రించి, లక్ష్మణుడి చేతిలో రావణుడు అంతమొందినట్లు కన్పిస్తుంది.

రాముడికి మొత్తంమీద 8000 మంది భార్యలు, లక్ష్మణుడికి 16000 మంది భార్యలూ వున్నారని ఈ రామాయణం పేర్కొంటోంది.

**సీత రావణుడి కూతురు :**

ఉత్తర పురాణం అనే జైన గ్రంథంలో రాముడు "సుబల"కూ లక్ష్మణుడు కైకకూ పుట్టారు.

పులస్త్యుడి కొడుకు రావణుడు అమిత్వేగుడి కుమార్తె మణిమతిని చెరిచాడనీ, ఆమె మరణిస్తూ, మరు జన్మలో అతనికి కూతురుగా పుట్టి అతని చావుకు కారణం అవుతానని చెప్పిందనీ వుంది. ఆ విధంగా రావణ మండోదరులకు సీత పుట్టింది.

జ్యోతిష్యుల వల్ల ఇది తెలుసుకున్న రావణుడు సీతను దూరంగా వదలి రమ్మని మారీచునికి అప్పగిస్తే అతను మిథిలా నగరం దగ్గర ఒక గోతిలో పడేశాడు. అదృష్టవశాత్తూ ఆమె జనకుడికి దొరికింది.

లక్ష్మణుడు దీర్ఘవ్యాధితో చాలాకాలం తీసుకునీ తీసుకునీ చివరికి మరణించి నరకానికి వెళ్ళాడు.

రాముడు జైనమతం స్వీకరించి మోక్షాన్ని పొందాడు.

## పురాణాల్లో రకరకాల రామకథలు

**పద్మపురాణం :** పద్మ పురాణంలో సీత స్వయంవరానికి ఇంద్రుడు, రావణుడు, ఇద్దరూ వచ్చినట్లుంది. రావణాసురుడి తర్వాతే కుంభకర్ణుడి మరణం జరిగింది. ఉత్తర రామాయణంలో చివరికి సీతారాములు మళ్ళీ కలుసుకొని సుఖంగా కాపురం చేసినట్లుంది.

**శివపురాణం :** తాను శివుడి సలహా సూచనల మీదే ఈ రామావతారం ఎత్తినట్లు రాముడు సతీదేవికి చెప్తాడు. వాల్మీకి రామాయణంలో తాను మనిషినే అనుకొంటున్నాను అంటాడు. తేడా గమనించండి. శివుడి వీర్యంలోంచే హనుమంతుడు పుట్టినట్లు ఈ పురాణంలో వుంది.

**దేవీ భాగవతం :** గరుడ పురాణంలో శూర్పణఖ ముక్కు చెవులూ స్వయంగా రాముడే కోసినట్లుంది. లక్ష్మణుడు కాదు.

**నారద పురాణం :** రామలక్ష్మణులు నారాయణ సంరక్షణ ఋషుల అవతారం అని పేర్కొన్నారు.

**అగ్నిపురాణం :** మంధర క్రూరత్వమే సీతారాముల కష్టానికి కారణం అని వుంది.

**బ్రహ్మ వైవర్త పురాణం :** రావణుడు ఎత్తుకు పోయింది అసలు సీత కాదనీ మాయా సీత అనీ ఇందులో వుంది.

**స్కంద పురాణం :** రామేశ్వరంలో శివలింగం ప్రతిష్టించడంకోసం హిమాలయాల్లో ఒక రాయిని గుర్తు చెప్పి తీసుకు రావలసిందిగా హనుమంతుణ్ణి పంపాడు రాముడు. అతను సకాలంలో తీసుకురాలేకపోవడంతో రాముడు ఇసుక లింగాన్ని స్వయంగా తయారుచేసి ప్రతిష్టించాడని వుంది. హనుమంతుడిని రుద్రుడి అవతారంగా ఇందులో పేర్కొన్నారు. ధర్మదత్తుడు దశరథుడిగా అవతరించాడట.

**కల్కిపురాణం :** జనకుడికి సీతతోపాటు అక్కడ ఇంకో ఇద్దరు పిల్లలు కూడా దొరికారట.

**మహాభాగవత (దేవీ) పురాణం :** శివుడే హనుమంతుడిగా అవతరించి సీతని వెదికి పెట్టాడని ఉంది. సీత మండోదరి కూతురే !

**బృహద్ధర్మ పురాణం, నృసింహ పురాణం :** రావణుడు సీతను అంటుకొనకుండా మట్టి పెళ్ళలతో పెల్లగించి తీసుకుపోయాడు.

**అధ్యాత్మ రామాయణం :** రాముడు విష్ణువు అవతారం అని కౌసల్య, వశిష్టుడు, విశ్వామిత్రుడు, జనకులకు తెలుసు. మాయా సీతనే రావణుడు ఎత్తుకుపోయాడని వుంది. లక్ష్మణుడు అరణ్యవాసంలో వున్నంతకాలం ఉపవాసం చేశాడట.

రావణుడి కడుపులో అమృతభాండం కథ అధ్యాత్మరామాయణంలోనే ఉంది. వాల్మీకి రామాయణం కాదు. రాముడి చేతిలో మరణించి మోక్షం పొందడం కోసమే రావణుడు సీతను ఎత్తుకుపోయాడట.

**అద్భుత రామాయణం :** సీత మండోదరి కూతురు. పరశురాముడికి, హనుమంతుడికి రాముడు తాను విష్ణు స్వరూపంతో దర్శనం ఇచ్చాడు.

**ఆనంద రామాయణం :** రావణుడు కౌసల్యనీ అపహరించాడు. వాల్మీకి సీత అయోనిజ. కానీ, ఆనంద రామాయణంలో సీత అగ్నిలోంచి పుట్టింది. ఆమె అగ్నిజ ! సీతకు కుశుడొక్కడే పుట్టాడు. లవుడు లేడు. రాముని చాలామంది స్త్రీలు ప్రేమించారు. వారందరికీ కృష్ణావతారంలో అవకాశం ఇస్తానంటాడు. ఒక పరిచారిక కోరినప్పుడు కృష్ణావతారంలో “రాధ”గా అవతరించే వరం ఇచ్చాడు. ఇవన్నీ ఆనందరామాయణం విశేషాలు.

## విదేశీ రామాయణాల్లో విశేషాలు

**టిబెట్ రామాయణం** : దశరథుడికి ఇద్దరే భార్యలు. పెద్ద భార్యకు రాముడు, చిన్న భార్యకు లక్ష్మణుడు పుట్టారు. సీత రావణుడి కూతురు. రావణ నాశనానికి ఆపిల్ల కారకురాలౌతుందని ఒక పెట్టెలోపెట్టి సముద్రంలో పారవేయిస్తే, అవతలి ఒడ్డున జాలర్లకు దొరుకుతుంది. రాముడు లక్ష్మణుడికి రాజ్యం అప్పగించి, తనంతతానే అడవులకు వెళ్ళాడు. వ్యవసాయదారుల వత్తిడి మీద సీతను పెళ్ళాడాడు. రావణుడి బొటన వేలిలో అతని ప్రాణం వుంది.

**చైనా రామాయణం :** (రేమ్ కేశ : రామఖ్యాతి)

“మహారాజనగ” అని నాగరాజుకు చెందిన భూముల్లో మొలిచిన ఏడు చెట్లని ఒకే బాణంతో రాముడు కూల్చినట్లు ఇందులో వుంది. ఆ కథని తులసీదాసు సవివరంగా రాశాడు. ఈ గ్రంథంలో వుంది చూడండి !

రావణాసురుడి బొమ్మగీసివున్న ఒక విసనకర్రతో విసురుకొంటుంటే రాముడు చూసి సీతని అనుమానించాడట – సీత “రావణాసురుడికి ఫాన్”....అని !

**సియాం రామాయణం :** లక్ష్మణుడు, హనుమంతుడు యుద్ధం చేస్తారు. రావణుడు సన్యాసి వేషంలో వచ్చి, వంతెన నిర్మాణంలో రాముడు వున్న దశలో అయన్ని కలుసుకుంటాడు. రావణాసురుడితో వైరం మంచిదికాదని, ఆ ఆలోచన వదులుకోవలసిందిగా ఉచిత సలహా ఇస్తాడు.

హనుమంతుడికి చాలామంది స్త్రీలతో సంబంధం ఉంది. రావణుడు సంజీవని యజ్ఞం చేస్తుంటే, దాన్ని చెడగొట్టడంకోసం, రావణుడి రూపంలో వెళ్ళి మండోదరిని అనుభవించాడట!

హనుమంతుడు లంకకు వెళ్ళి రావణుణ్ణి కలిసి, అతని పక్షాన శ్రీరాముడితో తాను యుద్ధంచేస్తానని చెప్పాడట. ఆవిధంగా రావణుడి మెప్పు పొంది, అతని అతిథిగా ఒకరోజు లంకలో వుండి, ఇంద్రజిత్తు రహస్యం తెలుసుకున్నాడు. ఆ సమయంలో 656 మంది స్త్రీలను అతను అనుభవించాడు. వారిలో మండోదరి ఒకతి !

***ఉత్తర సియాంలో రామజాతక కథ :***

ఈ కథలో రాముడూ, రావణుడూ వరుసకు అన్నదమ్ములు. రాముడికి లక్ష్మణుడు ఒక్కడే సోదరుడు.

సీతని పెళ్ళాడదానికి ముందు రాముడికి చాలా పెళ్ళిళ్ళయినాయి. వాలి భార్య, సుగ్రీవుడి భార్య కూడా ఒకప్పుడు రాముడి భార్యలేనట ! బుద్ధుడే ఆ శ్రీరాముడు. రావణుడు దేవదత్తుడు. దశరథుడు శుద్ధోధనుడు. లక్ష్మణుడు ఆనందుడు. సీత బౌద్ధభిక్షుకి "ఉప్పల వన్న"!

**హికాయత్ సెరిరామ్** : ఇదికూడా విదేశీ రామాయణమే ! ఇందులో దశరథుడే మాయా మండోదరిని తీసుకువచ్చి, ఆమెకు రావణుడి ద్వారా సీత కలిగేలా చేశాడు.

***సంస్కృత రామాయణంలో విశేషాలు :***

సంస్కృతంలో వెలువడిన రామాయణాల్లోనే అనేక విశేషాలున్నాయి. 'ఉన్మత్త రాఘవం' అనే గ్రంథంలో భాస్కరభట్టు దూర్వాసుడి శాపవశాన సీత ఒక "లేడి"గా మారిపోయిందనీ, ఆమెను వెదుకుతూ రాముడు తిరిగాడనీ, చివరికి అగస్త్యుడి సహాయంతో కనుగొన్నాడనీ వుంది!

ఆశ్చర్య చూడామణి అనే రామాయణాన్ని శక్తిభద్రుడు రాశాడు. ఇందులో రాముడి రూపంలో రావణుడు, లక్ష్మణుడి రూపంలో అతని రథ సారథి వచ్చి సీతని అపహరించినట్లుంది. ఈలోగా సీత రూపంలో శూర్పణఖ రాముణ్ణి కోరుతుంది. సరిగ్గా అదే సమయానికి రాముడి రూపంలో మారీచుడు లక్ష్మణుడితో ఏదో మాట్లాడుతూ వుంటాడు. ఈవిధంగా ఒక గొప్ప "డ్రామా"ని రచయిత సృష్టించాడు.

రామాభ్యుదయం గ్రంథాన్ని యశోవర్మ రాశాడు. ఇందులో లక్ష్మణుడు బంగారు లేడివెంట వెళ్ళి దాన్ని కూల్చాడు. "హా ! రామా !" అని లక్ష్మణుడి గొంతు వినిపించి, రాముడు సీతని వంటరిగా వదలి వచ్చాడు.

జయదేవుడి ప్రసన్న రాఘవంలో రావణుడు, బాణాసురుడు ఇద్దరూ సీతా స్వయం వరానికి వచ్చినట్లుంది. సీతని ఎలాగైనా అపహరించాలని రావణుడు అప్పుడే నిర్ణయించుకున్నాడు. స్వయంవరానికి ముందుగానే సీత రాముణ్ణి కలుసుకుంది. ఇద్దరూ ఒకరినొకరు ప్రేమించుకుంటారు.

హస్తిమల్లుడి మైథిలీ కళ్యాణంలో సీతారాములిద్దరూ కామదేవుడి గుడిలో కలుసుకున్నట్లుంది.

జానకి పరిణయం అనే గ్రంథంలో రామభద్ర దీక్షితులు గొప్ప హాస్య సన్నివేశాన్ని సృష్టించాడు.

విరథుడు రాముడి రూపంలో సీతని ఎత్తుకెళ్ళాలని వస్తూంటాడు. అతనే రాముడనుకొని సీత రూపంలో శూర్పణఖ అతని దగ్గరకు వస్తుంది. చివరికి విరథుడు శూర్పణఖని ఎత్తుకెళ్ళాడు.

**తెలుగు రంగనాథ రామాయణంలోని విశేషాలు :**

నిద్రా దేవత లక్ష్మణుడికి రెండు వరాలిచ్చింది. ఒక వరం అతని భార్య ఊర్మిళకు దీర్ఘ నిద్ర – రెండో వరం లక్ష్మణుడికి నిద్రే పట్టకపోవడం.

పంచవటి నిర్మాణం కోసం వెదురు కర్రలు నరుకుతూ లక్ష్మణుడు పొరబాటున శూర్పణఖ కొడుకు శంబుకుడి తలకాయను నరికేశాడు.

సీతను వదలి వెళ్ళేప్పుడు ఏడుగీతలు గీసి, వీటిని దాటవద్దని లక్ష్మణుడు కోరిన కథ ఇందులోదే.

హనుమంతుడు హిమాలయాలకు వెళ్ళేప్పుడు కాలనేమి కథ కూడా ఈ తెలుగు రామాయణం సృష్టే. ! గోనబుద్ధారెడ్డి రచన ఇది !

**తెలుగు రామాభ్యుదయంలో విశేషాలు :** అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయంలో దశరథుడి యౌవనజీవితాన్ని వర్ణించాడు. మునికుమారుడి మరణం సమయానికి అతను వివాహితుడుగా వున్నట్లు రాశాడు. తనకు సంతానవియోగ దుఃఖం ప్రాప్తిస్తుందని ముందే తెలిస్తే దశరథుడు వివాహం చేసుకోకపోవచ్చని, ఈవిధంగా మార్పు చేశాడు.

**మళయాళ అధ్యాత్మరామాయణంలో విశేషాలు :** వానర వీరుల భార్యల్ని చూడాలనే సీత కోరిక ఈ రామాయణం లోనిదే ! ఎరుత్తాచకుడు దీన్ని రచించాడు. తన ప్రేమ విఫలమైందనే ఉక్రోషం ఆపుకోలేక శూర్పణఖ అక్కడ రాక్షసంగా ప్రవర్తించింది. దాన్ని అదుపు చేయడానికి లక్ష్మణుడు చెయ్యిచేసుకోక తప్పలేదని రాశారు. తులసీదాసు రామాయణంలో రాముడే స్వయంగా దాని ముక్కు చెవులు కోసి పంపమని అన్నట్లుంది.

**వేదాలలో దశరథుడు :** శంబరాసురుడితో యుద్ధం గురించి ఋగ్వేదంలో వుంది. దశరథుడి ప్రస్తావనకూడా ఇందులో వుంది. 'సీత' పంటల దేవత పేరుగా కన్పిస్తుంది.

అధర్వణ వేదంలో 'సీత' అంటే నాగేటి చాలు. పొలాన్ని నాగలితో దున్నేప్పుడు మట్టిపెళ్ళగించబడి ఏర్పడిన చారని 'సీత' అంటారు. సీతా భూములు అంటే, దున్ని వ్యవసాయం చేయడానికి అనుకూలంగా వున్న పంట భూములని అర్థం ! మౌర్యుల కాలంలో ఈ సీతా భూముల మీద పన్ను వుండేది.

ఇంకా అనేక రామాయణాలు, అనేక విశేషాలు వున్నాయి. అనేకమంది పరిశోధకులు వాటి గురించి రాశారుకూడా ! ప్రాతః స్మరణీయులైన వారందరికి నమస్కారం. రామాయణాన్ని అభివృద్ధి నిరోధక రచనగా భావించిన వారుకూడా వున్నారు. ఏమైనా భారతీయులపైన ఈ రచనా ప్రభావాన్ని ఎవరూ తక్కువగా వెలకట్టలేరు.

తన కాలానికి ప్రచారంలో వున్న రామకథల్ని సేకరించి, ఒక దారంతో గుచ్చి ఈ అందమైన హారాన్ని తయారుచేశాడు వాల్మీకి అనేది స్పష్టం. వాల్మీకి అడుగుజాడల్లో మరెన్నో రామాయణాలు వెలిశాయి. రామకథని తమ బుద్ధికొద్దీ కొందరు, తమ భక్తికొద్దీ కొందరు విస్తరించారనేది కూడా స్పష్టం.

శ్రీరాముడు విష్ణువు అవతారం అని బ్రాహ్మణాలు, బోధిసత్వుడి అవతారం అని బౌద్ధులు, అష్టమ బ్రహ్మదేవుడు అని జైనులూ రామకథని తమ తమ మతాలకు అనుగుణంగా చిత్రించుకున్నారని కూడా ఈ నిరూపణలు మనకు సూచిస్తున్నాయి. రాముడి పాత్రని ఏమతం వారు ఏ విధంగా మలుచుకున్నా, ఆయన వ్యక్తిత్వాన్ని, ఔన్నత్యాన్ని, ధీరోదాత్తతని ప్రతిఒక్కరూ నిలబెట్టారనే చెప్పాలి.

అనేక రామాయణాలలోని విశేషాల్ని, ముఖ్యమైన అంశాల్ని, ఉత్సాహభరితంగా వుంటాయనిపించిన వాటిని ఏరి ఈ "రామాయణంలో విశేషాలు" గ్రంథంగా రూపొందించడం జరిగింది.

వివిధ సమస్యలు ఏర్పడినప్పుడు, వివిధ రకాల వ్యక్తిత్వాలున్న మనుషులు ఏ విధంగా ప్రవర్తిస్తారో ఈ పుస్తకంలో ఏర్చికూర్చిన అనేక పాత్రలు నిరూపిస్తాయి.

తన భార్యని ఎవడో రాక్షసుడు ఎత్తుకు పోయాడని వార్త తెల్సినప్పుడు సీతా స్వయంవర ఘట్టంలో రావణాసురుడు ప్రవర్తించిన విధానానికీ, తనే స్వయంగా సీతని అపహరించినప్పుడు, శ్రీరాముడు ప్రవర్తించిన విధానానికి మధ్య వ్యత్యాసాన్ని పాఠకులు ఊహించుకోవచ్చు.

"అహం మానుషం మన్యే...." "నన్ను నేను మనిషిననే అనుకొంటున్నాను-" అని రాముడు చాలా స్పష్టంగా చెప్పాడు. లోకనిందకు చాలా భయపడిపోయాడు. ఇంత బతుకూ బతికి ఎవడో అనామకుడు ఏదైనా అనవచ్చనే భయం శ్రీరాముణ్ణి పీడించింది.

వ్యక్తులు వ్యక్తులుగా వున్నంతకాలం వ్యక్తులే. వారి వ్యక్తిగత జీవితాలతో ప్రజలకు పనిలేదు. కానీ, వ్యక్తులు ప్రజా జీవితంలోకి వచ్చినప్పుడు వారి వ్యక్తిగత జీవితాల్లో మచ్చవుండ కూడదు, వుంటే ప్రజలకు వాటిని ఎంచే హక్కు వుంటుంది. వుంటుంది కాబట్టే, ప్రజా విమర్శకు రాముడు ఎక్కువ భయపడినట్లు కన్పిస్తుంది. వానరులు, ఎందరో అటవికులు, రాక్షసులు కూడా వారి వారి వ్యక్తిత్వాలకొద్దీ ఎలాంటివారు ఎలా ప్రవర్తిస్తారో రామాయణంలోని పాత్రలు మనకు బోధపరుస్తాయి.

ఈ కోణంలోంచి వివిధ పాత్రల్ని, వాటి విశేషాల్నీ ఈ గ్రంథంలో సంపుటీకరించే ప్రయత్నం చేశాను.

ఎప్పుడూ నా బాగోగులు కోరే పెద్దలు, సన్నిహితులు, హితులు, చరిత్ర పరిశోధకులు, ఆంధ్రప్రభ విశ్రాంత పాత్రికేయులు, లంక వెంకటరమణగారితో స్నేహానికి తీపి గుర్తుగా వారికి ఈ కృతి నందించాలని సంకల్పించుకున్నాను. మా ఇద్దరి అభ్యున్నతినీ సమానంగా కోరుకునే చిరకాల మిత్రులు, కృష్ణాజిల్లా ప్రగతికి నిరంతరం పరితపించే అవనిగడ్డ ప్రజాప్రతినిధి, గౌరవనీయులు శ్రీమండలి బుద్ధ ప్రసాద్‌గారి చేతుల మీదుగా వారికి అంకితం ఇవ్వాలని నా ఆకాంక్ష.

నన్ను ప్రేరేపించి, ప్రోత్సహించి, ఈ గ్రంథాన్ని రాయించి, స్వయంగా ముద్రించిన ప్రచురణ కర్త, సంఘజీవి, సమాజసేవాతత్పరుడు శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్‌గారికీ, సమాచార సేకరణలో సహకరించిన రచయిత్రి శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరిగారికి మనఃపూర్వక శుభాకాంక్షలు తెలుపుకొంటున్నాను.

– డా॥ జి.వి. పూర్ణచంద్

# విషయసూచిక

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥
వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః
శృణ్వన్ రామకథానాదం కో నయాతి పరాంగతిమ్ ॥

# వేదవేద్యుడి కథ

వేదవేద్యే పరేపుంసి జాతా దశరథాత్మజా
వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షాద్రామాయణాత్మనా ॥

వేదవేద్యుడైన పరమపురుషుడే దశరథరాముడై వుండగా, వేదమే రామాయణ రూపంలో వాల్మీకి మహర్షిద్వారా ఆవిర్భూతమయ్యింది.

వేదవేద్యుడు శ్రీరాముడు
వేదతంత్రజ్ఞుడు వాల్మీకి
వేదార్థ ప్రకాశకం రామాయణం !

# శాస్త్రం - కావ్యం - ఇతిహాసం

రామాయణం ఒక శాస్త్రం అని పెద్దలంటారు.

ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేత కృతకేన వా
పుంసాంయేనోపదిశ్యేత తచ్ఛాస్త్రమభిధీయతే ॥

మనుషులు నిత్యజీవితంలో తమ తమ ప్రవృత్తుల వలన నివృత్తుల వలన ఎలా ప్రవర్తించవచ్చో, ఎలా ప్రవర్తించకూడదో వివరించేది శాస్త్రం. అదే నిర్వచనం ప్రకారం రామాయణంలో అలాంటి లక్షణాలు వున్నాయి కాబట్టి అది ఒక శాస్త్రం !

రామాయణం ఒక మహాకావ్యం అని మరికొందరి అభిప్రాయం. కావ్యం నవరసాలతో కూడుకొని కొన్ని రసాల ప్రధానంగా వుంటుంది. రామాయణం కరుణరస ప్రధానమై కాంతా సమ్మితంగా వుంటుంది.

సూ॥ "రామాయణే హి కరుణో రసః స్వయమాది కవినా సూత్రితః శోకః శ్లోకత్వ మాగతః ఇత్యేవాం వాదినా। నిర్వ్యూఢశ్చ సఏవ సీతాఽత్యన్త వియోగపర్యన్తమేవ స్వప్రబన్ధా ముపరచయతా ॥"

అని ధ్వన్యాలోకంలో చెప్పినదాన్నిబట్టి, కరుణరస ప్రధానంగా, స్వయం ఆదికవి వాల్మీకి సూత్రించిన శోకం శ్లోకమై – గొప్ప ప్రబంధంగా రూపొందింది.

రామాయణాన్ని ఇతిహాసం అని కూడా కొందరంటారు. ఇతిహాసం అంటే, చారిత్రాత్మక రచన! ఒక పూర్వ గాథ ! పూర్వగాథల్ని మనం ఎందుకు చెప్పుకొంటాం ? ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలను ప్రతిపాదిస్తూ పూర్వం జరిగిన సంగతిని మంచి కథగా చెప్పుకొంటాం. కాబట్టి, రామాయణం అలాంటి ఇతిహాసం అని వీరి భావన !

రామాయణాన్ని ధర్మశాస్త్రం అని కొందరు భావిస్తే, రామాయణాన్ని ఓ మంచి ప్రబంధకావ్యంగా మరికొందరు ఆరాధిస్తే, అది ఈ భూమ్మీద నిజంగా జరిగిన ఒక సంఘటనగాను, అందులోని పాత్రలు, ప్రాంతాలు చారిత్రాత్మకమైనవిగాను మరికొందరు పరిశోధకులు సత్యాన్వేషణకోసం ప్రయత్నిస్తుంటారు.

## తారకమంత్ర మహిమ

బ్రహ్మాదియోగి ముని పూజిత సిద్ధమంత్రం
దారిద్ర్య దుఃఖ భవరోగ వినాశమంత్రం ।
సంసార సాగర సముత్తరణైక మంత్రం
వందే మహాభయహరం రఘురామమంత్రం ॥ *శ్రీరామకర్ణామృతమ్ 1-71*

బ్రహ్మాదులు, మునిశ్రేష్ఠులు పూజించగా వారికి సిద్ధిని ప్రసాదించిన మంత్రం; పేదరికం, దుఃఖం, జనన మరణ రూపమైన సంసారరోగం - వీనిని నివారించే మంత్రం; సంసారం నుండి మనుష్యుల్ని ఉత్తరింపజేసే మంత్రం; గొప్ప భయాల్ని హరించే మంత్రం ఆ శ్రీరామ మంత్రానికి నమస్కరిస్తున్నాను.

## గాంధీగారు చెప్పిన రామనామ ప్రాశస్త్యం

రామ మిన్దీవరశ్యామం రాజీవాయతలోచనమ్
జ్యాఘోష నిర్జితారాతిం జానకీ రమణం భజే ॥

హరిజన పత్రికలో గాంధీజీ రామనామం గురించి ఇలా రాశారు.

నా రామనామం సుప్రసిద్ధ చారిత్రక పురుషుడైన జానకీరాముని పవిత్రనామం. సమస్త ఈతిబాధల్ని పోగొట్టే సర్వోత్కృష్టమైన రామనామం కేవలం భగవన్నామం. ఈ భగవన్నామాన్ని ఆశ్రయించి మహాభక్తులు చిత్తశాంతిని పొంది ఈశ్వర సాక్షాత్కారం పొందారు.

రామనామం భౌతిక, మానసిక, నైతిక రుగ్మతల్ని పటాపంచలు చేయగల పరతత్త్వం.

రామనామం రామభక్తుని వ్యక్తిగతవైద్యునిగ చేసి తన్నాశ్రయించిన బాధల్ని తానే నివారించుకోగల స్వయంసేవకుడిగా తీర్చిదిద్దుతోంది.

రామనామం చిత్తస్థైర్యాన్ని, మానసిక ప్రశాంతతను, భక్తునికి ప్రసాదించి శరీర క్లేశాల్ని తట్టుకొనే శక్తినిస్తుందంటారు గాంధీజీ !

# భగవంతుని మతం మనది !

నీ మతం ఏదని ఎవరైనా అడిగితే, భగవంతుని మతం అని చెప్పండి – అంటుంది భగవద్గీత.

"యేయే మతమిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః
శ్రద్ధా వన్తో౽నసూయన్తో ముచ్యన్తే తే౽పి కర్మభిః"

భగవంతుడి మతాన్ని, అంటే భగవంతుడి అభిమతాన్ని నిత్యం అనుసరించనివాడు మూఢుడు, జ్ఞానహీనుడు, అవివేకి.

"సర్వజ్ఞాన విమూఢం స్తాన్ విద్ధి నష్టానచేతసం" – అని !

# లోకమర్యాదను కాపాడే మర్యాదా పురుషోత్తముడు శ్రీరాముడు

"మర్యాదానాంచలోకానాం కార్తాకారయితాచ సః
మర్యాదా పురుషోత్తమః"

శ్రీరామచంద్రుడు మర్యాదా పురుషోత్తముడు. అంటే లోకమర్యాదని సువ్యవస్థితం చెయ్యడానికి అవతరించాడని !

లోకం తన ధర్మం తాను నెరవేర్చేలా చూడడాన్ని లోకాన్ని పాలించడం అంటారు. అది మర్యాద ! లోక మర్యాద ! ఈ లోకమర్యాదని ఎవరు ఉల్లంఘించినా శిక్షించేందుకే అవతరించిన పరమపురుషుడు రాముడు అని మనం నమ్ముతాం. ఈవిధంగా లోకమర్యాదను కాపాడడానికి అవతరించిన మర్యాదా పురుషోత్తముడు శ్రీరాముడు !

వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజా ।
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షాద్రామాయణాత్మనా ॥

వేదవేద్యుడైన పరమపురుషుడు దశరథుడికి కొడుకుగా పుట్టగా వేదమే ప్రాచేతసుని (వాల్మీకి) ద్వారా రామాయణరూపంలో అవతరించింది... అంతా లోకమర్యాదను నిలబెట్టడం కోసమే !

వాల్మీకి మహర్షి శ్రీరాముణ్ణి అప్రాకృత దివ్యశక్తిసంపన్నుడిగా దైవాంశ సంభూతుడిగా, చిత్రించడానికన్నా మర్యాదా పురుషోత్తముడిగా నిరూపించడం ద్వారా – అప్రాకృతాన్ని, వేదవేద్యాన్ని, మనోవాక్కులకు అందని దివ్యతత్వాన్ని జనసామాన్యానికి మనోగ్రాహ్యం చేయాలని సంకల్పించాడు. భగవంతుడు మానవరూపంలో అవతరించినప్పుడు, మహామానుషమైన వ్యక్తిత్వం ఎలా వుంటుందో ఈ లోకానికి తెలియపరిచాడు. వాల్మీకి రామపాత్రను ఆ విధంగా తీర్చిదిద్దాలనే సంకల్పించాడు.

అందుకే తన రచనకు "శ్రీమద్రామాయణ సంహిత" అని పేరుపెట్టాడు వాల్మీకి!

# రాముడు అందగాడు

రామాయణంలో అనేక సందర్భాల్లో రాముని రూపలావణ్యం గురించి వర్ణనలు కన్పిస్తాయి.

1. పుండరీకనిభేక్షణుడు - అంటే, తామరరేకుల వంటి కన్నులున్నవాడు - పద్మపత్రవిశాలాక్షుడు - శ్రీరాముడు.
2. వృత్తమధ్యమము - అంటే సన్నగా, గుండ్రంగా వుంటుందట రాముడి నడుము.
3. గూఢకత్రువు - మెడక్రింద ఎముకలు కన్పించనివాడు.
4. పుష్టమైన హనువులు గలవాడు - బుగ్గలు లోపలికి పీక్కుపోతే డెక్కముఖంలా వుంటుంది. హనువులు నిండుగావుంటే ముఖం చంద్రబింబంలా వుంటుంది.
5. సుతామ్రాక్షం - కనుకొలకులు ఎర్రగా ఉంటాయట రాముడికి ! రక్తాంత నయనుడు !
6. సింహోరస్కుడు - సింహం శిరస్సులా విశాలమైన వక్షస్థలం కలవాడు.
7. ఆజానుబాహుడు - మోకాళ్ళు ఆనేంత పొడవైన చేతులు కలవాడు.
8. తేజస్సును విరజిమ్ము మోముగలవాడు.
9. కన్నులకు ప్రీతికలిగించు రూపంగలవాడు.
10. సుందరమైన కేశరాసిగలవాడు.
11. ఉన్నతమైన భుజసంపదగలవాడు.
12. మన్మథమోహనాంగుడు.
13. అరోగి; ఎలాంటి వ్యాధులూ ఎరగనివాడు.
14. అందమైన పెదవులు కలవాడు.
15. రూపసంపన్నుడు.

శ్రీరాముడి దూతగానే వచ్చానని సీతమ్మకు నిరూపణకోసం హనుమంతుడు ఆయన అవయవ సన్నివేశాన్ని ఇలా వర్ణిస్తాడు -

1. ఊరువులు, మణికట్టు, గుప్పెటలు స్థిరంగా, దృఢంగా వుంటాయి రాముడికి.
2. భ్రూవృషణ బాహువులయందు ప్రలంబత్వం.
3. నాభి, కుక్షి, వక్షస్థలం ఉన్నతంగా వుంటాయి.
4. కనుకొలకులు, గోళ్ళు, అరిచేతులూ రాగిరంగులో వుంటాయి.
5. పాదాలుగానీ, కేశాలుగానీ స్నిగ్ధంగా వుంటాయి.
6. గొంతు గంభీరంగా వుంటుంది.
7. పొట్టమీద, కంఠం మీద మూడు మడతలున్నవాడు.
8. మెడ చిన్నగా వుంటుంది. నడుము సన్నగా వుంటుంది. పృష్టభాగం హ్రస్వంగా వుంటుంది - రాముడికి !
9. నుదుటిమీద నాలుగు రేఖలుంటాయి.

10. 96 అంగుళాల శరీర ప్రమాణం కలవాడు.
11. అందమైన పళ్ళవరుస ఉంటుంది.
12. వెన్నెముకలు, చేతులు, అరిచేతులు, పాదాలు, వేళ్ళు, ముక్కుకొస, కనుకొలకులు, చెవులు... ఇవన్నీ బారుగా వుంటాయి.
13. ముఖం, కాళ్ళు, నోరు, నాలుక, దవడలు, గోళ్ళు, రొమ్ములు – ఇవన్నీ పద్మపత్రాల ఆకారంలో ఉంటాయి రాముడికి... ఇలా ఉన్నతమైన వ్యక్తిత్వానికి హస్తసాముద్రిక శాస్త్రంలో సూచించిన లక్షణాలు ఎలా వుంటాయో అలాంటి లక్షణాలన్నీ రాముడికి ఉన్నట్లు హనుమంతుడు ప్రతి అవయవాన్ని గుర్తులు, ప్రమాణాలతో సహా వివరించి సీతాదేవిని నమ్మించగలుగుతాడు.

# రాముడి వ్యక్తిత్వం

ఇప్పుడు ఈ పోటీయుగంలో అందరికన్నా ముందుపీటీన నడవగలిగేవారినే అదృష్టం వరించే పరిస్థితి నడుస్తోంది. పోటీని తట్టుకోవాలంటే వ్యక్తిత్వం వికసితంగా వుండాలి.

అలాంటి ఉన్నత వ్యక్తితం ఎలా వుంటుందో వాల్మీకి వివిధ సందర్భాల్లో రాముడి వ్యక్తిత్వాన్ని గురించి వ్రాసిన వర్ణనలు అర్థం చేసుకొంటే తెలుస్తుంది. వీటినే "Leader-ship Qualities" అంటుంటారు. విజేతల లక్షణాలు ఇవీ –

1. **ప్రసన్నఅంతఃకరణం :** ప్రసన్నమైన మనసుతో నిలకడగా ఆలోచిస్తాడు కాబట్టి, రాముడే ఎప్పుడూ విజయం సాధించగలుగుతాడు.
2. **మధురభాషి :** ఎదుటి మనిషిని నొప్పించకుండా తియ్యగా మాట్లాడగలగడం రాముని విజయ రహస్యం.
3. **స్మితపూర్వాభిభాషి :** ఎదుటి వ్యక్తి తనను పలకరించడానికన్నాముందే, తను నవ్వుతూ పలకరిస్తాడట రాముడు. విజయం సాధించదల్చినవాడు అలవరచుకోవలసిన చిట్కా ఇది !
4. **ప్రియంవరుడు :** ఎదుటి మనిషికి ఇష్టమైన విషయాలే ప్రస్తావించేవాడు. వాళ్ళని కష్టపెట్టేవి, బాధపెట్టే వాటిని మాట్లాడకుండా వుండేవాడు.
5. ఎవ్వరితోనూ పరుషంగా మాట్లాడనివాడు.
6. అందరికి ఇష్టుడైనవాడు (సర్వలోకేష్టుడు)
7. చంద్రుడిలా అందరికి ఆహ్లాదాన్ని పంచేవాడు.
8. తన రూపం ద్వారా, తన ఔదార్యం ద్వారా అందరి దృష్టినీ ఆకర్షించేవాడు అందరి హృదయాలను చూరగొనేవాడు.

9. **ప్రియదర్శకుడు** : కొందరిని చూస్తే పెట్టబుద్ధి అవుతుంది - కొందరిని చూస్తే మొట్టబుద్ధి అవుతుంది అంటాం. ప్రియదర్శకుడు అనదగిన వ్యక్తి - ఇతరులు తనకు ఆత్మీయతానురాగాల్ని ఇవ్వాలనిపించేలా కన్పించేవాడు.

10. **ఆత్మవంతుడు** : దృఢమైన, స్థిరమైన నిర్ణయాలు తీసుకోగలవాడుగా ఉండేవాడు.

11. ఇతరులు చేసిన మేలుని గుర్తుంచుకొనేలా కృతజ్ఞతతో ప్రవర్తించేవాడు.

12. ఇతరులు చేసిన అపకారాలు మరచిపోయి, ఉపకారాలను మాత్రమే ప్రస్తావించేవాడు.

13. **సాధువు** : దయార్ద్ర హృదయుడిగా, మృదువైన వ్యక్తిత్వంతో సున్నితంగా ఇతరుల పట్ల వ్యవహరించేవాడు - మృదువీర్యుడు.

14. **సత్యపరాక్రముడు** : సత్యధర్మోపాసకుడు.

15. జ్ఞానవృద్ధుడు, ఔదార్యసంపన్నుడు, మహామనస్వి, శీలసంపన్నుడు.

16. స్నేహమూర్తి, విద్యావివేక వినయసంపన్నుడు, ధర్మజ్ఞుడు.

17. గురువినీతుడు, మాతాపితృపరాయణుడు, సత్పురుషుడు.

18. **నిజాయితీపరుడు** : అబద్ధాలు, కపటాలు, మోసాలు తెలియనివాడు.

19. పరస్త్రీలు ఎదురైతే మాతృభావంతో మరలేవాడు.

20. కష్టాలలో ఉన్నవారిపట్ల సానుభూతితో వ్యవహరించేవాడు.

21. స్వవృత్త, స్వధర్మ, స్వజన సంరక్షుడు.

22. **రామోరమయతాం శ్రేష్ఠః** : అందరి మనస్సుల్ని ఆనందింపచేసేవారిలో శ్రేష్ఠుడు.

23. **రిపూణామపి వత్సలః** : శత్రువులుకూడా ప్రేమించదగిన సద్గుణాలు కలవాడు

24. అమోఘక్రోధ హర్షయుక్తుడు, ధరహృదయుడు.

25. రాజనీతి విశారదుడు.

26. దీర్ఘదర్శి (VISION) ఉన్నవాడు.

27. స్థిరప్రజ్ఞుడు, శాస్త్రజ్ఞుడు, వాదప్రతివాద నిపుణుడు.

28. **ఆయ వ్యయ విభాగజ్ఞుడు** : ఆదాయ వ్యయాలపైన అదుపుగలవాడు.

# రామునకు సీత గృహలక్ష్మి

సీత తనకెంత ప్రియమైనదో ఉత్తర రామాయణంలో రాముడు చెప్పినట్లు భవభూతిచేసిన వర్ణన ఇది -

ఇయంగేహే లక్ష్మీః ఇయమమృత వార్తిర్నయన యో
రసావస్యాః స్పర్శో వపుహి బహుళ శ్చందన రసః
అయం కంఠే బాహూః శిశిర మసృణో మౌక్తిక సర్వః
కిమస్యాన ప్రేయోయది పునరసహ్యో న విరహః

రాముడికి సీత గృహలక్ష్మి. అతని కళ్ళకు ఆమె అమృతంలా కన్పిస్తుంది. ఆమె స్పర్శ తగిలితే చాలు ఆయన శరీరం చందనసారం పూసినట్లు పులకరిస్తుంది. తన మెడచుట్టూ వేసిన ఆమె చేతులు శిశిరమసృణమైన ముత్యాలసరాల్లా అనిపిస్తాయి రామునికి. ఆమె వస్తువులన్నీ ఆయనకు ప్రియతములే ! ఆమె ఎడబాటు ఆయనకు పిడుగుపాటు.

సీత శారీరక సౌందర్యం గురించి కాక, ఆమె 'గృహలక్ష్మి' అనడం ద్వారా ఆమె పట్ల తనకు గల ప్రేమామృత రససేవనం ఈ మాటల్లో వ్యక్తమౌతుంది !

"మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని" - వాడిపోయిన పువ్వులక్కూడా ఆమె మాటలు వికాసాన్ని కల్పిస్తాయి.

"సంతర్పణాని సకలేంద్రియ మోహనాని" - ఆమె పలుకులు సంతృప్తినిస్తాయి. సకలేంద్రియ మోహనంగా వుంటాయి.

"ఏ తానిచే సువచనాని సరోరుహాక్షి - కర్ణామృతాని మనసశ్చ రసాయనా" - ఆమె మాటలు చెవికి, మనసుకు రసాయనాలుగా (పుష్టినిచ్చేవిగా) వుంటాయి... అంటాడు రాముడు.

ఆమె స్పర్శ హరిచందన ఆశ్ర్యోతంగా, చంద్రకిరణ కందళాసీకంగా, ఆతప్త జీవితానికి పరితప్తంగా, మరణించేవాడికి సంజీవనీ ఔషధంగా వుంటుందంటాడు. సీత స్పర్శ మహాత్మ్యాన్ని రాముడే స్వయంగా వివరిస్తూ ... "చలువలు కూర్చితాపమార్చును" - అని తెలుపుతాడు !

ఆమె జగన్మాత. ఆమె గుణసంపదే లోకులకు ఆదర్శం. ప్రజలు ఆమెని మాతృ భావంతో చూస్తారు గాని, కావ్యకన్యకలాగా చూడరు. అందుకే, విశ్వనాథవారంటారు -

**మంటి నుండి పుట్టిన సీత**
**మింటి నుండి పుట్టిన రాముడు**

ఇద్దరూ ద్యావాపృథువులలాగా ఆత్మరోదసిని పండువెన్నెలమయం చేస్తున్నారు.

"ఆహత రామపుష్కరద - ఆహిత లక్ష్మణ సీత కోటి - వర్షాహత సర్వసాగర సరిస్సరిదానత భవమందు భో... అంటారు విశ్వనాథ.

# త్యాగధనులు రాముడి తమ్ములు

నలుగురు అన్నదమ్ములున్నచోట ఒక రాజ్యాన్ని నిర్వహించే విషయంలో సమస్యలు రాకుండా వుండవు. ఒకరికోసం మరొకరు త్యాగంచేసుకొనే అపూర్వసహోదరులు. రామసోదరులు ఈ విషయంలో ఇది మరింత జటిలంగా వుంటుంది.

ఎలాగంటారా...

రాముడి అన్నదమ్ముల్లో అందరికన్నా ఎక్కువ త్యాగం చేసినవాడు లక్ష్మణుడు. అతని జీవితం అంతా త్యాగాలమయం. రాజ్యాధికారాన్ని ఏవిధంగానూ ఆయన అంగీకరించలేదు.

నిజానికి స్వభావరీత్యా భరతుడు కూడా అంతే త్యాగశీలి. కానీ, తన త్యాగాన్ని త్యాగంచేసి రాజ్యాధికారాన్ని చేయడం ఆయనకు తప్పనిసరి అయ్యింది. – "నాకు రాజ్యం వొద్దు మొర్రో..." అని పక్కకు తప్పుకున్న భరతుడు రాజ్యాధికార రాజకీయాలు నడపవలసిరావడం ఒక విధంగా భరతుడి దురదృష్టం !

భరతుడికి రాజ్యలోభం లేదని నిరూపించాలని రాముడు కూడా అనుకొని, తన పట్టాభిషేకం తర్వాత యువరాజు పదవిని అంగీకరించమని లక్ష్మణుడిని కోరాడు. త్యాగంలో ఇతరులతో పోటీపడే లక్ష్మణుడు ససేమిరా అన్నాడు.

"సర్వాత్మనా పర్యనునీయ మానో న సౌమిత్రి రుపైతియోగమే
నియుజ్యమనోపిఽ చయౌవరాజ్యే తతోఽ భ్యషించద్భరతం మహాత్మా"

ఎంత అనునయించినా లక్ష్మణుడు వినిపించుకోకపోవడంతో చివరికి తప్పనిసరిగా ఆ పదవిని భరతుడు అంగీకరించకతప్పలేదు. మరోసారి రాజ్యాధికారాన్ని అంగీకరించడం ద్వారా భరతుడు తన త్యాగగుణాన్ని త్యాగం చెయ్యకతప్పలేదు.

## లక్ష్మణుడిలాంటి తమ్ముడు దొరకడు

ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగపాశానికి బద్ధులుగా రామలక్ష్మణులు స్పృహతప్పి పడివున్నారు. వాళ్ళిద్దరి శరీరాలు శత్రువు కంట పడకుండా వానరులు జాగ్రత్తలు తీసుకొంటున్నారు. ఇంతలో స్వయంగా గరుత్మంతుడు వచ్చి నాగపాశం నుంచి రామలక్ష్మణుల్ని విముక్తుల్ని చేశాడు.

ముందుగా రాముడికి తెలివి వచ్చింది. స్పృహతప్పి పడివున్న లక్ష్మణుణ్ణి చూశాడు రాముడు. ఆయనకు మానవసహజమైన దుఃఖం ముంచుకొచ్చింది.

"శక్యా సీత సమా నారీ మర్త్యలోకే విచిన్వతా
నలక్ష్మణ సమో భ్రాతా సచివ స్సాంపరాయికః "

అంటాడు రాముడు.

"సీతవంటి భార్య భూలోకంలో ఎక్కడైనా వెదికితే దొరుకుతుందేమోకానీ, లక్ష్మణుడితో సమానమైన తమ్ముడు, వీరుడు, సచివుడు మాత్రం దొరకడు" – అని !

## శోకం శ్లోకమైన తీరు

"తపస్స్వాధ్యాయ నిరతం, తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మ్ముని పుంగవమ్"

లోక సంచారి దేవర్షి నారదుడు, కవికోకిల వాల్మీకి మహర్షి ఆశ్రమానికి వచ్చాడు. తపస్స్వాధ్యాయ నిరతుడిగా, వాగ్విదులలో ప్రముఖుడిగా వాల్మీకి అప్పటికే ప్రసిద్ధుడు.

దేవలోకం నుంచి పనిగట్టుకొని నారదుడు వచ్చాడంటే వాల్మీకికి ఆశ్చర్యమే ! ఆయన్ని గౌరవించి అడిగాడు వాల్మీకి... నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్ - ... ఏమని అడిగాడుట ... ?

అందరికన్నా గుణవంతుడు, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, ఉత్తమ చరిత్రగలవాడు, సర్వభూతహితంకరుడు, విద్వాంసుడు, సమర్థుడు, ప్రియదర్శనుడు, ఆత్మవంతుడు, వశీకృతాంతఃకరణుడు, అనసూయాత్ముడు, దేవతలుసైతం భయపడగలిగే ధీశాలి... ఇలాంటి లక్షణాలున్న మంచి 'నాయకపాత్ర' అనదగిన వ్యక్తి మీ దృష్టిలో వుంటే ఎవరైనా చెప్పండీ...అనడిగాడు వాల్మీకి మహర్షి నారదుణ్ణి !



నారదుడు వాల్మీకి మహర్షి ఆశ్రమానికి వచ్చింది ఈ విషయం చెప్పాలనే కావచ్చు... కానీ, వాల్మీకి "పరిప్రశ్న" మాత్రం... ఏదో మహత్కార్యం చెయ్యాలనే తలంపు ఆయనలో కూడా వున్నట్లు స్పష్టంగా అర్థం అవుతోంది. ఒక మహోదత్తుడి మహోచరిత్రని ఈ ప్రపంచానికి అందించాలనే సదాశయం ఆయన మాటల్లో స్పష్టమైంది.

అర్థం చేసుకున్నాడు నారదుడు. వాల్మీకి అంతటి భారాన్ని వహించగల సమర్థుడేనన్న నమ్మకం ఆయనకుంది... కొన్ని యుగాలు చిరస్థాయిగా నిలిచిపోగలిగే ఒక మహోరచనకు వాల్మీకి చేత శ్రీకారం చుట్టించాలనే సంకల్పం నారదుడికి కల్గింది !

"అడిగావుకాబట్టి చెప్తున్నాను - మహర్షీ...

సమస్త జీవలోకానికి రక్షకుడు, ధర్మ పరిరక్షకుడు, స్వధర్మ, స్వజనపాలకుడు, వేదవేదాంగ తత్త్వజ్ఞుడు, ధనుర్వేద నిష్ణాతుడు, సర్వలోక ప్రియుడు, సాధువు, దైన్యం ఎరగనివాడు, యుక్తాయుక్త వివేచనశాలి, సాధుసజ్జన పరివృతుడు, సకల సద్గుణ సంపన్నుడు అయిన ఒక మహోదత్తుని గురించి నీకు చెప్తాను-" అన్నాడు.

వాల్మీకి నారద మహర్షి మాటలకు పులకించిపోయాడు. తనకు కావలసింది అంతటి ఔన్నత్యంగల పాత్ర ! ఒక సజీవ పాత్ర !

వాల్మీకి ఆత్రుతని గమనించి నారదుడు చిరునవ్వు నవ్వాడు...

"మహర్షీ ! నీకు చెప్పాలనుకొంటోంది ఇక్ష్వాకు కులచంద్రుడు, కౌసల్యా నందవర్థనుడైన శ్రీరామచంద్రుడి చరిత్ర !" అంటూ స్థాలీపులాకంగా రామకథని వాల్మీకికి పరిచయంచేశాడు నారదుడు.

ఇది కాకతాళీయంగా జరిగిన సంఘటనగా అన్పించవచ్చు. కానీ, నారదుడు వెళ్ళిపోయిన తర్వాత వాల్మీకి మనసుని రామకథ పూర్తిగా ఆవహించింది. శ్రీరామచరితను త్రికాలాబాధితంగా లోకానికి అందించడానికి తగిన దైవశక్తి ఆసరాకోసం ఎదురు చూస్తున్నాడు. ఇప్పుడు రామకథే ఆయనకు తపస్సు. రామాయణ రచనే ఆయనకు జీవితం!

కానీ, కృత్యాద్యవస్థ ఆయన్ని బాధించసాగింది. అంతటి రచనా భారాన్ని స్వీకరించగల మనోబలంకోసం ప్రయత్నించసాగాడాయన !

భరద్వాజుడు వాల్మీకి శిష్యప్రముఖుడు. ఇద్దరూ తమసానదికి మాధ్యాహ్నిక క్రియలకోసం ఆశ్రమం నుండి బయల్దేరి వెడుతున్నారు -

అది శరదృతువు.

ఆ మహనీయుడి నిర్మల మనస్సులాగా తమసానది స్వచ్ఛమైన జలాలు పరవళ్ళు తొక్కుతున్నాయి.

అరణ్యం శోభాయమానంగా వుంది. చుట్టూ మహావృక్షాలు లోకక్రాంతిదర్శునికి, స్వాగతం పలుకుతున్నట్లు శిరసులెత్తి సగర్వంగా నిలుచున్నాయి - అరణ్య శోభను తిలకిస్తున్నాడు వాల్మీకి ! నయనానందకరమైన ప్రకృతి, ఆయన మనసులో కవితావేశాన్ని ఉద్దీపింపచేస్తోంది...

ఎన్నడూ ఎరుగనంత ప్రశాంతంగా వుంది ఆ మహాముని హృదయం. రాముడి దయా కరుణా కటాక్షాలలాగా.., సీత ప్రేమపూర్వక దరహాసంలాగా..., ఆ పవిత్ర దంపతుల పుణ్యచరిత్రలాగా.... !!!

రాముడి భావన కలిగితేనే ప్రకృతి ప్రసన్న ప్రశాంతతను అనుభవించసాగింది. అది అనంత ప్రశాంతత. తాను ఎన్నడూ ఎరుగని అమందానంద కరుణాపారావారం ఆయనను ముంచెత్తుతోంది.

భక్తివలయాలు కాంతిమయమై ఆయన చుట్టూ గుబురు విడిచాయి. ఒక్క క్షణం భయం వదలి ప్రకృతి స్వేచ్ఛగా ప్రసరించసాగింది. సరిగ్గా అదే సమయంలో భయ కారణాలు కనిపించకపోవడంతో ఒక క్రౌంచపక్షుల జంట గూడు విడిచి భయనిర్ముక్తంగా, సుఖంగా, ఏకాంతాన చరించసాగాయి.

అదే అదనుగా బోయడొకడు బాణం గురిచూడసాగాడు - ప్రకృతి రామనామ పారవశ్యంలో నిర్భయంగా నిలిచివుంది. క్రౌంచపక్షుల జంట స్వేచ్ఛా ఏకాంతాన్ని అనుభవిస్తున్నాయి. నిషాదుడి బాణం మాత్రం కర్కశ కసాయిత్వాన్ని కక్కుతూ పక్షిజంటను గుర్రున గురిచూస్తోంది.

వాల్మీకి మహర్షి భక్తి పారవశ్యంలో జరుగనున్న కరుణమాలిన అధర్మాన్ని గమనించలేకపోయాడు.

నిషాదుడి బాణం మగపక్షిని తాకింది. ఒక్క క్షణం ప్రకృతి విషాదాన్ని అలుముకుని హతాసురాలయింది.

శోణితపరీతాంగమై ఆకాశము నుండి చిటారు కొమ్మనుతాకి, కొమ్మమించి చెట్టు మానును తాకి, మాను పైనుంచి నేలపైనపడి విలవిలా కొట్టుకొంటూ ప్రాణాలు విడిచింది మగపక్షి. తన జంట తన కళ్ళముందే కుప్పకూలడంతో విలవిలలాడుతూ ఆడపక్షి చేసిన ఆర్తనాదం వాల్మీకి హృదయాన్ని కలచివేసింది. తనగోడును చెప్పుకోవడానికి పక్షికి పలుకులు లేవు. దానిది మూగగొంతు... దానిది మూగ భాష... ధర్మాత్ముడైన వాల్మీకి మహర్షి ప్రసన్న హృదయం అంతకన్న ఎక్కువగా కరిగిపోయింది.

ఉప్పొంగిన శోకం అప్రయత్నంగా ఆయన ముఖ కమలం నుంచి ఛందోబద్ధమైన శ్లోకంగా బయటకొచ్చింది.



**"మా నిషాద ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీ స్సమాః ।**
**యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్ ॥**

ఆ దుఃఖ తీవ్రతలో ఆయన ఏమన్నాడో ఆయనకే తెలియదు. ప్రకృతి సహజమైన కామమోహితంలో జంటకట్టిన క్రౌంచపక్షిని చంపావు. నీకు ఆయువు మూడింది. ఇంక నీవు ఎక్కువకాలం బ్రతకవు అని మందలించాడు నిషాదుణ్ణి వాల్మీకి.

ఇది ఆదికవి వాల్మీకి నోట వెడలిన మొదటి శ్లోకం. మొట్టమొదటి కవిత్వం తిట్టుతోనే మొదలయింది. శోకంలో బయటకువచ్చిన ఈ వాక్కు శ్లోకమై సంస్కృత భాషలో లౌకిక కవితకు ఆది రచనగా వినుతికెక్కింది.

పైకి ఇది తిట్టులా కనిపిస్తుంది. తిట్టే అయితే ఇందులో ఆది కవిత అనదగిన విశేషం ఏదీ ప్రత్యేకం కనిపించదు.

వాల్మీకి తిట్టాడని చెప్తున్న అర్థం ఇది -

"ఓ బోయదా ! కవగూడిన పక్షుల జంటలో ఒకదానిని చంపావు కాబట్టి ఈ భూమిమీద ఎక్కువకాలం జీవించి ఉండజాలవు" అని. అయితే రామాయణ రచనకు మూలమైన ఈ శ్లోకం బోయను తిట్టడం కోసం గాక రాముని ప్రశంసకోసం వాల్మీకి ఉద్దేశించి అన్నాడని పండితులు భగవత్పరమైన ప్రశంసార్థాన్ని దీనికి చెప్తారు. ఆ అర్థం ఏమంటే ... "ఓ శ్రీరామా ! మండోదరీ రావణుల జంటలో రావణుని చంపటం ద్వారా నీ కీర్తి ఈ లోకంలో శాశ్వతంగా వుంటుందీ" అని ...

కొంతసేపయాక శోకోద్రేకం తగ్గి తన వాక్కును వృథా చేసుకున్నందుకు వాల్మీకి చాలా బాధపడ్డాడు. కానీ శిష్యుడు భరద్వాజుడు కంఠస్థం చేసి అది పాదబద్ధంగా సమాక్షరంగా తంత్రీలయసమన్వితంగా ఉండడం గమనించాడు.

బాధ నుండి తెప్పరిల్లిన వాల్మీకి అప్రయత్నంగా వెలువడిన ఈ శోకాభివ్యంజక ఛందము మంగళమయమైన శ్లోకమగుగాక ! అని తనను తాను సమాధానపరచుకున్నాడు.

సరిగ్గా అదే రోజు సాయంత్రం -

శ్లోకంగా మారిన శోకచ్ఛందం గురించే వాల్మీకి ఆలోచిస్తూ వుండగా సంభ్రమాశ్చర్యాలు ముసురుకొనేలా సాక్షాత్తూ బ్రహ్మదేవుడు ఆయనకు దర్శనమిచ్చాడు. వాల్మీకి లేచి నిలబడి ప్రాంజలియై పాద్య అర్ఘ్య ఆసనాద్యుపచారాలతో ఆయనను సంప్రీతుని చేశాడు.



అప్పుడు బ్రహ్మ సంతోషాంతరంగుడై తన రాక గురించి వివరించాడు. వాల్మీకితో, "ఋషిసత్తమా ! ఛందోమయమైన నీ వాక్కులు మంగళకరమగు గాక ! నా ప్రేరణతోనే నీ ముఖ కమలము నుండి ఆ శ్లోకము వెలువడింది. నా ప్రేరణతోనే ఓ మహోన్నతుని

చరిత కావ్యంగా మలచాలనే కోరిక నీకు కలిగింది. నా ప్రేరణతోనే నారదుడు రామచరితను నీకు వినిపించాడు. మునివరా ! రామచంద్రుని పవిత్ర చరిత్రను లౌకిక భాషలో నువ్వు ఈ లోకానికి అందించు. అందువలన నీకు బ్రహ్మలోకావాప్తి కలుగుతుంది. నీ రచన రామకథ ఆచంద్రార్కం నిలిచివుంటుంది అని ఆశీర్వదించాడు.

# దశరథుడి చేతిలో రావణాసురునికి మొదటి పరాభవం

పదిమంది రథికుల బలం ఆయనొక్కడికే ఉంది కాబట్టి, ఆయన దశరథుడి పేరుతో సార్థకనామధేయుడు అంటుంది రామాయణం.

దశరథుడి రథానికి ఎదురు లేదు. అనేకమంది రాజులు అతనికి లోబడి సామంతులుగా మారిపోయారు. ఆర్యావర్తంలో అంటే, సింధూనది నుంచి గంగానది దాకా - ఇంకా బాగా అర్థం కావాలంటే, ఈనాటి పాకిస్తాన్‌తో మొదలుపెట్టి బంగ్లాదేశ్ దాకా వున్న ఒకనాటి ఉత్తర భారతదేశం అంతా 'ఆర్యావర్తం' గా పిలువబడేది. దశరథుడు ఇందులో చాలా భాగాన్ని తన స్వాధీనం చేసుకున్నాడు.

సరిగ్గా ఇదే సమయానికి దక్షిణ భారతదేశంలో రావణుడు కూడా అంతే బలసంపన్నుడిగా ఎదిగాడు. ఈ ఇద్దరి మధ్య ఎప్పుడో ఒకప్పుడు భారీ స్థాయిలో మహాసంగ్రామం జరగనుందని ప్రతి ఒక్కరూ అనుమానిస్తున్నారు. దాని పర్యవసానం ఎలా వుంటుందో తెలియదు. యుద్ధానికి ఎవరు ముందు తెరతీస్తారోకూడా తెలియదు.

ఈ రావణుడు తన రాక్షస దూతల్ని దశరథుడి దగ్గరకు పంపాడు. తనకు సామంతుడిగా వుండి కప్పంకట్టుకునేట్లయితే వదిలేస్తాననీ, లేకపోతే తనతో యుద్ధానికి సిద్ధంగా వుండాలనీ ఆ సందేశంతో దశరథుణ్ణి హెచ్చరించాడు.

రాక్షస దూతలు తెచ్చిన ఈ సందేశాన్ని విని దశరథుడు ఫక్కున నవ్వాడు. "మూర్ఖులారా... నేనిక్కడినించే బాణాలు వేసి మీ లంకానగర ద్వారాల్ని మూసేస్తున్నాను. మీ రావణుడికి చేతనైతే ఆ ద్వారాలు తెరుచుకొని బైటకు రమ్మను... నేను తప్పకుండా కప్పంకట్టి దాసోహం అంటాను..." అన్నాడు. రాక్షసదూతలు లంకానగరం చేరారు. అనుకొన్నట్లుగానే ద్వారాల్ని బాణాలతో కప్పేశాడు దశరథుడు. లోపలివాళ్ళు బైటకు రాలేరు. బైటవాళ్ళు లోనికి పోలేరు.

రావణుడు విశ్వప్రయత్నం చేశాడు. బాణాలు విడలేదు. ద్వారబంధాలు తెరుచుకోలేదు. రావణాసురుడు ఓటమిని అంగీకరించక తప్పలేదు.

ఓడిపోయినట్లు రావణుడు అంగీకరించగానే బాణాలు తిరిగి అయోధ్యకు వచ్చేశాయట ! అదీ రావణాసురుడి కక్ష దశరథుడిపట్ల !

# దశరథుడికి సంతానం కలగకుండా వరమడిగిన రావణుడు



దశరథుడి చేతిలో మొదటిసారి పరాభవం పొందిన రావణుడి హృదయం కక్షతో రగులుకుపోయింది. దిక్కులన్నింటినీ శాసించిన రావణుడు, ప్రకృతిని తన ఆధీనంలో నడిపిస్తున్నాననుకున్న రావణుడు, ఇంద్రుడంతటివాణ్ణి పారద్రోలి స్వర్గాన్ని తన ఏలుబడిలోకి తెచ్చుకున్న రావణుడు దశరథుడి బాణాల్ని విడగొట్టలేకపోవడం కన్నా అవమానం వుంటుందా... కోపంతో ఉడికిపోయాడు.

బ్రహ్మనుద్దేశించి ఘోరతపస్సు చేయడం మొదలుపెట్టాడు. రావణుడు లాంటి దుష్ట శక్తిమంతుడితో ఎక్కువ పెట్టుకోవడం ఇష్టంలేక బ్రహ్మ సులువుగానే ప్రత్యక్షం అయ్యాడు.

అప్పుడు రావణుడు బ్రహ్మని కోరిన వరం వినేసరికి బ్రహ్మదేవుడికి నిజంగానే మతిపోయినట్లయ్యింది. బహుశా అలాంటి వరం ఎవరూ ఎవరిని అడిగివుండరు. ఇంతకీ రావణుడు కోరిన వరం ఏమిటో తెలుసా... ?

"స్వామీ ! నన్ను అవమానించిన నా శత్రువు దశరథుడికి సంతానాన్ని కనే శక్తి అతని రక్తానికి లేకుండా చెయ్యి.... అని !

అంత బ్రహ్మ, "సరి ! యిచ్చితి"నని తెలిపి, అచటనే యుండిన రావణుడు మరేమైననూ కోరవచ్చునని తలంచి మరుక్షణమే అంతర్ధానమాయెను" అని రాశారు సత్యసాయిబాబా రామకథా రసవాహిని అనే గ్రంథంలో. ఇది తులసీదాసు రామాయణంలో కన్పించే కథ.

# కార్తవీర్యార్జునుడి చేతిలో రావణ పరాభవం

కార్తవీర్యార్జునుడు తన రాణులతో కళకళలాడుతున్నాడు. అది ఆయన స్వంత సరోవరం. మహాబలవంతుడు. గొప్ప ధనవంతుడు కూడా. వెయ్యి చేతులతో సంపాదించాడని ఆయన్ని సహస్రబాహు అంటారు. అనేక ఓడలున్నాయి ఆయనకి. బహుశా ఎగుమతి దిగుమతి వ్యాపారాల్లో ఆరితేరినవాడయివుంటాడు. అనేక దేశాల వారితో కూడా ఆయనకు మంచి సంబంధాలున్నాయి. ఆయన గురించి తెలిసిన వాళ్ళందరూ ఆయన దగ్గరగా వెళ్ళటానిక్కూడా భయపడతారు.

అలాంటి కార్తవీర్యార్జునుడి సరోవరం దగ్గరకి రహస్యంగా ప్రవేశించాడు రావణుడు. ఎదుటివాడి సంపదను చూస్తే చాలు కన్నుకుట్టే తత్త్వం రావణుడిది. రేవానది నుంచి నీటిని ఈ సరోవరంలోకి మళ్ళించి అక్కడ రాసక్రీడలో మునిగివున్నాడు కార్తవీర్యుడు. ఈ కార్తవీర్యుడి సంపద ఎలా అపహరించాలా... అనేదే రావణుడి ఆలోచన...

రేవానదిలో స్నానం చేసి, అక్కడో శివాలయం ఉంటే అందులో కూర్చున్నాడు. భక్తి శివుడిమీదేగాని, చిత్తం ఎదుటివాడి సంపదమీదే వుంది రావణుడికి. ఇంక నిగ్రహించుకోలేక పోయాడు. రేవానది నుంచి సరోవరానికి వస్తున్న నీటిమార్గం దగ్గర నిలబడి, ఆ నీటిని బంధించేశాడు. దాంతో ప్రవహించే నది ఆగిపోయి, సరోవరం మీదికి వరదలెత్తింది. వెల్లువలా వచ్చిపడ్తున్న నీటికి సరోవరంలో స్నానాలు చేస్తున్న స్త్రీలు కొట్టుకుపోసాగారు.

నదిమొత్తం ఇటే ప్రవహించడం గమనించాడు కార్తవీర్యుడు. ఆశ్చర్యంగా నదివైపుకు పరిగెత్తు కొచ్చాడు. తీరాచూస్తే ఇక్కడ ఈ పదితలల మనిషి... నీళ్ళకు అడ్డంగా నిలబడిన రావణుడు.

“ఎవడవురా నువ్వు...” అని గద్దించాడు కార్తవీర్యుడు. “నా శక్తి ఏమిటో చూశావుగా...” అన్నాడు బలదర్పంతో రావణుడు. కార్తవీర్యుడికి చాలా కోపం వచ్చింది. వీడికి తన శక్తి ఏమిటో చూపాలనుకున్నాడు. ఎడంచేత్తో రావణుణ్ణి ఒడిసిపట్టి అమాంతం పైకి లేపాడు. ఈడ్చుకొంటూ తన గుర్రపుశాలకు లాక్కుపోయి అక్కడ కట్టిపడేశాడు.

అంతఃపురంలో వున్న ఆడా, మగా – పిల్లాపీచూ వచ్చి రావణుణ్ణి చూసి వెక్కిరించి వెళ్ళడం మొదలుపెట్టారు. సిగ్గుపడిపోయాడు రావణుడు. “నీ పేరేమిట్రా!” అనడిగాడు కార్తవీర్యార్జునుడు. రావణుడికి చెప్పడానికి చాలా సిగ్గనిపించింది. ఎంత అడిగినా చెప్పలేదు. అంతఃపురంలో ఆడవాళ్ళు రావణుడిని సభామండపంలోకి తీసుకొచ్చి అతని పది తలల మీద పది దీపాలుపెట్టి చుట్టూచేరి ఆడుకోసాగారు... ఇన్ని అవమానాల్ని భరించాడు గాని, రావణుడు తానెవరో చెప్పలేదు.

అప్పుడు పులస్త్యబ్రహ్మ వచ్చి కార్తవీర్యార్జునికి నచ్చచెప్పి రావణాసురుణ్ణి చెరవిడిపించాడు. ఇలాంటి పరాభవాలు ఎన్ని పొందినా రావణుడికి సిగ్గు వుండదు. చేసిన తప్పే చేస్తుంటాడు. శాపాలు, కష్టాలు, అవమానాలు పొందుతుంటాడు. అదొక ఆనందం ఆయనకి. రాక్షసానందం అంటే అదే !

# రావణునికి నలకూబరుని శాపం

రంభ ఒక సాయంకాలం శివాలయానికి వెడుతోంది. చేతిలో పూలసజ్జ, గంధ పుష్పాక్షతలున్నాయి. రావణుడు ఆమెను చూశాడు. అంతటి అందగత్తె కాబట్టి ఆమెను సహజంగానే మోహించాడు. రావణుణ్ణి చూసేసరికి రంభలోకూడా కొద్దిపాటి మోహావేశం కలిగింది. మోహం కలగగానే ఆమెకు సిగ్గుముంచుకొచ్చింది. "సుందరీ.. ఎవరు నువ్వు" అని అడిగాడు రావణుడు. రంభ సిగ్గుపడి సమాధానం చెప్పలేదు. మౌనమే అర్ధాంగీకారంగా భావించాడు రావణుడు. అదే అదనుగా ఆమెతో సాంగత్యానికి ప్రయత్నించాడు.




రంభ దేవవేశ్య కాబట్టి, ఆమెకు వ్యక్తిగత శీలం అనేది ప్రధానంకాదు. కానీ, ఆపూట ఆమె నలకూబరుడి దగ్గరకు వెళ్ళేందుకు మాట ఇచ్చింది. ఇంతలో ఇది జరిగింది.

రంభ తిన్నగా నలకూబరుడి దగ్గరకు వెళ్ళి పొరబాటు జరిగిందనీ, రావణుడి కారణంగా ఆలస్యం అయ్యిందనీ జరిగిందంతా చెప్పింది. అలకానగర ప్రభువు నలకూబరుడికి కోపం తారాస్థాయికి వెళ్ళింది. వెంటనే "ఓరీ రావణా ! నీ వంశం నాశనం అయిపోతుంది" అని శపించాడు. నలకూబరుడు అంత శపిస్తాడని రంభ ఊహించలేదు. ఆమెకు భయంపట్టుకొంది. వెంటనే రావణుడి దగ్గరకు వెళ్ళి జరిగిందంతా చెప్పింది. ఇలాంటి శాపాలు ఎన్ని పొందాడు...? ఎదురు దెబ్బలు ఎన్ని తిన్నాడు...? అవమానాలు ఎన్ని భరించాడు...? శతకోటి శాపాల్లో ఇదొకటి అనుకున్నాడు. నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు రావణుడు.

అప్పుడతనికి ఒక విషయం గుర్తుకొచ్చింది. ఈమధ్య ఋషులు సక్రమంగా పన్నులు చెల్లించడం లేదని ! ఋషుల పన్నుల విభాగానికి అధిపతిని పిలిపించి ఏఏ ఋషి ఎంతెంత బాకీ వున్నాడో చూడమన్నాడు. ఒక్కొక్కరి వివరాలూ తెలుసుకున్నాడు.

ముందుగా ఒక ఋషి దగ్గరకి నల్గురు భటుల్ని పంపాడు. వాళ్ళని చూస్తూనే ఋషి వణికిపోయాడు. నలకూబరుడి శాపం కారణంగా రావణుడికేమైనా అపకారం జరిగిందేమోనని భయపడి..."అయ్యలారా ! తమ రాజుగారు కుశలమేనా... ?" అనడిగాడు. భటులు విసుగ్గా "మునీ ! పన్నుకట్టు ! రాజుగారు బాగానేవున్నార్లే" అన్నారు. రాజు నీతి తప్పాడు - అతని సేవకులు దుష్టులయ్యారు అని బాధపడ్డాడు ముని. ఉత్తచేతుల్తో పంపడం అనర్థహేతువు అని భావించి, చిన్న ముంత తీసుకొని, అందులోకి తన చెయ్యి కోసుకుని రక్తాన్ని పట్టి, మూకుడుతో మూసి, "దీన్ని మీ రాజుగారికి నా 'పన్ను' గా ఇవ్వండి. దీన్ని తెరిచి చూస్తే నశించిపోతాడని చెప్పండి" - అన్నాడు. భటులకి ఆ రక్తాన్ని తీయడం చూసి భయంవేసింది. తిన్నగా రావణుడి దగ్గరకు వెళ్ళి ఆ ముంతనిచ్చి ముని చెప్పిన సంగతి కూడా చెప్పారు.

అప్పుడు రావణుడి బుర్రలోకి ఓ మెరుపులాంటి ఆలోచన వచ్చింది. తనను శివసభలో అవమానించిన జనకుడికి దీన్ని అందేలా చేస్తే మూత తెరిచి చూస్తాడు. అమాంతం నశించిపోతాడు - అని దురాలోచన చేశాడు. వెంటనే వాయుమనోవేగాలతో వెళ్ళగలిగే తన వేగుల్ని పిలిపించి, వారికి ఈ ముంతని ఇచ్చాడు. మీరెవ్వరూ ఈ ముంతని తెరచి చూడకండి అని ఆదేశించాడు. రేపు జనక మహారాజు నేలని దున్నుతాడు. ఆ దున్నే నేల ఎక్కడుందో తెలుసుకొని అక్కడ దీన్ని పాతిపెట్టండి అన్నాడు. వేగులు తక్షణం రావణుడి ఆలోచనల్ని అమల్లోపెట్టారు.

జనక మహారాజు వర్షాలకోసం యజ్ఞం ప్రారంభించి, అందుకు బంగారు నాగలితో నేలను దున్నడం మొదలుపెట్టాడు. రాజు చేసే యజ్ఞం కాబట్టి రాజుగారే ఆ నేలని దున్నుతాడు. అలా దున్నుతుంటే, నాగలివెళ్ళి ఈ ముంతకు తగిలింది.

అంతే ! భూమి బద్దలై దేదీప్యమైన కాంతులతో ఒక దివ్యసింహాసనం భూమిలోంచి పైకివచ్చింది. దానిమీద పడుకోబెట్టిన ఒక పాపాయి కన్పించింది.

ఆశ్చర్యపోయాడు జనకుడు. ఆ భూపుత్రికని ప్రేమగా దగ్గరకు తీసుకున్నాడు. తన కుమార్తెగా పెంచుకోవడానికి నిర్ణయించుకొన్నాడు.

ఈ వేడుకలు చూడటానికి అక్కడ నారదుడు కూడా వున్నాడు. "జనక మహారాజా ! ఈ జనకపుత్రిని 'జానకి' అని పిలుచుకోండి. భూమి దున్నేటప్పుడు నాగటి చాలులో నీకు ఈమె లభించింది. నాగేటి చాలుని 'సీత' అంటారు. అందుకని 'సీత' పేరుతో ఈమె ప్రసిద్ధురాలవుతుంది" అని ఆశీర్వదించాడు. రావణుడి వ్యూహం ఇలా బెడిసికొట్టింది.

# వాలి ఇంటిలో నెల రోజులు ఉన్న రావణుడు

పంపానదీ తీరంలో పంపాపురంలో వానర రాజు వాలి సూర్యుడిని గురించి ధ్యాన నిష్ఠలో వున్నాడు. రావణుడు అక్కడకు వచ్చాడు. అక్కడ పెద్ద సరోవరంలో సూర్యుడికి అర్ఘ్య ప్రదానం చేస్తున్న వాలిని చూశాడు రావణుడు. తిన్నగా వెళ్ళి ఎదురుగా నిలబడ్డాడు.

వాలి ప్రశాంతంగా, రావణుణ్ణి చూసి చిన్నగా నవ్వి మళ్ళీ ధ్యానంలో మునిగాడు. బలగర్వంతో రావణుడు సింహనాదం చేసి, వాలికి ధ్యానభంగం కల్గించాలని చూశాడు. వాలి ఇతన్ని పట్టించుకోకుండా ధ్యానం చేసుకొంటున్నాడు. "రారా ! పిరికిపంద ! యుద్ధం చెయ్యలేక దేవుడి ధ్యానం నటిస్తున్నావా.." అంటూ రెచ్చగొట్టసాగాడు.

వాలి మళ్ళీ నవ్వాడు. "నువ్వు రావణుడివని నాకు తెలుసు. నీ బలం ఎంతో నాకు తెలుసు. కాసేపు ఆగు. నన్ను జపం పూర్తిచేసుకోనీ..." అంటూ తిరిగి ధ్యానంలోకి వెళ్ళాడు. అయినా రావణుడు రెచ్చిపోయి రెచ్చగొట్టాలని చూస్తూనే వున్నాడు.




"రావణా ! ఇప్పటికి కనీసం నాలుగుసార్లు నువ్వు అవమానం పొందావని అందరికీ తెలుసు. మళ్ళీ ఇంకోసారి ఎందుకు అవమానపడతావు... బుద్ధిగా ఇంటికిపో.." అని మందలించి వాలి మళ్ళీ ధ్యాననిమగ్నుడయ్యాడు. రావణుడికి ఈ హిత వాక్యాలు ఎక్కలేదు. తొడలు చరుస్తూ యుద్ధం... యుద్ధం అంటూ అరవసాగాడు. వాలి ఒక్క ఉదుటున రావణుడిమీదికి ఎగిరి అతనిని పట్టుకొని మడిచి చంకలో దూర్చి నొక్కిపట్టి, నాలుగు సముద్రాల్లోనూ మునిగిస్నానం చేస్తూ రావణుణ్ణి పట్టుకుని తిరిగాడు.

రావణుడు వాలిని ప్రార్థించి స్నేహంగా ఉందామని కోరాడు. ఆ కోరికను వాలి మన్నించి అతడిని తన ఇంట్లో అతిథిగా నెలరోజులపాటు ఉంచుకొని పంపించాడు.

అలా బతికి బయటపడ్డాడు రావణుడు.

# కౌసల్యనే ఎత్తుకుపోయిన రావణుడు

మళ్ళీ మొదటికొద్దాం.

రావణాసురుడి ధ్యాసంతా ఇప్పుడు దశరథుడిమీదే ! అతనికి సంతానం కలగకుండా చేయడంలో మొదటి విజయం సాధించాడు రావణుడు.

ఇప్పుడే అతనికి మరో వార్త అందింది. కౌసల్యతో దశరథుని వివాహానికి మాటలు జరుగుతున్నాయి అని ! "ఈ పెళ్ళిని ఎందుకు జరగనివ్వాలి...?" ఇదీ రావణాసురుడి బుర్రలో మెదిలిన ఆలోచన. తక్షణం కోసల రాజ్యం వెళ్ళాడు. సూక్ష్మరూపం ధరించాడు. అంతఃపురంలోకి ప్రవేశించాడు. రాజకుమారి కౌసల్యాదేవి మందిరంలో దూరాడు. ఆమెను మాయంచేసి, ఎత్తుకుపోయి ఒక పెట్టెలోపెట్టి సముద్రంలోకి విసిరేశాడు.

కౌసల్య నిద్రలోనేవుంది. పెట్టె అలలమీద తేలుతూ, కొట్టుకుపోతూ సముద్రంలో ఒక ఒడ్డుకు చేరింది. అది బ్రహ్మసంకల్పం. అది దశరథుడి రాజకుటుంబానికి చెందిన విహారస్థలం...ట ! మంచి బీచ్‌లాంటిది.

సరిగ్గా అదే సమయానికి దశరథుడి మంత్రి సుమంతుడు అదే దారిన వెడ్తున్నాడు. దూరంగా అందమైన పెట్టె కన్పించింది. జాలరులు ఆ పెట్టెని తెచ్చి సుమంతుడికి చూపించారు. ఆయన పెట్టెని తెరిపించాడు. లోపల కౌసల్యాదేవి.

ఆశ్చర్యపోయాడు మంత్రి ! గుర్తించాడు ఆమెని. తాను ఆ పెట్టెలోకి ఎలా వచ్చిందో చెప్పలేకపోయిందామె ! ఆలోచించాడు మంత్రి. "అమ్మా! ఇలాంటి పనులు మాయోపాయాలు నేర్చిన రాక్షసులే చెయ్యగలరు". అన్నాడు. అతనికి అర్థం అయ్యింది ఇది రావణుడి పనేనని !

కౌసల్యను తండ్రికి అప్పగించాడు. దశరథుని గుణగణాలను విశ్లేషించి వివరించాడు. విన్నాడు కోసలరాజు. "మంత్రీ ! మా పుత్రికను మీరే రక్షించారు. మీరే మీ రాజుతో ఆమె వివాహం జరిపించండి" అని కోరాడు. అలా రావణుడి కారణంగానే దశరథుడు కౌసల్యని పెళ్ళాడి ఒక ఇంటివాడయ్యాడు.

# ఈ రావణుడెవరు ?

"అగమ్యో మానుషైర్దీప్తః" అంటే, మామూలు మనుషులు చేరడానికి సాహసించని లంకాద్వీపానికి అధిపతి రావణుడు. రావణుడు రాక్షసుడు. బ్రాహ్మణుడు ఎట్లా అయ్యాడు ?

రాక్షసుణ్ణి వధించి దుష్ట శిక్షణ చేసినందుకు రాముడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొందనీ, దాన్ని పోగొట్టుకునేందుకు రాముడు శివాలయాల్ని కట్టించాడని చాలా శివాలయాల స్థల పురాణాల్లో కన్పిస్తుంది.

రావణుడు మనస్తత్వం రీత్యా దుష్టుడైనా, వ్యక్తిత్వం రీత్యా ఉన్నతుడు. అనేక విజయాలు సాధించాడు. పండితుడు. తపోశక్తిసంపన్నుడు. ఆయన్ని చంపవలసిరావడం రాముడికి బాధాకరమే మరి !

"సుమాలి" అనే రాక్షస రాజుకు అందమైన కూతురుంది. పేరు కైకసి. గొప్ప శివభక్తురాలు. రాక్షస జాతికి ప్రతిభావంతులైన బ్రాహ్మణుల ద్వారా సంతానం కలిగితే అత్యంత ప్రతిభావంతులూ అత్యంత శక్తిమంతులూ అయిన జాతి పుడ్తుంది అని ఆలోచించాడు సుమాలి.

అందుకోసం తన కూతురు కైకసిని "మిశ్రవో మహర్షి" అనే ప్రతిభావంతుడి దగ్గరకు పంపించి, ఆయన ద్వారా సంతానాన్ని పొందమని తండ్రిగా తనే అనుమతించాడు.

లైంగిక విషయాలలో ఎలాంటి కట్టుబాట్లూ రాక్షసులకుండవు కదా ..... అందుకని గొప్ప సంతానం కోసం మిశ్రవో మహర్షి దగ్గరకు వెళ్ళింది కైకసి. మహర్షితో సంగమాన్ని ఆమె కోరిన సమయం సంధ్యా సమయం.

**"అవిచిన్త్యతు తాం వేలాం దారుణాం పితృగౌరవాత్ ।**

**ఉపసృత్యా ఽ గ్రత స్తస్య చరణాథో ముఖీ స్థితా ॥"**

"కైకసి మహర్షి దగ్గరకు వచ్చింది. మిశ్రవో మహర్షి కళ్ళు తెరిచి చూశాడు. ఎదురుగా ఈ రాక్షసి. అందమైనదే !"

"ఎవర్నువ్వు - ఎందుకొచ్చావు ?" అడిగాడు మహర్షి.

**"మాం విద్ధి బ్రహ్మర్షే శాసనాత్పితు రాగతామ్"**

"మా నాన్న పంపితేనే వచ్చాను. నాపేరు కైకసి" అంది. "శేషం త్వాం జ్ఞాతు మర్హసి" ఇది మొదటి ప్రశ్నకి జవాబు. రెండో ప్రశ్నకు జవాబు మీరే ఊహించుకోండి " అని చెప్పింది.

ఒక ఆడది ఒక మగవాడి దగ్గరకు ఎందుకొస్తుంది - ? వచ్చి, "ఎందుకొచ్చానో ఊహించుకోండి" అని అంటే అర్థం ఏమిటీ .....

ఊహించుకొన్నాడు మహర్షి.

"కానీ, అందుకోసం నువ్వు వచ్చిన ఈ సమయం దారుణమైంది" అన్నాడు మహర్షి - నువ్వు కోరుకున్నట్లు ప్రతిభావంతులైన పుత్రులే పుడతారు. ఒకళ్ళు కాదు ముగ్గురు పుడతారు.

ఒకడు గొప్ప బ్రాహ్మణుడు, గొప్ప రాక్షసుడు అనదగినవాడు పుడతాడు.

ఒకడు అచ్చం రాక్షస మనస్తత్వంతో మహా భయంకరంగా పుడతాడు.

మూడోవాడు కేవలం బ్రాహ్మణ మనస్తత్వంతోనే పుడతాడు - అని చెప్పాడు.

ముగ్గురూ అనితర సాధ్యమైన ప్రతిభా వ్యుత్పత్తులు కలిగి వుంటారని వరం ఇచ్చాడు. ఆమె కోరికను, ఆ సాయంసంధ్యా సమయంలోనే తీర్చి పుత్రుల్ని ప్రసాదించాడు.

**పశ్చిమోయస్తవ సుతోభవిష్యతి శుభాననే**

**మమ వంశాను రూపస్స్ర ధర్మాత్మాచ న సంశయః ॥**

అలా కైకసికి ముగ్గురు పుత్రులు కలిగారు. వారిలో మొదటివాడు రావణుడు. బ్రహ్మవర్చస్సు - రాక్షస గుణాలు మేళవించి పుట్టినవాడు.

రెండవ వాడు కుంభకర్ణుడు. కేవలం రాక్షసగుణ సంపన్నుడు. మహాబలుడు. అతికాయుడు.

మూడవ వాడు ధర్మాత్ముడు. అతనే విభీషణుడు. ఏ కోశానా రాక్షసాంశ లేని ఋషితుల్యుడు.

తండ్రిని బట్టి ఈ ముగ్గురూ బ్రాహ్మణులయ్యారు. తల్లిని బట్టి రాక్షస రాజ్యానికి పాలకులయ్యారు.

..... ఇక్కడ గమ్మత్తేమిటంటే, రాముడి తల్లులలో కైక ఒకరు. రావణాసురుడి తల్లి కైకసి - నామ సామ్యతే కాదు, గుణ సామ్యత కూడా ఇద్దరికీ సమానంగా వుండటం విశేషం !

# దశరథుడి వివాహాల విశేషాలు

దశరథుడి మొదటి భార్య కౌసల్య. ఇద్దరూ ఇంచుమించు సమవయస్కులే. నిజమైన యవ్వనకాలంలో కౌసల్యతో వివాహం అయ్యింది దశరథుడికి. ఆమెతో సుదీర్ఘకాలం పెనవేసుకున్న జీవితం ఆయనది. ఆయన ప్రేమ, అభిమానం, ఆయన కష్టసుఖాలన్నీ సహధర్మచారిణిగా పంచుకొన్న అర్థాంగి కౌసల్య.

కౌసల్యద్వారా సంతానం కలగలేదని చాలాకాలం తర్వాత సుమిత్రను చేసుకున్నాడు దశరథుడు.

కౌసల్యకు సంతానం కలగలేదు కాబట్టి, సుమిత్రను పెళ్ళాడాడు దశరథుడు. కౌసల్యను చూసుకున్నంత ప్రేమగా సుమిత్రను చూసుకున్నాడా అనేది సందేహం. ఎందుకంటే, సుమిత్రతో వివాహం అయ్యేసరికి దశరథుడు నలభయ్యోపడిలో పడ్డాడు. వృద్ధుడూ కాదు, యువకుడూ కాదు ఆ సమయానికి ! తన మనసునీ, తన ప్రేమనీ ఎంతమేర పంచి ఇవ్వగలిగాడో ఆమెకి దశరథుడు... అనుమానమే.

ఈమెకూ సంతానం కలగలేదు. సంతానం కోసం తాపత్రయం దశరథుడిలో రోజురోజుకీ ఎక్కువ కాసాగింది. వయసు పెరిగిపోతోంది. పిల్లలు పుట్టే వయసుదాటితే ఉపయోగం లేదనుకున్నాడు. బహుశా, సంతానం కల్గలేదనే వేధింపులకు రాణులిద్దరూ బాగానే బాధపడివుండాలి. ఇంక లాభంలేదని మూడో వివాహానికి తలపడ్డాడు దశరథుడు.

కైకేయితో వివాహం దశరథుడు చేసిన పెద్ద తప్పు అని పండితులంటారు. ఇందుకు రెండు కారణాలున్నాయి. కౌసల్య వంటి ఉత్తమ ఇల్లాలి లక్షణాలు గానీ, సుమిత్ర వంటి సహనశీలం గానీ లేని వ్యక్తి కైక. అహంకారపూరితంగా వ్యవహరించడం ఆమె నైజం. ఇది మొదటి కారణం. ఇంక రెండో కారణం – తన వృద్ధాప్యంలో మహా సౌందర్యవతిని, యవ్వనవతిని భార్యగా స్వీకరించడం. స్వీకరించి ఇద్దరు సవతుల మధ్య చేర్చడం.

సరే... ఈ ముగ్గురు సంగతి అలా వుంచండి. వీళ్ళుకాక ఇంకా 350 మంది భార్యలున్నారు దశరథుడికి. వీళ్ళంతా 'రాణి' హోదా పొందినవారు కాకపోవచ్చు. లేదా, వారి ద్వారా కల్గిన తన సంతానానికి రాజ్యాధికారం ఇస్తానని మాట ఇచ్చినవారు కాకపోవచ్చు.

దశరథుడి రాణుల్లో సుమిత్ర పాత్ర చాలా దారుణమైంది. మొదటి భార్య కౌసల్య సుదీర్ఘకాలం దశరథుడితో గడిపిన వ్యక్తి. పెద్ద భార్యగా, పట్టమహిషిగా ఆమె గౌరవం ఆమెకు దక్కవలసిందే ! ఇంక కొత్త భార్య 'కైక'.. ఈమె ముద్దుల భార్య. మహారాజుగారి హృదయాన్ని, ప్రేమను చూరగొని తన అందంతో ఆయన్ని పూర్తిగా ఆకట్టుకొంది. ఆమె ఆదరణకు తక్కువేమీ లేదు. మధ్యలో రెండోరాణి సుమిత్ర పరిస్థితి ఏమిటన్నదే ప్రశ్న !

వాల్మీకి ఈ అంతఃపురంలో ఆడవాళ్ళ గురించి పెద్దగా పట్టించుకున్నట్లు ఎక్కడా కన్పించలేదు. అలాగని, ముగ్గురు రాణులూ ఎలాంటి పొరపొచ్చాలు లేకుండా అక్కాచెల్లెళ్ళ మాదిరే వున్నారనడానికి కూడా పూర్తిగా వీల్లేదు.

కైకేయి దగ్గర పనిచేసే దాసి, కౌసల్య దగ్గర పనిచేసే దాసిని రాముడి పట్టాభిషేకం వార్త తెలియగానే, కౌసల్య పేదలకు దానధర్మాలు చేసిందని – "మీ అమ్మగారు అప్పుడే రాముడు రాజు అయిపోయినట్లే దానధర్మాలు చేసేస్తోందే..." అని వ్యాఖ్యానిస్తుంది !

రాణుల మధ్య సహజంగా వుండే అసూయ, రాగద్వేషాలన్నీ వున్నప్పటికీ, నల్గురు కొడుకులపట్ల సమానమైన వాత్సల్యాన్ని చూపించాడు దశరథుడు. కానీ, వారిలో శ్రీరాముడిపట్ల అదనపు ఆదరణ ఆయనకుంది. కౌసల్య పట్ల ఆయనకున్న ఆదరణ శ్రీరాముడిపట్ల ఈ అదనపు ఆదరణకు కారణం కావచ్చు. రాముడి వ్యక్తిత్వం, ప్రవర్తన, అతనిలో చిన్ననాడే కన్పించిన నాయకత్వపు లక్షణాలు కూడా ఈ అదనపు ఆదరణని ప్రేరేపించి వుండవచ్చు.

తన అందంతో ఆయన్ని వ్యామోహంలో ముంచెత్తించిన కైక, తన పుత్రుడు భరతుడిపట్ల దశరథుని నుంచి ఇలాంటి అదనపు ఆదరణ సాధించుకోలేకపోవడమే ఈ కథలో విశేషం !!

# కైకేయికి వరాలెందుకు ?

శంబరాసురుడితో పోరాడుతున్న దేవతలకు సహాయంగా తన సైన్యాన్ని స్వయంగా తానే నడిపిస్తూ యుద్ధరంగానికి వెళ్ళాడు దశరథుడు.

ఆయనతోపాటు అప్పుడే కొత్తగా పెళ్ళి చేసుకున్న కైకేయిని కూడా తీసుకువెళ్ళాడు.

శంబరాసురుడితో దశరథుడియుద్ధం భీకరంగా సాగుతోంది.

ఆ సమయంలో అకస్మాత్తుగా దశరథుడి ఒక రథచక్రానికి శీల ఊడిపోయి రథం అటూ ఇటూ ఊగి బోల్తాపడబోయింది. దశరథుడు కంగారుపడి విల్లుదించి రథానికి ఏమయ్యిందా... అని చూసుకునే అవకాశం యుద్ధరంగంలో వుంటుందా... అందునా శంబరాసురుడంతటివాడితో యుద్ధం.

ఆ రథం మీదే కూర్చునివున్న కైక ఇది గమనించి, నేలమీదకి దూకి, ఊడిపోయిన రథ శీలమేకు స్థానంలో తన చూపుడు వేలుని పెట్టి రథాన్ని నిలబెట్టిందట...

దశరథుడికి పెద్ద ప్రమాదం తప్పినట్లయ్యింది – ఆయన హృదయం కైకేయిపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది.

శంబరాసురుడే చివరికి ఓడిపోయాడు. దేవతలు గెలిచారు. దశరథుడు తన రాజ్యానికి తిరిగి బయల్దేరాడు.

అప్పుడు ఆయనకో సందేహం వచ్చింది.

"తిరిగే రథచక్రం వెనక పరిగెడుతూ ఊడిపోయిన శీలమేకుకు బదులుగా రంధ్రంలో నీ వేలు పెట్టగలిగావంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. ఎలా బాధని సహించగలిగావు ? –

నీ వేళ్ళు నలగకపోవడం గానీ, గాయపడకపోవడం గానీ చూస్తే మతిపోతోంది - ఏమిటా రహస్యం...!" అనడిగాడు.

అప్పుడు కైక నవ్వి తన చిన్ననాటి సంగతి ఒకటి చెప్పింది - ఆ కథ ఇది ...

కైక బాగా చిన్న పిల్లగా వున్నప్పుడు పిల్లలంతా వనవిహారం చేస్తూ ఒక అడవిలోకి వచ్చారట. అక్కడ ఒక ముని తపస్సు చేసుకొంటుంటే, కైక తన బాల్యచాపల్యం చేత ముని ముఖానికి మసి రాసి కేరింతలు కొట్టి నవ్వుందట.

మునికి తపోభంగం అయ్యి, కళ్ళు తెరిచి చూసి, ఆ పిల్లని పట్టుకొని "పొద్దున్నే నీ ముఖం ఎవడు చూసినా పంచమహాపాతకాలూ చుట్టుకుంటాయ్..." అని తిట్టాడు. అంటే, శపించాడన్నమాట !

అలాంటి మహాపురుషులు ఏమంటే అది జరిగి తీరుతుంది.

దాంతో బెంబేలుపడి ఆ పిల్ల భోరున ఏడ్చేసింది.

జాలిపడ్డాడు ముని ! లోకక్షేమం కోరే వ్యక్తులేగాని, లోకాన్ని హింసించడం మునులకు లక్షణం కాదుకదా... ఆ పిల్లని దగ్గరికి తీసి ఓదార్చాడు. కళ్ళనీళ్ళు తుడుచుకోవడంతో తడిసిపోయిన ఆమె రెండు అరచేతుల్ని తన చేతుల్తో తడిమి, "తల్లీ ! ఈ రెండు చేతులూ వజ్రంలా గట్టిగా అయిపోయేలాగా నీకు వరం ఇస్తున్నాను - ఏడవకు" అన్నాడు. ఈ కథనంతా వివరించి చెప్పి, రథచక్రం లోపలే కాదు, రథచక్రాల కింద పెట్టినా నా చేతులు నలగవు - " అని వివరించింది కైకేయి.

ఈ మేలుకి ఒక వరం ఇస్తానన్నాడు దశరథుడు.

ఇదే యుద్ధంలో శంబరాసురుడితో పోరుతూ ఒకసారి దశరథుడు రథం మీదే మూర్ఛపోయాడు. సారధి మరణించాడు. వెంటనే కైకేయి గుర్రాల పగ్గాలుపట్టి, రథాన్ని పక్కకు తప్పించి, శంబరాసురుడికి అందకుండా చేసింది. మూర్ఛపోయిన దశరథుడికి శీతలోపచారాలు చేసి సేదతీర్చింది. మేల్కొన్నాడు దశరథుడు. ఈ ఉపకారం కోసం ఆమెకు ఇంకోవరం ఇస్తానన్నాడు దశరథుడు. దారిలో తన రథం శీలకున్న మేకుని సరిచేసినందుకు, తన ప్రాణాలు కాపాడి నందుకు ఆమె కోరినప్పుడు తీర్చే విధంగా రెండు వరాలు ఇస్తానన్నాడు దశరథుడు. ఆమె అవసరం అయినప్పుడు చూద్దాం అన్నట్లు వాటిని అలానే అట్టేపెట్టుకొంది. దశరథుడు కూడా, "నీ ఇష్టం వచ్చినప్పుడు అడుగు - కాదనకుండా తీరుస్తాను" అన్నాడు. అలా శంబరాసురుడితో సమరం సమయంలో రెండు వరాలను పొందింది కైక వాటిని సరయిన సమయంలో ఉపయోగించాలనుకొంది. దశరథుడు అందుకు అంగీకరించాడు. అదీ కథ !!

# కైకేయివన్నీ తల్లిపోలికలే !

రామాయణ కథకు కైక కీలకపాత్రధారి. ఆమె మహా సౌందర్యవతి. ఆమె సౌందర్యం దశరథుణ్ణి కట్టిపడేసింది. ఎంత కట్టిపడేసిందంటే, స్వయంగా తనకు తాను తీసుకున్న నిర్ణయాన్నికూడా మార్చుకుని, రాముడి రాజ్యాధికారాన్ని కాదని, భరతుడికే రాజ్యం ఇవ్వడానికి అంగీకరించేంతదాకా కట్టిపడేసింది.

కైకేయి తత్త్వం ఎలాంటిదో అర్థంచేసుకోవడానికి ఆమె తల్లి గురించి తెలుసుకొంటే సరిపోతుంది. కేకయ రాజు కూడా కైక తల్లిని వ్యామోహపడే వివాహమాడాడు. పెళ్ళయిన మరుక్షణం నుంచి కేకయ రాజుని తన అదుపాజ్ఞల్లో బందీని చేయగల్గింది కైక తల్లి.

కేకయరాజుకి జంతువులు, మాట్లాడుకునే భాషను అర్థం చేసుకోగలిగే శక్తివుందిట. కానీ, తన విద్యారహస్యాన్ని బైటకుచెబితే ఆ క్షణానే మరణిస్తాడు.. అదీ ఆయన పరిస్థితి.



ఒకరోజు ఓ విచిత్ర సంఘటన జరిగింది. రెండు చీమలు ఏవో మాట్లాడుకొంటున్నాయి. కేకయరాజు ఆ సంభాషణ విని బిగ్గరగా నవ్వాడు. ఎందుకలా నవ్వుతావని అడిగింది రాణి. రాజు చెప్పలేదు. రాణి పట్టుబట్టింది. "చెప్పకూడదు - చెప్తే చచ్చిపోతాను" - అన్నాడు రాజు. నిర్దాక్షిణ్యంగా కైకతల్లి తన భర్తతో ఏమన్నదో తెలుసా... "నువ్వు చస్తే చచ్చావు... నాకేం బెంగలేదు. కానీ, నువ్వెందుకు నవ్వావో చెప్పితీరాల్సిందే... !" అని ! అప్పుడు రాజుకి జ్ఞానోదయం అయ్యింది. అందగత్తెననే అహంకారంతో విర్రవీగే ఆమెకోసం తన ప్రాణాలు బలిపెట్టడం అవివేకం అనుకున్నాడు. ఎదురు తిరిగాడు. చెప్పనుగాక చెప్పను పొమ్మన్నాడు.

కైకేయికూడా తన తల్లి చేసిన పనే చేసింది. రాముడు లేకపోతే నేను బతకలేను అన్నాడు దశరథుడు. "మీ చావు బతుకుల గురించి ఆలోచించే సమయం ఇది కాదు –" అంది కైక. రాముడు అడవులకు పోవల్సిందేనంది. దశరథుడు మరణశయ్య ఎక్కినా చలించలేదు. చనిపోయేవరకు పట్టువదల్లేదు.

తన మామగారు కేకయరాజు చూపించిన తెగింపు దశరథుడు చూపించలేక పోయాడు. కైకను పెళ్ళాడడం అనే తప్పు చేసినందుకు అప్పుడు కుళ్ళికుళ్ళి ఏడ్చినంత పనిచేశాడు. చివరికి, "నువ్వు నా పెళ్ళానివీ కాదు – నీ కొడుకు నాకు కొడుకూ కాదు –" అనేశాడు.

## రాక్షసవధ చేస్తానని విష్ణుమూర్తి హామీ

కన్పించిన వాళ్ళందరితోనూ కజ్జాలు పెట్టుకోవడం రావణుడి అలవాటు. అనేకసార్లు తానే గెలిచాడు. గరుడ, గంధర్వ, కిన్నెర, యక్ష, నర, నాగజాతుల్ని ఎదుర్కొని రావణుడే గెలిచాడు.

ఒక్కోసారి తానూ ఓడిపోయాడు. దశరథుడు, పరశురాముడు, వాలి, కార్తవీర్యార్జునుడు ఇలా అనేకమందిచేత అవమానాలు పొందాడు.

కానీ గెలుపులు అతన్ని విర్రవీగేలా చేశాయి. అష్టదిక్పాలకులు అతని ఆజ్ఞలను శిరసావహిస్తారు. సృష్టిలోవున్న సమస్తము రావణుడి ఆధీనంలో వున్నాయి. ఇంద్రజిత్తు రావణుడి కొడుకు. తండ్రికి తగిన బిడ్డ. తండ్రి అంతటి క్రూరుడు కూడా !!




ఈ తండ్రీకొడుకుల దౌష్ట్యాన్ని చూసి, రావణుడి అన్నగారు కుబేరుడు "తమ్ముడూ! మరీ అంత క్రూరంగా వుండవలసిన అవసరం లేదేమో..." అని ఒక చిన్న ఉత్తరం రాశాడు రావణుడికి. అంతే ! కోపంతో రెచ్చిపోయి, కుబేరుడి సభమీదకి దండెత్తి అతన్ని

వెళ్ళగొట్టి అతని సింహాసనం ఆక్రమించాడు. అలాగే యముడి సింహాసనం కూడా ఆక్రమించాడు. వీడికింకా మరణం సమీపం కాలేదని భావించి, చేసేదిలేక యముడే ఇచ్ఛికంగా యమపురిని వదిలేసి వెళ్ళిపోయాడు. ఇంక అదే ఊపుతో ఇంద్రునిమీద దండెత్తి ఇంద్రపదవిని అధిష్టించాడు రావణుడు.

వేద గ్రంథాల్ని మూసేయించాడు. గోబ్రాహ్మణుల్ని అంతం చేయించాడు. సదాచార పరాయణుల్ని బంధించి హింసించాడు. వాడు పెట్టే బాధలు భరించలేక భూదేవి బ్రహ్మ దగ్గరకు వెళ్ళి అతని దుశ్చేష్టితాలను బ్రహ్మకు మొరపెట్టుకొన్నది.

అప్పుడు భూదేవిని ఓదార్చి బ్రహ్మ విష్ణువును ఆశ్రయించమని సలహా ఇచ్చాడు.

రావణుడు పెట్టే బాధలను దేవేంద్రాది దేవతలు ఇక ఏమాత్రమూ భరించలేక పోయారు. వారు కూడా బ్రహ్మ దగ్గరికివెళ్ళి మొరపెట్టుకున్నారు. ఆయన విష్ణువును శరణువేడమని సలహా ఇచ్చాడు.

"విష్ణువు ఎక్కడుంటాడు?" ప్రశ్నించారు దేవతలు. ఒక దేవత– "వైకుంఠంలో" అని ఠక్కున సమాధానం చెప్పాడు. "క్షీరసముద్రంలో శేషునిమీద పడుకొని వుంటా"డని ఇంకోదేవత అన్నాడు. "ఎవరు భక్తితో కొలుస్తారో వాళ్ళ దగ్గర ఉంటాడు" అని ఇంకొకరు చెప్పారు. అప్పుడు శివుడు చెప్పాడు. "ఓ దేవతలారా ! హరి సర్వవ్యాపకుడు. సర్వసముడు. భక్తితో పూజించేవారికి ఎక్కడైనా ప్రత్యక్షం అవుతాడు. సమస్త పదార్థాల్లోనూ 'హరి'వున్నాడు. దిశలు, విదిశలు, కాలం, దేశం అంతటా హరి వున్నాడు. సందేహంలేదు. ఎక్కడ హరిని వెదికితే అక్కడే కన్పిస్తాడు.." అని వివరించాడు. అప్పుడు అందరూకలిసి అక్కడికక్కడే హరికీర్తన చేశారు. హరి ప్రత్యక్షమై "నా పరమశక్తితో అవతరించి, భూభారాన్ని హరిస్తాను. దేవతలారా, నిర్భయంగా మీ ఇళ్ళకెళ్ళండి"– అని చెప్పాడు. బ్రహ్మ భూదేవిని ఊరడించాడు. ఆమె సంతోషించింది.

## దశరథుడి కూతురు 'శాంత'

దశరథుడికి ఒక కూతురుంది. ఆమె పేరు శాంత. అంగదేశపు రాజు రోమపాదుడితో దశరథుడికి స్నేహం అయ్యింది. ఆ స్నేహానికి తీపి గుర్తుగా దశరథుడు తన కూతురు శాంతని చంటిపిల్లగా వున్నప్పుడే, రోమపాదుడికి దత్తత ఇచ్చాడు. రోమపాదుడి ముద్దుల కూతురుగా పెరిగింది శాంత.

రామాయణంలో శాంత పాత్ర చాలా చిన్నదే గాని, కీలకమైంది. ఎందుకంటే, శాంతను ఋష్యశృంగుడనే ఒక మహర్షికిచ్చి పెళ్ళిచేశారు. ఈ ఋష్యశృంగుడు మహిమాన్వితుడు, జ్ఞాని, సమస్త శాస్త్రపారంగతుడే కాదు, సంతానం లేనివారికి సంతానాన్ని కల్గించే వైద్య ప్రక్రియలు తెలిసిన వైద్యుడు కూడా. ఈనాడు సంతాన సాఫల్య కేంద్రాలు నడిపేవారు ఆ వైద్యప్రక్రియకు పితామహుడైన ఋష్యశృంగుని గురించి తలచుకోవాల్సి వుంటుంది. అంతటి గొప్పవాడు ఋష్యశృంగుడు.

# ఋష్యశృంగుని కథ

సరే ! దశరథుడు తనకు సంతానం కలగలేదని, వృద్ధాప్యం మీదపడ్తోందనీ విచారిస్తున్న సమయంలో, అశ్వమేధయాగం చేస్తే ఫలితం కల్గుతుందనే ఆలోచన వచ్చింది ఆయనకి. వెంటనే మంత్రి సుమంతుణ్ణి పంపి సుయజ్ఞుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, వశిష్ఠ పురోహితుడు... వీళ్ళందర్నీ పిలిపించి, అశ్వమేధయాగం ప్రస్తావన చేసి సాధ్యాసాధ్యాలను చర్చించాడు.



గతంలో తనకు తెలిసిన శబ్దవేధి విద్యతో సరయూ నదిలో నీళ్ళుముంచుకొంటున్న మునికుమారుణ్ణి పొరబాటున చంపి బ్రహ్మహత్యాపాతకం తెచ్చుకున్నాడు దశరథుడు. అంతేకాదు కుమారుని మరణవార్తను - వృద్ధుడు, అంధుడు అయిన తండ్రికి తనే స్వయంగా తెలియచేశాడు కూడా.

అప్పుడా వృద్ధుడు "తెలియకుండా పొరబాటున బ్రాహ్మణ బాలకుణ్ణి చంపావు కాబట్టి, బ్రహ్మహత్యాపాతకం వెంటనే చుట్టుకోదు - అన్నాడు. అంటే, నెమ్మదిగా చుట్టుకొంటుంది అనే కదా...! దాని ఫలితమే తనకు సంతానం కలగకపోవడం అని నిశ్చయించుకొన్నాడు.

దశరథుడికి మాత్రమే తెలిసిన ఇంకో విషయం ఉంది - తనలాగే, దశరథుడు కూడా పుత్రవియోగ దుఃఖంతో మరణిస్తాడని ఆ వృద్ధుడు శపించిన సంగతి ! ఆయనకి అదే ఆశ... తనకు పుత్రుడు కలిగితే కదా... పుత్రవియోగం ఏర్పడేది అని ! ఈ దోషాలు, శాపాలు పోవాలంటే, ఒక్కటే మార్గం - అశ్వమేధయాగం చేసి పుణ్యం సంపాదించుకోవాలి - అని నిర్ణయించుకున్నాడు. వశిష్ఠుడు మొదలైన ఋషులంతా దశరథుడి అశ్వమేధయాగానికి సరేనన్నారు.

అప్పుడు మంత్రి సుమంతుడు ఏనాటి సంగతో ఒకటి జ్ఞాపకం చేసుకొని చెప్పడం మొదలుపెట్టాడు దశరథుడికి.

"మహారాజా ! ఒకప్పుడు మహర్షి సనత్కుమారుడు స్వయంగా భవిష్యత్తులో జరిగే సంఘటనలు కొన్నింటిని నాతో చెప్పాడు. వాటిలో చాలా వరకు నిజమైనాయి. ఆయన చెప్పిన విషయాల్లో మీ ప్రస్తావన కూడా వుంది -

1. కశ్యపుడికి విభాండకుడనే పుత్రుడు, అతనికి ఋష్యశృంగుడిగా ప్రసిద్ధుడైన కుమారుడు కలుగుతారు.
2. ఆ సమయంలో రోమపాదుడనే రాజు అంగదేశానికి అధిపతి అవుతాడు.
3. తీవ్రమైన అనావృష్టి, కరువు పరిస్థితులు ఏర్పడినప్పుడు ఋష్యశృంగ మహర్షికి తన కుమార్తె శాంతనిచ్చి వివాహం చేస్తాడు. ఋష్యశృంగుని మహిమవలన వర్షాలు కురిసి ప్రజలు కరువులోంచి బైటపడతారు.
4. పెళ్ళి సమయంలో రోమపాదుడు ఋష్యశృంగుని దశరథునికి పరిచయం చేసి, "నీ భార్య శాంత నాకు దత్తపుత్రిక. ఆమె అసలు తండ్రి ఈ దశరథుడు. నీకు నేనెంతో, ఈ దశరథుడూ అంతే..." అంటాడు.

ఇవన్నీ సనత్కుమారుని ద్వారా నాకు ముందే తెలుసు. ఇప్పుడు మీకు ఇంకో సంగతి తెలియజేయాలి. తమ అల్లుడు ఋష్యశృంగుడు మహిమగల మహర్షి, అంతకుమించిన వైద్యుడు కూడా ! సంతాన ప్రాప్తినిచ్చే వైద్యరహస్యాలు తెలిసినవాడు... అని అదనపు సమాచారం అందించాడు సుమంతుడు.

ఆ మాట వినంగానే దశరథుడి కళ్ళు ఆశగా మెరిశాయి. ఆలస్యంగా తెల్సినా అసలు విషయం తెల్సినందుకు సంతోషించాడు.

తక్షణం తన మిత్రుడు అంగరాజు రోమపాదుణ్ణి కలిసి, ఆయన ద్వారా ఋష్యశృంగులవారిని అయోధ్యకు రప్పించే ఏర్పాట్లు చేయవలసిందిగా కోరాడు. ఋష్యశృంగుని ఆధ్వర్యంలో యజ్ఞం నిర్వహించదలచినట్లు, అందుకు అంగీకరింప జేయవలసిందిగా అంగరాజుకు విజ్ఞాపన పంపుకున్నాడు.

అప్పుడు సుమంతుడు ఇంకో సంగతికూడా చెప్పాడు : "మహారాజా ! ఏది జరగాలన్నా కాలం దానికి సమకూరాలి. మీరు ఋష్యశృంగుని రప్పించి అతని ఆధ్వర్యంలో యజ్ఞం నిర్వహిస్తారు. ఆయన అనుగ్రహంతో వంశప్రతిష్ఠాకరులు, అమిత బలసంపన్నులూ అయిన నలుగురు పుత్రులు మీకు కలుగుతారు... ఈ సంగతి భవిష్యద్వాక్కులుగా ఏనాడో సనత్కుమారులు నాకు తెలిపారు. సమయం ఆసన్నమైంది కాబట్టి ఆ రహస్యాన్ని ఇప్పుడు మీకు చెబుతున్నాను"- అన్నాడు.

నలుగురు కొడుకులు పుట్టబోతున్నారన్న వార్త విని దశరథుడి ఆనందానికి అవధులు లేకుండా పోయాయి.

# అశ్వమేథయాగం దేనికి ?

దశరథ మహారాజు అశ్వమేథ యాగ సన్నాహాలు ప్రారంభించే సమయానికి అరవై ఏళ్ళ వయసువాడు. రోజులు గడుస్తున్నకొద్దీ వయసు తరిగిపోతోందన్న భయంతో గడుపుతున్నాడు.

వసంతమాసం వస్తేగానీ, అశ్వమేథయాగానికి సమయం అనుకూలంగా వుండదన్నారు పండితులు. అప్పటిదాకా పంటిబిగువున ఆగాడు. ఒక శుభ ముహూర్తాన చేయవలసిన శాంతులన్నీ చేయించి, అశ్వాన్ని తన సామ్రాజ్యం మీదికి విడిచిపెట్టాడు. దాంతోపాటుగా కొందరు మేధావుల్ని, సమర్థులైన వీరుల్ని తోడు పంపించాడు. ఒక సంవత్సర కాలంలో సామ్రాజ్యాన్ని చుట్టి అశ్వం తిరిగి వచ్చింది. అప్పుడు దశరథుడు కుల పురోహితుడు వశిష్ఠుణ్ణి అశ్వమేథయాగాన్ని జరిపించవలసిందిగా కోరాడు. వశిష్ఠుడు ఆ ఏర్పాట్లలో వున్నాడు.

"రాష్ట్రం వా అశ్వమేథః" "క్షత్రంహిరాష్ట్రం", "శ్రీర్వై రాష్ట్రమశ్వమేథః" అని శతపథ బ్రాహ్మణం, ఐతరేయబ్రాహ్మణం, తైత్తిరేయ బ్రాహ్మణంలో చెప్పిన వాక్యాల్నిబట్టి, అశ్వమేథయజ్ఞాలు దేశం అభివృద్ధి కోసం మాత్రమే వుద్దేశించినవి. మహారాజులు తమ రాజ్యాలు సుభిక్షంగా వుంటూ, ధన ధాన్య సమృద్ధిగా వర్థిల్లాలని అశ్వమేథ యజ్ఞాలు చేస్తారని అర్థం అవుతోంది. గుర్రంతోపాటుగా వీరులు, మేధావులు, అధికారులు వెళ్ళేది సమస్యల్ని పరిష్కరించి సంతృప్తి కలిగించడానికే !

తనకు పుత్రులు పుట్టబోయే శుభ తరుణంలో దేశానికి శత్రుభయం లేకుండా వుండాలి. ప్రజలు కష్టాలు లేకుండా సంతోషంగా వుండాలి. ఎక్కడా అసంతృప్తి, నిరాశ, నిస్పృహలు లేకుండా వున్నప్పుడు, అందరూ తన హితాన్ని, తన అభివృద్ధిని కోరుతున్న దశలో తనకు ఉత్తమోత్తమ సంతానం కలగాలని దశరథుడు ఆశించాడు. అందుకని, అశ్వమేథయాగం చేసిన తర్వాతే పుత్రకామేష్టి యాగం చేయాలని సంకల్పించాడు. అశ్వం విజయవంతంగా తిరిగివచ్చింది. యాగానికి అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాయి.

ఋష్యశృంగుడు, వశిష్ఠమహర్షి సహకారంతో యాగాన్ని ప్రారంభించాడు. దశరథ మహారాజు ముగ్గురు రాణులతోకలిసి యజ్ఞదీక్ష తీసుకున్నాడు.

# రావణ వధకు దశరథుని పథక రచన

దశరథుడు అశ్వమేథయాగం అకారణంగా చేశాడనుకోవడం పొరబాటు ! దానివెనుక బలమైన కారణాలున్నాయి. దాన్ని నిర్వహించడానికి ముందు అనేకమంది ఋషులు, దేవతలు, ఆర్య జాతిలోని ప్రముఖుల్ని ఆహ్వానించి ఒక పెద్ద సభ జరిపాడు.

ఈ సభలో ఆనాటి రాజకీయ పరిణామాలు చర్చకు వచ్చాయి. అన్నింటికన్నా ప్రధానమైన అంశం రావణాసురుడు బలం పుంజుకుని రాజ్యవిస్తరణ చేస్తున్న సంగతి.

దాంతో, ఉత్తర భారతదేశంలోని రాజన్యులంతా తమ తమ అధికారాల్ని సుస్థిరం చేసుకోవాలనే ఆలోచనల్లోకి వచ్చారు. రావణుడి అడ్డుతొలగాలంటే, అందరూ ఏకం కావాలి. ఒకే నాయకత్వం కింద సమష్టిగా పోరాడాలి. ఆ సమష్టి నాయకత్వం వహించగలవాడెవ్వడు ?

ఆర్యావర్తంలో మున్నూరు రాజులున్నారని చెప్తోంది రామాయణం. దశరథుడు వారిలో ప్రముఖుడు.

దక్షిణాపథం యావత్తూ రావణుడి ఆధీనంలో వుంది. అదంతా దట్టమైన కీకారణ్యప్రాంతం అనీ, అక్కడ ఎవరో కొందరు ఆటవికులైన మనుషులు వుంటూ వుంటారనీ ఈ ఉత్తరాది రాజులకు మొదటినుంచీ చిన్నచూపు. దశరథుడి కాలంలో కూడా ఇదే అభిప్రాయం వున్నట్లు కన్పిస్తుంది. అందుకనే వనచరులైన వానర జాతుల అమిత శక్తి సంపదలు రాముడు స్వయంగా వెళ్ళి తెలుసుకొనేవరకు ఆర్యావర్తంలోని వారికి పెద్దగా అవగాహన లేదనే అనిపిస్తుంది.

సరే ! రావణాసురుడు దక్షిణాపథాన్ని తన శాసనంలోకి తెచ్చుకున్నాడు. ఇప్పుడు మరింత బలసంపన్నుడయ్యాడు. రావణవధ జరగాలనే ప్రతిపాదనని మహర్షులు తెచ్చినప్పుడు, ఆ పేరు వినగానే ఆర్యావర్తంలో ఉన్న రాజులు భయంతో వెనుక వెనుకగా నుంచున్నారట. అదీ ఆనాటి స్థితి.

ఆ సభకు దశరథుడు కావాలనే దక్షిణాపథంలోని వానరరాజుల్ని ఎవ్వరినీ పిలవలేదు. ఎందుకంటే, వాలి, రావణుల స్నేహం గురించి పూర్తి సమాచారం దశరథుడి దగ్గర వుంది కాబట్టి ! వాళ్ళంతా రావణాసురుడి మనుషులేననే బలమైన అభిప్రాయం వుంది కాబట్టి !

వానరుల్ని పిలిచినందువలన మేలు కలగకపోగా, ఇక్కడి విశేషాలన్నీ రావణుడికి చేరవేయడానికి అవకాశం కల్పించినట్లే అవుతుంది కాబట్టి !!

ఇప్పుడు వ్యూహం ఏమంటే, రావణుణ్ణి వానరుల్ని వేరుచెయ్యాలి. ఇద్దరి మధ్య మిత్రభేదం కల్పించాలి. ఇది ఋషుల సూచన. దశరథుడు దీన్ని నల్గురితో చర్చించి, దాన్ని అమలుపరిచే బాధ్యత ఋషులకే అప్పగించదలిచాడు.

అసలు క్షత్రియులు ఇలా ఒక రాక్షసరాజుకు భయపడి చర్చించవలసిన పరిస్థితి ఎందుకొచ్చింది ? పరశురాముడే దీనికి కారకుడు. లోకంలో క్షత్రియుడనే వాడే లేకుండా చేయడానికి కంకణం కట్టుకొని 1300 మంది మదాంధులైన రాజుల్ని హతమార్చి రాచరిక వ్యవస్థని బలహీనపరిచాడు. కానీ, అందుకు ప్రత్యామ్నాయ వ్యవస్థని ఆయన నిర్మించలేదు. విధ్వంసం చేశాడు గానీ, పునర్నిర్మాణం చెయ్యలేదు. ఆ తర్వాత అస్త్రసన్యాసం చేసి తపస్సులోకి వెళ్ళిపోయాడు.

దీన్ని ఒక అవకాశంగా తీసుకున్నారు రాక్షసులు. రాక్షస, దానవ, దైత్య జాతులన్నీ ఏకం అయ్యాయి. రావణుడు వారి నాయకుడయ్యాడు. దక్షిణాపథం అంతా ఆక్రమించారు. రేపోమాపో ఆర్యావర్తంపైన దాడికి సిద్ధంగా వున్నారు. సింధూనది నుంచి గంగానది

దాకా ఉత్తర భారతదేశం భూభాగాల్ని ఆర్యావర్తం అంటారు. ఆర్యావర్తం యుద్ధ భయంతో గడగడలాడ్తున్న నేపథ్యంలో దశరథుడు ఆ సభని జరిపాడు.

రావణుడి వేగుల వ్యవస్థ గొప్పది. ఈ సమాచారం అంతా ఆయనకు తెలుసు. వానరుల్ని చేజార్చుకుంటే కలిగే అపాయం ఏమిటో కూడా ఆయనకు తెలుసు. ఆర్యావర్తంలో రాజులు వింధ్యనుదాటి దక్షిణాపథంమీదకు దండు వస్తున్నారనే వార్తను వానరజాతులకు చేరవేయించాడు. వారి రక్షకుడిగా తను ప్రత్యేక అవతారం ఎత్తాడు. నాసిక్ వద్ద 25000 మంది రాక్షస వీరుల్ని కావలి వుంచి వానరులకు అభయం ఇచ్చాడు. వానరులు మరింత దూరప్రాంతాలకు తరలిపోయేలా ప్రోత్సహించాడు. ఖరుడు, దూషణుడు, త్రిశరుడు, తాటకి... ఈ విధమైన రాక్షస మహావీరుల్ని ఈనాటి మహారాష్ట్ర, ఉత్తర కర్ణాటక, ఆంధ్ర ప్రాంతాలకు అధిపతులుగా నియమించాడు.

రాక్షసులకు ఎప్పటికైనా రాజుల కన్నా ఋషులవలనే ఎక్కువ ప్రమాదం అని గ్రహించాడు. ఋషివ్యవస్థపైన ముప్పేట దాడి ప్రారంభించాడు.

ఇప్పుడు ఋషులకు రక్షకులు కావాలి. వైదిక విధులు సక్రమంగా నిర్వహించడానికి తగిన రక్షణ వ్యవస్థ కావాలి. ఇందుకోసం ఆ సభను జరిపాడు దశరథుడు.

# పుత్రకామేష్టి నియమాలు

పిల్లలు కలగాలని చేసే యజ్ఞాన్ని పుత్రీయేష్టి అనీ, పుత్రకామేష్టి అనీ పిలుస్తారు. అశ్వమేథయాగం ప్రజలకు సకల సౌకర్యాలు కల్పించి పుణ్యం సంపాదించుకోవడం కోసం చేశాడు దశరథుడు. సమస్త పాపాలనూ పోగొట్టుకొని ఇప్పుడు పుత్రుల్ని పొందే దీక్ష తీసుకొంటున్నాడు.

పుత్రులు కలగాలి అంతే ! అందుకోసం దశరథుడు, అతని ముగ్గురు రాణులు ఎంతటి శ్రమనైనా భరించడానికి సిద్ధపడ్డారు. ఆ శ్రమ అప్పటికి 16 నెలల క్రితమే మొదలయ్యింది బ్రహ్మచర్యదీక్షతో !

యజ్ఞం చేయిస్తోంది సాక్షాత్తు అల్లుడుగారు, చేస్తోంది వృద్ధుడైన మామగారు. కానీ, ఏమాత్రం మొహమాటం లేకుండా కఠినాతికఠిన నియమాలన్నీ పాటింప చేయిస్తున్నాడు ఋష్యశృంగుడు. పాటిస్తున్నారు దశరథుడు అతని రాణులు.

అశ్వమేథయాగంకోసం గుర్రాన్ని వదిలింది మొదలు పరిపూర్ణవ్రతస్నాతలై సత్కర్మాచరణులై, భోగభాగ్య విరాగంగా గడిపారు దశరథుడూ, అతని రాణులు. నేలమీదే పడక. దర్భ చాపల మీద శయనం. నిత్యం యజ్ఞం చేయడం, ఆ యజ్ఞంకోసం తయారు చేసిన హవిస్సుల్ని (ప్రసాదాల్ని) మాత్రమే ఆహారంగా తీసుకోవడం చేస్తున్నారు.

పూర్వపు స్వేచ్ఛాచారాలు, విచ్చలవిడి ప్రవృత్తులు, రాజభోగాలు ఏవీ ఇప్పుడు లేవు. నియమబద్ధంగా యజ్ఞవిధి ననుసరించి జీవించడం ప్రారంభించారు.

ఇక్కడ విశేషంగా చెప్పుకోవల్సిన అంశం ఒకటుంది. పుత్రకామేష్టియాగం ద్వారా ఒక దివ్య ఔషధాన్ని సిద్ధం చేస్తాడు ఋష్యశృంగుడు. దాన్ని రాణులు ముగ్గురూ సేవిస్తారు. అది సేవించేటప్పుడు వారి శరీరాలు గర్భధారణకు యోగ్యంగా, దోషాలు లేనివిగా వుండాలి.

శారీరక దోషాలు మానసిక దోషాల వలన కూడా ఏర్పడతాయి. మానసిక దోషాలు అంటే, రజోగుణం, తమోగుణం. ఇవి రెండూ వదిలేసి సాత్త్వికంగా కనీసం 16 నెలలు వాళ్ళు జీవించేలా చేశాడు ఋష్యశృంగుడు. మనోదోషాల్ని పెంపొందించే రాజసమయమైన, తామసమయమైన ఆహార పదార్థాల్ని నిషేధించి, కేవలం యజ్ఞ ప్రసాదం తీసుకొని జీవించే నియమం పెట్టాడు. వీటివలన నిర్మలమైన మానసిక స్థితి ఏర్పడుతుంది. శరీరంలో వాత, పిత్త, కఫ దోషాలు సమస్థితిని పొందుతాయి. గర్భాశయాలు నిర్మలంగా వుండి, గర్భధారణకు అనుకూలతను పొందుతాయి.

అశ్వమేథయాగం సమయంలో ఈ దీక్షావ్రతాలు చేయడం, ఆ వెంటనే ప్రారంభించిన పుత్రకామేష్టికి ఆ విధంగా ఉపయోగపడ్డాయన్నమాట !

## రాణులకిచ్చిన పాయసం ఔషధమా ?

ఔషధాలు అందరు వైద్యులూ ఇస్తారు. కానీ, శక్తివంతుడైన వైద్యుడు నిర్మలమైన మనసుతో ఇచ్చినప్పుడు, దైవానుకూలత ఉన్నప్పుడు ఆ ఔషధం మహాద్భుతమైన ఫలితాలిస్తుంది. 'ఫలానా డాక్టరు గారి చేతి చలవ గొప్పది'- అని వైద్యుల్ని లోకం గౌరవించేది ఇందుకే ! సంతాన సాఫల్యాన్నిచ్చే చికిత్సలు చేస్తున్న వైద్యుల విషయంలో ఇది మరీ ముఖ్యం.

ఋష్యశృంగుడు అథర్వణ వేదాన్ననుసరించి పుత్రకామేష్టిని జరిపించాడు. అథర్వణవేదంలోనే సంతానప్రాప్తిని కల్గించే ఔషధీమహిమని వివరించే అనేక మంత్రాలున్నాయి.

ఉదాహరణకు :

"శమీ మశ్వత్థ ఆరూఢన్తత్ర పుంసవనం కృతమ్ । తద్వై పుత్రస్య వేదనం తత్స్త్రీషా భరామసి ॥"

జమ్మిచెట్టు మీద పెరిగిన రావిచెట్టు పుత్ర ప్రాప్తిని కల్గిస్తుంది. మగపిల్లవాడు పుట్టడానికి ఇది ఉత్తమ ఉపాయం. దీనిని స్త్రీలకు వాడించవలసి ఉంటుంది.

"పుంసిస్వైరే తో భవతి తతస్త్రియా మనుషిచ్యాతే । తద్వై పుత్రస్య వేదనం తత్ ప్రణపతి రబ్రవీత్॥"

పురుషుడి రేతస్సు ఆ స్త్రీలో ప్రవేశించినపుడు ఔషధి ప్రభావాన ఆమె శరీరంలో అనుకూలస్థితి ఏర్పడి, పుత్రప్రాప్తికి సాధనం అవుతుంది.

"ప్రజాపతి రనుమతిః సినీవాల్ల చీర్లుపత్। స్త్రైషూయ మన్యత్రనధత్ పుమాంసముధ దాదిహ ॥"

ప్రజాపతి అనుమతితో సినీవాలి ఇలా చేసింది. ఆడపిల్ల పుట్టడం మరొక చోట జరుగుగాక. మగపిల్లవాడి జననం ఇక్కడ జరుగుగాక !!

ఇవి అధర్వ వేదమంత్రాలు. అధర్వ వేదంలో పుంసవన ప్రక్రియలు అంటే సంతానోత్పత్తిని కల్గించే ప్రయోగాలు చాలా వున్నాయి. దశరథుడు తలపెట్టిన పుత్రకామేష్టియాగం అధర్వ వేదానుసారం జరిగింది కాబట్టి, ఇలాంటి ఔషధ ప్రయోగం ఏదో ఋష్యశృంగుడు అనుసరించి వుంటాడని పండితులు భావిస్తారు.

దశరథుడు పుత్రకామేష్టి చేసి పంచిన పాయసానికి ఇలాంటి ఔషధగుణాలు వుండివుంటాయి !

ఇక్కడే ఇంకో ముఖ్య విషయం చెప్పాలి. అధర్వణ వేదంలో పుంసవనమ్, స్త్రైషూయామ్ అనే రెండు పదాలు కన్పిస్తాయి. కొడుకు కావాలనుకున్నవారికి పుంసవన ప్రయోగాన్నీ, కూతురు కావాలనుకున్నవారికి స్త్రైషూయామ్ ప్రయోగాన్ని నిర్వహిస్తారు.

అయితే, మూలికలతో మందు తయారుచేసినంత మాత్రాన సరిపోదు. ఔషధసేవన చేసేవారు 16 నెలలపాటు తీసుకోదగిన జాగ్రత్తలు, చేయదగిన పుణ్యకార్యాలు, యజ్ఞ నిర్వహణ, పుంసవనకారక ఔషధాన్ని మంత్రశక్తితో శక్తిమంతం చేయడం... ఇవన్నీ సమకూరాలి అన[illegible] కథ ద్వారా మనకు అర్థం అవుతోంది !

"పుత్రకామేష్టి పూర్తయ్యింది. విజయవంతంగా జరిగింది. యజ్ఞ పురుషుడు అవతరించాడు. పాయస అన్నాన్ని దశరథుడికి అందజేశాడు.

దశరథుడు ఆ పాయసాన్ని తన ముగ్గురు భార్యలకూ పంచిపెట్టాడు. పంచిపెట్టిన విధానంలోనే వుంది ఓ ప్రత్యేకత.

1. ముగ్గురుకీ సమానంగా ఇవ్వలేదు.
2. ఎక్కువ తక్కువలుగానైనా సరే, మూడు భాగాలు చేసి ముగ్గరికీ ఇవ్వలేదు.
3. ముగ్గరికీ ఒకేసారి ఇవ్వలేదు.
4. వాల్మీకి రామాయణమే ప్రమాణం అనుకుంటే, దశరథుడు ముందుగానే రకరకాలుగా పాయసాన్న విభజన చేసి, ఎవరికి ఇవ్వవలసింది వాళ్ళకి ఇచ్చినట్లు కన్పిస్తుంది.
5. బహుశా, ఇలా పాయసాన్న విభజన చేయించడంలో ఋష్యశృంగుని సూచనలు వుండి ఉంటాయి. ఎవరి శరీర పరిస్థితిని బట్టి వారికి ఆయా వాటాల్ని ఆ విధంగా ముందుగానే నిర్ణయించి వుంటారని మనం అర్థం చేసుకోవాలి.
6. అగ్నిదేవుడు దశరథుడికి పాయసాన్నిచ్చినప్పుడే, యథోచితంగా విభజించి రాణులకివ్వమని ఆదేశించినట్లు తులసీదాసు రామాయణంలో వుంది.

సరే పాయసాన్నాన్ని దశరథుడు ఎలా విభజించాడో వాల్మీకి మహర్షి చెప్పిన విశేషాల్ని ముచ్చటించుకొందాం.

**కౌసల్యాయై నరపతిః పాయసార్థం దదౌతదా ।**

**అర్ధాదర్థం దదౌచాపి సుమిత్రాయై నరాధిపః ॥**

పాయసాన్నం మొత్తాన్ని ఒక పాత్రలోకి తీసుకున్నాడు. అందులో సగ భాగాన్ని ఇంకో పాత్రలో వుంచాడు. ఈ పాత్ర కౌసల్యకోసం ఉద్దేశించాడు. ఇప్పుడు సగం పాయసాన్నం మాత్రమే మిగిలింది. ఈ సగాన్ని సుమిత్రకూ, కైకేయికీ పంచాలని అనుకొన్నాడు. అంటే, 1/4 వంతు పాయసం సుమిత్రకు కేటాయించి మరోపాత్రలోకి తీసుకొన్నాడు.

**కైకేయ్యై చావశిష్టార్థం దదౌపుత్రార్థ కారణాత్ ।**

**ప్రదదౌ చావశిష్టార్థం పాయసస్యామృతోపమమ్ ॥**

ఇంక మిగిలిన 1/4 వంతు భాగం కైకేయికోసం మూడవ పాత్రలోకి తీసుకున్నాడు.

**అనుచిన్త్య సుమిత్రాయై పునరేవ మహామతిః**

ఇలా సగం కౌసల్యకి, మిగిలిన సగంలో సగం సుమిత్రకి, సగం కైకేయికి - పావు వంతు చొప్పున విభజించిన తర్వాత పునరాలోచన చేశాడట దశరథుడు. చేసి, కైకేయి వంతు కేటాయించిన 1/4 భాగంలోంచి ఇంకో సగభాగం తీసి సుమిత్ర భాగంలో కలిపాడట.

వాల్మీకి మహర్షి ఇచ్చిన లెక్క ప్రకారం పాయసాన్న విభజన ఇలా జరిగింది -

కౌసల్యాదేవి : 1/2 భాగం = 50%

సుమిత్రాదేవి : 1/4 + 1/8 = 37.5%

కైకేయి : 1/8 = 12.5%

ఈ విధంగా కైకేయి భాగంలోంచి కొంత సుమిత్రకు ఇచ్చినందువలన సుమిత్రకు ఇద్దరు కొడుకులు లక్ష్మణ, శతృఘ్నులు కలిగారని పండితులు విశ్లేషిస్తారు.

మరికొన్ని రామాయణాలు దశరథుడు కౌసల్యాదేవి వంతులోని 1/8 వంతు భాగం తీసి సుమిత్ర వంతుకు కలిపినట్లు రాయడం జరిగింది. ఇందువలన రాముడి భాగంతో జన్మించిన లక్ష్మణుడు ఆయనను అంటిపెట్టుకొని వున్నాడని మరొక విశ్లేషణ కూడా వుంది.

రాణుల్ని ముగ్గుర్నీ దశరథుడు కూర్చోబెట్టి వాళ్ళందరి అంగీకారంతోనే, కౌసల్యకు అర్ధ భాగం, కైకేయకు పావు భాగం, సుమిత్రకు పావు భాగం ఇచ్చినట్లుంది. కౌసల్య, కైకల భాగాల్లోంచి కొద్దికొద్దిగా తీసి ఇంకో పావు భాగం సుమిత్రకు అదనంగా ఇచ్చాడంటాడు తులసీదాసు.

"అల కోసల కేకయ తనయల కిడియెన్
బంచి పాయసాన్నము నీలోత్పలి నీకుముద్వతి
కాన్యల కన్నెల కర సుధాంశ మందిచ్చుగతిన్"

"ఇచ్చిన గని యిరువురు బొర
పొచ్చెములే కప్పుడు సవతి పొలతి సుమిత్రన్
మచ్చిక విరిచి కృపామతి
నిచ్చిరి చెరిసగము తమకునిడి నందులలోన్-"

అని రామాభ్యుదయంలో అయ్యలరాజు రామభద్రకవి వర్ణించాడు.

మొదట, దశరథుడు పాయసాన్ని రెండు భాగాలే చేసి, కౌసల్యకూ, కైకకూ మాత్రమే ఇచ్చాడట. కౌసల్య, కైకేయీ జాలిపడి, తమ తమ వాటాల్లోంచి కొంత భాగం తీసి సుమిత్రకు స్నేహంకొద్దీ ఇచ్చారట !

ఈ వివరణ కూడా గమ్మత్తుగానే వుంది ! అయితే, అధ్యాత్మ రామాయణంలో కూడా ఇదే అర్థంలో వర్ణించడం కన్పిస్తుంది !

## హనుమంతుడూ, రాముడూ బాల్యస్నేహితులు

రాముడికి హనుమంతుడు కొత్త కాదు. హనుమంతుడికి రాముడు కొత్త కాదు. ఇద్దరూ చిన్ననాటి స్నేహితులు. కలిసి ఆడుకున్నారు. కలిసి పెరిగారు. కలిసి చదువుకున్నారు కూడా ! ఎలాగంటారా ... తులసీదాసు రామాయణంలో చెప్పిన ఈ కథ చదవండి !

హనుమంతుడు రాముడి దగ్గరకు ఎలా చేరాడా... అని సందేహంగా ఉంది కదూ ... తులసీదాసు తన అపార కల్పనా చాతుర్యంతో అలా కలిపాడు. "రాముని చరిత్ర అపారం. సిద్ధులు, మునులు వాళ్ళ బుద్ధికి తోచిన విధంగా రామరాజ్యాన్ని వర్ణించారు" అంటాడు తులసీదాసు. అందుకే స్వేచ్ఛగా అనేక విశేషాలు రాశాడు. తులసీదాసు చెప్పిన హనుమంతుడి వృత్తాంతం ఇది :

ఒకరోజు ఎవరో బిచ్చగాడు కోతిని ఆడిస్తూ అడుక్కుంటున్నాడు. అంతఃపురం మేడమీంచి రాముడు ఆ కోతిని చూసి, తనకు కూడా కోతి కావాలని ఏడవడం మొదలుపెట్టాడు. ఆ బిచ్చగాడి దగ్గర కోతిని తెప్పించి ఇచ్చారు. కానీ, రాముడు ఈ కోతి కాదు - వేరే కోతి కావాలి... అనడం మొదలుపెట్టాడు. ఏ కోతిని తెచ్చినా అదేమాట అంటుంటే సహజంగానే అందరికీ విసుగు కల్గింది.

అప్పుడు వశిష్ఠుడికి బుర్రలో గొప్ప ఆలోచన కల్గింది. ఎటు తిరిగీ కిష్కింధలో వానర జాతి ప్రజలతో స్నేహం కోరుతున్నారు కాబట్టి దశరథుడి చెవిలో ఇలా చెప్పాడు.... "సుగ్రీవుడి దగ్గర నుంచి ఒక మంచి కోతిపిల్లని తెప్పించండి. చాలా గౌరవంగా వ్యవహరించి ఈ పనిని సానుకూలపరిచే వాణ్ణి పంపండి. ఆ కోతి పిల్లని చూసి రాముడు ఏడుపు ఆపుతాడు"- అని !

దశరథుడి మనుషులు సుగ్రీవుని ఒప్పించి, తిరిగి జాగ్రత్తగా తెచ్చి ఒప్పగించే ఒప్పందం మీద హనుమంతుడనే చంటిపిల్లవాణ్ణి వాళ్ళకిచ్చి పంపించాడు. రాముడు హనుమంతుడితో

కున్నాడు. తన గుండెలమీద పడుకోబెట్టుకొని ముద్దాడాడు. తనే స్వయంగా
ఘని పెంచసాగాడు. ఇద్దరూ కలిసే ఆడుకున్నారు, పాడుకున్నారు.

ఒకరోజు రాముడు గాలిపటం స్వయంగా తయారుచేసి దాన్ని ఎగరవేశాడు. అది రయ్యిన అంతరిక్షంలో దూసుకుపోయి దేవలోకంలో ఇంద్రుని కోడలు - జయంతుడి భార్య జయంతి దగ్గరికి చేరింది. ఇంత గొప్ప గాలిపటాన్ని ఎగరవేసిందెవరో... అని ఆశ్చర్యపడి, దాన్ని తీసి జాగ్రత్తగా పెట్టింది జయంతి !

అప్పుడు రాముడు "హనుమా ! చూశావా ... మన గాలిపటాన్ని ఎవరో దాచిపెట్టారు..." అన్నాడు. అంతే, హనుమంతుడు ఆ దారం వెంబడే దేవలోకం వెళ్ళి జయంతుని భార్యని కలిసి, తన మిత్రుడి గాలిపటాన్ని తిరిగి ఇచ్చెయ్యమని కోరాడు."దీన్ని ఎగరేసిన వాణ్ణి నాకు చూడాలనుంది"- అంది జయంతి.

హనుమంతుడు జయంతి కోర్కెని రాముడికి చెప్పాడు. రాముడు చిత్రకూట పర్వతం మీద తనను చూడవచ్చు - ఆ అవకాశం ఒకరోజు వస్తుంది - అని చెప్పాడు.

ఆ సంగతి మళ్ళీ దేవలోకం వెళ్ళి ఆమెకు తెలియజేశాడు హనుమంతుడు. రాముని దర్శించే భాగ్యం తనకు కలుగుతోందని తెలిసి ఆమె సంతోషించి గాలిపటాన్ని ఇచ్చేసింది. రాముడు, హనుమంతుడు ఏమీ ఎరగనట్టే ఇంటికి వెళ్ళిపోయారు.

తులసీదాసు ఈ కథనంతా చెప్పి, యాగ సంరక్షణ కోసం తనని విశ్వామిత్రుడి వెంట పంపుతున్నప్పుడు రాముడు హనుమంతుడితో అంటాడు- "ప్రస్తుతానికి నువ్వు మీ కిష్కింధకు వెళ్ళిపో..... నేనే మీ దేశానికి వస్తాను..... వచ్చినప్పుడు నిన్ను కలుస్తాను" అని !

# విశ్వామిత్రుడి వెంట నెల రోజులు

**ఒకటవ రోజు :**

విశ్వామిత్రుడి వెంట అంతఃపురంలోంచి, బైటకు వచ్చి రామలక్ష్మణులు రెండు మూడు క్రోసుల దూరం నడిచారు. పదిరోజుల ఒప్పందమే నిజానికి ! కానీ, విశ్వామిత్రుడి నుంచి తెల్సుకోవాల్సింది చాలా వుంది. అందరూ సరయూనదీ తీరానికి వచ్చారు.

అప్పటికి సాయంత్రం అవుతోంది. అది శుక్లపక్ష షష్టి.

రామలక్ష్మణులు నదిలో దిగి కాళ్ళూ చేతులూ కడుక్కున్నారు. విశ్వామిత్రుడు అక్కడే నదీతీరాన వాళ్ళిద్దర్నీ కూర్చోబెట్టి, బల-అతిబల అనే రెండు యుద్ధ విద్యల్ని వాళ్ళిద్దరికీ నేర్పించాడు.

ఈ రెండు విద్యలూ వాళ్ళిద్దరికీ అమితమైన బలాన్నీ, శక్తినీ ఇచ్చాయి.

1. వారికి శ్రమ, అలసట అనేవి కలగవు. జ్వరం వంటి వ్యాధులు రావు.
2. శరీరానికి ఎలాంటి అపకారమూ కలగదు. ఎంత విపరీత పరిస్థితిలో కూడా శరీరం కాంతి తగ్గి వడలిపోవడం అనేది వుండదు.

3. నిద్రపోతున్నా మనసు అప్రమత్తంగా వుంటుంది.
4. అమితమైన బాహుబలం ఏర్పడుతుంది.
5. సౌభాగ్యం కలుగుతుంది. దీక్షా దక్షతలు పెరుగుతాయి. మంచీ, చెడులు విచక్షణ బుద్ధి కలుగుతుంది. సమయానుకూలంగా నిర్ణయాలు చేయగలుగుతారు.
6. అన్ని రకాల విద్యల్ని నేర్చుకోగల సమర్థత కలుగుతుంది.
7. ఆకలిదప్పులు కలగవు.
8. శక్తిని పెంపొందిస్తుంది.
9. ఈ రెండు విద్యలు బ్రహ్మదేవుడు ప్రసాదించినవి కాబట్టి, ఇవి గ్రహించిన వారి తేజస్సు అమితంగా ఉంటుంది.

వీటిని యోగ్యత పరీక్షించిన తర్వాతే గురువు నేర్పుతాడు. రామలక్ష్మణులు యోగ్యులని భావించి, ఈ అతి శక్తిగల విద్యలు మొదటి రోజునే ముందుగా వాళ్ళకి నేర్పించాడు.

**రెండవ రోజు :**

శుక్ల పక్ష సప్తమి. రామలక్ష్మణులు సరయూనదీ, భాగీరథీ నదీ సంగమ స్థానంలో కామాశ్రమంలో విడిది. అనేక యుద్ధ మెళకువలు నేర్పించాడు విశ్వామిత్రుడు.

**మూడవ రోజు :**

శుక్లపక్ష అష్టమి. గంగానదిని దాటి దక్షిణంగా బయల్దేరి తాటకి నివసించే అడవిలోకి ప్రవేశించారు.

బల–అతిబల విద్యలు నేర్చుకొని ఉండటంతో వాళ్ళకి అలసటలేదు – నీరసం కలగలేదు.

ఆ రోజు సాయంకాలం ..... రాక్షసుల బలం అధికంగా వుండే సమయం. తాటకి విజృంభించింది. దాన్ని సంహరించవలసిందిగా చెప్పాడు విశ్వామిత్రుడు. "రామా! సంకోచించకు ! బాణం ప్రయోగించు ....." అన్నాడు విశ్వామిత్రుడు.

"స్వామీ ! స్త్రీ వధ చేయవచ్చా ?" సందేహించాడు శ్రీరాముడు. "తాటకి లాంటి దాన్ని 'ఆడది' అనడం తప్పు. రక్షతా జీవ లోకస్య ..... లోకంలో జీవులందరిని రక్షించాలంటే, దీన్ని వధించి తీరాల్సిందే ..." అన్నాడు విశ్వామిత్రుడు.

తాటకిని చంపెయ్యాలనే నిర్ణయాన్ని రాముడు వెంటనే తీసుకొన్నాడు. అలా తక్షణం నిర్ణయం తీసుకోగలిగే శక్తి అతనికి బల–అతిబల విద్యల వలన సంక్రమించింది.

1. గోబ్రాహ్మణుల సంరక్షణార్థం తాటకిని సంహరించాలి.
2. చాతుర్వర్ణ వ్యవస్థని సంరక్షించడంకోసం తాటకిని అంతం చెయ్యాలి.
3. రాజ్యభారం వహించడానికి, ప్రజారక్షణార్థం తాటకిని రూపుమాపాలి.

బాలకాండలో తాటకిని ఎందుకు సంహరించాలని విశ్వామిత్రుడు భావించాడో చెబుతూ ఈ వివరాలు రాశాడు వాల్మీకి.

తాటకివలన గో(బ్రాహ్మణులకు, తద్వారా వైదిక విధులకు అంతరాయం కలుగుతోంది. (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాలుగు వర్ణాలవారినీ గుర్తించే చాతుర్వర్ణ్య వ్యవస్థను ఈ తాటకి వ్యతిరేకిస్తోంది.

ఈ నాలుగు వర్ణాలకూచెందని ప్రజల పక్షాన తాటకి వైదిక ఋషులతో పోరుతూ వుండి వుండవచ్చుని, శ్రీరాముడు వైదిక ఋషుల పక్షం వహించి, చాతుర్వర్ణ్య వ్యవస్థకు ప్రచారం కల్పించి వుండవచ్చునీ దీన్ని బట్టి మనకి తేలికగా అర్థం అవుతుంది. భగవద్గీతలో "చాతుర్వర్ణం మాయా సృష్టం" అని భగవంతుడు స్వయంగా చెప్పినట్లు రాశారు కదా ! .....

విలోచనుడి కూతురు మంథర ఈ భూమండలాన్ని నాశనం చేయాలని ప్రయత్నించినప్పుడు ఇంద్రుడు ఆమెను చంపి భూ సంరక్షణ చేశాడు.

భృగువు భార్య - శుక్రాచార్యుడి తల్లి - ఇంద్రుణ్ణి నాశనం చెయ్యాలని చూసినప్పుడు విష్ణువు స్వయంగా ఆమెను సంహరించాడు.

కాబట్టి, దేశహితం కోరి రాజు అయినవాడు అవసరమైతే, అలాంటి దుష్ట స్త్రీని 'స్త్రీ' అని చూడకుండా సంహరించాలని విశ్వామిత్రుడు బోధించాడు.

రాముడు, తాటకిని వధించాడు. దేవతలు దిగివచ్చి శ్రీరాముని అభినందించి, విశ్వామిత్రుడితో నీదగ్గరి దివ్యాస్త్రాలని వీళ్ళకు ఇవ్వవయ్యా మహర్షీ" అని చెప్పారు. "అందుకే గదా, నాతో అడవికి రామలక్ష్మణుల్ని తెచ్చింది - " అన్నాడు విశ్వామిత్రుడు.

**నాలుగవ రోజు :**

శుక్లపక్ష నవమి. కొన్ని అస్త్రాల ప్రయోగం, ఉపసంహారం నేర్పించాడు విశ్వామిత్రుడు. అక్కణ్ణించి తన స్వంత సిద్ధాశ్రమానికి తీసుకెళ్ళాడు. ఆ రోజే యజ్ఞ దీక్షను స్వీకరించి యజ్ఞం కూడా ప్రారంభించాడు.

**ఐదవరోజు :**

శుక్లపక్ష దశమి నుంచి ఆరు రోజులపాటు యజ్ఞకాండను నిర్వహించాడు విశ్వామిత్రుడు. అనేకమంది ఋషులు ఆ సమయానికి వచ్చి యజ్ఞ విధిలో పాల్గొన్నారు.

ఈ మధ్యకాలంలో తాటకి కొడుకులు మారీచ, సుబాహులతో యుద్ధం చేశారు రామలక్ష్మణులు. మొదట సుబాహువుని చంపాడు శ్రీరాముడు. మారీచుడు తీవ్రంగా గాయపడి పారిపోయాడు.

**పదకొండవ రోజు :**

కృష్ణపక్ష పాడ్యమి. పదిరోజుల గడువులోగా విశ్వామిత్రుడికి యజ్ఞం పూర్తి అయ్యింది. సిద్ధాశ్రమం నుంచి విశ్వామిత్రుడితో పాటుగా అతని అనుచరులైన ఋషులు కూడా రామలక్ష్మణులను వెంటబెట్టుకొని బయల్దేరారు. ఇలా బయలుదేరటానికి కావలసిన సరుకులు సరంజామాలు సేకరించుకోవడం కోసం మూడు రోజులు పట్టింది. పదిరోజుల

తర్వాత రామలక్ష్మణుల్ని తిరిగి పంపించేస్తానన్నాడు కాబట్టి తిరుగు ప్రయాణానికి సన్నాహాలు 11వ రోజు నుంచీ మొదలయ్యాయి.

**పదిహేనవ రోజు :**

కృష్ణపక్ష పంచమి. సిద్ధాశ్రమంనుంచి సాయంకాలానికి శోణ నదీతీరం చేరుకున్నారు. ఆ రాత్రి అక్కడే విశ్రమించారు. దారిలో విశ్వామిత్రుడు ఎన్నో విశేషాలు. మెళకువలూ నేర్పుతూనే వున్నాడు.

**పదహారవ రోజు :**

కృష్ణపక్ష షష్ఠి : గంగా తీరానికి చేరుకున్నారు.

**పదిహేడవ రోజు :**

కృష్ణపక్ష సప్తమి : వైశాలి నగరానికి వచ్చారు.

**పద్దెనిమిదవ రోజు :**

వైశాలిని వదిలి మిథిలా నగరానికి బయల్దేరారు. దారిలో గౌతమ మహర్షి ఆశ్రమంలో అహల్యకు శాపవిమోచనం జరిగింది. అక్కడనుంచి చీకటిపడేలోపు మిథిలా నగరానికి వచ్చేశారు.

తన రాజధాని నగరానికి విశ్వామిత్రుడి రాక గురించి జనకుడికి తెలిసింది. ఆయన స్వయంగా వచ్చి విశ్వామిత్రుణ్ణి కలిశాడు. స్వాగతం పలికాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణుల్ని జనకమహారాజుకు పరిచయం చేశాడు.

**పందొమ్మిదవ రోజు :**

కృష్ణపక్ష నవమి : సీతాస్వయంవరం – శివధనుర్భంగం, దశరథుడికి వర్తమానం – ఆహ్వానం. దశరథుడికి వార్త చేరి ఆయన బయల్దేరి మిథిలకు రావడానికి మొత్తం ఆరు రోజులు పట్టింది.

**ఇరవై ఆరవ రోజు :**

శుక్లపక్ష పాడ్యమి : దశరథుడి రాక – ఆయనకు స్వాగత సన్నాహాలు, గోదాన సంస్కారాలు తదితర వివాహ కృత్యాలు. 3 రోజుల పాటు వివాహ పూర్వపు విధులు.

**ముప్పయ్యో రోజు :**

శుక్లపక్ష పంచమి : సీతారాములు తదితర సోదరుల వివాహం. ఈ రోజుని 'సీతా పంచమి' అంటారు. దక్షిణాదిన మార్గశిర శుక్ల పంచమి అనీ, ఉత్తరాదిన ఆగ్రయణ శుక్ల పంచమి అనీ అంటారు. ఈ తిథుల విషయంలో పండితుల మధ్య విభేదాలు ఉన్నప్పటికీ స్థూలంగా విశ్వామిత్రుడితో రామలక్ష్మణులు గడిపిన నెలరోజుల ముచ్చట్లు ఇవి. వివాహం అయిన తర్వాత విశ్వామిత్రుడు ఇంక నిష్క్రమించాడు. సీతను అత్తవారింటికి తోడ్కొని పెళ్ళివారు అయోధ్యకు బయల్దేరారు.

# రాముడికి దివ్యాస్త్రాలు ఇలా చేకూరాయి ... !

అనేక సందర్భాలలో అనేక కారణాలుగా అనేక దివ్యాస్త్రాలను శ్రీరాముడు సంపాదించుకోగలిగాడు. వాటిలో కొన్ని లక్ష్మణుడి దగ్గరకూడా వున్నాయి.

శ్రీరామలక్ష్మణులకు అస్త్రశస్త్రాలను ప్రసాదించిన వారిలో వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, అగస్త్యుడు ముఖ్యులు. ఇంకా అనేక సందర్భాల్లో సూర్యుడు, దేవేంద్రుడు, పరమశివుడు ..... వీళ్ళంతా రామునికి అస్త్రాలను, శస్త్రాలను కూడా సమయానికి అందించి తోడ్పడ్డ వారే !

వీళ్ళందరిలోనూ, దివ్యాస్త్రాలు విశ్వామిత్రుడు ఇచ్చినవే ఎక్కువగా కన్పిస్తాయి.

విశ్వామిత్రుడు తాను గాధి రాజుగా ఉన్నప్పుడు సంపాదించుకున్న అస్త్రాలివి. ఆ తర్వాత అతడు ఘోర తపస్సుకు పూనుకొని బ్రహ్మర్షిగా మారాడు. బ్రహ్మర్షి అయినాక ఇంక ఆ దివ్యాస్త్రాల్ని ప్రయోగించడానికి ఆయనకు మనస్కరించలేదు. వాటిని యోగ్యుడైన శిష్యుడికి అందించాలనుకున్నాడు. లేకపోతే, అవి తనతో అంతరించిపోయే ప్రమాదం వుంది. ఋషి కూటమిలో ఈ విషయం చర్చించిన తర్వాత ఏకగ్రీవంగా శ్రీరాముడి యోగ్యతని అందరూ ఆమోదించారు. ఆ మేరకు దశరథుణ్ణి కలిసి, అస్త్ర విద్యలన్నీ నేర్పిస్తానని చెప్పి రామలక్ష్మణుల్ని తనతో తీసుకువెళ్ళాడు.

విద్యను పొందుతున్న కొద్దీ వినయాన్ని పొందారు రామలక్ష్మణులు. కటిక నేలమీద గడ్డి పరుచుకొని పడుకొంటూ, కందమూలాలు భుజిస్తూ విద్యలు నేర్చుకున్నారు. అలాంటివి అలసట కల్గించకుండా ముందే బల-అతిబల విద్యలు నేర్పించాడు విశ్వామిత్రుడు.

"గృహీతా స్త్రోஉస్మి భగవాన్ దురాధర్షః సురైరపి"

ఈ దివ్యాస్త్రాలన్నీ సంపాదించుకో గలిగాను. ఇప్పుడు నేను శూరులకు అజేయుణ్ణి! దేవతలైనా సరే ....." అనే ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించాడు ..... శ్రీరాముడు !

ఇక్కడ ముఖ్య విషయం ఏమంటే, విశ్వామిత్రుడు దివ్యాస్త్రాలను ప్రసాదించడానికి తీసుకున్న కాలవ్యవధి నాలుగు రోజులే ! మిగిలిన రోజులన్నీ యుద్ధ మెళకువలు, ఆయా అస్త్రాల ప్రయోగ ఉపసంహారాలు బోధించడానికి కేటాయించాడు. విశ్వామిత్రుడు నేర్పిన వాటిలో యుద్ధ తంత్రమూ, యుద్ధ వ్యూహాలు ముఖ్యమైనవి.

రాక్షసుల్ని ఎంతటి వాడినయినా చంపగలననే దృఢ విశ్వాసం, ఆత్మవిశ్వాసం శ్రీరాముడికి తద్వారా కలిగాయి.

అంతఃపురంలో రాజకీయ వారసత్వపు సంక్షోభం ఏర్పడినప్పుడు ఈ ఆత్మ విశ్వాసంతోనే రాక్షస నిర్మూలన కోసం అరణ్యవాసాన్ని ఒక అవకాశంగా వాడుకోగలిగాడు శ్రీరాముడు.

# రాతిని నాతిగా మార్చడం అంటే ఏమిటి ?

"ఆత్మజం దాతుమర్హసి । దశరాత్రం హియజ్ఞస్య రామమ్" అని యజ్ఞం కోసం రాముణ్ణి పదిరోజులపాటు తనతో పంపమని కోరాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుడి వెనకే వెళ్లి అస్త్రశస్త్రాలను ఆయన దగ్గర అభ్యసిస్తున్నారు రామలక్ష్మణులు. రాముడు సాధించిన అస్త్రాలు, లక్ష్మణుడు సాధించిన అస్త్రాలు ఎవరి శక్తి కొద్దీ వారికి దక్కాయి.

మార్గమధ్యంలో విశ్వామిత్రుడు వాళ్ళని అహల్య రాయిగా పడివున్న ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు.

అక్కడ ఒక రాయిపైన కూర్చుని ఆహార పానీయాలు లేకుండా, రాత్రింబవళ్ళు ఏకాగ్ర చిత్తంగా రామనామం జపిస్తూ తపస్సు చేసుకుంటూ ఉంది అహల్య.

ఆమె కదలకుండా మెదలకుండా నిశ్చలంగా ఆ రాతిపై అలానే వుండిపోయింది. అదొక విధమైన జడసమాధి స్థితి. అంటే, జడపదార్థంలా పడివుండడం అన్నమాట !

"అదృశ్య సర్వభూతానాం ఆశ్రమేఽస్మిన్ వసిష్యసి ॥" ఎవరికీ కన్పించకుండా, ఎవ్వరినీ తాను చూడకుండా ఒక రాయిలా ఆశ్రమంలోనే పడివుండట !

"శ్రీరామచంద్రుడు వచ్చి నీ ఆతిథ్యం స్వీకరిస్తాడు. అప్పుడు నీవు పవిత్రురాలివి అవుతావు. ఆ తర్వాతే నీవు నాదగ్గరకు తిరిగి వచ్చే అర్హత వస్తుంది –" అని గౌతముడు చెప్పి వెళ్ళిపోయాడు.

ఎప్పుడో రాముడు ఇక్కడికి వస్తాడని గౌతముడు ఎలా ఊహించాడు ? అదంతా దివ్యదృష్టి అంటారు ..... అది వేరే సంగతి.

దివ్య దృష్టి అయినా, కాకపోయినా, రాముడి రాకను చాలా ముందుగానే గౌతముడు ఊహించే అవకాశం ఉంది.

1. అహల్యా శాపవృత్తాంతం జరిగే నాటికి రాముడికి నాలుగైదేళ్ళ వయస్సు ఉండి ఉండాలి.
2. ఆయన్ని కొంత వయస్సు వచ్చాక రాజమందిరంలోంచి బైటకు తెచ్చి వివిధ మహర్షులకు పరిచయంచేసి వారివారి దగ్గరున్న అద్భుతమైన విద్యల్ని రాముడికి నేర్పించాలని ఋషి సంఘం ముందుగానే చర్చించుకొని ఉండాలి.
3. ఆ మేరకు బాధ్యతని విశ్వామిత్రుడికి అప్పచెప్పి ఉండాలి.
4. అనుకున్నది అనుకొన్నట్లు సాధించగల నేర్పు విశ్వామిత్రుడికి ఉంది కాబట్టి ఆయన ఒకరోజు – ఈ ప్రాంతానికి రఘురాముణ్ణి తప్పకుండా తీసుకొస్తాడు.

5. అందుకు 10 లేక 12 ఏళ్ళు పట్టవచ్చు. ఈ పన్నెండేళ్ళూ అహల్య కఠోర నియమాలతో ఒక స్థాణువులా ఉండిపోయింది తపోదీక్షతో !

6. అహల్య మళ్ళీ మామూలు మనిషి కావాలంటే రాముడు అక్కడకు రావాలి. విశ్వామిత్రుడు అక్కడికి ఆయన్ని తేవాలి ! తన భార్య చెయ్యకూడని తప్పుచేసినప్పుడు గౌతముడు ఆమెకు విడాకులిచ్చేయలేదు - ఇంట్లోంచి వెళ్ళగొట్ట లేదు -ఆమెలో స్పష్టమైన పరివర్తన వచ్చేవరకూ ముని జీవితాన్ని గడిపి తిరిగి వచ్చి తనను చేరమన్నాడు. కాబోయే రాజు రాముడే ! అందుకే, రాముడి అనుమతితో మానసికంగా శుద్ధిని పొంది తిరిగి తనను చేరే అవకాశం కల్పించాడు. అందాకా ఈ పది పన్నెండేళ్ళు తానుకూడా హిమాలయాలకు వెళ్లిపోయి, అంతకన్నా కఠోర నియమాలతో తపోదీక్షకు ఉపక్రమించాడు.

అనాలోచనాపరుడైన మరో పురుషుడైతే ఆమెను కఠినంగా శిక్షించేవాడు. జమదగ్నిలాగా తలతీయించి మరణశిక్ష విధించేవాడు. కానీ, ఆమెలో మార్పుని తెచ్చి, పునీతురాలిని చేసి, తిరిగి స్వీకరించాడు గౌతముడు. తాను పునీతుడిగా వున్నాడు కాబట్టి తన భార్య పునీతగా వుండాలని ఆశించాడు.

అహల్య దగ్గరకు వెళ్ళేసరికి రామలక్ష్మణుల వయస్సు 16 ఏళ్ళు. అప్పటిదాకా దేవదానవులు, మానవులు ఎవరికీ చూడనలవి కాకుండా తపోదీక్షతో తేజరిల్లుతూన్న అహల్యాదేవిని వాళ్ళిద్దరూ సందర్శించారు. ఆమె పాదాలకు తమ శిరస్సును ఆనించి మొక్కారు రామలక్ష్మణులిద్దరూ !

అప్పటిదాకా స్థాణువులా కదలకుండా మెదలకుండా తపోదీక్షలో వున్న అహల్య, రాముడి శిరస్సు తన పాదాలకు తగిలి కళ్ళు తెరిచి చూసింది.

శ్రీరాముని చూపించి విశ్వామిత్రుడు "ఆ రాముడు ఈయనేనమ్మా !" అని పరిచయం చేశాడు. గౌతముడి మాటలు అహల్యకు గుర్తుకొచ్చాయి. ఇంతకాలం తాను స్మరిస్తున్న రాముడు ఈయనే !

రామలక్ష్మణులకు తిరిగి నమస్కరించింది అహల్య. వారికి చక్కని ఆతిథ్యం ఇచ్చింది". "అర్ఘ్యపాద్యాదులు" అంటే కాళ్లు కడిగి నెత్తిన నీళ్ళు చల్లుకుంది. అక్కడున్న అందరినీ అదే విధంగా గౌరవించింది.

కాకతాళీయం కావచ్చు - లేదా ముందుగా చేసుకున్న నిర్ణయమే కావచ్చు - సరిగ్గా ఇదే సమయానికి గౌతమ మహర్షి కూడా అక్కడకు వచ్చాడు. తపోబలంతో పునీత అయిన ఆ మహా ఇల్లాలిని చూశాడు. రామలక్ష్మణులు గౌతముని పాదాలకు మొక్కి ఆయన ఆశీస్సులు పొందారు. రాముడి కోరిక మీద అహల్యా గౌతములు ఇద్దరూ

ఏకం అయ్యారు. దేవదుందుభులు మ్రోగాయి. ఆ ముని దంపతులిద్దరూ అత్యంతానందంతో రామలక్ష్మణుల్నీ, విశ్వామిత్ర మహర్షినీ చక్కగా సన్మానించారు.

ఇదీ వాల్మీకి రామాయణంలో అహల్యా శాపవృత్తాంతం కథ !

"అహల్య" అంటే - పగలు దేనిలో విలీనం అవుతుందో ఆ సంధ్య వెలుగు - అని !

"అహల్య" అంటే, మరో అర్థంకూడా ఉంది - ఏది "పగలు"లో విలీనం అవుతుందో ఆ "రాత్రి" "అహల్య" అని !

"హల్య తే ఇతి హల్యా" అనే ఇంకో అర్థం ప్రకారం నాగలిచేత దున్నబడిన భూమిని 'హల్యా' అంటారు. 'ద్విహల్య' అంటే రెండు సార్లు దున్నిన భూమి అని ! 'త్రిహల్య' అంటే మూడు సార్లు దున్నిన భూమి అని ! 'అహల్య' అంటే, అసలు 'దున్నని భూమి' అని అర్థం.

దున్నని భూమి రాళ్ళూ రప్పలతో, ముళ్ళ కంపలతో బంజరు నేలలా, పాడుపడినట్లుంటుంది.

రాముడు నాగరీకుడు. శాస్త్రజ్ఞానం కల్గినవాడు. ఆయన అడవులకు వచ్చాడు. అక్కడ అనాగరకంగా జీవిస్తూ, దొరికిన ఆహార పదార్థాలేవో సేకరించుకొని, ఏరుకొని తింటున్న ప్రజల్ని కలుసుకున్నాడు. వారికి పంటలు పండించడం, వ్యవసాయం గురించి తెలియజేశాడు. ఆహారాన్ని ఏరుకొచ్చుకోవడం కాదు. 'ఉత్పత్తి చేయాలి' అని చెప్పాడు. మానవ సంబంధాలలో ఆర్థికపరమైన విషయాల గురించి వివరించాడు. వారిచేత 'అహల్య' గా వున్న - అంటే, దున్నని బంజరు భూముల్ని చదును చేయించాడు. దున్ని పంటలు పండింపచేయించాడు. సిరులు పండాయి.

రాతిని నాతిని చేయడం వెనక ఇలాంటి కథకూడా ఉంది. అహల్య భూములన్నీ హల్య భూములై "శ్రీ"లు పొంగిపొర్లాయి. అదీ రామరాజ్యం అంటే !

హేతువాద దృక్పథంతో అహల్యా శాపవృత్తాంతాన్ని విశ్లేషించి ఈ విధమైన వివరణకూడా ఇస్తుంటారు తాత్వికులు !

# సీతాస్వయంవరం - విశేషాలు

సీతాస్వయంవరం కోసం సభతీరి వున్నాడు జనకుడు. "ఇంకా ఆలస్యం ఏమిటీ - సీతను తీసుకురండి"- అని వత్తిడి చేస్తున్నాడు రావణుడు. "ఈ ధనుస్సుని ఎక్కుపెట్టి సీతను గెల్చుకొని తీసుకుపోతాను"- అన్నాడు రావణుడు.

అతని పక్కనే బాణాసురుడు కూడా వున్నాడు. "మిత్రమా ! తొందరపడకు ఒక్కక్షణం ఆగు... ఈ ధనుస్సు మన గురువుది... మహేశ్వరుడిది... దాన్ని సంధిస్తానంటూ ప్రగల్భాలు పలుకుతున్నావు.... జాగ్రత్త...." అని హెచ్చరించాడు.

రావణుడు పెద్దగా నవ్వి - "బాణాసురా! నా భుజబలం నీకు తెలియదా... యముడే తన సింహాసనం వదిలి పారిపోయాడు. కుబేరుడు దరిద్రుడయ్యాడు. సూర్యుడు నా ప్రతాపం ముందు వెలవెలపోయాడు. మేరుపర్వతాన్ని చేతుల్తో పెకిలించినవాణ్ణి - శివధనుస్సు నాకో లెక్కా?" అన్నాడు గర్వంగా !

అప్పుడు బాణాసురుడు ఒక సంగతి చెప్పాడు. "నీకు మా తండ్రి బలిచక్రవర్తి తెలుసుకదా... విష్ణువు మూడడుగుల భూమి అడగడానికి మా తండ్రి దగ్గరకొచ్చాడు. మూడడుగుల నేలకోసం ఇంత యాచనా ? ఓ వామనుడా... నాతో పరాచికాలాడ్తున్నావా... నా గౌరవానికి తగ్గట్టుగా నీకేం కావాలో అడుగు అన్నాడు మా తండ్రి బలిచక్రవర్తి. మానాన్న ఇలా నిష్ఠూరంగా మాట్లాడుతూనే వుంటే, నేనే జలాన్ని ధారపోసి ఆ మూడడుగులూ దానం ఇచ్చాను- కానీ, కీర్తి మా తండ్రిది మూడు లోకాలకూ వ్యాపించింది. ఈ దేవతలతో వ్యవహారాలు ఇలానే వుంటాయి. ఇలాంటి విషయాల్లో జాగ్రత్తగా వుండాలి-" అని హెచ్చరించాడు మళ్ళీ !

దానికి రావణాసురుడు వ్యంగ్యంగా నవ్వి - ఈ విష్ణువు సంగతి నాకు చెప్పకు - అతని ఆదిశేషుడు భూమండలాన్ని మోస్తున్నాడని గొప్పలు చెప్తారు. కాని, అనంతకోటి బ్రహ్మాండాల్ని శివుడు తన నెత్తిన భరిస్తున్నాడు. శివుడికి, శేషుడికి పోలికేమిటీ... అలాంటి శివుడి కైలాసాన్నే నేను ఎడంచేత్తో ఎత్తాను - అలాంటి నాకు గర్వం ఎందుకుండదు...? ఉంటుంది. నేను గర్విష్టినే..! అన్నాడు.

రావణాసురుడు, బాణాసురుడు ఇలా మాట్లాడుకుంటున్నారు.. తొందరపడవద్దని రావణుణ్ణి ఒక స్నేహితుడిగా బాణాసురుడు వెనక్కిలాగే ప్రయత్నాలు చేస్తూనేవున్నాడు- అయినా రావణుడు లొంగలేదు.

ఇంక చేసేది లేక బాణాసురుడు లేచి, శివుడి ధనుస్సుకు ప్రదక్షిణం చేసి నమస్కరించి, సభలోంచి నిష్క్రమించాడు. అంతలో రావణాసురుడికి మాత్రమే విన్పించేట్లుగా ఆకాశవాణి ఒక వార్తని అందించింది..

"రావణా ! నీ రాణులలో ఒకతె 'కుంభీనస'ని మధుదైత్యుడు ఎత్తుకుపోతున్నాడు. ఆమెను కాపాడేందుకు ఎవరూ లేరక్కడ. మేఘనాథుడు ఏదో యజ్ఞంలో వున్నాడు. విభీషణుడు తపస్సులో వున్నాడు. కుంభకర్ణుడు గాఢనిద్రలో వున్నాడు"- అన్నది ఆకాశవాణి.

అంతే ! రావణుడు సీతసంగతి, శివుడివిల్లు సంగతి అన్నీ వదిలేసి, తన భార్య సంరక్షణకోసం హడావిడిగా పరిగెత్తాడు. రావణుడు ఎందుకు వెళ్ళిపోయాడో ఎవ్వరికీ అర్థం కాలేదు.

రావణుడు నిష్క్రమించగానే అందరికన్నా ఎక్కువ సంతోషించింది జనకమహారాజే, హమ్మయ్య అని ఊపిరిపీల్చుకున్నాడు.

# పరశురాముడెలా వుంటాడు ?

జనకుడి నిండు సభ ఇంకా జరుగుతోంది. శివధనుర్భంగం జరిగింది. కరతాళధ్వనులు మిన్నుమిట్టుతున్నాయి. పాపాత్ములు, దుర్మార్గులు, ఈర్ష్యాపరులు అయిన రాజులు ఎదురు తిరిగి జనకుడితో గొడవ పెట్టుకొన్నారు. కొందరు సర్ది చెప్పాలని చూస్తున్నారు. కొందరు రాముడికి అనుకూలంగా నినాదాలు చేస్తున్నారు.

ఇదంతా చూసి, జానకిని ముందు జాగ్రత్తగా లోపలికి పంపించేశారు. రామలక్ష్మణులు బుద్ధిగా విశ్వామిత్రుడి దగ్గరకొచ్చి కూర్చున్నారు. లక్ష్మణుడు చాలా కోపంగా వున్నాడు. ఎప్పుడు ఈ దుష్టరాజులమీద విరుచుకుపడదామా.. అని చూస్తున్నాడు.

సరిగ్గా ఆ సమయంలో చిందులు తొక్కుతూ పరశురాముడొచ్చాడు. డేగనుచూసి పిట్టలు భయపడ్డట్లు రాజులు అతన్ని చూసి ఠక్కున నోళ్ళు మూశారు.

తెల్లని శరీరం. నఖశిఖ పర్యంతం విభూది పూసుకొని వున్నాడు. విశాల లలాటం మీద ఊర్ధ్వపుండ్రాలు ప్రకాశిస్తున్నాయి. జడలు బారిన జుత్తుని ఎత్తుగా కిరీటం మాదిరి ముడి వేసుకున్నాడు. చంద్రబింబం లాంటి ఆయన ముఖ వర్చస్సు కోపాగ్నిని జ్వలిస్తోంది. కళ్ళల్లోంచి నిప్పులు కురిపిస్తూ, రౌద్రకారుడై సభలోకి ప్రవేశించాడు. వృషభ మూపురాల్లాంటి భుజాలు... విశాల వక్షస్థలం... దీర్ఘ బాహువులు... దివ్య యజ్ఞోపవీతం... చక్కని రుద్రాక్షమాల... వీపుకు కట్టుకున్న జింకచర్మం... నడుముకు కట్టుకున్న కాషాయవస్త్రం... రెండు భుజాల మీదా వ్రేలాడుతున్న అక్షయతూణీరాలు... ఒక భుజం మీద వ్రేలాడుతున్న గొడ్డలి. చేతిలో ధనుర్బాణాలు.... ఇదీ పరశురాముడిని చూడగానే గుర్తించగలిగిన స్వరూపం. ఆ స్వరూపంలోనే ఆయన స్వభావం అంతా ఇమిడి వుంది...

పరశురాముడికి జనకమహారాజు నమస్కరించాడు. ఆయన పిలిస్తే సీత కూడా వచ్చి నమస్కరించి వెళ్ళింది. సౌభాగ్యవతీభవ అని దీవించాడు. సభలో వున్న రాజులంతా వచ్చి పాదాభివందనాలు చేసివెళ్ళారు. ఆఖరున విశ్వామిత్రుడు వచ్చి పరశురాముడికి నమస్కరించి కుశల ప్రశ్నలు వేశాడు. ఆయన మాటమీద రామలక్ష్మణులు కూడా నమస్కరించారు. పరశురాముడు వారిని కూడా దీవించాడు. శ్రీరాముడి దివ్యమంగళ విగ్రహాన్ని చూసి ఒకింత ఆశ్చర్యపోయాడాయన !

# పరశురాముణ్ణి ఆటపట్టించిన రామలక్ష్మణులు

మొత్తంమీద వస్తూనే తెచ్చుకున్న కోపం అంతా దాదాపుగా తగ్గింది పరశురాముడికి. కొంచెం మెత్తపడి జనకుడి వంకచూసి "రాజా ! ఇక్కడ ఈ ఘాతుకం చేసిందెవరు?" అనడిగాడు. ఏ ఘాతుకమో అర్థం కాలేదు. అడిగితే ఏంతంటా వస్తుందో తెలియదు.

మనిషి నిదానించాడు కదా... అని సీతా స్వయంవరం ప్రకటన నుంచి శివధనుర్భంగం దాకా జరిగింది జరిగినట్లు చెప్పాడు జనకుడు.

"ఎవరు దాన్ని విరిచింది... నాకు వాణ్ణి చూపించు....." అంటూ మళ్ళీ కోపంగా అరిచాడు పరశురాముడు. జనకుడికి, రాముడికి మూడిందని అసూయాపరులైన రాజులు చంకలు కొట్టుకొంటున్నారు. మిగిలిన వారి ముఖాలు విషాదంతో నిండిపోయాయి.

అప్పుడు రాముడు... "మహర్షీ! ఈ విల్లు విరిచినవాడు మీ సేవకుడే..." అన్నాడు. "సేవకుడైతే తప్పు చేసినప్పుడు దండనార్హుడే. వాణ్ణి బైటకురమ్మను"- అన్నాడు పరశురాముడు. "నాకు పరమశత్రువు ఈ విల్లు విరిచినవాడు... తెలుసా..." అని మళ్ళీ గట్టిగా అరిచాడు. "వాడెవరో చెప్పకపోతే ఈ సభలో వున్నవాళ్ళందరిని చంపేస్తాను" అని ఉగ్రంగా లేచి నిలబడ్డాడు.

ఒక ముని ఇలా ఒంటికాలు మీద లేచి వీరంగం ఆడుతుంటే, లక్ష్మణుడికి నవ్వొచ్చింది. బిగ్గరగా నవ్వేశాడు - లక్ష్మణుడు నవ్వుతుంటే ఉగ్రుడైపోయాడు పరశురాముడు. గొడ్డలి పుచ్చుకొని నరికేస్తానంటూ మీదిమీదికి వచ్చాడు. అప్పుడు లక్ష్మణుడు అన్నాడుగదా... "మా చిన్నప్పటి నుంచి ఇలాంటి ధనుస్సుల్ని మేం చాలా విరిచేశాం మునిరాజా ! దీనికోసం మీరింత రెచ్చిపోతారేమిటి"- అనడిగాడు.

"ఇది మామూలు ధనుస్సు కాదు..." అన్నాడు కోపంగా పరశురాముడు.

"మునిరాజా ! ధనుస్సు అంటే ధనుస్సే ! ధనుస్సులన్నీ ఒక్కటే... మా అన్నయ్య దాన్ని ముట్టుకొన్నాడు. అది విరిగింది. మమ్మల్నేంచెయ్యమంటారు ?" అని రెట్టించాడు.

జనకుడికి లోపల వెర్రెత్తిపోతోంది. ఎవరైనా ఈ లక్ష్మణుణ్ణి కాస్త అదుపుచేసి మునిని శాంతింపచేయగలిగితే చాలు... అనుకొంటున్నాడు. ఏ చిన్న చెడు సంఘటన జరిగినా అది తనకే గదా అపకీర్తి !

"ఓరీ మూర్ఖుడా ! నేనెవరో తెలిసే మాట్లాడుతున్నావా... ఈ గొడ్డలితో కార్తవీర్యార్జునుడి వెయ్యిచేతుల్ని నరికేశాను తెలుసా !" అన్నాడు గర్వంగా పరశురాముడు.

"మాటిమాటికి ఆ గొడ్డల్ని అలా నాకెందుకు చూపిస్తారు?" మీ రూపం చూస్తే మీరు భార్గవులని, బ్రాహ్మణులని స్పష్టంగా అర్థం అవుతోంది. మీ బ్రహ్మముడి వలన మీరు గౌరవనీయులు. మీ సూర్యవంశీకులెప్పుడూ గోబ్రాహ్మణ వధ చెయ్యరు కాబట్టి, మీరు పదేపదే గొడ్డలిని చూపించకండి. మీరు శస్త్రాస్త్రాలు ప్రదర్శిస్తుంటే కొద్దిగా అనుచితంగా మాట్లాడాను. పెద్దలు... మన్నించండి.." అని కూర్చున్నాడు లక్ష్మణుడు.

పరశురాముడు కోపంతో ఉడికిపోయి, ఏం మాట్లాడాలో తెలియక విశ్వామిత్రుడి వైపు తిరిగి, "ఈ బాలకుణ్ణి మీరేకదా తెచ్చారు... కొంచెం బుద్ధి చెప్పండి... నేనెవరో తెలియజేయండి..." అన్నాడు.

దానికి విశ్వామిత్రుడు కొంచెం కొంటెగా, "మహర్షీ ! మీరెవరో ఆ బాలకుడికి మీరే స్వయంగా చెప్పుకొన్నారు. మీరు చెప్పుకొన్నది చాల్లేదని మీకు అన్పిస్తే మరొకసారి

గట్టిగా మీరే చెప్పుకోండి"– అన్నాడు. మీ ప్రతాపాన్ని మీరే చెప్పుకోండి అనడం... ప్రగల్భాలు పలకడంగా విశ్వామిత్రుడు ఎత్తిపొడిచేసరికి పరశురాముడికి ఏమీ పాలుపోలేదు. కోపం కట్టలుతెంచుకుంటోంది.

"అందరికీ ఇదే చెప్తున్నాను వినండి ! చిన్నపిల్లాడు అనికూడా చూడకుండా నేనిప్పుడే ఈ లక్ష్మణుణ్ణి సంహరిస్తున్నాను. రేపు నన్ను తప్పుబట్టకండి – నాకే ఎదురు చెప్తాడా... వేలెడంతలేడు" అన్నాడు పరశురాముడు.

విశ్వామిత్రుడు తనలోతానే నవ్వుకొని "హరి, హరిని 'అరి' (శత్రువు) అనుకొంటున్నాడు" అనుకొంటూ, వజ్రంలాంటి ధనుస్సుని చెరుకు ముక్కలా విరిచిన వాడి గురించా ఈయన ఇలా మాట్లాడ్తున్నాడు"– అన్నాడు. లక్ష్మణుడు తనమాటలతో మహర్షిని రెచ్చగొడ్తున్నాడు.

అప్పుడు రాముడు కలుగచేసుకొని, "మునిరాజా ! ఆ పిల్లాడి మాటల్ని మీరు పట్టించుకొంటారేమిటీ ... మీరు మునిశ్రేష్ఠులు... జ్ఞానులు... శాంత స్వరూపులు... వాణ్ణి క్షమించండి"– అన్నాడు.

పరశురాముడు రాముడివంక తిరిగి – "వీడు మెత్తగా కన్పిస్తున్నాడు గాని, లోపలంతా విషం... జాగ్రత్త" అన్నాడు. లక్ష్మణుడు మళ్ళీ నవ్వి "మీరు అరచినంతమాత్రాన విరిగిన ధనుస్సు అతుక్కోదుకదా... పోనీ విశ్వకర్మని పిలిపించి అతుక్కోగలదేమో చూడమనండి"– అన్నాడు వ్యంగ్యంగా.

రాముడు మాత్రం "పిల్లాడి మాటలు పట్టించుకోకండి" అంటున్నాడు – లక్ష్మణుడు అధిక ప్రసంగం చేస్తూనే వున్నాడు.

"ఏం చేస్తే మీకోపం శాంతిస్తుందో చెప్పండి – అది చేస్తాం" అన్నాడు రాముడు. పరశురాముడు రౌద్రంగా... "ఏం చేస్తావయ్యా... మీ అన్నదమ్ములిద్దరూ నాతో ఆడుకుంటున్నారు...? అటు వాడేమో గురగురచూస్తూ మాటలు పేల్తున్నాడు. ఇటు నువ్వేమో శాంతం శాంతం అంటూ గిల్లుతున్నావు"– అన్నాడు.

"ఓ జనకా ! వాళ్ళిద్దర్నీ నా ముందునుంచి అవతలికి తీసుకుపో – "అని అరిచాడు పరశురాముడు జనకుడివైపు తిరిగి. జనకుడు లేవబోతూ వుండగా, లక్ష్మణుడు – "కాసేపు మీరు కళ్ళుమూసుకుంటే ఎవ్వరూ కన్పించరు కదా..." అన్నాడు వ్యంగ్యంగా !

అర్థం అయిపోయింది పరశురాముడికి. రామలక్ష్మణులిద్దరూ కావాలనే తనని ఆడిస్తున్నారని ! "రామా ! విల్లు విరిచింది నువ్వే కదా ! శివద్రోహీ... నిన్నిప్పుడే సంహరిస్తాను"– అన్నాడు.

రాముడు నమస్కారం పెట్టి, "మిమ్మల్ని ఆటపట్టించింది నా తమ్ముడైతే మీరు నన్ను వధిస్తాననడం అన్యాయం. అయినా నేను మీ సేవకుడిని. సేవకుడు యజమానితో యుద్ధం చెయ్యడుకదా..." అని చిన్నగా నవ్వాడు.

"ఏమోయ్ ! నేనేమన్నా వెర్రి బ్రాహ్మణుడిని అనుకొంటున్నావా... నా ధనుస్సు స్రువం. నా కోపం అగ్ని. నా బాణం ఆహుతి. యజ్ఞ సమిధలే నా చతురంగ బలాలు. మీలాంటి రాజులంతా నాకు యజ్ఞపశువులు. ఈ గొడ్డలితోనే నేను రాజుల్ని నరికి అగ్నికి ఆహుతిచ్చాను. ఇలా అనేక యజ్ఞాలు చేశాను. నా ప్రతాపం నీకు తెలియదు. ధనుస్సు విరిచావని గర్వంతో నేనేదో పిచ్చి బ్రాహ్మణుడిని అనుకొంటున్నావేమో..." అన్నాడు.

అప్పుడు రాముడు కొంచెం కటువుగా... "మునిరాజా ! ముట్టుకొంటేనే విరిగిన ధనుస్సుని విరిచావు విరిచావు అంటూ అరిచేది మీరే ! చంపుతా చంపుతా అంటారేమిటి... అంత తేలికా చంపడం అంటే... మా రఘువంశంలో ఎవరూ ఎప్పుడూ యుద్ధానికి భయపడి వెనకడుగు వెయ్యలేదు. మీరు బ్రాహ్మణులు... అందుకని మీతో యుద్ధాన్ని మేము కోరుకోవడం లేదు... పౌరుషం మీ బ్రహ్మవంశం యొక్క ప్రభావం. అందులో మీ గొప్పేమీ లేదు"– అన్నాడు.

దాంతో పరశురాముడికి జ్ఞానోదయం అయ్యింది. అనవసరంగా మాటలతో యుద్ధంచేసినట్లయింది తన పరిస్థితి అనుకొన్నాడు. రాముడివంక తిరిగి, "ఇదిగో నా విష్ణుధనువు నీకు ఇస్తున్నాను. చేతనైతే దీన్ని ఎక్కుపెట్టు"– అన్నాడు.

రాముడు పరశురాముడి చేతిలో విష్ణుధనువు తీసుకొన్నాడు. తన ధనువు తన చేతిలోకి రాగానే దానికదే ఎక్కుపెట్టబడినట్లు నిలబడింది. ఆ చిత్రంచూసి పరశురాముడికి ఆశ్చర్యం అయ్యింది.

రాముడు సాక్షాత్తు విష్ణువే అని గ్రహించాడు. మనసు పరమానందం పొందింది. రాముడికి అభినందనలు చెప్పి తన అవతార పరిసమాప్తి కోసం తపోవనాలకు నిష్క్రమించాడు. హరి – హరిని వదిలి – హరిదగ్గరకు చేరుకున్నాడు. అలా జనకుడి సభ సుఖాంతం అయ్యింది.

# సీతారాముల కళ్యాణ వైభవం

పెళ్ళి నిశ్చయం అయిపోయింది. సీతను రామునికిచ్చి వివాహం చేస్తానని జనకుడు సభలో ప్రకటించాడు. విశ్వామిత్రుడు దశరథుడి పక్షాన తన అనుమతినిచ్చాడు.

జనకుడు తన మంత్రుల్ని వాయుమనోవేగాల్తో వెళ్ళి ఈ విషయాన్ని దశరథుడికి తెలియజేసి ఆయన్ని సకుటుంబ సపరివారంగా మిథిలానగరానికి ఆహ్వానించవలసిందిగా పంపించాడు. సమాచారం దశరథుడికి, అతని రాణులకు అందరికీ సంతోషదాయకం అనిపించింది.

ఆయన చతురంగ బలాల్నీ తీసుకొని, నాలుగు రోజులు ప్రయాణం చేసి మిథిలా పట్టణానికి చేరుకొన్నాడు. ఒక గుర్రపు బండి నాలుగు రోజులు ప్రయాణం చేసేటంత దూరంలో అయోధ్య నుంచి మిథిలానగరం వుందన్నమాట ! జనకుడు సంబరంగా



వాళ్ళందరికీ స్వాగతం పలికాడు. రామలక్ష్మణులు తండ్రికి పాదాభివందనం చేశారు. దశరథుడు కొడుకులిద్దర్నీ మెచ్చుకున్నాడు. రెండు పక్షాలవారూ ఒకళ్ళనొకళ్ళు అభినందించుకున్నారు. ఆ రాత్రికి విడిది మందిరాల్లోకి వెళ్ళి విశ్రాంతి తీసుకున్నారు.

సీతారాముల వివాహం - ఐదు రోజులపాటు జరిగింది. రాముడి పెళ్ళి ఎలా జరిగిందని వాల్మీకి మహర్షి వర్ణించాడో ఈ నాటికీ, భారతీయుల వివాహ విధానం ఇంచుమించుగా అదే పద్ధతిలో జరుగుతోంది. మొన్నమొన్నటిదాకా ఐదు రోజుల పెళ్ళిళ్ళు తెలుగువారిలో జరుగుతూనే వున్నాయి కూడా. ఇప్పటికీ ఒకేరోజున జరిగినా ఆనాటి విధివిధానాలన్నీ యథావిధిగా పాటిస్తూనేవున్నారు ఇంచుమించుగా..!! సీతారాముల పెళ్ళి ఎలా జరిగిందో వాల్మీకి వర్ణనలో చూడండి !!

## మొదటి రోజు కార్యక్రమం :

"వరప్రేషణం" అంటే లగ్నపత్రిక పంపడంతో వివాహవిధి మొదలయ్యింది. మొదట మిథిలా నగరానికి వెలుపలే నిలబడి దశరథుడి పరివారానికి స్వాగతం చెప్పి వారికి స్వాగత సత్కారాలు అందించారు. దీన్ని "సీమాంతపూజ" అంటారు. ఊరు చివరే నిలబడి వస్తున్న పెళ్ళివారికి స్వాగతం చెప్పడం "సీమాంతపూజ"! ఈనిని 'ఎదురుకోల' అని రాయలసీమలో ఈనాటికీ పాటిస్తున్నారు.

సీతాస్వయంవరం, శివధనుర్భంగం కథనాలను వివరించి, సీతని రాముడికిచ్చి వివాహం చేయడానికి దశరథుడి అనుమతి కోరాడు జనకుడు. దశరథుడి అంగీకారంతో ఆయనకు లగ్నపత్రికని అందించారు. ప్రయాణ అలసట తీరేలా ఉపచారాలు చేశారు. సగౌరవంగా తోడ్కొని వచ్చి ప్రత్యేకంగా అలంకరించిన విడిది మందిరాలకు పంపించారు.

దశరథుడి అంగీకారం అయింది కాబట్టి, తన ఇంటికివెళ్ళి, జనకుడు యజ్ఞానికి సంబంధించిన విధానాలకోసం ఏర్పాట్లు ప్రారంభించాడు. కన్యాదానానికి కావలసిన అంకురార్పణలు - ధాన్యం మొలకెత్తించడం - వంటి కృత్యాలు చేయించాడు. ఇది మొదటి రోజు కార్యక్రమం !

పెద్దల్ని ఆహ్వానించినప్పుడు ఊరు చివర నిలబడి వారికి స్వాగతం పలికి అక్కణ్ణించి "ఊరు ఎరిగింపు - ఊరేగింపు"గా తోడ్కొని వచ్చే సాంప్రదాయాన్ని ఇప్పటికీ మనం పాటిస్తున్నాం.

## రెండవ రోజు కార్యక్రమం :

జనకుడికి కుశధ్వజుడు అనే తమ్ముడున్నాడు. ఆయన సాంకాశ్యనగరం పాలకుడుగా వున్నాడు. ఆయన్ని సకుటుంబ సపరివారంగా తీసుకురావలసిందిగా మనుషుల్ని కబురంపాడు జనకుడు. తన ఇద్దరు కూతుళ్ళు సీతనీ, ఊర్మిళనీ రాముడికి, లక్ష్మణుడికి ఇచ్చి పెళ్ళి చేస్తున్నాననీ, తాను తప్పకవచ్చి ఈ వేడుకల్లో పాల్గొనాలని తమ్ముణ్ణి కోరాడు. ఈ పెళ్ళి రెండో రోజు పొద్దునకే కుశధ్వజుడు జనకుడి ఇంటికి చేరుకున్నాడు. సమయానికి వచ్చినందుకు సంతోషించాడు జనకుడు. ఆ అన్నదమ్ములిద్దరూ కలిసి చర్చించుకొని, దశరథుడి విడిదికి వెళ్ళి ఆయన్ని సకుటుంబంగా ఇక్కడికి ఆహ్వానించి తీసుకురమ్మని మంత్రి సుమంత్రుని పంపాడు. దశరథుడు, ఆయన రాణులు, ఆయన కుటుంబం వచ్చారు. విశ్వామిత్రుడు, వశిష్ఠుడు కూడా వచ్చారు.

తమ వంశం గురించి అన్ని వివరాలూ తెల్సిన వశిష్ఠులవారు తమ వంశావళిని చెప్తాడన్నాడు దశరథుడు.

అవ్యక్త ప్రభువైన బ్రహ్మతో ప్రారంభించి దశరథుడి వరకూ ఇక్ష్వాకు రాజవంశాన్ని వివరించాడు వశిష్ఠుడు :

బ్రహ్మ - మరీచి - కశ్యపుడు - వివస్వంతుడు -

1) మనువు 2) ఇక్ష్వాకువు 3) కుక్షి 4) వికుక్షి 5) బాణుడు 6) అనరణ్యుడు 7) పృథువు 8) త్రిశంకువు 9) ధుంధుమారుడు 10) యువనాశ్వుడు 11) మాంధాత 12) సుసంధి 13) ధ్రువసంధి 14) భరతుడు 15) అసితుడు 16) సగరుడు 17) అసమంజుడు 18) అంశుమంతుడు, ప్రసేనజిత్తు 19) దిలీపుడు 20) భగీరథుడు 21) కాకుత్స్థుడు 22) రఘువు 23) ప్రవృద్ధుడు 24) శంఖణుడు 25) సుదర్శనుడు 26) అగ్నివర్ణుడు 27) శీఘ్రగుడు 28) మరువు 29) ప్రశుశ్రుకుడు 30) అంబరీషుడు 31) నహుషుడు 32) యయాతి 33) నాభాగుడు 34) అజుడు 35) దశరథుడు

ఈ వంశంలో మొదటివాడు మనువు వివస్వత మహర్షిపుత్రుడు. కాబట్టి వైవస్వత మన్వంతరంలో దశరథుడు 35వ తరం వాడని మనం దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

వాల్మీకి రామాయణంలోనే ఈ వంశక్రమంలో బాలకాండ, అయోధ్యాకాండల్లో కొద్దిపాటి తేడాలు కన్పిస్తాయి. అవి లిపీకరణం చేయడంలో దొర్లిన పొరబాట్లు కావచ్చని డా॥ మల్లాది గోపాలకృష్ణశర్మ పేర్కొన్నారు.

కాళిదాసు తన రఘువంశంలో దిలీపుడు, రఘువు, అజుడు, దశరథుడు ఈ నలుగురినీ వరుస రాజులుగా పేర్కొన్నాడు. బహుశా పద్మపురాణంలోంచి కాళిదాసు ఈ సమాచారం తీసుకొని వుంటాడని పండితులంటారు.

దశరథుడి వంశావళి అంతా వశిష్ఠుడు చెప్పాడు. మగపెళ్ళివారికి వారి పురోహితులు చెప్తారు. కానీ, ఆడపెళ్ళి వారికి పెళ్ళికూతురు తండ్రే స్వయంగా తన వంశావళి చెప్పుకుంటారట. జనకుడు తన వంశవృద్ధిని దశరథుడికి వివరించాడు.

1) నిమి 2) మిథి 3) జనకుడు (1) 4) ఉదావసువు 5) నందివర్ధనుడు 6) సుకేతువు 7) దేవరాతుడు 8) బృహద్రధుడు 9) మహావీరుడు 10) దృష్టకేతువు 11) హర్యశ్వుడు 12) మరువు 13) ప్రతీంధకుడు 14) కీర్తిరథుడు 15) దేవమీఢుడు 16) విబుధుడు 17) మహీధ్రకుడు 18) కీర్తిమంతుడు 19) మహారోముడు 20) స్వర్ణరోముడు 21) హ్రస్వరోముడు 22) జనకుడు (2) (సీతాదేవి తండ్రి). ఇతని తమ్ముడు కుశధ్వజుడు.

ఈ వంశవృక్ష క్రమంలో నిమితో ప్రారంభించి జనకుడు 23వ తరం వాడుగా కన్పిస్తాడు.

ఇద్దరూ తమ తమ వంశాల్లోని గొప్పతనాన్ని, తమ పూర్వీకుల విషయాల్ని చెప్పుకున్నారు... అలాంటి మహనీయులు జన్మించిన వంశంలో పుట్టాం అని ! తమ పిల్లలు కూడా శీలసంపదలతో, శౌర్యసంపదలతో మంచి నడవడిక గలిగి వంశగౌరవాన్ని కాపాడేవారుగా, ఇంటి పేరుని నిలబెట్టేవాళ్ళుగా వుంటారని భావించారు.

విశ్వామిత్రుడు రెండు వంశాల చరిత్రలూ విన్నాక, ఒకరికి తగిన వారు వేరొకరని ప్రశంసించారు. సీత తనకు దొరికిన వైనం, ఆమెను తన కన్న కూతురుతో సమానంగా ఎలా పెంచిందీ వివరించాడు జనకుడు.

జనకుడు రెండు పక్షాలకూ సంబంధించిన బంధువులను, తదితర పెద్దల సమక్షంలో శ్రీరాముడికి సీతనిచ్చి, లక్ష్మణుడికి ఊర్మిళనిచ్చి పెళ్ళిచేస్తానని 'వాగ్దానం' చేశాడు. "మూడుసార్లు చెప్తున్నాను. ఇందులో సంశయం లేదు"– అన్నాడు. మూడుసార్లు ప్రకటించే అలవాటు మన పూర్వీకులకు మొదటి నుంచి వుంది. వేలంపాటల్లోనూ, న్యాయస్థానాల్లోనూ మూడుసార్లు చెప్పే అలవాటు ఈనాటికీ వుంది !

సరే ! ఇవన్నీ అయినాక విశ్వామిత్రుడికి ఓ ఆలోచన వచ్చింది. వశిష్ఠుడితో సంప్రదించాడు. ఇద్దరూ కలిసి, కుశధ్వజుడి కూతుళ్ళు మాండవి (మాళవి), శృతకీర్తి ఈ ఇద్దరు ఆడపిల్లల్ని, భరతుడికీ, శత్రుఘ్నుడికి ఇచ్చి పెళ్ళి చేస్తే బావుంటుంది – అని ప్రతిపాదించారు.

జనక మహారాజుకి ఈ ప్రతిపాదన చాలా సంతోషాన్ని కల్గించింది. "మహనీయులైన ఆ మహర్షులిద్దరూ చేసిన ఈ ప్రతిపాదనతో మా వంశం ధన్యమైంది"– అన్నాడు. దశరథుడు కూడా తన నలుగురు పిల్లలకూ ఒకే ఇంటినించి ఒకేసారి సంబంధం కుదరడం చాలా ఆనందం అన్పించింది. సంకోచించకుండానే అంగీకరించాడు.

"ఈ నల్గురికీ ఒకే రోజున పాణిగ్రహణం జరగాలి. ఉత్తర ఫల్గుణీ నక్షత్రం ప్రశస్తంగా వుంది. ఆ ముహూర్తానికే పెళ్ళిళ్ళు ఏకకాలంలో జరుగుతాయి"– అన్నాడు జనకుడు.

జనక మహారాజు 'వాగ్దానం' తర్వాత మగపెళ్ళివారు విడిదికి తరలివెళ్ళారు.

విడిదికి వచ్చి దశరథుడు వివాహవిధుల్లో ఒకటైన నాందీశ్రాద్ధాన్ని నెరవేర్చినట్లు వాల్మీకి రాశాడు. దీనిపైన వివరణ ఇస్తూ, డా॥ మల్లాది గోపాలకృష్ణ శర్మగారు, శ్రీమద్రామాయణ వైభవం గ్రంథంలో ఈ అలవాటుని తెలుగువారు కొద్దిగా మార్పుచేసి, ఆడపిల్ల తండ్రిచేత వరుడికి గోదానం చేయించడంగా ఆచరిస్తున్నట్లు పేర్కొన్నారు.

**"ఓం మాతారుద్రాణాం– మాగా మనాగా మదితిం వధిష్ట"** అనేమంత్రాన్ని చదివి, ఆడపిల్ల తండ్రి దర్భని, తడి తుడిచి, దాన్ని తుంచి, సంకల్పపూర్వకంగా వరుడికి గోదానం చేస్తాడు. ఇలా మార్చుకున్నారు తెలుగువాళ్ళు.

**మూడవ రోజు కార్యక్రమం :**

మూడోరోజు ప్రొద్దున్నే దశరథుడు తన పిల్లల క్షేమం కోరి బంగారపు తొడుగుల్ని కొమ్ములకు తొడిగి, చక్కగా పాలిచ్చే నాలుగు లక్షల మంచి జాతి ఆవుల్ని, పాలు పితికేందుకు కావలసిన కంచుపాత్రలతో సహా బ్రాహ్మణులకు దానం ఇచ్చాడు. సంతృప్తికరంగా దక్షిణలు కూడా ఇచ్చాడు.

**నాల్గవ రోజు కార్యక్రమం :**

జనకుడి కూతుళ్ళు సీత, ఊర్మిళ, కుశధ్వజుడి కూతుళ్ళు మాండవి, శృతకీర్తిలచేత మాంగలిక కార్యాలన్నీ పూర్తిచేయించి వివాహమండపానికి రప్పించారు. దీన్ని వధూనిష్క్రమణం అంటారు.

అవతల విడిది మందిరాల్లో, దశరథుడి పుత్రులు రాముడు, భరతుడు, లక్ష్మణుడు, శతృఘ్నుడు కూడా మంగళస్నానాలు చేసి, చక్కగా అలంకరించుకొని కళ్యాణమండపానికి వచ్చారు. వశిష్ఠుడు "ముహూర్తం సమీపించింది. అందరూ వచ్చేశారు కాబట్టి పెళ్ళికార్యక్రమం ప్రారంభిద్దాం" అన్నాడు జనకుడితో !

జనకుడు వరపక్షపురోహితుడైన వశిష్ఠుడితో తానే స్వయంగా ఈ వివాహ వేడుకలు జరిపించాలని కోరాడు. వశిష్ఠుడు కన్యాపక్షపురోహితుడైన శతానందుడిని సహకరించ వలసిందిగా కోరాడు. ఇద్దరూ కలిసి కళ్యాణ మండపంలో మధ్యగా పెద్ద వేదికను ఏర్పరచారు. దాన్ని గంధ పుష్పాక్షతలతో, సువర్ణ పాలికలతో, మొలకెత్తిన విత్తనాల

అంకురాలతో, శోభిస్తోన్న రంగురంగుల కుంకుమలతో, ముగ్గులతో అలంకరింపచేశారు. ధూపదీపాలకోసం కావలసిన పాత్రలన్నింటినీ సిద్ధం చేశారు.

వేదిక అలంకారం అయిన తర్వాత వశిష్ఠుడు మంత్రోచ్చారణ పూర్వకంగా అగ్నిప్రతిష్ఠ చేసి హోమాదులు చేయించాడు.

వధువుల్ని, వరుల్ని ఎదురెదురుగా కూర్చోబెట్టారు.

మొదట జనకుడు సీతని శ్రీరామునికి ఇస్తూ కన్యాదానం చేశాడు.

**"ఇయంసీతా మమసుతా సహధర్మచారిణీ తవ**
**ప్రతిచ్ఛచైనాం భద్రంతే పాణింగృహ్ణీష్వపాణినా**
**పతివ్రతా మహాభాగా ఛాయేవాఽనుగతాసదా ॥** ***(26-27-73)***

"నీకెదురుగా కూర్చున్నది నా కుమార్తె సీత ! ఈమెని నీకు సహధర్మచారిణిగా సమర్పిస్తున్నాను. ఈమె పాణిగ్రహణం చేసి స్వీకరించు. నీకు మంచి జరుగుతుంది. నీవంటి భర్త లభించడం ఈమె అదృష్టం. ఈమె పతివ్రత అయి, నీడలాగా నిన్ను అంటిపెట్టుకొనే నడుచుకొంటుంది" అన్నాడు జనకుడు.

అగ్నిసాక్షిగా శ్రీరాముడు సీతాదేవి పాణిగ్రహణం చేశాడు. దేవతలు, ఋషులు, పురప్రజలు, పెద్దలు, పిల్లలు అందరూ ఆ నూతన దంపతులకి శుభం పలికారు. దేవదుందుభులు మ్రోగించారు. పుష్పవృష్టి కురిపించారు.

ఆ తర్వాత ఊర్మిళను లక్ష్మణుడికి, మాండవిని భరతుడికి, శృతకీర్తిని శత్రుఘ్నుడికీ మంత్రజల పురస్సరంగా కన్యాదానాలు చేశారు.

కొత్తదంపతులు నల్గురూ అగ్నికి త్రిపది (మూడుసార్లు) ప్రదక్షిణాలు చేశారు. సప్తఋషులకు ప్రదక్షిణలు చేసి నమస్కరించారు. తమ తమ నవవధువులతో కలిసి హోమాలు చేశారు.

హోమాలు అయిన తర్వాత తమ తమ వధువుల్ని తీసుకొని నల్గురు అన్నదమ్ములూ విడిదికి వచ్చేశారు. దశరథుడు, తదితర మగపెళ్ళివారంతా వెనకాలే బయల్దేరారు.

**ఐదవ రోజు కార్యక్రమం :**

ఇంక తాను బయల్దేరతానని దశరథుడి దగ్గర సెలవు తీసుకొని, విశ్వామిత్ర మహర్షి ఉత్తర పర్వతం వైపు వెళ్ళిపోయాడు. దశరథుడి పరివారం కూడా జనకుడి దగ్గర సెలవు తీసుకొని అయోధ్యకు బయల్దేరారు.

కాపురానికి వెడ్తున్న తన నల్గురు కుమార్తెల్ని ఆశీర్వదించాడు ! వారికి కన్యాదానం కింద లక్షలాది ఆస్తులు, మంచి కంబళ్ళు, పట్టు వస్త్రాలు, నూలు వస్త్రాలు, ఏనుగులు, గుర్రాలు, రథాలు, సైనికులు, వందమంది కన్యకలు, దాసదాసీజనం, బంగారం, ముత్యాలు, పగడాలు... ఇలాంటివెన్నో ఇచ్చి తన కూతుళ్ళను జనక మహారాజు అత్తగారింటికి పంపించాడు.

స్త్రీ ధనం అంటే ఇదే ! ఈ ధనం మీద వాళ్ళ భర్తలకు ఎలాంటి అధికారం లేదు. అది ఆమె స్వంత ఆస్తి. అత్తగారింటికి వెళ్ళిన తర్వాత ఏ విధంగానైనా ఈ ఆస్తులు ఆమెకు ఉపయోగపడతాయని ముందుజాగ్రత్తగా ఇచ్చేవాళ్ళు.

లక్ష్మణుడు తల్లిని వదిలి రాముడితో కలిసి వనవాసానికి బయల్దేరినప్పుడు అంటాడు "మా అమ్మకి వెయ్యిగ్రామాలు స్వంతంగా వున్నాయి. వాటితో ఆమె నాలాంటి వాళ్ళని వెయ్యి మందిని పోషించగలరు"- అంటాడు. ఇలా 'స్త్రీ ధనం' తన స్వంత హక్కుగా స్త్రీలకుండేది ఆరోజుల్లో !

మిథిలానగరాన్ని వదిలి నవవధువులతో దశరథుడి పరివారం అయోధ్యకు బయల్దేరడంతో మిథిలలో వివాహ కార్యక్రమాలు ముగిసాయి.

తర్వాత నెమ్మదిగా అయోధ్యకు చేరారంతా !

వధూస్వాగతం, వధూ అభినందనాలు చేసి, అంతఃపురంలోని ముత్తయిదువులు మంగళహారతులిచ్చి నవవధువులకు స్వాగతం పలికారు. నవవధువుల గృహప్రవేశం సందర్భంగా ప్రత్యేకంగా హోమం చేశారు. మహదాశీర్వచనాన్ని వేదపండితులతో ఇప్పించారు. దేవతా పూజల తర్వాత దేవతోద్వాసనం చేయించారు.

ఇలా యథావిధిగా ఐదు రోజుల పాటు ఘనంగా జరిగింది సీతారాముల పెళ్ళి.

# ఇది సీతాదేవి స్వయంవరమా ?

సీతారాముల వివాహం పెద్దలు చేసిన పెళ్ళా - లేక, ప్రేమ వివాహమా ..... ?

పెద్దలు చేసిన పెళ్ళి అయితే, సీతా స్వయంవరం ఎలా అవుతుంది ..... ? అలా కాదనుకొంటే, కనీసం పూర్వ పరిచయం కూడా లేని సీతారాముల మధ్య పెళ్ళిదాకా దారితీసిన ప్రేమ వ్యవహారం ఎక్కడ నడిచింది ..... ?

అసలు, స్వయంవరం అంటే ఏమిటో ముందు పరిశీలిస్తే సీతారాములది ఏ తరహా వివాహమో నిర్ణయించవచ్చు.

తన ఇష్టం వచ్చిన పద్ధతిలో, తన ఇష్టం వచ్చిన వ్యక్తిని ఒక స్త్రీ వరించి పెళ్ళాడడం స్వయంవరం.

తన దగ్గరున్న శివధనుస్సును ఎవరు ఎక్కుపెడతారో ఆ వ్యక్తికి సీత నిచ్చి పెళ్ళిచేస్తానని ప్రకటించాడు జనకుడు. కాబట్టి ఇది జనకుడి స్వయంవరము గాని, సీతా స్వయంవరం ఎలా అవుతుందీ ?

ఎక్కుపెట్టగలిగే బలం అయినా వుండాలి - లేదా నేర్పరితనం అయినా వుండాలి. ఇవి వున్న, వాడు ఎలాంటి వాడయినా, జనకుడు మాట తప్పే అవకాశం లేదు. అదీ అక్కడి పరిస్థితి. ఎలాంటివాడు వస్తాడో తెలీదు - వాడి రూపలావణ్యాలు ఎలా ఉంటాయో

తెలీదు. ఎలాంటి వాడయినా, తండ్రి ప్రతిజ్ఞ ప్రకారం సీత వరించితీరాలి. కాదనడానికి వీల్లేని ఈ పెళ్ళితతంగాన్ని సీతా స్వయంవరం అని ఎలా అనగలుగుతాం ..... ?

వనవాస కాలంలో అనసూయాదేవిని సందర్శించడానికి సీతారాములు అగస్త్యుడి ఆశ్రమానికి వెళ్లినప్పుడు నీ స్వయంవరం విశేషాలు నీ నోటితో వినాలని ఉంది చెప్పమని అడిగిందిట అనసూయ.

అదృష్టవశాత్తు సీత రాముడికి దక్కింది. రావణుడు పోటీలో పాల్గొనకుండా నిష్క్రమించాడు. చాలామంది విఫలం అయ్యారు. మిగిలిన వారికి ఆ అవకాశమే రాలేదు.

మన పురాణేతిహాసాలలో సత్యవంతుని వరించిన సావిత్రిది నిజమైన స్వయంవరం. ఇంద్రుడు, సూర్యుడు, యముడు, వరుణుడు లాంటి మహామహులు స్వయంవరంలో పాల్గొనడానికి వచ్చినా దమయంతి నలమహారాజునే స్వయంగా ఎంచుకొని వరించింది.

రుక్మిణి కథ ఇంకా ముందుకు వెళ్ళింది – తనే స్వయంగా కృష్ణుడికి కబురుపెట్టి తనని ఎట్లావచ్చి ఎట్లా తీసుకు పోవాలో చెప్పి మరీ వివాహం ఆడింది. బహుశా మొదటి ప్రేమలేఖ రాసింది రుక్మిణియే నేమో !!

కానీ, సీత – ద్రౌపదిల వివాహంలో బలపరీక్షలకు తమ కుమార్తెల జీవితాన్ని ముడిపెట్టి స్వయంవరాల పేరుతో వాటిని జరిపించడం ఒక విశేషం.

అయితే –

సీత వివాహంలో జనకుడు గానీ, ద్రౌపది విషయంలో ద్రుపదుడు గానీ మరీ అంత అవివేకంగా ప్రవర్తించారనడానికి వీల్లేదు.

ఒక విధంగా ఇవి రెండూ కూడా స్వయంవరమే !

ఎలాగంటే, ఏకాగ్రత, దృఢ చిత్తం వున్న వ్యక్తులకే ఈ బల పరీక్షల్లో విజయం లభిస్తుంది. ఇవి రెండూ ఉన్న వ్యక్తులు అసాధారణ వ్యక్తులే అవుతారు గాని దుష్టులు దుర్మార్గులు కావడానికి వీల్లేదు. అందుకే ఈ పరీక్షలు పెట్టారు ఆ యిద్దరు మహారాజులు తమ ముద్దుల కూతుళ్లకు కాబోయే వరులకోసం !

సాక్షాత్తూ శివధనుస్సును ఎక్కుపెట్ట గల వ్యక్తికి ఎన్ని అర్హతలుండి ఉండాలో జనకుడికి తెలుసు.

స్వయంవరంలో జనకుడు భయపడింది – ఎలాంటి వాడు వచ్చి ఈ విల్లునెత్తుతాడో ..... అని కాదు ..... విల్లునెక్కుపెట్ట గల ధీరుడు ఈ భూమండలంలో అసలు ఉన్నాడా ..... అని !

అలాంటి అపురూప వ్యక్తిని మనసారా వరించేందుకు సిద్ధపడింది సీత !

ఆ విధంగా అది సీతా స్వయంవరమే !!

# రామలక్ష్మణులతో సీత చెలికత్తెల పరిహాసం

సీతారాముల పెళ్ళి తంతు పూర్తయ్యింది. పెళ్ళి వారికి తాంబూలాలు ఇచ్చి జనకుడు సన్మానించాడు. ఆ మర్నాడు ప్రొద్దున్నే జనక మహారాజు తన కుమారుడు లక్ష్మీనిధిని పిలిపించి, వెళ్ళి అతని బావమరుదులు నలుగురినీ విందు భోజనానికి రమ్మనమని ఆహ్వానించవలసిందిగా చెప్పి పంపించాడు. దశరథుడు సంతోషంగా తన పుత్రులు నల్గురునీ లక్ష్మీనిధితో పంపించాడు. నలుగురు అన్నదమ్ములతోపాటు వాళ్ళ స్నేహితులు కూడా తోడురాగా అందరూ కలిసి విందుకు బయల్దేరారు.

ముద్దులు మూటగట్టే ఆ నలుగురు అన్నదమ్ముల్ని చూసి, మోహపరవశులై చేష్టలు తప్పి, మాటలు లేక చెక్కిన బొమ్మల్లా నిలబడి రెప్పవెయ్యకుండా చూస్తూండిపోయారట అంతఃపుర స్త్రీలు. తమంత అందగత్తెలు లేరని గర్వించిన వాళ్ళుకూడా రాముణ్ణి చూసి గర్వంచచ్చి సిగ్గుపడ్డారట. రాముడి ఎదుట వాళ్ళ చక్కదనం భిక్షానికి వచ్చినట్లుందిట ! నల్గురు అన్నదమ్ముల్ని చూసి అంతఃపురంలో "సిద్ధి" మొదలైన రాకుమార్తెలు సంతోషంతో సరసాలాడటం మొదలుపెట్టారు.

ఒక అమ్మాయి రాముడితో "నువ్వు దశరథుడికి పుట్టావా... మన్మధుడికి పుట్టావా... ఇంత అందంగా వున్నావు?" అని అడిగిందిట. జనకుడి కోడలు ఇంతకన్నా పెద్ద ప్రశ్నే వేసింది. "రామా ! మనం క్షత్రియులం కదా - మీ అక్కయ్య శాంత ఋష్యశృంగుణ్ణి ఎలా పెళ్ళిచేసుకొంది?" అని ! మీ అక్క ఋష్యశృంగుణ్ణి వరించిందా - ఋష్యశృంగుడు ఆమెని వరించాడా... ఈ కులాంతర వివాహం ఎలా జరిగింది"- అని వెక్కిరించిందట.

లక్ష్మణుడు మధ్యలో కల్పించుకొని, "ఎవరికి రాసిపెట్టిన వాళ్ళతో వాళ్ళకి పెళ్ళిళ్ళు జరుగుతాయి. బ్రహ్మరాత అది. అయినా సిద్ధీ - నీ భర్తపేరు లక్ష్మీనిధికదా... మీ ఇద్దరి పేర్లు ఆడపేర్లలానే వున్నాయి. మీ ఇద్దరికీ పెళ్ళి ఎలా అయ్యిందంటావు?-" అని ఎత్తిపొడిచాడు.

అది విని, ఇంకో అమ్మాయి, "మీ అయోధ్యలో మరీ చతురులున్నారు. పాయసం తిని పిల్లల్ని కనేస్తారు" అంది నవ్వుతూ. రాముడు అందుకొని, "నిజమే ! మా అయోధ్యలో కనీసం తల్లులైనా వున్నారు. మీ మిథిలా రాజ్యంలో పిల్లలు భూమిలో నుంచి పుట్టేస్తుంటారు" అన్నాడు. ఈ ఎత్తిపొడుపు తిన్నగా వెళ్ళి జానకికే తగిలింది. ఆమె హాయిగా నవ్వేసింది.

అప్పుడు సిద్ధి చెల్లెలు ముందుకొచ్చి, ఇంత చిన్నవయసులో మీరు మునుల వెంట తిరుగుతున్నారు. మునిపత్నుల ద్వారా దొరికిన పరిచయాలా ? అనడిగింది. అప్పుడు భరతుడు కల్పించుకొని, 'నువ్వేదో చిన్నపిల్లవనుకున్నాను- ఇంత చిన్నవయసులో మగాళ్ళతో స్నేహం గురించి మాట్లాతున్నావు- ఈ కళాశాస్త్రాన్ని నీ దగ్గరే మేం నేర్చుకోవాలి"- అన్నాడు. "నిన్ను సాధువుల పద్దులో వేసుకున్నాం. సంసారుల గురించి కూడా నీకు తెలుసే"- అని ఎత్తిపొడిచిందామె !

అప్పుడు మరో అమ్మాయి కల్పించుకొని, "వీళ్ళు అడవుల్లో యజ్ఞాలు సంరక్షిస్తున్నప్పుడు తాటకి అనే రాక్షసి మోహించి వచ్చిందట. బహుశా ఆ తాటకి చాలా విద్యలు నేర్పి వుంటుందీ"- అంది.

ఇలా చాలాసేపు సరసాలాడుకున్నాక సిద్ధి అంది – "రామా ! నీ రూపం చూసిన తర్వాత ఈ నగరంలో ఏ ఆడది నిన్ను మోహించకుండా వుండగలదా..?" అని. అప్పుడు రాముడు అన్నాడు. "ఓ బాలా ! భగవంతుడు లోకంలో కొన్ని మర్యాదలు ఏర్పరిచాడు. లోకం దానికి అనుగుణంగా వ్యవహరించవలసి వుంటుంది. మన భావానికి అనుగుణంగానే ఇతరులూ వ్యవహరిస్తారు"- అన్నాడు.

# పెళ్ళినాటికి సీతారాముల వయసెంత ?

విశ్వామిత్రుడు మిథిలానగరానికి వచ్చాడని తెలిసి, జనక మహారాజు స్వయంగా వచ్చి ఆయనకు స్వాగతం పలికాడు. రామలక్ష్మణుల్ని విశ్వామిత్రుడు ఆయనకు పరిచయం చేసిన తర్వాత ఇద్దరూ చాలా విషయాలు ముచ్చటించుకున్నారు.

ఎందరో రాజులు తన కుమార్తెను పాణిగ్రహణం కోరుతున్నారని చెప్పాడు జనకుడు. "సీతకు పెళ్ళిఈడు వచ్చేసింది. ఇంకా ఆమెకు వివాహం కాలేదు. యోగ్యుడైన వరుడికి ఇచ్చి చేయాలని వెదుకుతున్నాను" అన్నాడు జనకుడు.

డబ్బు లేనివాడు డబ్బు పోయినప్పుడు ఎంత బాధపడ్తాడో, యుక్తవయస్సు వచ్చినా నాకు పెళ్ళిచేయలేకపోతున్నందుకు మా నాన్న నాకోసం అంత దిగులుపడ్డాడని సీత స్వయంగా అనసూయతో చెప్పింది.

తాను అయోధ్యలో దశరథుడి ఇంట పన్నెండేళ్ళు సర్వభోగాలు అనుభవిస్తూ హాయిగా వున్నానని కూడా చెప్పింది. ఈ లెక్క ప్రకారం సీతవయస్సు అరణ్యవాసానికి వచ్చే కాలానికి 16 + 12 = 28 ఏళ్ళు వుండివుండాలి.

అయితే, సీతకు ఆరవ ఏటనే పెళ్ళి జరిగిందని ఎక్కువమంది రామాయణ కర్తలు రాశారు. వ్యాఖ్యాతలు కూడా పేర్కొన్నారు.

**"మమభర్తా మహాతేజా వయసా పంచవింశకః ।**
**అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే ॥"** ***(10-47-3)***

అని వాల్మీకి రామాయణంలో రావణాసురుడు కపటముని వేషంలో వచ్చి సీత వివరాలు అడిగినప్పుడు ఆమె చెప్పిన సమాధానం అది !

"మహా తేజస్సంపన్నుడయిన నా భర్త ఇరవై ఐదేళ్ళవాడు. నాకు పద్దెనిమిది ఏళ్ళు-" అన్నది సీత. ఈ మాటల్ని కొలబద్దగా తీసుకొంటే, రాముడికి వివిధ వయసుల్లో జరిగిన సంఘటనలు ఇలా వున్నాయి –

1) శ్రీరాముడిని 12వ ఏట విశ్వామిత్రుడు అడవులకు తీసుకువెళ్ళాడు.
2) 13వ ఏట సీతతో పాణిగ్రహణం.
3) సీతతో 12 ఏళ్ళు అయోధ్యలో కాపురం.
4) 25వ ఏట పట్టాభిషేక ప్రయత్నం.
5) వనవాస కాలం ప్రారంభానికి రాముడి వయసు 25 ఏళ్ళు మాత్రమే !
6) తర్వాత వివిధ మునుల ఆశ్రమాల్లో 10 ఏళ్ళున్నాడు.
7) పంచవటిలో 3 సంవత్సరాలు వున్నాడు.
8) వనవాసం మొదలుపెట్టిన 13వ సంవత్సరంలో సీతాపహరణం.
9) సీతాపహరణం జరిగే సమయానికి రాముడి వయస్సు సరిగ్గా 38 ఏళ్ళు.

గోవిందరాజీయం అనే గ్రంథంలో - ఈ వివరాలిస్తూ **"ఇదానీంతు రామః అష్టాత్రింశద్వర్షః మమత్వేక త్రింశద్వార్షా గతాః । ఇదానీంతు ద్వాత్రింశో వర్షో వర్షతే॥"** అన్నాడు. రాముడికి 25 ఏళ్ళు, తనకు 18 ఏళ్ళు అని సీత రావణాసురుడికి చెప్పింది. వనవాస ప్రారంభం నాటికి - అని అన్వయించుకోవాలని ఈ గ్రంథం చెప్తోంది.

ఆమెకు ఆరేళ్ళ వయసులో పాణిగ్రహణం, పన్నెండేళ్ళు అయోధ్యా నివాసం - వెరసి 18 ఏళ్ళు వచ్చేసరికి వనవాసం ప్రారంభం. మునుల ఆశ్రమాలలో 10 ఏళ్ళు, పంచవటిలో 3 ఏళ్ళు, 31వ ఏట సీతాదేవిని రావణుడు అపహరించినట్లు అర్థం అవుతుంది. ఆమెకు 33వ ఏట - రాముడితో కలిసి పట్టాభిషేకం జరిగింది !

సీతారాముల వయసు ఎంత అనే వివాదంలో ఇది ఒక వాదన మాత్రమే ! సీతకు యుక్త వయసు వచ్చిన తర్వాతే వివాహం అయ్యింది - అనే వాదన నిజం అయ్యేట్లయితే, సీతాపహరణ సమయానికి ఆమె వయసు 40 ఏళ్ళు దాటి వుండాలి. రాముడి వయసు 50కి సమీపంలో వుండి వుండాలి... సరే, సీతకు 31 ఏళ్ళు అయినా, 40 ఏళ్ళయినా, అయోధ్యలో గానీ, అరణ్యవాసంలో గాని సీతారాములకు సంతానం కల్గినట్లు ఎక్కడా లేదనేది గమనార్హం. ఇంతకీ ఆ సమయానికి రావణాసురుడి వయసు ఎంత ... అనేది మరో పెద్ద ప్రశ్న ! అతను దశరథుడి కాలానికే అరివీర భయంకరుడైన యోధుడు కాబట్టి ఎనభై ఏళ్ళపైబడ్డవాడే అయివుంటాడు.

# కైకకిచ్చిన మాట తప్పేందుకు సిద్ధపడ్డ దశరథుడు

కైకేయి తండ్రి కేకయరాజు దశరథుని రాజ్యాన్నంతా "ఓలి"గా తీసుకొని కైకనిచ్చి పెళ్ళిచేశాడని రామాయణం చదివేప్పుడు కొందరికి అనిపిస్తుంటుంది. అనుమానం కలగడం సహజం. నివృత్తి చక్కగా జరగాలి !

సుమిత్రతో సహా అనేకమంది రాణులున్న దశరథుడు తనకన్నా చిన్నరాజుకు రాజ్యాన్నంతా ఇచ్చి కైకని పెళ్ళి చేసుకోడానికి గల బలమైన కారణం ఏదీ కన్పించదు.

పెళ్ళి చేసుకొన్నది మాత్రం వాస్తవం. పెళ్ళి చేసుకునేప్పుడు కైకకుపుట్టే బిడ్డకు రాజ్యం ఇస్తానని వాగ్దానం చేయడం కూడా వాస్తవం.

ఇక్కడ రెండు ప్రశ్నలు తలెత్తుతాయి.

1. రాజ్యం అంతా కైకదే అయితే, రాముడికి పట్టాభిషేక ప్రయత్నం చేసేందుకు దశరథుడికి నైతికంగా హక్కులేదు.
2. వాగ్దానం నిజమే అయితే, మాట మరచిపోయి రామ పట్టాభిషేకానికి ముహూర్తం నిర్ణయించే హక్కు కూడా దశరథుడికి లేదు.

ఎటునుంచి చూసినా ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానం దొరకదు.

ఇక్కడ, భరతుడు స్వయంగా తనకు రాజ్యం వద్దని చెప్పడమే కీలకమైన మలుపు ఈ కథకు !

భరతుడు తనకు రాజ్యాధికారం వద్దనీ, తనకన్నా రాముడే అందుకు యోగ్యుడనీ, ఒకవేళ రాముడికి రాజ్యం ఇవ్వడానికి తానిక్కడ వుండటం ఇబ్బంది అనుకొంటే, ఈ క్షణానే తప్పుకొంటాననీ భరతుడే స్వయంగా అన్నాడు.

ఎవరైనా ఇలా అంటారా...? అలా అనడం ద్వారా భరతుడు మాత్రం పితృవాక్య పరిపాలనకు విఘాతం కల్గించినవాడు కాలేదా ... అనే సందేహాలు కూడా మనకు కలుగుతాయి.

దశరథుడు కూడా ఈ విషయంలో పెద్ద తర్కంలో కూరుకుపోయాడు. ఏది ధర్మమో, ఏది అధర్మమో తేల్చుకోలేని స్థితిలో పడిపోయాడు.

కైక వరంవలన భయం దశరథుడికి ముందే వుంటే, పాయసాన్ని కౌసల్య, సుమిత్రలిద్దరికే ఇచ్చి ఊరుకునేవాడు కదా ! అందుకే, కేవలం 'పావు' భాగమే ఇచ్చివుంటాడు కూడా.

పెళ్ళినాడు కైకకిచ్చిన మాట వ్యక్తిగతం.

రామపట్టాభిషేకం అనేది ప్రజల కోరిక ! ప్రజాభిమానానికే మొగ్గుచూపడానికి నిర్ణయించుకున్నాడు - అసత్య దోషాన్ని భరించకతప్పదనుకొంటూ దశరథుడు !

అందుకే ముహూర్తం కోసం హడావిడి చేశాడు -

**విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః**
**తావదేవాఽభిషేకస్తే ప్రాప్తకాలో మతోమమ ॥**

శ్రీరాముని పిలిచి స్పష్టంగా చెప్పాడు -

"తాత కేకయరాజు గారి ఇంటికి వెళ్ళిన భరతుడు తిరిగివచ్చే లోగా నీకు అభిషేకం జరగాలి"- అని !

రాముడు తటపటాయించాడు - భరతుడి రాజ్యాన్ని తాను అన్యాక్రాంతం చేస్తున్నానేమోననే శంక ఆయనది ! దశరథుడు అలాంటి అనుమానాలేవీ పెట్టుకోవద్దని నచ్చచెప్పాడు.

**"కామంఖలుసతాం వృత్తే భ్రాతా తే భరతః స్థితః**
**జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేన్ద్రియః"**

రామభద్రా ! నీ వెనకాలే నడిచే నీ అనుచరుడు, ధర్మం తెలిసినవాడు, దయాశీలుడు, జితేంద్రియుడూ అయిన మన భరతుడు. "జ్యేష్ఠుడే రాజ్యానికి అర్హుడు" అనే పెద్దల మాటల మీద "కామంఖలు స్థితః" అత్యంత నిశ్చయంగా వున్నాడు- భరతుడే స్వయంగా నిన్నే అభిషిక్తుణ్ణి కావలసిందిగా చెప్పివెళ్ళాడు - అని వివరించాడు దశరథుడు.

తానక్కడ వుంటే రాముడు అభిషిక్తుడు కావడానికి అంగీకరించడని భరతుడు ముందుగానే తప్పుకొన్నాడు. ఇదంతా రాణులకు తెలిసే జరుగుతోందా... అని ఆలోచిస్తే అంతఃపురం దాకా చేరని సమాచారం అనే అనుకోవాలి. ఎందుకంటే రామపట్టాభిషేక వార్త వినగానే మొదట సంతోషం ప్రకటించింది కైకే కాబట్టి. ఆ తర్వాతే మంథర రంగప్రవేశంతో కథ మరో మలుపు తిరిగింది. రాముడి పట్టాభిషేకం జరిగిపోయిందని తెలిసేవరకూ తిరిగి అయోధ్యకు రానని వెళ్ళిపోయాడు భరతుడు. ఇదే భరతుడు లేకపోవడానికి కారణం. "రామభద్ర ! ఈ అభిషేకం ఇప్పుడే దేనికి - తర్వాత చేసుకోకూడదా... అని అనకు - ఎందుకంటే, మనుషుల చిత్తం చాలా చంచలంగా వుంటుంది-" అంటాడు దశరథుడు రాముడితో !

**కింను చిత్తం మనుష్యాణా మనిత్య మితి మే మతమ్**
**సతాం చ ధర్మ నిత్యానాం కృతశోభిచ రాఘవ ॥**

"ధర్మనిరతుల చిత్తం జరిగిపోయిన మంచి వలన శోభిస్తుంది" అంటాడు దశరథుడు. ఇలా అనడంలో చాలా అంతరార్థాలున్నాయి.

భరతుడు ధర్మమూర్తి కాబట్టి నీకు పట్టాభిషేకం జరిగితే సంతోషిస్తాడు అనడం ఒకటి - ఏమో... ఏం చెప్పగలం... రేపు ఎవరి ఆలోచనలు ఎలా వుంటాయో... అనే సందేహం కూడా ఆయన భాషలో వుంది !

ఒకటి మాత్రం వాస్తవం...

భరతుణ్ణి ఏదో బుజ్జగించి, మాయమాటలు చెప్పి గిరివ్రజంలో తాతగారింటికి పంపించి గుట్టుచప్పుడు కాకుండా దశరథుడు రామపట్టాభిషేకం చేస్తున్నాడనే అభిప్రాయం చాలామందికి కల్గింది ! ముఖ్యంగా శ్రీరాముడికి ఇది నచ్చినట్లు లేదు.

**"కేకయ భూతలాధిపతికిన్ జనియించియు నీచబోధముల్**
**గైకొని లోకనింద కొడిగట్టితివా రఘురాము రాజ్యల**

క్ష్మీకర పంకజ గ్రహణ కేళికి విఘ్న మొనర్చి దుష్టమా
యాకృతివై చరించు పతిహంత్రివి తల్లివె నీవు రాక్షసీ !"

అని నిందించిన భరతుడి నిజాయితీని దశరథుడు కూడా సరిగా అర్థం చేసుకోలేదనిపిస్తుంది.

1. దశరథుడు స్వయంగా నిర్మించిన రాజ్యసభ నిర్ణయానికి ఆయన బద్ధుడు.
2. ప్రజాభిమానం, వారి అభిప్రాయాలకు అనుగుణంగా నడుచుకోవడం కూడా రాజుగా దశరథుడి బాధ్యత.
3. రామ పట్టాభిషేకం అన్యాయం అయ్యేట్లయితే ప్రజా ప్రతిఘటన, రాజ్యసభ వ్యతిరేకతలుండేవి కదా !
4. ఇంత జరిగినా రాణివాసానికి, రామపట్టాభిషేక ప్రయత్నాల కబురే చేరకుండా వుంటుందా !

అంతా పరిశీలిస్తే ఒకటి అర్థం అవుతుంది. మౌలికంగా రామ పట్టాభిషేకానికి కైకతోసహా, భరతుడి దగ్గరనుంచీ అందరూ అంగీకరించిన విషయమే ! మేనమామగారు వచ్చి భరతుణ్ణి పంపమని అడిగిన తర్వాత - దశరథుడుకి ముందుజాగ్రత్తగా ఇతను తిరిగిరాక ముందే రాముడికి అప్పటికప్పుడు రాజ్యాభిషేకం పూర్తిచేస్తే మంచిదనిపించింది. ఎందుకంటే క్షణభంగురములు కదా... మనుషుల చిత్తములు... అని !

ఈ వ్యవహారంలో ఇంకొంత 'స్పష్టత' వుండివుంటే బావుండేది- అనేది రాముడి అభిప్రాయంగా కన్పిస్తుంది. అందుకే ఆయన పట్టాభిషేకానికి అంగీకరించినట్లు సూటిగా కన్పించదు - తటపటాయిస్తున్నట్లే అనిపిస్తుంది. ఇంతలో వచ్చిన అరణ్యవాసం తన శక్తిని ప్రదర్శించడానికి మరో అవకాశంగా భావించుకున్నాడాయన !

# లక్ష్మణుడి నిర్వేదం

సీతారామలక్ష్మణుల్ని, మంత్రి సుమంతుడినీ గుహుడు శృంగిబేరపురానికి చేర్చాడు. వనవాస నియమం ప్రకారం నేను పట్టణంలోకి రాలేనన్నాడు రాముడు. సీతారాముల్ని చూడాలని వచ్చిన పురజనం ఆ దివ్యమంగళ విగ్రహాల్ని చూసుకొని సంతృప్తిచెంది వీడ్కోలు చెప్పి ఇళ్ళకు వెళ్ళారు.

నదీతీరంలో ఒక పెద్ద శింశుపావృక్షం దగ్గరికి సీతారామలక్ష్మణుల్ని తీసుకువెళ్ళి అక్కడ విశ్రాంతి తీసుకోమన్నాడు. దర్భలు, తుంగ మొక్కలు తీసుకొని అప్పటికప్పుడు మెత్తటి పడకలు ఏర్పాటు చేశాడు. అందరూ కందమూలాలు తిని పడుకున్నారు. సుమంతుడిని కూడా పడుకోమన్నాడు లక్ష్మణుడు. తాను ఆయుధాలు పుచ్చుకొని కాపలాకాస్తూ కూర్చున్నాడు.

అప్పుడు గుహుడు నెమ్మదిగా లేచి లక్ష్మణుడి దగ్గరకొచ్చి కూర్చున్నాడు. అతని కళ్ళవెంబడి నీళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. దుఃఖంతో గొంతు మూసుకుపోతోంది. ఎందుకు విచారిస్తున్నావని అడిగాడు లక్ష్మణుడు. "అంతటి గొప్ప వారు... మీరు" ఇలా ఎలా అయ్యారా... ? అని బాధపడ్తున్నాను. పాలనురుగులాంటి తెల్లటి మెత్తటి దుప్పటి మీద గొప్ప మందిరాలలో పడుకొనే మీరు ఇలా కుశపల్లవ పర్యంకాల మీద పడుకోవాల్సి వచ్చిందికదా అని !" అన్నాడు. "దీనంతటికి ఆ కైకే కారణం" అన్నాడు కోపంగా !

అప్పుడు లక్ష్మణుడన్నాడు - "నిషాదపతి ! మనకొచ్చే కష్టాలన్నింటికీ ఎవరో కారణం అనుకోవడం పొరబాటు. ఎవరి కర్మఫలాన్ని వాళ్ళు అనుభవిస్తున్నారంతే. ఈ సుఖదుఃఖాలు, ఆచారవ్యవహారాలన్నీ మాయారచితాలే! వాస్తవాలు కావు. నిద్రపోయేవాడు కలకంటాడు. ఆ కలలో బిచ్చగాడు ధనవంతుడైనట్టు, ధనవంతుడు బిచ్చగాడైనట్లు వుంటుంది. తెల్లారి నిద్రలేచిన తర్వాత అంతా మిథ్య ! ఏమీ వుండదు. మన జీవితాలు కూడా అంతే" అన్నాడు. "ఇంతదానికి ఎవరో కారణం అని తిట్టడం దేనికి..." అని సర్దిచెప్పాడు. గడవనున్న రోజుల గురించి లక్ష్మణుడు ఎంత గుండె దిటవు చేసుకున్నాడో ఈ సంభాషణ ద్వారా అర్థం అవుతుంది !

# శూర్పణఖతో రాముడి పరిహాసం

పరిహాసాలు ఒక్కోసారి కొంపలు ముంచుతాయి. అందులోనూ రాక్షస ప్రవృత్తి కల్గిన వ్యక్తులతోనూ, ముఖ్యంగా స్త్రీలతోనూ పరిహాసాలు రాముడంతటి వాడినే పెద్దగా దెబ్బతీశాయి.

శూర్పణఖ చక్కగా అలంకరించుకొని వచ్చి, రాముణ్ణి కోరి వచ్చి నేరుగా అడిగేసింది. రాముడు కూడా అంతే సూటిగా, "కాదు-కుదరదు"- అంటే దాని దారిన అది పోయేదో- లేకపోతే ఏమయ్యేదో - వేరే సంగతి -

"ఈ సీత నీకెందుకు ? నాకు భర్తగా వుండు - నిన్ను, నీ తమ్ముణ్ణి కలిపి తినెయ్యాలని వుంది" అని శూర్పణఖ **"అనేన సహతే భ్రాత్రా భక్షయిష్యామి మానుషీమ్"** అన్నప్పుడు రాముడు 'భక్షయిష్యామి' తినెయ్యాలని వుంది అనే మాటలోని కామపరమైన వ్యంగ్యార్థాన్ని తీసుకొని సరదాగా నవ్వాడు.

**"శ్రీమానకృత దారశ్చ లక్ష్మణో నామ వీర్యవాన్ - అపూర్వీ భార్య యా చార్థీ..."** అన్నాడు పరిహాసం ఆడుతూ.

"నన్నేం తింటావులే - నాకు ఓ భార్య వుంది. అక్కడ మా తమ్ముడున్నాడు. వెంట భార్య లేకుండా వంటరిగా వున్నాడు. ఆ తినేదేదో అతన్ని తిను" అన్నాడు. "అకృత దారశ్చ లక్ష్మణః" అనే మాటకు ఇదే అర్థం.



నాకు సీత వుంది కాబట్టి నా భార్యగా వుంటే నీకు సవతి పోరు వుంటుంది. లక్ష్మణుడికి భార్య దగ్గర లేదు కాబట్టి, ఆ సవతి పోరు కూడా వుండదంటూ గలగలా నవ్వాడు.

శూర్పణఖ ఎంత కామోద్రేకంతో వచ్చిందో రాముడు అంతగా ఆమెను ఆటపట్టించాడు. కోరివచ్చిన ఆడదాన్ని ఛీకొట్టి అవమానించి పంపడం మంచిది కాదని ఇలా పరిహాసాలాడుతూ సున్నితంగా తిరస్కరించడం రాముడి ఉద్దేశ్యం కావచ్చు. పైగా ఈ సంభాషణంతా పక్కన కూర్చుని వింటూ సీత కూడా ఆనందిస్తోందన్న విషయం మరచిపోకూడదు.

కానీ, చివరికి జరిగింది అదే... లక్ష్మణుడు దాని ముక్కూ, చెవులూ కోసి అవమానించి పంపడమే జరిగింది. దాని పర్యవసానంగా ఎంత కథ నడిచిందో తెల్సిందే కదా ! ముక్కర పెట్టుకోడానికి వీల్లేకుండా లక్ష్మణుడు దాని ముక్కుని అర (1/2) చేశాదని వర్ణించాడు రామాభ్యుదయ కావ్యంలో అయ్యలరాజు రామభద్రుడు.

# సీతాపహరణం ఇలా జరిగింది !

దండకారణ్యంలో పంచవటి !

సీత ఏకాంతంగా ఒక్కతే భయంభయంగా, బిక్కుబిక్కుమంటూ, చాలా ఖంగారుగా బైటే నిలబడి రామలక్ష్మణులకోసం ఎదురుచూస్తోంది.

రాముడేమయ్యాడో తెలీదు.

వెదుకుతూ వెళ్ళిన లక్ష్మణుడు కూడా ఏమయ్యాడో తెలీదు - క్షణమొక యుగంగా అక్కడే నిలబడి వుంది.

అంతలో, సన్యాసి రూపంలో వచ్చాడు రావణుడు.

సీతను చూశాడు. నమస్కరించింది సీత ! వచ్చింది ఎవరైనా మునిరూపం కాబట్టి ఆ రూపానికి నమస్కారాలు చెప్పింది –

ఋషిపుంగవుడిలానే మాట్లాడాడు రావణుడు.

ఆమె ఎవరు – ఎవరి కూతురు, ఎవరి భార్య, ఎవరి కోడలు – ఆమె వయసెంత, ఆమె భర్త వయసెంత... అన్ని వివరాలూ అడిగాడు – అన్నింటికి ఓపిగ్గా సమాధానం చెప్పింది – తాను అపహరించి తీసుకువెళ్ళవలసిన వ్యక్తి ఈమేనని నిర్ధారించుకొన్నాడు రావణుడు !

పరమ రాక్షసంగా వికటాట్టహాసం చేస్తూ, మునివేషం పీకి పారేసి తన అసలు స్వరూపంతో ఆమె ఎదుట నిలబడ్డాడు.

అతణ్ణి చూస్తూనే భయంతో వణుకుతూ కెవ్వున అరిచింది సీత.

ఆమెకు తల తిరిగినట్లయ్యింది. నేలమీద వాలిపోయింది.

ఆ హఠాత్పరిణామానికి ఆమెకు మూర్ఛ వచ్చింది – స్పృహతప్పి పడిపోయింది. విరిగిపడిన అరటి చెట్టులా నేలకూలింది సీత.

రావణుడు రెండు చేతుల్ని ఉపయోగించాడు. తన కుడిచేతిని ఆమె మోకాళ్ళకిందకి పోనిచ్చి, ఎడం చేతిని మెడకింద వుంచి ఆ పవిత్ర సాధ్వీమణిని లేపి తీసుకుని అమాంతం ఆకాశవీధిలోకి ఎగిరి వెళ్ళిపోయాడు.

లక్ష్మణరేఖ కథ, రావణుడు ఆ గీతని దాటలేకపోవడం, సీతను మట్టిబెడ్డలతో సహా పెకలించుకొని రావణుడు విమానంలో వెళ్ళడం... ఇలా చాలా రామాయణాలలో అనేక రకాల వర్ణనలున్నాయి. రావణుడు సీతని ఎత్తుకువెళ్ళాడు! ఎత్తుకు వెళ్ళాడు – అంటే ఎత్తుకొని వెళ్ళడమే !

రావణుడు సీతని ముట్టుకున్నాడు కాబట్టి ఆమె పాతివ్రత్యం చెడిందనే వాదన చేస్తూంటారు కొందరు. అందుకనే, సీతలాంటి పునీతని తాకితే దహించుకు పోతానని రావణుడు సీతతో సహా భూమిని పెళ్ళగించి తీసుకుపోయాడని చెప్తుంటారు. ఆమెను తాకడానికే సాహసం చెయ్యలేని రావణుడు ఆమెని వాంఛించి, లొంగదీసుకోవాలని చూడడం చాలా వింతగా అనిపిస్తుంది.

# రావణ చెరలో విలవిలలాడిన సీత

రావణుని బారి నుండి తప్పించుకు పారిపోవడానికి సీత పెనుగులాడ్తున్నప్పుడు - చెట్లు యముడైన రావణుని చూసి యయోద్విగ్నాలై దూరం దూరంగా జరిగాయట. అడుగునిడ ధర నిలువదు - అంటాడు విశ్వనాథ వారు ఈ దృశ్యాన్ని వర్ణిస్తూ కల్పవృక్షంలో.

అడవి అడవి గిరగిరా తిరుగుతోంది. ఆ చలనంలో కూడా ఒక క్రమం కనిపించడం లేదు.

ఆకాశం నీరవమై, నిశ్చలానిలమయి బావురుమంటోంది.

సానుభూతి వున్నచోట కూడా దైవీశక్తులకు అనుకూలంగా వుండవలసి వస్తుంది - ప్రకృతి - మృత్యువుతో సమానమైన గాఢ తమస్సు విజృంభించినప్పుడు జరిగే అపకారం ఇదంటారు విశ్వనాథ ! పోతన గారు చెప్పిన పెంజీకటి అంటే ఇదే !

"దుష్ట సర్పాస్వలగ్న దర్దుర శిశువలె కీచుమనె సీత - నా కుసంకేత భుజగియోర్తు లజ్జాశ్లథ పరీభవో గ్రశిరసునొక శిలాస్థలి వేసికొట్టికొని చచ్చె"

సీతాపహరణం జరుగుతున్నప్పుడు ప్రకృతి తల్లడిల్లింది - పుట్టలో పాము సిగ్గుతో విలవిల్లాడి రాయికి తలని బాదుకొని మరణించిందట ! సీతామాత పరాభవానికి తల్లడిల్లిన ప్రకృతి వైనం ఇది ! విశ్వనాథ వారి వర్ణనా చమత్కృతికి ఇది నిదర్శనం.

# రావణుడు సీతను అపహరించి అశోకవనంలో ఎందుకుంచాడు ?

సీతని అశోకవనంలో విడిచిపెట్టాడు. ఇంట్లో అట్టేపెట్టుకునే ధైర్యం రావణాసురుడికి లేకపోయింది. సీతని ఇంట్లో వుంచితే ఎదురుగా కనిపిస్తూ వుంటుంది. ఎదురుగా ఆవిడ



కనిపిస్తే రావణుడికి చపలత్వం ఆగదు. బలాత్కారం చెయ్యాలనే ఆలోచన వస్తుంది. బలాత్కరిస్తే వెంటనే తలపగిలి చచ్చిపోతాడు. ఇది కుబేరుడి శాపం. అందుకని ఇంట్లో పెట్టకుండా దూరంగా ఒక తోటలో వుంచి, మధ్యమధ్యలో బెదిరిస్తూ వుండాలనుకున్నాడు. తన బెదిరింపులకి భయపడి సీత తనంత తానుగా లొంగివస్తుందని ఆశించాడు !

బ్రహ్మదేవుడు ఇదంతా గమనించాడు. దేవేంద్రుణ్ణి పిలిచి, "ఈ క్షీరాన్నం తీసుకెళ్ళి సీతకు రహస్యంగా అందించు. దీన్ని తింటే, ఇంక ఆకలి, దాహం వుండవని చెప్పు"- అని పరమాన్నం ఇచ్చి పంపించాడు.

దేవేంద్రుడు ఆ రాత్రి, దేవమాయ సహాయంతో అందరికీ నిద్ర వచ్చేలా చేసి, జానకి దగ్గరకు వెళ్ళి, నమస్కరించి తన పేరు చెప్పుకొని పరమాన్నం ఇచ్చాడు. దేవేంద్రుడు తాను నిజంగా దేవేంద్రుడేనని నమ్మించడానికి చాలా తంటాలుపడ్డాడు. ఎప్పటికో నమ్మి ఆమె ఆ పరమాన్నం తిన్న తర్వాత దేవేంద్రుడు వెళ్ళిపోయాడు.

కపట మృగాన్ని వేటాడుతూ వెళ్ళిన రాముడి రూపాన్నే ధ్యానిస్తూ సీత అశోక వృక్షం క్రింద కూలబడిపోయి వుంది !

# కబంధుడి కథ

"చివరకు రామలక్షణులె సీవిరి కల్వలు మంచుతుంపురుల్
చివురులు ముగ్ధ సంచర మషీర సమీర కుమార మూర్తులం
ధువు పెనులోతు త్రవ్వినను నూత్కొను కొబ్బరి పాలవంటి న
రవిరిసిన క్రొత్త పెద్ద జలవై చనుదెంచితి రీరు మీరలై"

విశ్వనాథ సత్యనారాయణగారు రామాయణ కల్పవృక్షంలో కబంధుడు తన భుజాల్ని నరుకుతోన్న రామలక్ష్మణులతో అన్నమాటలుగా ఈ పద్యాన్ని వ్రాశారు.

రామలక్ష్మణులు కబంధుడి భుజాలు నరుకుతుంటే, వాడికి చల్లగా, హాయిగా వుందిట... వాళ్ళు కలువ పూవుల్లా, మంచు తుంపరల్లా, మావి చిగురుల్లా వున్నారట ! ముగ్ధ సంచర మషీర సమీర కుమారమూర్తులుగా వున్నారట !

నుయ్యి తవ్వీ తవ్వీ విసిగిపోయిన రైతు, చివరిసారిగా ఒక్క దెబ్బ బలంగా వేసి పలుగు పైకిలాగగానే రివ్వున చిమ్మిన జలధార ఎంత సంతోషాన్నిస్తుందో కదా... ఆ రైతుకి అలా కొబ్బరి పాలలాంటి పెద్ద'జల'లాగా మీరిద్దరూ వచ్చారంటాడు. మీరు మీరుగా వచ్చారని మెచ్చుకొంటాడు.

మీరు దేవుడిలా వచ్చారని మెచ్చుకుంటాడు ఎవడైనా తన కృతజ్ఞత చెప్పుకోవడానికి! కానీ, శాపవిమోచనం పొందిన కబంధుడు రామలక్ష్మణుల్ని మీరు మీరుగా వచ్చారనడమే విశ్వనాథ రచనలో చమత్కారం. మీరు దేవతలు. దేవతలైన మీరు దేవతల్లాగా వచ్చారని అతని భావన కావచ్చు.

రామలక్ష్మణులు దేవతా స్వరూపుల్లా కన్పించారన్నది ముఖ్యం. మానవ స్వరూపంలో తిరుగుతున్న రామలక్ష్మణులు కబంధుడికి దేవతల్లా కన్పించడానికి ఒక కారణం వుంది. అదే అతని శాప వృత్తాంతం కథ !

కబంధుడు బాగా డబ్బున్న ఒక గంధర్వుడు. సహజంగా గర్విష్టి. వాడికి మనుషులంటే చాలా చిన్నచూపుగా వుండేది. ఒక వెన్నుపాముకి రెండు కాళ్ళు, రెండు చేతులూ, ఒక తలకాయ వ్రేలాడుతుంటాయి... మనిషి అంటే అంతే కదా... అనేది వాడి అభిప్రాయం... గడ్డిబొమ్మకీ, మనిషికి తేడా ఏమీ ఉండదని హేళనగా మాట్లాడుతూ ఉండేవాడు.

స్థూలశిరుడనే ఒక ఋషి ఎక్కడో తపస్సు చేసుకొంటూవుంటే ఆయనకు తపోభంగం కలిగించి... దిష్టిబొమ్మ నెత్తిన కుండలాగా, ఆ తలకాయి ఏమిటీ... పెద్దగా బలిసిన ఆ పొట్ట ఏమిటీ ... ఆ స్వరూపం ఏమిటీ... అంటూ ఆ ఋషిని వేళాకోళం ఆడాడు. దాంతో కోపం వచ్చి, ఆ ఋషిగారు కబంధుణ్ణి నీక్కూడా అలాంటి రూపమే వస్తుందిలే అన్నాడు. వెకిలిగా నవ్వాడు కబంధుడు. కబంధుడి అతిశయం అక్కడితో ఆగలేదు.

బాగా పొగరెక్కి వుండడం వలన, మరణం లేదనే వరం వుండడం వలన ఒకరోజు ఇంద్రుడి వజ్రాయుధానికి అడ్డంగా తలకాయపెట్టి, "ఏం చెయ్యగలవు నన్ను...?" అంటూ రెచ్చగొట్టాడట...



ఇంద్రుడు వజ్రాయుధం పిడితో నెత్తిన ఒక గుద్దు ఇచ్చేసరికి తలకాయ పొట్టలోకి కుంగిపోయింది. కాళ్ళు విరగ్గొట్టి తొడల్లోకి కుదించాడట. బ్రహ్మ తనకు చావులేదని వరం ఇచ్చాడు గానీ, కాళ్ళు, తలకాయ పోవని వరం ఇవ్వలేదు కదా...

కబంధుడి పరిస్థితి కదల్లేనిదయ్యింది. ఆకలికి ఆగలేడు, ఆహారాన్ని సంపాయించు కోలేడు. ఇంతకన్నా చచ్చిపోవడమే సుఖం కదా... అన్పించింది వాడికి. చావు రాదాయే ! ఆకలి తీరే ఉపాయం ఏమిటని బతిమాలి అడిగాడు. అప్పుడు ఇంద్రుడు వాడికి ఒక వరం ఇచ్చాడు - "నీ రెండు చేతులూ యోజనం దూరం పెరుగుతాయి. అందిన జంతువుని అందినట్లు తిను"- అని! శాపవిమోచనం అడిగితే, "రామలక్ష్మణులు వచ్చి నీ చేతులు నరికి విమోచనం కల్గిస్తారు"- అని చెప్పాడు ఇంద్రుడు.

ఆ రోజు నుంచీ కబంధుడు రామలక్ష్మణులకోసం ఎదురుచూస్తున్నాడు. వాళ్ళు ఏ రూపంలో వుంటారో కూడా వాడికి తెలీదు. అందుకని చేతికి అందిన ప్రాణిని అందినట్లు పట్టుకొంటున్నాడు. వాళ్ళలో ఏ ప్రాణీ వాడి భుజాల్ని నరకడం లేదు. దాంతో వాడికి కోపం వెర్రెత్తిపోతోంది. కసిగా ఆ ప్రాణిని చంపేస్తున్నాడు. ఇలా రోజులు గడిచిపోతున్నాయి. ఎన్ని సంవత్సరాలు గడిచాయో వాడికే తెలీదు. రామలక్ష్మణులకోసం ఎదురుచూస్తూనే వున్నాడు.

చివరికి కబంధహస్తాలకు రామలక్ష్మణులు చిక్కారు. భుజాలు నరికారు. వాడికి శాపవిమోచనం అయ్యింది. తన నిజ స్వరూపంలోకి వచ్చాడు. మొదటిసారిగా దివ్య సుందర రూపులు రామలక్ష్మణుల్ని చూశాడు. మనుషులంటే వాడికి చాలా చిన్నచూపు కదా... మనుషులైతే ఇంత సుందరంగా వుండరు కాబట్టి వీళ్ళు దేవతా స్వరూపులే అనుకున్నాడు. దేవుడిలా వచ్చి తనకు శాపవిముక్తి కల్గించారు కాబట్టి, దేవుళ్ళు దేవుళ్ళలా వచ్చారు అనే అర్థంలో "మీరు మీరైవచ్చారు" అన్నాడు. అలా కబంధుడిచేత అన్పించడంలో విశ్వనాథవారి కవితాశక్తి ఇమిడివుంది !

# శబరి చెప్పిన రావణుడి ఆచూకీ

శ్రీరాముడు తనను ఆదరించిన శబరికి సద్గతులు కలుగుతాయని చెప్పాడు. శబరినీ, శబరి మహిమనూ స్మరించిన వాళ్ళకి కూడా సద్గతులు ప్రసాదించాడు.

"శబరీ ! సీత గురించిన సమాచారం ఏదైనా విన్నావా?"- అనడిగాడు రాముడు. అప్పుడు శబరి తన అనుమానం రావణుడి మీదేనని చెప్పింది. అందుకు ఆధారంగా మాతంగ మహాముని చెప్పిన ఒక కథని రాముడికి వివరించింది.

రావణుడు మహాబలవంతుడు. అంతే కామార్తుడు కూడా ! ఒకరోజు అతను విమానం ఎక్కి వెడ్తుంటే, అడవిలో ఒకచోట ఓ అందమైన కన్నెపిల్ల తపోదీక్షలో వున్నది




కన్పించి, నేలమీదకి దిగాడు. ఆమె తపస్సు భంగపరచి ఆమె గురించి అడిగాడు. ఆమె రావణుణ్ణి చూసి భయపడుతూ తన కథ చెప్పింది.

ఆమె తండ్రి కుశధ్వజుడు. ఆయన బ్రహ్మర్షి. వేదాధ్యయన సంపన్నుడు. ఆయన వేదమంత్రాలు ఉచ్చరిస్తున్నప్పుడు ఆమె పుట్టింది కాబట్టి ఆమెకి "వేదవతి" అని పేరు పెట్టారు. ఆమెని విష్ణుమూర్తికిచ్చి పెళ్ళిచేయాలని సంకల్పించాడు. కానీ, శంభుడనే రాక్షసుడు వచ్చి వేదవతిని తనకిచ్చి పెళ్ళిచేయాలని పట్టుబట్టాడు. కుశధ్వజుడు అందుకు ఒప్పుకోలేదు. దాంతో శంభుడు ఆ బ్రహ్మర్షిని చంపేశాడు. ఆమె తల్లి సహగమనం చేసింది. వంటరిగా మిగిలిన వేదవతి తన తండ్రిమాట నిజంచేయడం కోసం విష్ణువుని ఉద్దేశించి తపస్సు చేస్తోందిట... ఆ సంగతి చెప్పి తనజోలికి రావద్దని రావణుణ్ణి వేడుకొంది !

అది విని రావణుడు బిగ్గరగా నవ్వాడు. "ఎక్కడో వున్న విష్ణువు కోసం ఏం పాటుపడతావు ? అంతకన్నా గొప్పవాణ్ణి, మూడు లోకాలకు అధిపతిని - నన్ను పెళ్ళి చేసుకో"- అని ఆమె చెయ్యి పట్టుకొన్నాడు. పదునైన కత్తిని పట్టుకుంటే తెగినట్లు వేదవతిని తాకగానే అతని వేలు తెగి నెత్తురు కారింది.

"రావణా ! ఈ క్షణాన నిన్ను నాశనం చేయగల శక్తి నాకుంది. కానీ, నీలాంటి అల్పుడికోసం నా తపశ్శక్తిని వృథా చేసుకోలేను. నేను మళ్ళీ పుట్టి అయినా సరే నీ చావుకు కారణం అవుతాను"- అని అగ్నిగుండాన్ని సృష్టించుకొని అందులో దూకి మరణించింది వేదవతి !

శబరి ఈ కథని వివరించి, ఏనాడో మాతంగముని నాకు చెప్పిన రహస్యం ఏమంటే ఆ వేదవతే సీతగా పుట్టింది- ఈమె రావణుడి మరణానికి కారణం అవుతుంది అని ! రావణుడు తన "చావు"ని ఇలా ఎత్తుకెళ్ళాడు... అంతే !! అంది.

## కొరికిన ఎంగిలి పళ్ళు పెట్టిందా శబరి ?

కబంధుడి శాపవిమోచనం తర్వాత రాముడికి చాలా విషయాలు చెప్పాడతను. అతని సూచన మీద మాతంగ మహర్షి శిష్యులైన కొందరు ఋషులకు సేవలు చేసుకొంటూ, నిరంతర తపస్సులో జీవిస్తున్న 'శబరి' అనే వృద్ధురాలి ఆశ్రమానికి వెళ్ళారు రామలక్ష్మణులు.

ఆ సిద్ధురాలు రామలక్ష్మణుల పాదాలకు నమస్కరించింది. రాముడు ప్రేమతో ఆ వృద్ధతాపసిని పలకరించాడు. పలకరించడానికి విషయాలు ఏముంటాయి. మీ తపస్సు సక్రమంగానే సాగుతోందా... మీ తపస్సులకు కావలసిన ఆహార నియమాలకు తగ్గ పళ్ళు, ఫలాలన్నీ చక్కగా దొరుకుతున్నాయా... అని పలకరించాడు **"కచ్చిత్తే వర్ధతే తపః ।"** అని ! వృద్ధ తాపసి, సిద్ధ సమ్మత, ధర్మ సంస్థితురాలు అయిన శబరి రాముడితో ఇలా అంది...

ధర్మజ్ఞులు, పూజ్యులు అయిన మహర్షులు ఏనాడో నాకు చెప్పారు... "ఆగమిష్యతి తే రామః సుప్రుణ్య మిమ మాశ్రమమ్." "నీ ఆశ్రమానికి రామలక్ష్మణులు వస్తారు. వాళ్ళకి నువ్వు చక్కని ఆతిథ్యం ఇవ్వూ..." అని.



ఈ వనంలోకెల్లా తియ్యని పళ్ళను ఏరికోరి, మీ కోసం తెచ్చి దాచి వుంచాను - రకరకాల ఫలాలు - బాగా తియ్యగా వున్నాయని అనిపించిన ఫలాల్నే తినిచూసి మరీ ఏరుకొచ్చి మీ కోసం అట్టేపెట్టాను - అంది శబరి.

వనంలో అనేకరకాల ఫలాలు తినిచూసింది శబరి. వాటిలో బాగా తియ్యగా వున్న ఫలాల్ని ఎంచుకొని తెచ్చిందనే వాల్మీకి రాశారు. కొరికి, సగం తిని, మిగతా సగం రామలక్ష్మణులకు పెట్టినట్లు రాయలేదు. వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు శ్రీమద్రామాయణ తత్త్వ కథనంలో ఈ కొరుకుడు కథ రామాయణంలోకి ఎలా ప్రవేశించిందో తెలియదన్నారు.

# వానర స్నేహం శబరి సలహాయే !

"రామా ! ఇప్పుడు విచారిస్తూ కూర్చోవడం మంచిదికాదు. గుండె దిటవు చేసుకోండి. సీతని వెదకడం మొదలుపెట్టండి. ఆమెకు రావణుడు ఏ విధమైన హానీ తలపెట్టలేదు. తనంతగా తాను లొంగివచ్చేందుకు ఎక్కడో దాచిపెట్టివుంటాడు. ఆ స్థలం మనం కనుక్కోవాలి. అందుకు మీకు ఈ అడవులతో బాగా పరిచయం వున్న వ్యక్తుల సహకారం అవసరం.

మీరు తిన్నగా పంపానదీతీరానికి వెళ్ళండి. అక్కడ గొప్ప గొప్ప మునీశ్వరులున్నారు. అక్కడ నివసించే వాళ్ళకి నిత్యం సుఖశాంతులుండే విధంగా మాతంగముని వరం ఇచ్చాడు. అక్కడి ఋషులని మీరు కలుసుకోండి. వాళ్ళు చాలా సాయపడ్తారు.

అక్కడ సుగ్రీవుడనే రాజు వున్నాడు. అతనితో స్నేహం కలుపుకోండి. ఎంతైనా మేలు చేస్తాడు. రావణ సంహారానికి వీళ్ళు నీకు చాలా అవసరం కూడా ! రావణుడి మరణం - నీ పట్టాభిషేకం జరగాలి" అన్నది శబరి. రామాయణ పాత్రల్లో శబరి ప్రదర్శించిన ఇంత ముందుచూపు తక్కిన వాటిలో కన్పించదు.

శబరి దూరదృష్టికి ఆశ్చర్యపోయాడు రాముడు. రెండు చేతులు ఎత్తి ఆమెకు నమస్కరించాడు. దుఃఖంతో నిండివున్న తన కళ్ళపొరలను తొలగించి, దిశానిర్దేశం చేసినందుకు ఆమెకు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

శబరి శ్రీరాముడి చరణాలకు నమస్కరించి విష్ణులోకాలకు ప్రయాణమై వెళ్ళిపోయింది.

# వాలీ సుగ్రీవుల జన్మరహస్యం

సుగ్రీవుణ్ణి హనుమంతుడు రాముడికి పరిచయం చేశాడు. ఇద్దరూ స్నేహంగా కావులించుకొన్నారు. అప్పుడు సుగ్రీవుడు అతి విచిత్రమైన తమ జననం గురించిన కథని చెప్పడం మొదలుపెట్టాడు.

"ఒకసారి బ్రహ్మదేవుడు తన కంటి పుసిని తీసి గోరుతో నేలమీదకి విదిలించాడట. అందులోంచి ఒక ఆటవికుడైన మానవుడు పుట్టాడు. మహాభయంకర స్వరూపుడైన ఆ మానవుడికి ఋక్షరాజు అని పేరుపెట్టి, ఆ వనంలో ఫలాలు తింటూ, అక్కడున్న రాక్షసుల్ని సంహరిస్తూ జీవించవలసిందిగా ఆదేశించాడు బ్రహ్మదేవుడు.

బ్రహ్మదేవుని ఆదేశానుసారం ఋక్షరాజు పంపాతీరానికి వచ్చి అక్కడ రాక్షసుడనేవాడే లేకుండా చేశాడు. మహర్షులు ఋక్షరాజు కావలిలో సుఖంగా జీవించసాగారు.

ఆ ఋక్షరాజు ఒకసారి ఓ తటాకం దగ్గర వంగి నీళ్ళలో తన ప్రతిబింబం చూసుకున్నాడు. ఆ కన్పించే వ్యక్తి ఎవరో శత్రువనుకొన్నాడు. తటాకం చుట్టూ తిరుగుతూ ఎన్నిసార్లు చూసుకున్నా ఆ వ్యక్తి కూడా అలానే తిరుగుతున్నట్లుగా గమనించాడు. తను ఏం చేస్తే నీళ్ళలో వ్యక్తికూడా అదే చేస్తుండటంతో వాడు తనని రెచ్చగొడ్తున్నాడనుకొని, వాణ్ణి సంహరించడం కోసం తటాకంలోకి దూకాడు. అంతే! అందమైన అమ్మాయి రూపం వచ్చిందతనికి. చక్కని కన్నెపిల్లలాగా ఒడ్డుపైకి వచ్చాడు.

ఆమెని ఇంద్రుడు చూశాడు. సూర్యుడు కూడా చూశాడు. ఇద్దరూ మోహించారు. ఇంద్రుడు వదిలిన వీర్యం వెంట్రుకలమీద పడింది. సూర్యుడు వదిలిన వీర్యం మెడమీద పడింది. ఇంద్రుడి అంశవలన మా అన్న వాలి జన్మించాడు. సూర్యుడి అంశవలన నేను జన్మించాను.

వాలంలోంచి పుట్టి 'వాలి' అయ్యాడు మా అన్న. మెడలోంచి పుట్టి సుగ్రీవుడినయ్యాను నేను" అన్నాడు. సుగ్రీవుడి కథ చాలా ఉత్సాహంగా వుండటంతో రామలక్ష్మణులు ఆసక్తిగా వింటున్నారు.

అప్పుడు బ్రహ్మదేవుడు వాలి, సుగ్రీవులిద్దరిని కిష్కింధ నగరం పాలిస్తూ సుఖంగా బతకమని ఆశీర్వదించాడు.

యజ్ఞయాగాలు చేస్తే గాని బ్రహ్మదేవుడి దర్శనం కాదంటారు. ఇవేమీ లేకుండానే ఆయన్ని మేం ఇద్దరం చూడగలిగాం. మాకదే సంతోషం. అన్నాడు.

వనంలో రాక్షస సంహారం చేయడమే మా విధి. ఇక్కడ రాక్షసులు అడుగుపెట్టకుండా చెయ్యగలిగాం. కానీ, బ్రహ్మదేవుడి వ్యాపారం అలక్షితంగా వుంటుంది. దాన్ని తెలుసు కోవడం కష్టం.

ఒకసారి మయుడి కొడుకు 'మాయావి' అనే రాక్షసుడు మా నగరానికి వచ్చి మమ్మల్ని యుద్ధానికి రమ్మని కవ్వించాడు. శత్రువు పొగరుని ఏమాత్రం సహించని మా అన్న వాలి వాడిమీదకు విరుచుకుపడ్డాడు. దాంతో వాడు తోకముడిచి పారిపోయాడు. వాణ్ణి తరుముకొంటూ వెన్నాడి వెళ్ళాడు. వెనకాల సైన్యం తీసుకొని నేను బయల్దేరాను. వాడు ఒక పర్వత గుహలోకి ప్రవేశించాడు. అప్పుడు వాలి, నువ్వీ గుహద్వారం దగ్గర నిలబడి వుండు. పదిహేను రోజులు చూడు.

నేను తిరిగి రాకపోతే యుద్ధంలో వాడు నన్ను చంపేశాడని అర్థం - అన్నాడు. నేను ముప్పయి రోజులు ఎదురుచూశాను. అన్న తిరిగి రాలేదు. గుహలోంచి రక్తం బైటకు రావడం మొదలయ్యింది. మా అన్న చనిపోయివుంటాడని నేను ఊహించాను. మా అన్ననే చంపినవాడు నన్నుకూడా చంపకుండా వుంటాడా అని నాకు భయం వేసింది. మేమంతా కలిసి ఆ గుహద్వారాన్ని పెద్దరాయితో మూసేశాం. ప్రాణభయంతో నగరానికి పారిపోయి వచ్చేశాం.

మంత్రులు బలవంతంగా రాజ్యాన్ని నాకు కట్టబెట్టారు. అంతా వాలి చనిపోయి వుంటాడనే అనుకున్నాం. కానీ, కొన్నాళ్ళకి మా అన్న తిరిగి వచ్చాడు. నన్ను అపార్థం చేసుకొన్నాడు. నేనిదంతా కావాలని చేశాననుకొన్నాడు. నా సర్వస్వాన్ని తీసుకొని, నా భార్యని అపహరించి నన్ను తరిమేశాడు.

నేను నగరాన్ని వదిలి ఇలా అడవుల్లో తిరుగుతున్నాను. ఈ ఋష్యమూక పర్వతం పైకి రాకూడదని వాలికి శాపం వుంది. అందుకని ఇక్కడకు రాడు. ఆ కారణం వలన మేం ఇక్కడ తలదాచుకొంటున్నాం - అన్నాడు.

సుగ్రీవుడికి రాముడు అభయం ఇచ్చి ఓదార్చాడు. "ఇంకనుంచి నీ బాగోగులు నావి" అన్నంతగా అతనికి ధైర్యం చెప్పాడు.

## "ఋష్యమూక పర్వతానికి వాలి రాడు !"

దుందుభి గొప్ప రాక్షసుడు. మహాబలవంతుడు. వాడు నాకంటే బలవంతుడెవరూ లేరని నిరూపించుకోవాలనుకున్నాడు. ఎవరో సముద్రుడు నీకన్నా గొప్పవాడు అన్నారు. దాంతో దుందుభుడు సముద్రతీరానికి వచ్చి సముద్రుణ్ణి రెండు చేతులతో మథించడం మొదలుపెట్టాడు. సముద్రంలోని కోట్లాది జీవరాశులూ అల్లకల్లోలం అయ్యాయి వాడిదెబ్బకి.

సముద్రుడు భయపడుతూ వచ్చి నువ్వే బలవంతుడివి, నాకన్నా ! ఒప్పుకొంటున్నాను. హిమవంతుడు గొప్ప బలవంతుడని విన్నాను. నువ్వు అతనితో బలం తేల్చుకో - అని చెప్పి ఎలాగోలా దుందుభుణ్ని వదుల్చుకున్నాడు.

దుందుభుడు హిమాలయాల శ్రేణికి వెళ్ళి రెండు చేతుల్తో హిమవంతుణ్ణి అమాంతం పైకెత్తాడు. అప్పుడు హిమవత్పర్వతం దడిసిపోయి, తనకంటే దుందుభే గొప్పవాదని



ఒప్పుకొని, పంపానదీతీరంలో 'వాలి' అనే రాజున్నాడు. అతనితో తేల్చుకోమన్నాడు. దుందుభుడు వాలీ ! వాలీ ! అని అరుచుకుంటూ కిష్కింధకు చేరుకున్నాడు.

వాలి, దుందుభి ఇద్దరూ మహాబలసంపన్నులే. రెండు మదపుటేనుగుల్లా ఆ ఇద్దరూ పోరుకు దిగారు. ఆ ఇద్దరి మధ్య భయంకరమైన యుద్ధం జరిగింది. చివరికి వాలి ఒక పెద్ద పోటు పొడిచాడు. దాంతో గింగిర్లు తిరిగి దుందుభి విరుచుకొని నేలమీద పడిపోయాడు. వాడి మహాశరీరంకింద అనేకమంది పడి నలిగి చనిపోయారు.

వాడి శరీరాన్ని రెండుగా చీల్చి చెరో వైపుకీ విసిరి పడేశాడు వాలి. అలా విసిరేటప్పుడు కొద్ది రక్తపు చుక్కలు ఋష్యమూక పర్వతం మీద ఋషులు తపస్సు చేసుకొనేచోట పడ్డాయి. తమ ఆశ్రమం దగ్గర వర్షంలా కురుస్తున్న రక్తం చూసి, ఇందుకు కారణం అయినవాడు ఎవరైనా సరే, వాడు ఇటువైపు వచ్చినా, ఈ పర్వతాన్ని చూసినా భస్మమైపోతాడని శపించారు. అందుకే వాలి ఋష్యమూక పర్వతం దగ్గరకి రాడు. ఈ రహస్యం ఎవరికీ తెలియదు. అది తెలిసిన సుగ్రీవుడు ఒక్కడే ఇది సురక్షిత స్థావరంగా భావించి అక్కడ తన మనుషులతో నివసించడం మొదలుపెట్టాడు. సుగ్రీవుడు ఋష్యమూకం మీద సురక్షితంగా జీవించడానికి కారణం ఇది !

## రాముడు కూలగొట్టిన ఏడు తాడిచెట్ల కథ

సుగ్రీవుడు రాముణ్ణి మైదానప్రాంతంలో ఒక ఏకాంత ప్రదేశానికి తీసుకెళ్ళాడు. అక్కడ ఒకే వరసలో గీత గీసినట్లు పక్కపక్కనే ఏడు తాడిచెట్లు కన్పించాయి.

సుగ్రీవుడు రాముడితో ఆ తాడిచెట్లని చూడమన్నాడు. "మీరు ఒకే బాణంతో ఈ ఏడు తాడిచెట్లను కూల్చగలరా ?" అనడిగాడు. 'ఇప్పుడంత అవసరం ఏమొచ్చింది?'

ప్రశ్నించాడు రాముడు. "అవసరమే! చాలా అవసరం !! మీరు ఏడు తాడిచెట్లనూ కూలగొట్టి చూపించండి అప్పుడు మీతో అన్ని విషయాలూ చెప్తాను. కానీ ఒక విషయం గుర్తుపెట్టుకోండి - ఈ తాడిచెట్లన్నింటిని ఒకేసారి ఒకే బాణంతో కూలగొట్టాలి. ఇది చెయ్యలేకపోతే వాలి సంహారము జరుగదు, మన స్నేహము నిలవదు. మీ పరిశ్రమ అంతా వ్యర్థమే" అన్నాడు.

రాముడు సుగ్రీవుడి మాటలకు చిన్నగా నవ్వాడు. "వాలి సంగతి సరే! అసలీ తాడిచెట్ల సంగతేమిటీ ?" అని మళ్ళీ అడిగాడు. అప్పుడు సుగ్రీవుడు రాముడుకి చెప్పిన కథ ఇది -

"ఒకరోజు వాలి అడవినించి పూలూ పళ్ళు కోస్తూ కోసిన వాటిని ఒకచోట పేర్చుకొంటున్నాడు. వాటిలో ఏడు తాటిపళ్ళున్నాయి. అన్నింటినీ ఇంటికి తీసుకుని వెళదామనుకొంటుండగా ఒక పాము తాటి పళ్ళమీద కూర్చుని ఆడడం మొదలుపెట్టింది. దాన్ని చూసేసరికి వాలికి చాలా కోపం వచ్చింది. "ఇవి నా పళ్ళు! నా వాటిని ఎందుకు ముట్టుకున్నావు ?" అని అరిచాడు వాలి. కాళనాగు అతని ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. వాలి ఆగ్రహంగా, "బతకాలనుకోవడం లేదా ?" అన్నాడు. నాగుపాము నిర్లక్ష్యంగా ఆడింది. వాలి కోపం రెట్టింపయి, "ఈ క్షణాన నీ శరీరం పగిలిపోయి, అందులోంచి ఏడు తాటిచెట్లు పుడతాయి" అని శపించాడు. అవే ఈ తాడిచెట్లు అని వాలి ఇచ్చిన శాపం కథ వివరించాడు సుగ్రీవుడు. నాగుపాము మెలికలు తిరిగినట్లే వున్నాయి ఆ ఏడు తాడిచెట్లు.

"ఆ నాగుపాము తక్షకుడి కొడుకు. చిన్నతనం చేష్టలతో వాలిని నిర్లక్ష్యం చేసి శాపగ్రస్థుడైపోయాడు. ఈ సంగతి తక్షకుడికి తెలిసింది. వాలిని అతను ఏమీ చెయ్యలేక, 'ఈ ఏడు చెట్లనీ ఒకే బాణంతో కూలగొట్టగల్గినవాడి చేతిలో వాలి మరణిస్తాడు' అని శాపం పెట్టాడు. మీరు అలా కూలగొడితే వాలిని చంపగలరనే నమ్మకం మాకు కల్గుతుంది. ఇలా అయితేనే మీతో స్నేహానికి మేం సిద్ధం" అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుడు కోరినట్లే - శ్రీరాముడు ఏడు తాడిచెట్లనీ కూలగొట్టాడు. ఒకే బాణంతో ఒకేసారి కూలగొట్టాడు. అందరూ ఆశ్చర్యంగా చూస్తుండగా కూలిపడిన ఆ తాడిచెట్లులోంచి తక్షకుడి కొడుకు సర్పరూపంలో బైటకు వచ్చాడు. తనకు శాపవిమోచనం కల్గించిన శ్రీరాముడికి, అందుకు కారకుడైన సుగ్రీవుడికి ధన్యవాదాలు చెప్పుకున్నాడు. ప్రత్యుపకారం ఏదైనా చేసుకొంటాను - అడగవలసిందిగా ప్రార్థించాడు.

అప్పుడు సుగ్రీవుడు రాముడికి మాత్రమే విన్పించేట్లు ఏదో చెవిలో చెప్పాడు. రాముడు కూడా ఆ ప్రతిపాదనని బాగా ఆలోచించాడు. విజయం సాధించాలంటే కొన్ని పనులు చెయ్యాలి, తప్పదు - అని నిర్ణయించుకొన్నాడు. "వాలి మెడలో వుండే జయమాలను రహస్యంగా తెచ్చి మాకు ఇవ్వు" అన్నాడు రాముడు. తప్పకుండా తెస్తానంటూ బయల్దేరాడు తక్షకుడి కొడుకు.

ఆ సర్పరూపంలోనే కిష్కింధానగరానికి బయల్దేరాడతను. అంతఃపురంలోకి ప్రవేశించాడు. వాలి గాఢనిద్రలో వున్నాడు. నెమ్మదిగా జయమాలని దొంగిలించాడు. రహస్యంగా తెచ్చి రాముడికి అందించాడు.

అప్పుడు సుగ్రీవుడు చెప్పాడు - ఇది మహత్తు కల్గిన మాల ! దీన్ని ధరించినవాడికి భయం అనేది వుండదు. తెగించి పోరాడగల్గుతాడు. అదీ దీని మహాత్మ్యం అని !

తక్షకుడి పుత్రుడు మరొక్కసారి శ్రీరాముని ఆశీస్సులు పొంది నిష్క్రమించాడు.

వాలి - సుగ్రీవుల పోరుకు రంగం సిద్ధం అయ్యిందింక !

## రామలక్ష్మణుల రాకసంగతి వాలికి ముందే తెలుసు !

బుధగ్రహం, అంగారకగ్రహంలాగా వాలీ సుగ్రీవులిద్దరూ నెత్తురు కారేలాగా కొట్టుకున్నారు. ఇద్దరూ ఒకే రూపంలో వున్నారు. ఒకే వేషంలో వున్నారు. సమానశక్తితో పోరాడుతున్నారు.

చెట్టుచాటున బాణం ఎక్కుపెట్టి చూస్తున్నాడు రాముడు. ఈ ఇద్దరిలో ఎవరు వాలి ? ఎవరు సుగ్రీవుడు ?

పొరబాటున బాణం సుగ్రీవుడికే తగిలితే .... ?

బాణాన్ని ఉపసంహరించేసి మౌనంగా, ఆ చెట్టుచాటునే చూస్తూ నిలబడిపోయాడు. వాలీ సుగ్రీవులిద్దరూ హోరాహోరీ పోరాడ్తున్నారు. చివరికి సహజంగానే అలిసిపోయి, సుగ్రీవుడు ఓడిపోయినట్లు ఒప్పుకొని, మతంగముని ఆశ్రమంలో దూరాడు. కొంచెం దూరం వెంటాడి ... "బతికిపోయావు పో"... అంటూ ఛీకొట్టి వెనక్కు వెళ్ళిపోయాడు వాలి.

రామలక్ష్మణులు ఆ వెనకే మతంగ ఆశ్రమానికి వెళ్ళి సుగ్రీవుణ్ణి ఓదార్చారు. సుగ్రీవుడు రాముడి వంక క్రోధంగా చూసి, "మీరేదో పెద్ద సాయపడ్తారని నమ్మి ఇలా దెబ్బలు తిని ప్రాణాలు దక్కించుకున్నాను-" అన్నాడు. "వాలిని నువ్వు చంపలేవయ్యా అని నేను ముందే చెప్పాను. కానీ, ఏదో చేసేవాడిలా ఆ రోజున మాట్లాడావు ..." అని ఈసడించాడు.

రాముడు చిన్నగా నవ్వి, "సుగ్రీవా ! కోపం తెచ్చుకోకు. మీ ఇద్దరూ అచ్చం ఒకే ఆకారంలో వుంటే పోల్చుకోవడం కష్టం అయ్యింది. సుగ్రీవా ! నిన్ను కాపాడటం నీ అవసరం కాదయ్యా నా అవసరం ! నా కోసమైనా నిన్ను కిష్కింధకు రాజును చెయ్యాలి. చేస్తాను. నామాట నిలబెట్టుకొంటాను. నిన్ను గుర్తించడానికి మెడలో ఏదైనా ధరించు"

అన్నాడు. లక్ష్మణుడి వైపు తిరిగి, "అదిగో 'గజపుష్పి' పూలు పూసింది. ఆ పూలతో మాలను పేర్చి సుగ్రీవుడికి ధరింపచెయ్యి" అన్నాడు. మళ్ళీ యుద్ధానికి సిద్ధం కావలసిందిగా ప్రోత్సహించాడు.

సుగ్రీవుడు ఆ రాత్రికి రాత్రే వాలి విడిది చేసిన గుహద్వారం దగ్గరకు వచ్చి మళ్ళీ యుద్ధం కోసం సింహగర్జన చేశాడు.

వాలికి చాలాకోపం వచ్చింది. కోపంతో చిందులు తొక్కాడు. ఆ అదురుడుకు భూమి కంపించినట్లయ్యింది. అది చూసి వాలి భార్య తార అతన్ని కౌగలించుకొని కొన్ని విషయాలు చెప్పింది.

1. ఇప్పుడే పడిపోయి పారిపోయినవాడు మళ్ళీ అంతలోనే యుద్ధానికి వచ్చాడంటే, అతన్ని ప్రోత్సహిస్తున్నవారెవరో - ఆలోచించు.
2. అతనికేదో అపూర్వ సహాయ సంపత్తి దొరికే వుంటుందని నా అనుమానం.
3. మన గూఢచారులు ఒక వర్తమానం మోసుకొచ్చి మన అంగదుడికి చెప్పారు. అయోధ్య రాజకుమారులిద్దరు ఋష్యమూక పర్వతానికి వచ్చి సుగ్రీవుడితో స్నేహం చేస్తున్నారట! ఇంతకుమునుపే ఈ సంగతి నాకు అంగదుదు చెప్పాడు. ఈ పరిణామాలు చూస్తుంటే, అయోధ్య రాజకుమారుల అండ చూసుకునే సుగ్రీవుడు ఇలా యుద్ధానికి మళ్ళీ వస్తున్నాడనిపిస్తుంది.
4. అయోధ్య రాజకుమారుడు రాముడికి మంచి పేరుంది. అతను చాలామంది రాక్షసుల్ని సంహరించాడని చెప్పుకొంటుంటే నేను విన్నాను. అతనితో మనకి విరోధం అనవసరం. సుగ్రీవుడి సంగతి చూడబోయేముందు రాముడెవరో, అతని సహాయం ఇతనికి ఎంత వుందో విచారించు.
5. అయినా, సుగ్రీవుడితో ఇంత శత్రుత్వం నీకు మంచిది కాదేమోనని నాకు కూడా అన్పిస్తోంది. అతని భార్యని, అతని రాజ్యభాగాన్ని అతనికిచ్చేయడం వలన మనకు పోయేదేమీ లేదు - బైటవాడేం కాదు - మీ తమ్ముడే కదా ...!
6. ఇలాంటప్పుడు కోపంతో అనాలోచితంగా ప్రవర్తించడంకన్నా యుక్తిగా సమస్యను పరిష్కరించడం మంచిది.

తార చెప్పిన ఈ విషయాలకు వాలి మెత్తపడలేదు. "తమ్ముడూ తమ్ముడంటావు ... ఎవడే నా తమ్ముడు ? అన్నని, నామీదే కయ్యానికి కాలుదువ్వినవాడు నాకు తమ్ముడా? వాడికి అన్న అవసరం లేదు గాని, నాకు మాత్రం తమ్ముడు కావాలా ?" అని అరిచాడు.

ఇంక అతనెవరో రాముడంటున్నావు. పైగా మంచివాడంటున్నావు - అతను మంచివాడైతే మా ఇద్దరి మధ్య కలగచేసుకోవాల్సిన అవసరం అతనికి లేదు.

సరే ! తమ్ముడంటున్నావు కదా ... సుగ్రీవుణ్ణి చంపను. వాడి గర్వాన్ని అణగ్గొట్టి వస్తాను – సరేనా ... ? అన్నాడు. అక్కడికి 'తార'కు అదే సంతోషం అయింది. ఎప్పటికైనా ఆ అన్నదమ్ములిద్దరూ కలుస్తారనేదే ఆవిడ ఆశ !

ఈ విధంగా రాముడు అక్కడే ఎక్కడో వుండి వుంటాడని వాలికి తెలుసు. బహుశా కన్పిస్తాడేమోనని కొంత వెదికే వుంటాడుకూడా ! కన్పించకపోవడం వలన ఆ యుద్ధంలో రాముడు జోక్యం చేసుకోబోడనే నమ్మకంతో వుండి వుంటాడు. రాముడు చెట్టు చాటు నుంచి బాణం వేస్తాడని మాత్రం ఊహించి వుండడు.

రాముడు చెట్టు చాటునుంచి కూలగొట్టినప్పుడు అదే ప్రశ్నవేశాడు. "నేను నీకు గాని, నీ దేశానికి గాని కీడు చెయ్యలేదు, నీతో యుద్ధానికి రాలేదు. కందమూలాలు తినే ఆదిమ ఆటవిక జీవులం... వానరులం... ఏ పాపం ఎరగని నామీద బాణం ఎందుకు వేశావయ్యా ... అదికూడా దొంగచాటుగా కావాలని వేశావు ...?" అనడిగాడు వాలి.

"మీ రాజులకి 'వేట' ధర్మం ! కానీ, తినడానికి ఉపయోగపడనిదాన్ని చంపకూడదనే ధర్మం నీకు తెలీదా ... నా మాంసం నీకు పనికి రాదు. నా చర్మం నీకు పనికిరాదు, నా రోమాలు నీకు పనికిరావు. నా ఎముకలు పనికిరావు... కోతిని ఏ విధంగా తిందామని నన్ను గాయపరిచావయ్యా ...?" అని నిలదీశాడు.

అప్పుడు రాముడు వాలి వేసిన ప్రతి ప్రశ్నకు ఇలా జవాబు చెప్పాడు :

1. నేను వేటగాడిగా నిన్ను గాయపరచలేదు. కాబట్టి నిన్ను తినడం మానడం అనే ధర్మాధర్మాల విషయాలు ఇక్కడ అప్రస్తుతం.
2. నిన్ను ధర్మరక్షణార్థం ఒక రాజుగా చంపదలిచాను. అధర్మాన్ని సంహరించడానికి శత్రువా మిత్రువా అనే మీమాంస వుండదు – కాబట్టి నిన్ను చంపడానికి నీతో నాకు ఏ విధమైన శత్రుత్వమూ వుండనవసరం లేదు.
3. చెట్టుచాటునవుండి చంపడం గురించి ఇంక నీ ప్రశ్న. ఎదుట నిలిచిన వాడి బలం నీకు సంక్రమించేలా నీకు వరం ఇచ్చిన వాణ్ణి నేనే ! నే ఇచ్చినదాన్ని నేనే తప్పకూడదు కదా ... ! అందుకని పక్కన నిలబడి నీమీద బాణం వదిలాను.
4. అటు తిరిగి వున్నవాణ్ణి వెనుకనించి కొట్టవచ్చా ... అనడిగావు .. నువ్వు అధర్మమార్గాన అటుతిరిగే నుంచున్నావు. ధర్మమార్గాన లేవు. అందుకని ఇటు నుంచి కొట్టక తప్పలేదు – చంపదగిన వాణ్ణి ఎటునించైనా చంపితీరాలి ! ఇది రాజధర్మం !!

5. ఇంతకీ నువ్వు చేసిన అధర్మం ఏమిటో తెలుసా ... తమ్ముని నిష్కారణంగా వెళ్ళగొట్టి అతని భార్యని చెరబట్టి ఆమెతో రమించడం. తమ్ముడు మరణించినప్పుడు అతని భార్యని చేపట్టడం మీ కులాచారం కావచ్చు కానీ, తమ్ముణ్ణి వెళ్ళగొట్టి అతని భార్యను చేపట్టి, అధర్మానికి పాల్పడ్డావు. అందుకే ఒక రాజుగా నీకు ఈ శిక్ష విధిస్తున్నాను.

6. "శిక్షాధికారం రాజుకే గాని, నీకు లేదు. నువ్వు రాజువు కాదు." అని నన్ను ప్రశ్నించబోతున్నావు. నాకు తెలుసు. నా తమ్ముడు అయోధ్యలో రాజ్యపాలన చేస్తున్నాడు. పరిపాలనా సౌలభ్యం కోసం రాజులు తమ ప్రతినిధుల్ని దేశం అంతా నియమిస్తారు. ధర్మరక్షణ కోసం అలా భరతుడి ప్రతినిధిగా నిన్ను శిక్షించాను- అన్నాడు రాముడు.

7. ఇవన్నీ కాదు - దైవరహస్యం ఒకటి వేరేవుంది. నీకు మనశ్శాంతి కలగడం కోసం దాన్ని చెప్తాను - దేవదానవ సంగ్రామంలో దేవతలకు సాయపడడానికి ఇంద్రుడు నిన్ను సృష్టించాడు. నువ్వు నీ జన్మకు కారణాన్ని మరచిపోయి దేవతలకు శత్రువులైన రాక్షసులతో స్నేహం కట్టావు. కాబట్టి మొదట నిన్ను వధిస్తే గాని, రాక్షస సంహారం పూర్తికాదు. అందుకే నిన్ను సంహరించాను.

మొత్తంమీద రాముడు చెప్పిన వాటిని వాలి అంగీకరించాడు. తన తప్పు గ్రహించాడు. అంగదుడి భవిష్యత్తు రాముడిచేతుల్లో పెట్టి, వీడికి ఏవిధంగా న్యాయం చేస్తావో అది చెయ్యి - అని కోరాడు.

సుగ్రీవుడికి తన మెడలో కాంచనమాలని బహూకరించి, కిష్కింధని తన తర్వాత పాలించవలసిందిగా చెప్పాడు. అంగదుణ్ణి పిలిచి, సుగ్రీవుడి శత్రువులతో చేతులు కలపవద్దని హితవు చెప్పాడు.

ఈలోగా వాలి మరణవార్త కిష్కింధానగరాన్ని చేరింది. నగరద్వారాలు మూయించి, అంగదుడికి పట్టంగట్టి, రాజ్యాన్ని కాపాడుకోమని మంత్రులు తారకు సలహా చెప్పారు.

కానీ, తార విజ్ఞత చూపించింది. రాముడి కారణంగానే వాలివధ జరిగిందని ఆమెకు అర్థం అయ్యింది. కిష్కింధభారం రామునికి అప్పగిస్తే కిష్కింధలోని ప్రజలూ, అంగదుడు కూడా క్షేమంగా వుంటారని నిర్ణయించుకొంది - వాలి విగతజీవుడై పడివున్న యుద్ధభూమికి బయల్దేరింది.

# వాలిని ఎందుకు చంపవలసివచ్చింది ?

వానరులు రావణ వధకోసమే పుట్టారు కదా... రావణ వధే కదా రాముడికి కూడా కావలసింది. వానరులలో రావణ వధ చెయ్యగలిగిన మొనగాడెవరైనా వుంటే 'వాలి' ఒక్కడేనన్నది అందరికీ తెల్సిన సంగతే ! మరి అంతటి 'వాలి'ని రాముడు చెట్టుచాటునుండి మరీ చంపాలని నిర్ణయించడమే ఒక వింత ! కొన్ని వింతలు అలా జరుగుతాయి.

వానరాధిపతి వాలికి అఖండ సైన్యం వుంది. అంగదుడంతటి మహాబలవంతుడూ, మేధావీ అయిన పుత్రుడున్నాడు. అతనికి లేనిది లేదు. అలాంటి వాలితో రావణుడు ఒకసారి జగడం పెట్టుకొని భంగపడ్డాడు. ఎందుకైనా మంచిదని, వాలితో సఖ్యంగా వ్యవహరించడం మొదలుపెట్టాడు. ఎంత సఖ్యత నడిపాడంటే, వాలి ఎంత చెపితే రావణుడు అంత - అన్నంత సఖ్యతని నెలకొల్పగలిగాడు.

రాముడు వాలితో స్నేహం చేసినట్లయితే ఏమౌతుంది ... ? రెండు నిముషాల్లో రావణుడి దగ్గర్నుంచి సీతని తెప్పించి రాముడికివ్వగలిగేవాడు. రాముడు తన భార్యని దానం పుచ్చుకొని మౌనంగా అయోధ్యకు వెళ్ళిపోయేవాడు. 'వాలి' వాలిగానే వుండేవాడు. 'రావణుడు' రావణుడుగానే వుండేవాడు. రాముడు మాత్రం ఇంకెప్పుడూ అడవులకు భార్యను తీసుకొని రాకూడదని చెంపలేసుకునేవాడు.

రామాయణ పరమార్థం సీతను తెచ్చుకోవడం కాదు - రావణుణ్ణి వధించడం. అందుకే, వాలిని మొదటగా చంపాలనే నిర్ణయానికి వచ్చాడు రాముడు.



సరే ! 'వాలి' చెప్పినట్టే విని రావణుడు సీతని సగౌరవంగా తెచ్చి ఇస్తాడనే అనుకొందాం... యుద్ధానికి సన్నద్ధం అవబోయేముందు సాక్షాత్తూ ఆ వాలి గారి కొడుకు అంగదుణ్ణి రాయబారిగా పంపారు కదా ... విన్నాడా రావణుడు ... వినలేదే ... వాలి వెళ్ళి అడిగినా రావణుడు అదే సమాధానం ఇచ్చేవాడేమో... లేకపోతే, ఎవరో రాముడికోసం నేను రావణుణ్ణి ఎందుకు శత్రువుని చేసుకోవాలని 'వాలి' తనే రావణాసురుడి పక్షం వహించేవాడేమో ... ఏమైనా వాలి అడ్డుతొలగించుకొని, వాలి సైన్యసంపదని తన ఆధీనంలోకి తెచ్చుకోగలగడం రాముడు తెలివైన నిర్ణయం తీసుకున్నాడనడానికి సాక్ష్యం!!

వాలిని వధించే విషయంలో కూడా ఇదే మీమాంస ఏర్పడింది. రాముడు విల్లంబులు తీసుకొని 'వాలి'కి ఎదురుగా వచ్చాడనుకోండి... 'వాలి' రాముడి శరణాగతుడయ్యాడనుకోండి... అప్పుడు దయచూపించి వాలిని వదిలేయాల్సి వస్తుంది. దానివలన వాలిని చంపి తీర్తానని శ్రీరాముడు సుగ్రీవుడికిచ్చిన వాగ్దానం నీరుకారిపోతుంది. కాబట్టి వాలిని చెట్టుచాటు నుంచే చంపాలని నిర్ణయించుకున్నాడు రాముడు. వాలిని చంపడం అనేది రావణ వధకి మొదటిమెట్టు అంతే ! రాక్షసులతో స్నేహం చేసి తన జన్మరహస్యాన్ని మరిచిపోయినందుకు వాలిని శ్రీరాముడు శిక్షించదలిచాడు. అంతేగాని, వాలితో యుద్ధం చెయ్యలేదు. శిక్షని వేసినవాడు, దాన్ని అమలు పరిచేవాడూ రాముడే ! శిక్షను ఎట్లాగయినా అమలుపరచవచ్చు - చెట్టు చాటునుంచి కూడా అంటారు - వాలి వధని సమర్థించే పండితులు !

# "నాకీ నెత్తురు కూడు వద్దు" - సుగ్రీవుడు

తాత్కాలిక ఆవేశాలకు లోనై వాలీ సుగ్రీవులు ఒకరికొకరు హాని కల్గించుకున్నారు. కానీ, వాలి మరణావస్థలో వున్నప్పుడు ఆ హృదయవిదారక దృశ్యాన్ని చూసిన సుగ్రీవుడు చలించిపోయాడు. వాలి తన తప్పులకు పశ్చాత్తాపం ప్రకటించిన తర్వాత ఇంక సుగ్రీవుడికి కోపం, పగ మిగిలి లేవు.

తనను చంపకుండా వదిలేసిన వాలి - నిజానికి ప్రాణదాతతో సమానం. కానీ, ప్రాణదాత ప్రాణాన్ని తాను హరింపచేసిన పాపభీతి అతన్ని ఆవహించసాగింది. "రామా ! నాకీ నెత్తురు కూడు వద్దు ! నేను కందమూలాలు తింటూ బతుకుతాను - అన్నా ! నీతో పాటే వచ్చేస్తాను. నాకీ రాజ్యం వద్దు... ఈ వైభవాలు వద్దు." అని ఏడవడం మొదలుపెట్టాడు.

అప్పుడు రాముడు తారనీ, సుగ్రీవుణ్ణీ యిద్దరినీ ఓదార్చాడు. ప్రాయోపవేశం చేస్తానని సిద్ధపడిన యిద్దరినీ నిలువరించాడు.

భర్త శరీరం మీదపడి రోదిస్తున్న తారని బలవంతంగా లేపి ఇవతలికి తీసుకొచ్చారు. రాముడు ఆమెకు అభయం ఇచ్చాడు... "అంగదుడు యువరాజు అవుతాడు... యువరాజు తల్లిగా నీ సౌభాగ్యానికి ఎటువంటి లోటూ వుండదు" అని ఆమెకు వాగ్దానం చేశాడు. ఈ వృథా దుఃఖాన్ని మాని తదుపరి కర్తవ్యం గురించి ఆలోచించమని సుగ్రీవుడితో చెప్పాడు.

లక్ష్మణుడు కల్పించుకొని, అంగదుడిచేత ప్రేతకర్మలు చేయించవలసిందిగా సుగ్రీవుడికి చెప్పాడు.

తారుడు వెళ్ళి సర్వాలంకృతమైన పల్లకిని తీసుకొచ్చాడు. వాలి శవాన్ని ఆ పల్లకిలో కెక్కించి, పట్టువస్త్రాలు కప్పి పడుకోబెట్టారు. వాలి శవాన్ని పల్లకిలో ఊరేగించి చితిస్థానానికి చేర్చారు. అంగదుడు అంత్యక్రియలు పూర్తిచేశాడు.

అందరూ పంపానదిలో స్నానాలు చేశారు.

తర్వాత హనుమంతుడు రాముడి దగ్గరకు వచ్చి, "మీరు స్వయంగా వచ్చి సుగ్రీవుడిని సింహాసనం మీద ప్రతిష్ఠించండి" అన్నాడు. రాముడు చిన్నగా నవ్వాడు. "సౌమ్యా ! నీ కోరిక సంతోషదాయకమే ! కానీ, అరణ్యవాస నియమం ప్రకారం నేను ఈ పద్నాలుగు ఏళ్ళు పురాన్ని గాని, గ్రామాన్ని గాని తొక్కకూడదు. మీరంతా కిష్కింధానగరానికి వెళ్ళండి. యథాశాస్త్రం సుగ్రీవుడికి పట్టం కట్టండి. అలాగే అంగదుడికి యువరాజ్యాభిషేకం చెయ్యండి. శ్రావణమాసం వచ్చేసింది. వచ్చే నాలుగు నెలలూ వర్షాకాలం ఈ నాలుగు నెలలూ ఏ పనులూ సాగవు. అందాకా మీరంతా కిష్కింధలోనే వుండండి. నేనూ లక్ష్మణుడూ ఈ ప్రస్రవణ పర్వతం మీదే కాలం గడుపుతాం ... మళ్ళీ అందరం కార్తీకమాసంలో కలుద్దాం... !" అన్నాడు.

## వాలికి తెలిసిన రావణుడు సుగ్రీవుడికి తెలియడా ?

రామసుగ్రీవుల మధ్య మైత్రి కుదిరింది. సీతాన్వేషణ ప్రారంభం అయ్యింది. ఎత్తుకెళ్ళినవాడు రావణుడేనని అనేక విధాల రుజువైపోయింది. ఈ రావణుడెవడు ? ఎక్కడుంటాడు ? సరిగ్గా చెప్పగలిగినవాళ్ళు ఎవరూ కన్పించలేదు -

సుగ్రీవుడు కూడా తనకేమీ తెలియదని చెప్పాడు రావణుడి గురించి !

వాలి తన బలపరాక్రమాలతో రావణాసురుణ్ణి చంకలో బిగించి తిప్పినప్పుడు వాలి, సుగ్రీవులిద్దరూ కలిసే వున్నారు - వాలితో రావణుడు సంధిచేసుకున్నప్పుడు రాజ్యంలో రెండో స్థానంలో వున్న పాలకుడు సుగ్రీవుడికి రావణుడి గురించి ఏమీ తెలీదా ?

ముందే రావణుడి వివరాలు శ్రీరాముడికి తెలియజేస్తే, రాముడు వాలిని వధించే విషయం వదిలేసి, తిన్నగా లంకమీదకి యుద్ధానికి వెళ్ళిపోతాడని, తన గతి ఇంక అంతేనని భయపడి సుగ్రీవుడు రావణుడి గురించి తనకు తెలిసినా తెలియదని చెప్పాడా ?

చాలామంది పండితులు ఇదే అభిప్రాయాన్ని రాశారు.

కానీ, సుగ్రీవుడికి తెల్సిన విషయాలు ఒక్క సుగ్రీవుడికి మాత్రమే పరిమితంగా వుంటాయా ...? సుగ్రీవుడి మంత్రి హనుమంతుడు, సేనాపతులు జాంబవంతాదులక్కూడా తెలియకుండా వుంటాయా ? తెలిసినా వీళ్ళంతా కూడా ఏమీ తెలియదన్నట్టు ఊరుకున్నారా ?

అందాకా ఎందుకు - రావణుడి బంట్లు మారీచ సుబాహుల్ని, వాళ్ళ తల్లి తాటకిని ఏనాడో చిన్నప్పుడే చంపిన శ్రీరాముడిక్కూడా రావణుడెవరో ... అతని స్థావరం ఏదో తెలియదా... ?

శ్రీరాముడికి తెలియకపోవడంలో ఆశ్చర్యం లేనప్పుడు సుగ్రీవాదులక్కూడా తెలియకపోవడంలో ఆశ్చర్యం ఏమీ లేదనిపిస్తుంది. ఆ మాటకొస్తే, వాలిక్కూడా రావణ సామ్రాజ్య వివరాలు పూర్తిగా తెలిసివుండకపోయినా ఆశ్చర్యపడనవసరం లేదు-

రావణుడు అనేక మంది చేతుల్లో భంగపడినా, ఆ సంఘటనలన్నీ లంకకు వెలుపలే జరిగాయి. లంకానగరం ఒక దుర్భేద్యమైన రాజ్యం. అందులోకి రావణుణ్ణి విరోధించి ప్రవేశించగలగడం దాదాపు అసాధ్యమే ! పైగా అది సముద్రం మధ్య ఒక దీవిలో చిత్రకూట పర్వతం చాటున వున్న నగరం.

అందులో ప్రవేశించినవాడెవడూ ప్రాణాలతో తిరిగివచ్చే అవకాశాలు లేవు. అందుకే, రావణుడి స్థావరాలగురించి, అతని రథం గురించి, అతని సైనిక బలాల గురించి ఎవరికి తెలియకపోతే, వాళ్ళంతా అబద్ధాలాడారనుకోవడం అన్యాయమే !

**"ఆగత్య పీహ హరయో భవిష్యంతి నిరర్థకాః**
**నహి యుద్ధేనవై లంకాశక్యా జేతుం సురైరపి"**

దేవతలక్కూడా ఈ లంకానగరంలోకి రావడం కష్టం. ఇంక, మన వానర సేన ఇక్కడకు ఎలా రాగలుగుతుందీ - రావణుడితో యుద్ధం ఎలా చేస్తుందీ - అనుకొంటాడు హనుమంతుడు సీతను వెదుకుతూ మొదటిసారిగా లంకానగరంలోకి ప్రవేశించినప్పుడు.

అంతటి కష్టసాధ్యం కాబట్టి, రావణుడు అందరికీ తెలిసినా అతని నివాసస్థావరాల గురించి ఎవరికీ తెలియకుండా పోయిందని అర్థం అవుతుంది దీనివల్ల !

# వానర ప్రముఖులు వీరే !

రాముడు పెట్టిన నాలుగు నెలల గడువూ పూర్తయిపోయింది. సుగ్రీవుడు రామకార్యం గురించి పెద్దగా ఆలోచిస్తున్నట్లు కన్పించలేదు. లక్ష్మణుడికి చాలా కోపం వచ్చింది. విల్లంబులు పుచ్చుకొని కిష్కింధకు బయల్దేరాడు. అంతకన్నా ముందే హనుమంతుడు సుగ్రీవుణ్ణి ఒకసారి హెచ్చరించాడు. "కార్తీకమాసం వచ్చేస్తోంది. గడువు దాటిపోతుంది. రాముడికి ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలి గదా... సీతను వెదికించాలి కదా ... " అని !

సుగ్రీవుడు అప్పటికప్పుడు నీలుణ్ణి పంపి, పదిహేను రోజుల్లోగా వానరవీరులందర్నీ ససైన్యంగా పిలిపించమని చెప్పాడు. ఈలోగా, లక్ష్మణుడు కోపంగా రావడం, సుగ్రీవుడు ఆయన్ని శాంతింపచేసి, రాముణ్ణి కలవడం జరిగిపోయాయి.

అంతలోనే, కామరూపులైన వానరయోధులు నలుమూలలనుంచి వచ్చి అక్కడకు చేరారు. నీలుడు ఎక్కడెక్కడో వున్న వానర వీరులందర్నీ ఆ సమయానికి అక్కడకు రప్పించాడు. అలావచ్చిన వానర వీరులందర్నీ ఒక్కొక్కరినీ రాముడికి పరిచయం చేశాడు సుగ్రీవుడు.

1. **శతవలి :** మహేంద్రపర్వతం నుంచి వచ్చాడు. పదివేల కోట్లు ఇతని సైన్యం.
2. **సుషేణుడు :** తార తండ్రి. గొప్ప సైన్యబలం ఈయనకుంది.
3. **తారుడు :** గొప్ప వానర వీరుడు.
4. **కేసరి :** హనుమంతుడి తండ్రి. మహాబుద్ధిశాలి.
5. **గవాక్షుడు :** గోలాంగూల రాజు
6. **ధూమ్రుడు :** భల్లూకవీరుడు. భీమవేగవంతులైన సైన్యం ఈయనకుంది.
7. **పనసుడు :** పర్వతాకారులు, ఘోరులూ ఈయన సైన్యం.
8. **గయుడు :** గొప్ప సైన్యంతో వచ్చాడు.
9. **మైంద ద్వివిదులు :** అశ్వనీ దేవతల పుత్రులు.
10. **గజుడు**
11. **జాంబవంతుడు**
12. **రుమణ్వంతుడు**
13. **గంధమాదనుడు**
14. **అంగదుడు**
15. **ఇంద్రజానువు**
16. **రంభుడు**
17. **దుర్ముఖుడు**

18. **హనుమంతుడు**

19. **దధిముఖుడు**

20. **శరభుడు**

21. **కుముదుడు**

22. **వహ్ని**

23. **రంహుడు**

వీళ్ళంతా లెక్కకు మించిన తమతమ సైన్యాల్ని వెంటబెట్టుకొని అక్కడకు వచ్చారు.

సుగ్రీవుడు వీళ్ళందర్నీ రాముడికి పరిచయం చేసి, "రామా ! ఈ మహాసైన్యాన్ని మీకు అప్పగిస్తున్నాను - ఆజ్ఞాపించండి !" అన్నాడు.

రాముడు చాలా నిరాసక్తిగా సుగ్రీవుడి వంక చూశాడు.

'మిత్రమా ! నాకిప్పుడు కావలసింది సైనిక బలం కాదు - నా భార్య సీత బతికుందో లేదో తెలియాలి. ఆమెను అపహరించిన రాక్షసుడు ఎవరో, ఎక్కడుంటాడో తెలుసుకోవాలి. వాడు సీతను ఎక్కడ దాచివుంటాడో అన్వేషించాలి. ఆమెను వెదకడం ... ఇది నేను గానీ, లక్ష్మణుడు గానీ చేయించగలిగిన పనికాదు ... ఆ పనిని నువ్వే చేయించగలవు ... ఏం చెయ్యాలో నీ సైన్యానికి నువ్వే ఆజ్ఞాపించు. నీకు తెలియని కాల విశేషాలు ఏమున్నాయి ... ? నాకు లక్ష్మణుడు ఎంతో నువ్వూ అంతే ... " అన్నాడు.

సుగ్రీవుడు ఒక్కో వానర యోధుణ్ణి పిలిచి ఒక్కొక్క ప్రాంతం గురించి వివరించి చెప్పి, అక్కడ అణువణువూ గాలించి సీతని వెదకమని పురమాయించాడు.

వింటున్నాడు రాముడు -

ఆ మహావీరులు మహాశక్తిసంపన్నులే ! కానీ, ఈ సీతాన్వేషణ ఖచ్చితంగా వీరు చెయ్యగలరని ఆయనకు అన్పించినట్టు లేదు. వాళ్ళని వెదికించేందుకు పంపుతున్న విధానం కూడా ఆయనకు నచ్చినట్టు లేదు. లక్ష్మణుడు అంతా జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

అంతలో సుగ్రీవుడు హనుమంతునితో ఇంతమందిని ఇన్నిచోట్లకు పంపుతున్నాను గాని, సీతను అన్వేషించే కార్యం చివరికి నీ వలనే పూర్తవుతుందని నా నమ్మకం అన్నాడు. రాముడికి ఆశ్చర్యం వేసింది. సుగ్రీవుడి బుద్ధికుశలతకు మనసులోనే అభినందించాడు. ఆయనకు తెలుసు - ఈ కార్యాన్ని నెరవేర్చుకురాగలవాడు హనుమంతుడొక్కడే ... అని !

హనుమంతుని దగ్గరకు పిలిచాడు రాముడు. 'మారుతీ ! ఇదిగో నాపేరు చెక్కిన ముద్దుటుంగరం. సీతాదేవికి గుర్తుగా ఇవ్వడం కోసం దీన్ని నీకిస్తున్నాను. ఆమె జీవించి

వున్నట్లయితే తప్పకుండా నీకళ్ళలో పడ్తుంది. ఆమెకు ఈ ఉంగరాన్ని చూపించు. ఆమె నిన్ను మన్నిస్తుంది –" అంటూ హనుమంతునికి తన ఉంగరం ఇచ్చాడు.

హనుమంతుడు బయల్దేరబోయేముందు మళ్ళీ పిలిచి రాముడు "అతిబలా ! నీ బలంమీద నాకు నమ్మకం వుంది. సీతజాడ తెలియజెప్పే బాధ్యత నీదే !" అని ఇంకోసారి హెచ్చరించి ఆశీర్వదించాడు.

రాముడి ఆశీర్వాదం తీసుకొని, ఆయన ఉంగరాన్ని చేత్తో పట్టుకోగానే ఆయనలో ఏదో తెలీని మహాశక్తి ఆవహించినట్లయింది. వాయుమనోవేగాలతో దక్షిణదిశగా బయల్దేరాడు... తన బలగాన్ని తీసుకొని !

శతవలి ఉత్తరదిశగా, వినతుడు తూర్పుదిశగా, సుశేణుడు పశ్చిమదిశగా వెళ్ళారు.

సీతని ఎవరో ఒక రాక్షసుడు తన విమానం మీద దక్షిణ దిశగా తీసుకుపోతుండగా సుగ్రీవుడుతో సహా చాలామంది వానరయోధులు స్వయంగా చూశారు. పైగా ఆమె రామా ! లక్ష్మణా ! అని ఏడుస్తూ, తన నగల మూటని సుగ్రీవుడి అనుచరుల మధ్య పడేలా విమానంలోంచి విసిరివేయడాన్ని కూడా వాళ్ళు కళ్ళారా చూశారు.

అందుకే దక్షిణ దిశకు అందరికన్నా సమర్థుడు హనుమంతుని పంపించాడు సుగ్రీవుడు. సీత ఖచ్చితంగా లంకలోనే వుంటుందని సుగ్రీవుడి నమ్మకం ! ఆమె జీవించే వుంటుందనీ, అపహరించిన రాక్షసుడు ఆమెను ప్రతిరోజూ హింసిస్తూ వుంటాడనీ ఆయన ఊహ ! అయితే, ఆ లంకారాజ్యం ఎక్కడ వుందీ ? ఇదే తేలని ప్రశ్న !

## సుగ్రీవుడు సీతను వెదికించిన దేశాలివీ ...

సీతను వెదికేందుకు సుగ్రీవుడు తనకు తెలిసిన దేశాలన్నింటికీ తన మనుషుల్ని పంపించాడు. ఒక నెల రోజులలోపు మీరంతా తిరిగి ఇక్కడకు వచ్చి ఏ సంగతి చెప్పాలి – అని ఆదేశించాడు. ఇదే సుగ్రీవాజ్ఞ !

వానరులు దేవతాంశ సంభూతులు. వాళ్ళకు అసాధ్యమైన కార్యం అంటూ ఏదీ లేదు. సుగ్రీవుడు వివిధ ప్రాంతాల్లో వున్న తమ వానర సేన మొత్తాన్నీ రాముడి దగ్గరకి పిలిపించాడు. "శ్రీరాముడి కార్యం మీరు సాధించాలి. మీమీ సైన్యంతో మీరు ప్రపంచం నలుమూలలకూ పోవాలి. జానకిని వెదికి ఆమె జాడ శ్రీరామునికి తెలియజేయాలి" అని ఆదేశించాడు. తులసీదాసు రామాయణం ప్రకారం సుగ్రీవుడి సైన్యం వెతకడానికి వెళ్ళిన దేశాలు ఇవి :

1. ఆవర్తన (Britain)
2. అశ్వక్రాంత (Europe)
3. రోమ (Rome)

4. పటచ్చర (Haly)
5. ఇంద్రద్వీపం (England)
6. పశుశీలం (Portugal)
7. క్రౌంచం (Germany)
8. సైనిక, కుక్కుటాలు (Holland & Belgium)
9. అశ్వీయం (Austria)
10. ప్రలియం (France)
11. తామసం (Spain)
12. మారకం, మాటకం (Norway & Swedan)
13. అరణ్యకతురుష్కం (Europe Turkey)
14. కానివలం (Cannibal country)
15. బర్బరం (Barbary)
16. రథక్రాంతం (Africa)
17. విష్ణుక్రాంతం (Asia)
18. హైబి (Siberia)
19. రుహదేశం (Russia)
20. శంకతురుష్కం (Asia Turkey)
21. చీన, మహాచీనం (Chinese Empire)
22. తాలతోషకం (Tibet)
23. పార్వతం (Tartary)
24. ఆవర్తం (Arbia)
25. పారస్యం (Persia)
26. తుఖారం (Bokhara)
27. శూద్రయవన (Mecca)
28. పదానవ (Kabul)
29. కారస్కారం (Medina)
30. గాంధారం (Kandahar)
31. అపక్రాంతం (Muscat)
32. బ్రహ్మదేశం (Burma)
33. ఉపమల్వకం (Malay Peninsula)
34. సింహళం (Ceylon)
35. కన్యాకుబ్జం (Capecoriorin)

36. స్వర్గభూమి (America)
37. దక్షిణోత్తరకుమారములు (North & South America)
38. రమాకం (Australiasia)
39. తలహం (Brazil)
40. స్వర్గప్రస్థం (Polynesia)
41. దుర్గద్వీపం (Bhutan)
42. పంచనదం (Punjab)
43. దరదలింగం (Dorzeling)
44. కాశ్మీరం (Kashmir)
45. ఉత్తరకోసల (Oudh)
46. కురుజంగాలం (Kurukshetra)
47. ఇంద్రప్రస్థం (Delhi)
48. అవంతి (Ujjain)
49. సర్జలాటం (Gujeral)
50. కాంచి (Carnatic)
51. వారణాశి (Banaras)
52. కేకయ (Herat)
53. మాషికం (Mysore)
54. పాండ్య (Malabar)
55. ఉత్కళ (Orissa)
56. మిథిల (Rirhut)
57. సింధుసౌవీర (Singu Prina)
58. సురాష్ట్ర (Maharashtra)
59. మహోదయ, కన్యాకుబ్జ (Kanuz)
60. మగధ (Gaya)
61. అంగ (Rajmahal etc.)
62. పాటలీపుత్ర (Patna)
63. పుండ (Midnapur)
64. బంపా (Bhagalpur)
65. మత్స్యదేశ (Dinjpur - Rajasthan)
66. వంగగౌడ (Bakargunj)
67. ఉపవంగ (Mymaning)

68. కిలకిలా (Culcutta)
69. ప్రాగ్జ్యోతిష (Kamrup)
70. శూరసేన (Mutha)
71. రంగభూమి (Rangoon)

ఇలా రకరకాల దేశాల, నగరాల, ఖండాల పేర్లు చెప్పి, ఒక్కొక్క సైనికుణ్ణి పేరుపేరునా పలకరించి ఒక్కో దేశానికి పంపుతుంటే, సుగ్రీవుడి ఆజ్ఞలో ప్రత్యేకత ఏమిటో గమనించి ఆశ్చర్యపోయాడు రాముడు.

"ఈ దేశాలన్నీ నీకెలా తెలిశాయయ్యా .... " అని అడిగాడు రాముడు విస్మయంగా సుగ్రీవుణ్ణి.

"మా అన్న వాలి నన్ను వెళ్ళగొట్టినపుడు, అతనికి భయపడి నేను ఈ దేశాలన్నీ తిరిగాను. దేశ సంచార ఫలం ఇవ్వాళ ఇలా నాకు ఉపయోగిస్తోంది" అన్నాడు సుగ్రీవుడు.

# ఋక్షబిలం

హనుమంతుడు, అంగదుడు ఇంకా చాలామంది కలిసి దక్షిణదిశగా బయల్దేరారు. సీతను వెదుకుతూ పోతున్నప్పుడు, అంగదుడికి ఒకచోట ఎవరో ఒక రాక్షసుడు కన్పించాడు. వాడే సీతాపహరణం చేసిన రాక్షసుడు అనుకొన్నాడు అంగదుడు. ఆ రాక్షసుడు ఈ కోతిమూకని చూసి భయపడి పారిపోవడం మొదలుపెట్టాడు. పారిపోతున్నాడంటే, ఖచ్చితంగా రావణుడే అయ్యుంటాడనుకొని అంగదుడు వాణ్ణి వెంటాడి, పిడికిలి బిగించి నెత్తిమీద ఒకటే గుద్దు ఇచ్చాడు. నెత్తురు కక్కుకుంటూ వాడు అక్కడికక్కడే చనిపోయాడు.

ఆ రాక్షసుడు ఒక గుహలో వుంటున్నాడు. చచ్చినవాడు అపహరించినవాడే అయితే, - వాడి గుహలో సీత వుండేవుంటుందని లోపలంతా కలియతిరిగి వెదికారు. ఎక్కడా సీత కనపడలేదు. వీడు వాడు కాదు - అని అప్పుడు నిర్ధారించుకున్నారు.

"ఇలా వెదికితే కాలం చాలదు - సుగ్రీవుడి గడువు దాటితే, ఆయన చండశాసనుడు - తప్పకుండా శిక్షిస్తాడు -" అన్నాడు అంగదుడు. అందరూ నిద్రాహారాలు మాని వెదకడం మొదలుపెట్టారు.

ఒకచోట గొప్ప వెలుగు మధ్య 'పెనుగుహ' ఒకటి కన్పించింది వారికి. ఆ గుహ లోపలినుంచి సుగంధ ద్రవ్యాల వాసన వ్యాపింపసాగింది. హంసలు, చక్రవాకాలు, పక్షులు గుహ లోపల్నించి బైటకు వస్తూ కన్పించసాగాయి. లోపల ఏదైనా పెద్ద జలాశయం వుండి వుంటుందని అందరూ కలిసి ఆ వెలుగులో గుహలో ప్రవేశించారు.

వారు గుహలోకి కొంచెం ముందుకెళ్లారో లేదో, లోపలంతా గాఢమైన చీకటి ఆవహించింది. సింహాలు, పెద్దపులులూ ఆ చీకట్లో అరుస్తున్నట్లు విన్పించాయి.

వానర వీరులు ఒకళ్ళనొకళ్ళు పట్టుకొని నెమ్మదిగా ముందుకు నడవడం మొదలు పెట్టారు. సాహసంతప్ప వేరే దారిలేదు. భయపడి సాధించేదేమీ ఉండదు. దూరంగా ఏదో కొద్దిగా వెలుగు కన్పించింది. ఆ వెలుతురులోంచి చూస్తే లోపల మనోహరమైన తోట, అందులో ఒక కొలను వున్నట్లు కన్పించాయి. ఇంకొంచెం ముందుకెడితే, అక్కడ బంగారం వెండి తొడిగిన మందిరం కన్పించింది. ఆ మందిరంలో మధ్యన ఒక 'చదుకం' దానిమీద తేజస్సుతో వెలుగొందుతున్న ఒక వృద్ధ తాపసి కన్పించారు.

ఆ వృద్ధ తపస్విని గొప్ప ప్రభావం కల్గినదిగా కన్పించింది. ఆమెను సమీపించడానికి భయపడి, దూరంగా చేతులు కట్టుకొని నిలబడ్డారు వానరసైనికులు.

హనుమంతుడు, కొంత చొరవ తీసుకొని, ఆమెకు నమస్కరించి, "అవ్వా ! ఈ బిలం ఎవ్వరిది - నీవెవ్వరవు ? దాహం వేసి నీళ్ళకోసం ఇందులోకి వచ్చాం. ఇదంతా ఏదో రాక్షసమాయలా వుంది" అని అడిగాడు.

అప్పుడా అవ్వ "నువ్వు వూహించింది కొంత నిజమే... " అంది ! మళ్ళీ ఆమే అందుకొని "భయపడకండి ! పూర్వం మయుడు బ్రహ్మను గురించి తపస్సు చేసి, శుక్రాచార్యుడు చెప్పిన శిల్పశాస్త్రాన్ని బ్రహ్మద్వారా వరంగా పొంది ఈ కాంచన భవనాన్ని నిర్మించాడు. ఆయనకి హేమ అనే అప్సర స్త్రీతో స్నేహం కలిగింది. మహేంద్రుడు ఈ సంగతి తెలుసుకొని వజ్రాయుధంతో చంపుతానని మయుడి వెంటపడ్డాడు. మయుడు ఇంద్రుడికి భయపడి, ఈ కాంచన భవనాన్ని హేమకి ఇచ్చేసి పారిపోయాడు. ఆమెకు నేను ఇష్టసఖిని. నా పేరు స్వయంప్రభ. ఆమె పక్షాన ఈ ఇంటిని ఇలా నేనే సంరక్షిస్తున్నాను" అని వివరించింది.

ముందు నీటిని తాగి, సేదతీరండి ఫలాలున్నాయి ఆరగించండి అని మర్యాదలు చేసింది అవ్వ !

అప్పుడు హనుమంతుడు ఆమెకు చేతులు జోడించి, "తల్లీ ! నీ శరణు వేడుకొంటున్నాం. మేము రామకార్యం మీద బయల్దేరాం ... మాసం గడువులోగా సీత జాడ చెప్పాలని సుగ్రీవాజ్ఞ. ఈ బిలంలోంచి బైటపడే దారి కన్పించడంలేదు. మమ్మల్ని మాగమ్యానికి చేర్చు-" అని వేడుకొన్నాడు. అన్నిచోట్ల బలప్రదర్శన పనికిరాదని తెల్సిన జ్ఞాని హనుమంతుడు. ఆయన బ్రతిమాలుకోవడం ద్వారా కార్యం సులువుగా సాధించే మార్గం ఎంచుకొన్నాడు.




అవ్వ సంతోషించి, "ఈ బిలంలోకి ప్రవేశించిన వాళ్ళెవరూ ఇంతవరకూ బతికి బయటపడలేదు. కానీ, 'రామకార్యం' కోసం బయల్దేరినట్లు మీరు చెప్పారు కాబట్టి వదిలేస్తున్నాను- మీరు కళ్ళుమూసుకోండి మిమ్మల్ని బయటకు చేరుస్తాను" అంది.

వానరులు అలాగే అని గట్టిగా కళ్ళుమూసుకొన్నారు. ఆమె తెరవమన్నాక తెరిచారు. "అదిగో మహాసముద్రం... మీకు జయం కలుగుతుంది అని చెప్పి అంతర్ధానమయ్యింది. సముద్రం దాటితే లంక ! అవ్వ పుణ్యమా అని సముద్రానికి చిటికెలో చేరారు. ఇప్పుడు లంకని ఎలా చేరాలి ...?

బిలంలోంచి సురక్షితంగా ప్రాణాలతో బైటపడినందుకు వానరులంతా సంతోషించారు కానీ, ఈ వెదుకులాట గోల ఏమిటో ... అని విసుక్కున్న వానర యోధులు వాళ్ళలో లేకపోలేదు.

తారుడనే యోధుడు పైకే అన్నాడు – సీతాదేవిని కనుగొనలేకపోతే సుగ్రీవుడో, రాముడో శిక్షిస్తాడని భయపడతారు దేనికి ? ఆవిడ దొరక్కపోతే తప్పు మనదా ... అయినా మళ్ళీ మనం ఆ ఋక్షబిలం దగ్గరకే పోదాం రండి ! అవ్వని మంచిచేసుకొని అక్కడే సుఖంగా వుందాం .... ఆ బిలంలోకి సుగ్రీవుడూ రాలేడు – రాముడూ రాలేడు – " అన్నాడు.

అంగదుడు, మిగిలిన వానరవీరులు ఈ ఉపాయం బాగానే వుందని సమర్థించారు.

హనుమంతుడు అంతా వింటున్నాడు.

"ఆహా ! ఈ అంగదుడు అవకాశం దొరికితే సుగ్రీవుడికి ఎసరుపెట్టే లాగున్నాడు. కొంచెం జాగ్రత్తగా వ్యవహరించాలి –" అనుకొన్నాడు. సుగ్రీవుడితో అంగదుడికి స్నేహం పెంచకపోతే రాబోయే ప్రమాదం ఎలా వుంటుందో హనుమంతుడు ఊహించగలిగాడు.

అంగదుణ్ణి పక్కకు పిలిచి, "నువ్వు చిన్నవాడివి ! ఇక్కడ వున్న ఈ వానరయోధుల్లో ఎవ్వరిని నీ వెనక తీసుకువెళ్ళగలననుకొంటున్నావు ? అక్కడ సుగ్రీవుడి సంరక్షణలో పెళ్ళాం పిల్లల్ని వదలి ఇక్కడకు వచ్చిన వాళ్ళంతా నీ వెనకాల బిలంలోకి వస్తారను కొంటున్నావా .. జాంబవంతుణ్ణి తీసుకెళ్ళగలవా ? నీలుణ్ణి తీసుకెళ్ళగలవా ? అందాక ఎందుకు ? నన్ను తీసుకెళ్ళగలవా ?

అంగదా ! నువ్వు సుగ్రీవుణ్ణి వదిలి విడిగా వుండదలుచుకొంటే వుండు. కానీ, వెనక నిన్ను నమ్మి ఏ వానరవీరుడూ నీవెనక వస్తాడని నేననుకోవడం లేదు.

సుగ్రీవాజ్ఞని కాదని నువ్వెక్కడో సురక్షితంగా వుండగలననుకోవడం నీ భ్రమ ! నీ తండ్రికన్నా నువ్వు గొప్పవాడివేమీ కాదు - రాముడి భక్తులుగా మారిన ఈ వానర యోధులకన్నా నువ్వు అధికుడివీ కాదు -" అని మందలించాడు.

"సుగ్రీవుడి తర్వాత రాజువి కావాల్సిన నీకు ఇలాంటి విపరీతపు ఆలోచన రావడం మంచిది కాదు-" అని హెచ్చరించాడు.

సంభాషణ అక్కడిదాకా వచ్చింది కాబట్టి ఇంక అంగదుడు తన మనసులో మాట బైటపెట్టవలసిందే ననుకొన్నాడు.

"మారుతీ ! నీకు ఎదురు చెప్పడం నా ఉద్దేశం కాదు. కానీ, ఈ సుగ్రీవుడికి ఏ మాత్రం అయినా కృతజ్ఞత అనేది వుందంటావా ? తమ్ముడని నమ్మి గుహద్వారానికి కాపలా పెట్టిస్తే, ద్వారాన్ని మూసి ఇంటికొచ్చి వాలి చచ్చిపోయాడని చెప్పి, తల్లిలాంటి వదినగారిని చెరపట్టిన వాడికి కృతజ్ఞత వుంటుందంటావా ?

లక్ష్మణుడు బాణం పుచ్చుకొన్నాడని భయపడి సీతాన్వేషణకి మనల్ని పంపాడు కాని, నిజంగా కృతజ్ఞత ఉన్నవాడయితే, ముందే ఈ పని చేసేవాడు కదా!

రేపు తన కొడుక్కి పట్టంకట్టానంటాడు గాని, రాజ్యాన్ని నాకు అప్పగిస్తాడా...? నీకు నమ్మకం వుందిగానీ, నాకు లేదు.

ఏదో ఒక వంకతో నన్ను చంపాలనో, చంపించాలనో చూస్తాడే గాని, నన్ను ఉద్ధరించేంత ఉదారత అతనికి లేదు - అతని చేతుల్లో చచ్చేకన్నా, ఇక్కడే ప్రాయోపవేశం చేసుకొని చావడం మంచిది - నాకు సెలవిచ్చి మీరు మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి అన్నాడు బాధగా అంగదుడు.

అతని పరిస్థితిని అర్థం చేసుకొన్నాడు హనుమంతుడు. జాలిపడ్డాడు. తారుడు అంగదుడి మాటలతో ఏకీభవించాడు. నేను కూడా అంగదుడితో కలిసి ప్రాయోపవేశం చేస్తాను - అంటూ సముద్రంలో మునిగి, బైటకి వచ్చి దర్భలు పరుచుకుని దక్షిణదిశగా తలకాయపెట్టి పడుకున్నాడు.

వానర అనుచరులు అంగదుడికోసం, తారుడికోసం పెద్దపెట్టున ఏడవడం మొదలుపెట్టారు. ఈ గోలకి ఒక పెద్దపక్షి ఆకాశంనుంచి తన దేగకంటితో కిందికిచూసి, "ఎన్నాళ్ళకు తనకు కోతిమాంసం తినే అవకాశం దొరికింది ..." అనుకొంటూ రయ్యిన నేలమీదకి దూసుకురావడం మొదలుపెట్టింది. కిందికి వస్తుంటే, ఆ వానర వీరులు పెద్దగొంతుతో సీతాపహరణం, జటాయువు మరణం ... ఇలా కథలు చెప్పుకొంటున్నారు. ఆ పక్షి ఈ సంభాషణంతా విని దగ్గరగా వచ్చి-"మా అన్న జటాయువు మరణించాడా...?" అంది దుఃఖంగా.

## జటాయువు కథ

అంగదుడి పరివారం సుగ్రీవుడికి వ్యతిరేకంగా నిలవాలనే నిర్ణయించుకొంది. తమకు సంబంధంలేని ఈ సీతాన్వేషణ భారాన్ని తాము వహించడానికి వారిలో చాలామంది సిద్ధం కాలేకపోతున్నారు.

కేవలం హనుమంతుడు, జాంబవంతుడే ఈ విషయంలో గట్టిగా నిలబడ్డారు - ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలని ! అంగదుడితో సహా మిగిలినవారంతా జారిపోవడానికి సిద్ధంగా వున్నారు.

జారిపోయేవాళ్ళంతా అంగదుడు చచ్చిపోతానంటున్నాడని బిగ్గరగా ఏడవడం మొదలుపెట్టారు. తారుడు కూడా దర్భలు పరుచుకొని తానూ చచ్చిపోతాననేసరికి వాళ్ళ దుఃఖం రెట్టింపు అయ్యింది.

ఇదంతా దేనికొచ్చింది .... ?

సీతాపహరణం కారణంగా ...

ఖరదూషణాది రాక్షస సంహారం కారణంగా ...

జటాయువు సుగ్రీవుడి గురించి చెప్పిన కారణంగా ...

వాలి వధ కారణంగా ...

సుగ్రీవుడు రాజు కావడం కారణంగా ...

వానర వీరులు పెద్దగొంతుతో ఈ విషయాలన్నీ చెప్పుకొంటూ ఏడుస్తుంటే, కొండ శిఖరం మీద కూర్చున్న పెద్ద పక్షి కిందికి చూసింది.

బోలెడన్ని కోతులు ఒక్కసారే కన్పించాయి.. వీటిలో ఒక్కటి దొరికినా కమ్మటి కోతిమాంసం దొరుకుతుందని ఆశగా నేలమీదకి రావాలని ప్రయత్నిస్తోంది.

వానరవీరులు మాట్లాడుకొంటున్న మాటలు దాని చెవినపడ్డాయి.

"ఇక్కడెవరు ... ? జటాయువు పేరు విన్పించింది... జటాయువు సంగతి మళ్ళీ చెప్పండి ... గద్దించింది. ఆ పెద్ద పక్షి ! ఆ జటాయువు నా తమ్ముడు. సంపాతి నా పేరు". ఇప్పుడు చెప్పండి ... భయపడకండి – మా జటాయువు ఎలా వున్నాడు – అని మళ్ళీ గద్దించి అడిగాడు సంపాతి.

"జటాయువుని ఒక రాక్షసుడు చంపాడు" అన్నాడు అంగదుడు. ఆ మాట వింటూనే సంపాతి నేలకూలినట్లయ్యాడు.

"నా తమ్ముడు మరణించాడా ! అయ్యో ! ఆ రాక్షసుడికీ, నా తమ్ముడికీ యుద్ధం ఎందుకు జరిగింది ? ఇన్నాళ్ళకు నా తమ్ముడి పేరు విన్పించిందన్న సంతోషం అంతలోనే మాయమైపోయిందే !" అన్నాడు.

అంగదుడు ఆ ముసలి పక్షిని కొండమీదనుంచి నెమ్మదిగా నేలమీదకు దింపి సుఖాశీనుణ్ణి చేశాడు. రాముడి కథనంతా సుగ్రీవుడి పట్టాభిషేకం వరకూ చెప్పి, తాము సీతాన్వేషణకు బయల్దేరిన సంగతి వివరించాడు.

"వానరోత్తమా ! అంగదా ! జటాయువు నా తమ్ముడు. నన్ను సంపాతి అంటారు. రావణుడు నా తమ్ముణ్ణి చంపాడా ? అయ్యో ! ముసలితనం వచ్చేసింది నాకు. రెక్కలు లేని పక్షిని – ఆ రాక్షసుడి మీద తమ్ముడి పగదీర్చుకోలేని అశక్తుణ్ణి... " అని దుఃఖించాడు.

జాంబవంతుడు, హనుమంతుడు ఆయన్ని ఊరడించారు. అప్పుడు తమ చిన్ననాటి సంగతుల్ని తలచుకున్నాడు సంపాతి.

"ఆ రోజుల్లో వృత్రాసురుణ్ణి చంపేందుకు మా బలాబలాల్ని పరీక్షించుకోవాలని, నేను, మా జటాయువు ఆకాశంలో ఎవ్వరమూ ఎగరలేనంత ఎత్తుకు ఎగరాలని అనుకొన్నాం. అంత పైనించి చూస్తే భూగోళం ఒక బొంగరంలా కన్పించేంత ఎత్తుకు ఎగురుకొంటూ వెళ్ళాం. నదులు నూలుపోగులంత, మహారణ్యాలు పచ్చికబీళ్ళలా కన్పించసాగాయి. హిమాలయాలు, గున్న ఏనుగులంత కన్పించాయి.

అలా ఎగురుతూ ఎగురుతూ సూర్యమండలందాకా ఎగురుకొంటూ వెళ్ళాం. అక్కడదాకా వెళ్ళేసరికి మాకు భయం వేసింది. దృష్టి తప్పింది. ఆ వేడికి నిలువలేకపోయాం. భూమి మీదనుంచి చూస్తే అరచేయంత కన్పించే సూర్యుడు తీరా అక్కడిదాకా వెళ్ళేసరికి భూమండలం కన్నా అనేక రెట్లు కన్పించాడు. అందులోని లోకాలన్నీ ప్రళయకాలాగ్ని దగ్ధంగా వున్నాయనిపించింది.

నేను మహాప్రయత్నపూర్వకంగా మనశ్చక్షు సంధానం చేసి సూర్యుణ్ణి తేరిపార చూడాలనుకున్నాను. అంతలో నా తమ్ముడు సూర్యుడి వేడికి సొమ్మసిల్లిపోసాగాడు. నేను,

వాణ్ణి కాపాడటం కోసం నా రెక్కలు కప్పి రక్షించాను. ఆ వేడికి నా రెక్కలు కాలిపోయాయి. నేను అంతరిక్షంలో నిలవలేక మళ్ళీ భూమ్మీదకు కుప్పలా కూలిపడ్డాను. అప్పట్నించి నా తమ్ముడు ఏమయ్యాడో నాకు తెలీదు. నేను ఈ పర్వతం మీదే వుండిపోయాను... ” అన్నాడు సంపాతి.

మొత్తం మీద సంపాతి చెప్తున్న కథ అందరిలోనూ ఉత్సాహాన్ని నింపింది. అప్పటిదాకా విమర్శ – ప్రతివిమర్శలతో వేడెక్కిన వాతావరణం చల్లబడింది. హనుమంతుడు, తారుడు, జాంబవంతుడు, అంగదుడు అందరూ వచ్చి కూర్చుని శ్రద్ధగా వింటున్నారు.

“అలా రెక్కలు కాలిపోయి, ఒళ్లంతా దెబ్బలతో కోలుకోలేని స్థితిలో వున్న నన్ను నిశాకరుడనే మహర్షి రక్షించాడు. కొంత ఉపశమనం కల్గించాడు. బాధపడకు – నీవలన లోకోపకరమైన ఒక పని జరగవలసి వుంది. దాన్ని నువ్వు నెరవేర్చే రోజు వస్తుంది. అందాక ఓపికపట్టు !” అని బోధించాడు.

“రెక్కలు తెగిన పక్షిని – నా వలన జరిగే లోకోపకారం ఏమిటి ? అందువలన నాకు కలిగే విముక్తి ఏమిటీ ?” అని ఆ మహర్షిని ప్రశ్నించాడు.

“నీకు తెల్సిన ఒక రహస్యాన్ని వానరులకు చెబుతావు – అలా చెప్పగానే నీకు రెక్కలు మొలుస్తాయి” అని వివరించాడు మహర్షి !




సంపాతికి ఒక కొడుకున్నాడు. వాడిపేరు సుపార్శ్వుడు.

“రెక్కలులేని వాణ్ణి కావడంతో నా ఆహారం కూడా సుపార్శ్వుడే తీసుకువచ్చి నన్ను పోషిస్తున్నాడు.

ఒకరోజు వాడు చీకటి పడ్తున్నా ఆహారం తీసుకురాలేదు... ఎప్పటికో వచ్చాడు వుత్త చేతుల్తో. ఏమిట్రా కారణం అంటే, వాడో సంగతి నాకు చెప్పాడు.

కాటుకరాసిలాంటి నల్లని రాక్షసుడొకడు ఒక స్త్రీని చంకలో పట్టుకొని ఆకాశమార్గాన ఈడ్చుకుపోతున్నాడు. ఇద్దర్నీ ఆహారంగా తీసుకురావాలని నేను ఆకాశంలోకి ఎగిరి వాడికి అడ్డుగా నుంచున్నాను. వాడు నన్ను బతిమాలుకుంటూ దారి వదలమని ప్రాధేయపడ్డాడు !

నేను వాడి ప్రార్థనని మన్నించి దారి వదిలేశాను - వాడు మహావేగంతో వెళ్ళిపోయాడు.

ఆ ఆకాశ మార్గంలోనే పోతోన్న సిద్ధులు నా దగ్గరకు వచ్చి "వాడికి దారివదిలి మంచి పనిచేశావు. లేకపోతే ఈ పాటికి పరలోకాలకు పోయుండేవాడివి - దేవుడి దయవలన బతికిపోయావు - ఆ వెళ్ళినవాడు ఎవడో తెలుసా ... రాక్షసరాజు రావణుడు. వాడు రాముడి భార్య సీతను అపహరించుకుపోతున్నాడు..." అని చెప్పారు.

"సీతాపహరణం చేసినవాడు అక్కడెక్కడైనా కన్పిస్తాడేమోనని వెదికివెదికి వచ్చాను. అందుకే ఆహారం ఏమీ తీసుకురాలేక వట్టిచేతులతో వచ్చాను..." అని చెప్పాడు నా కుమారుడు.

"బహుశా మీరు వెదకదలచిన సీత, నా కుమారుడు చెప్పిన సీత ఒకరే అయి వుంటారు... ఆమెను అపహరించినవాడు రావణుడు. వాడు లంకలో వుంటాడు. దక్షిణ సముద్రం మధ్యలో వుంది లంక ! రామలక్ష్మణుల బాణాలకు వాడు బలికాక తప్పదు. వాడెంత తేజోబలసంపన్నుడైనా, మీ శక్తి ముందు వాడు బలహీనుడే ! ఆలస్యం చెయ్యకుండా కర్తవ్యం ఆలోచించండి - మనసులో వేరే ఆలోచనలు రానీయకండి !" అన్నాడు సంపాతి.

అతను ఆ మాట అంటుండగానే రెక్కలు పుట్టుకురాసాగాయి అందరూ ఆ వింతను కళ్ళారా చూశారు. "ఋషి వాక్యం వమ్ముపోదు. బహుశా సీతాపహరణం చేసిన రావణుడి ఆచూకీ మీకు చెప్పడమే నావలన కలిగే లోకోపకారం అయి వుంటుంది. అందుకే తిరిగి రెక్కలు మొలుస్తున్నాయి. మళ్ళీ యవ్వనం పుట్టుకొస్తోంది ! నిశాకర మహర్షీ ! నీ వర ప్రభావానికి నా నమస్సులు - " అన్నాడు సంపాతి.

తన నిజబలాన్ని పరీక్షించుకోవడం కోసం మళ్ళీ ఆకాశంలోకి రివ్వున ఎగిరి వెళ్ళిపోయాడు సంపాతి.

# సుందరకాండకు ఆ పేరెలా వచ్చింది ?

1. సుందరకాండని మిగతాకాండలకన్నా అతి సుందరంగా, అతి పవిత్రంగా వాల్మీకి రాశాడు కాబట్టి అది సుందరకాండగా సార్థకనామధేయి.
2. హనుమంతుడికి సుందర హనుమంతుడనే మరో పేరుకూడా వుంది. ఆయన్ని ముద్దుగా 'సుందరా' అని కూడా పిలుస్తారు. ఆ విధంగా అది సుందరకాండ అయ్యింది.
3. సుందరుడైన హనుమంతుడు, "అతిరూపవతి సీతా" అని వాల్మీకి వర్ణించినట్లు సుందరమైన సీతాదేవి ఆ కాండలో ప్రధాన పాత్రలుగా వుంటారు కాబట్టి దాన్ని సుందరకాండ అన్నారు.
4. శ్రీ యువనామ సంవత్సర ఫాల్గుణశుద్ధ త్రయోదశి ఉదయం ఎనిమిది గంటలకి హనుమంతుడు సుందర అనే పర్వతం మీంచి సముద్రం మీద ఎగురుతూ రావణుడి రాజ్యం ఎక్కడుందో వెదకడం మొదలుపెట్టాడు. సాయంత్రం నాలుగ్గంటలకి అరిష్టనేమి పర్వతాగ్రంమీద దిగాడు.
5. చీకట్లో హనుమంతుడుకి సాయంగా వుండేందుకోసం చంద్రుడు ఆ రాత్రి అతిసుందరంగా ప్రకాశించాడు.

సూర్యాస్తమయం అయ్యేవరకూ అక్కడే ఆగి లంకానగరంలో సుందర ఉద్యానవనంలోకి దిగాడు. సూర్యాస్తమయం తర్వాత గంటా పన్నెండు నిమిషాలకి అంటే షుమారుగా రాత్రి ఏడుంబావుకి లంకిణిని ఓడించగలిగాడు. లంకా నగరంలోకి ఎడమకాలుపెట్టి ప్రవేశించాడు హనుమంతుడు. రాచద్వారం లోంచి కాకుండా, ప్రాకారం మీంచి లంకలోకి లంఘించాడు హనుమంతుడు.

ఇన్ని సుందరమైన విషయాలు కలబోసిన అధ్యాయం కాబట్టి ఇది సుందరకాండ అయ్యిందని పండితులంటారు.

# హనుమంతుడు సముద్రాన్ని లంఘించిన తీరు

వానరవీరుల బలాలన్నీ అంచనాలు వేశారు. కొందరు లంకదాకా వెళ్ళలేము అన్నారు. కొందరు వెళ్ళగలము కానీ తిరిగి రాలేము అన్నారు. అందరూ కలసి హనుమంతుడు చెయ్యగలడని తీర్మానించారు. హనుమంతుడు అందుకు అంగీకరించాడు.

యోగాసనం వేసి, నిండుగా గాలి పీల్చుకొని బైటకు రాకుండా బంధించాడు. శరీరం గాలి బుడగలా పైకి తేలింది. సముద్రంలో కొంతదూరంలో 'సుందరం' అనే పేరున్న కొండ వుంది. హనుమంతుడు ఒక్క ఉదుటున గాలిలో ఎగిరి సుందరపర్వతం మీదకు చేరుకున్నాడు. ఆ కొండమీద నిలబడి సింహనాదం చేశాడు. శరీరాన్ని ఆకాశం

అంత ఎత్తుకు పెంచాడు. మళ్ళీ వాయుబంధనం చేశాడు. కుడిపాదంతో సుందరపర్వతం మీద తొక్కి అంతరిక్షంలోకి లఘించాడు. చేతులు బారజాపాడు. తలకాయ పైకెత్తాడు. రామబాణంలా దూసుకుపోయాడు.

ఆ వేగానికి పర్వతంమీద చెట్లు అతనితో కలిసి గాల్లోకి ఎగిరి కొంతదూరం సాగనంపినట్లు వెళ్ళి వెనక్కి వచ్చాయి. అతను రామకార్యార్థం వెళ్తున్నాడని తెలిసి వెనక్కు వచ్చేసాయని వర్ణించాడు తులసీదాసు.

హనుమంతుడు పాదంతో సుందరపర్వతాన్ని ఒక తొక్కుతొక్కి ఉప్పుని గాల్లోకి ఎగిరాడు. ఆయన అలా తొక్కి ఎగిరిన గంతుకి సుందర పర్వతం నేలలోకి పాతాళందాకా కృంగినట్లయింది.

అలా ఎగిరి వెడ్తున్న హనుమంతుడు రామబాణంలా దూసుకుపోతున్నాడంటాడు తులసీదాసు. రాముడి బాణానికి మూడు గుణాలున్నాయి.

1. రామబాణానికి జయమే గాని అపజయం లేదు. హనుమంతుడి పురోగమనానికీ అంతే ! కార్యం సాధించకుండా వెనక్కి వచ్చే సమస్యే లేదు.
2. రామబాణం వాయువేగాలతో దూసుకుపోతుంది. హనుమంతుడూ అంతే, గురిచూసి వదిలిన బాణంలానే దూసుకుపోతున్నాడు.
3. రామబాణాన్ని ఎవరూ అడ్డగించలేరు. అడ్డగించినా పేలిపోతారు. హనుమంతుడు కూడా అంతే ఊపుతో ఎగిరి వెళ్తున్నాడు.

ఇదంతా గమనించాడు సముద్రుడు. తాను నేలమట్టానికి వున్నవాడు. గాలిలో ఎగిరివెడ్తున్న హనుమంతుడు రామకార్యార్థి కాబట్టి అతనికి సహాయం ఏం చెయ్యగలనా అని ఆలోచించాడు.



తన లోపల వున్న మైనాక పర్వతాన్ని బైటకు పిలిచాడు. ఒకప్పుడు ఇంద్రుడు పర్వతాల రెక్కలుకొడ్తున్నప్పుడు వాయుదేవుడు నీకు సాయపడ్డాడు. ఇప్పుడు నువ్వు వాయుదేవుడి కొడుక్కి సాయపడాలి - అన్నాడు. మైనాకుడు సరేనని, ఏం చెయ్యాలో ఆజ్ఞాపించమన్నాడు.

హనుమంతుడికి విశ్రాంతినిచ్చి సహకరించమన్నాడు సముద్రుడు. సముద్రుడు చెప్పిన ప్రకారమే మైనాకుడు నీటిలోపలినించి పైకి లేచాడు. చేతులు జోడించికొని హనుమంతుణ్ణి నిలిపి తనమీద కొంచెం విశ్రమించమని ప్రార్థించాడు.

హనుమంతుడు చిన్నగానవ్వి ధన్యవాదాలు చెప్పి, "రామకార్యార్థిగా వెళ్ళేవాడు విశ్రాంతి తీసుకోవడం బాగోదు. పని పూర్తయ్యేవరకూ నేను విశ్రమించకూడదనుకున్నాను. నువ్వు ఇలాగే మహాపర్వతమై నిలిచి ఉండు. నీకింక ఇంద్రుడి భయం వుండదు... " అని మైనాకుడి భుజం తట్టి వెళ్ళిపోయాడు ఎగురుకుంటూ హనుమంతుడు.

# హనుమంతుడికి అడ్డంవచ్చిన నాగమాత

ఇలాంటప్పుడే వ్యక్తి అంతరంగం పరీక్షకు నిలుస్తుంది. దృఢనిర్ణయం తీసుకున్నాడా లేదా అనేది నిగ్గుతేల్తుంది. దేవతలు హనుమంతుని పరీక్షించి అతని శక్తిని లోకానికి చాటాలనుకున్నారు.

'సురస' అనే నాగమాతని హనుమంతుని అడ్డగించవలసిందిగా పంపించారు. ఒక మహాసర్పంలా ఆకాశంలోకి ఎగిరి నాగమాత హనుమంతుని మింగేస్తానంటూ ఎదురువెళ్ళింది. ఒక్కక్షణం ఓర్పుపట్టాడు హనుమంతుడు.

"తల్లీ ! రామకార్యార్థం వెడ్తున్నాను - సీతను వెతకాలని ! తిరిగి వచ్చేటప్పుడు మింగుదువుగానీ" అని దణ్ణం పెట్టి బ్రతిమాలాడు. నాగమాత మింగితీరాల్సిందేనని భీష్మించింది.

"సరే ! నన్ను మింగడం నీకు కష్టం. అయినా నీ ప్రయత్నం నువ్వు చెయ్యి" అన్నాడు. "అమ్మా తల్లీ ! అని బతిమాలినా నువ్వు వినడం లేదు. స్త్రీవై వుండీ, ఇంకో స్త్రీని రక్షించడానికి వెడ్తున్నానంటున్న విన్పించుకోవాయే .. రాముడి కార్యం ఇది అని చెప్పినా వినడం లేదు - మింగుతానంటున్నావు గదా .. మింగు .." అన్నాడు.

'సురస' తన సర్పశరీరాన్ని ఒక యోజనం పెంచింది. వెంటనే హనుమంతుడు రెండు యోజనాల పొడవున తన శరీరాన్ని పెంచాడు. ఆ నాగమాత పదారుయోజనాలు పెరిగింది. హనుమంతుడు ముప్పయి రెండు యోజనాలు విస్తరించాడు. ఆమె ఒకటి



పెరిగితే అతను రెండు పెరుగుతున్నాడు. చివరికి ఆమె నూరు యోజనాలంత పెరిగింది. అప్పుడు హనుమంతుడు ఈ నాటకానికి తెరదించాలనుకొన్నాడు. అంతే ! నలకంత సూక్ష్మరూపంలోకి దిగిపోయాడు. తిన్నగా ఆమె నోట్లోనుంచి కడుపులోనికి వెళ్ళి బైటకు వచ్చేశాడు. "తల్లీ ! నువ్వు కోరుకున్నట్టే నన్ను మింగాననుకో ! నేను నీ కడుపుదాకా వెళ్ళి బైటకొచ్చాను - ఇంక నన్నొదిలెయ్ త్వరగా వెళ్ళాలి -" అంటూ నమస్కారం పెట్టాడు.

రాముడి పట్ల హనుమంతుడికి గల నిబద్ధతని పరీక్షించే దేవతల ప్రేరణతో తాను ఇలా చేసినట్లు చెప్పి, అతన్ని మెచ్చుకొంది. నీలాంటి నమ్మకమైన రామదూత తప్పకుండా రామకార్యాన్ని సాధించగల్గుతాడని ఆశీర్వదించి పంపించింది.

## హనుమంతుడికి స్వాగతం పలికిన లంకిణి

లంకానగరాన్ని కాపాడే ఉద్యోగం చేస్తోంది కాబట్టి ఆమెను లంకిణి అన్నారు. ఆమె ఉద్యోగం నగరద్వారం బైటే ! లోపలికి ఈగలూ, దోమలూకూడా రాగూడదన్నంత కఠినంగా ఆమె కావలి కాస్తుంది.

హనుమంతుడు సముద్రం దాటి ఒడ్డున చేరి అక్కడ ఒక పర్వతం పైకి ఎగిరి నుంచుని లంకానగరాన్ని, దాని ఆసుపాసుల్నీ అధ్యయనం చెయ్యడం మొదలుపెట్టాడు. ఎటునుంచి ఎలావెళ్ళాలో చక్కని పథక రచన చేసుకొన్నాడు.

ఎదురుగా నగరద్వారం. దాన్ని భయంకరమైన ఆడరాక్షసి కావలి కాస్తూ ద్వారానికి అడ్డంగా నిలుచునుంది. అందుకని, హనుమంతుడు చిన్న దోమరూపంలో లోపలికి

దూరాలని అనుకొన్నాడు. కానీ, ఆ దోమని పసిగట్టి చేత్తో పట్టింది లంకిణి ! క్షణం ఆలస్యం అయితే రెండువేళ్ళతో నలిపేసేదే .... వెంటనే హనుమంతుడు వానరరూపంలోకి మారి, ఒకే ఒక గుద్దుతో ఆమె ముఖం పగులకొట్టాడు. దాంతో లంకిణి గిర్రున తిరిగి నేలమీద పడింది. పగిలిన ఆమె ముఖంలోంచి రివ్వున రక్తం ఎగచిమ్మింది.

ఆమె వెంటనే లేచి నుంచుని, చేతులుజోడించి, వానర మహాత్మా ! అంది. ఆశ్చర్యపోయాడు హనుమంతుడు. ఒక గుద్దుకే లంకిణి ఇంత లొంగిపోవడం అతను నమ్మలేకపోయాడు. ఆమె ముఖం తుడుచుకొని, హనుమంతుడికి ఒక గొప్ప దేవరహస్యం చెప్పింది. బహుశా ఈ రహస్యాన్ని ఎవరికీ ఆమె చెప్పి వుండదు. ఇవ్వాళ చెప్పవలసిన అవసరం వచ్చింది కాబట్టి బైటపెట్టింది.

"వానరోత్తమా ! బ్రహ్మదేవుడు లంకానగరానికి వచ్చి, రావణ సోదరులకు వరాలిచ్చి తిరిగి ఇదే దారిలో వెడ్తున్నప్పుడు నేను వంగి దణ్ణం పెట్టాను. ఆయన నన్ను ఆశీర్వదించి, మీ రాజుగారికి చావులేకుండా వరాలిచ్చాను. కానీ, ఏదో ఒకరోజు ఒక వానరుడు వచ్చి మొట్టమొదటగా నీపైనే తలపడతాడు. ఏ వానరుడు నిన్ను తన గుద్దుతో దెబ్బతీస్తాడో అతని వలన రావణుడికి అపాయం వుంటుంది. ఇది గుర్తుపెట్టుకో – అని నాకు చెప్పి వెళ్ళిపోయారు.

ఇన్నాళ్ళకి వానరుడివి నువ్వు గుద్దుతో నన్ను బలంగా దెబ్బతీశావు. బ్రహ్మవాక్కులు నిజమౌతాయి. "రావణుడికి ముప్పు త్వరలోనే వుంది. మా రాక్షసజాతికి వినాశనం తప్పదు కాబోలు" అని ఏడ్చేసింది. హనుమంతుడు కరిగిపోయాడు. తాను వచ్చిన రామకార్యం వివరించాడు. లంకిణిది బైట కావలి ఉద్యోగం. లోపలి వ్యవహారాలగురించి ఆమెకు పరిజ్ఞానం వుండకపోవచ్చు. అందుకని, "హనుమా ! నీతో ఈ కొద్దిసేపు సత్సాంగత్యం వలన నాకెంతో హాయిగా వుంది. రాముణ్ణి ధ్యానిస్తూ నిరభ్యంతరంగా లోపలికి వెళ్ళు. అయితే సూక్ష్మరూపంలో వెళ్ళు. నిన్నెవరూ గుర్తించలేరు. నీ కార్యాలన్నీ సిద్ధిస్తాయి. మీ సుగ్రీవుడి ఆజ్ఞ నెరవేర్తుంది. నీ రామకార్యం పూర్తి అవుతుంది. మీ వానరులంతా పడిన శ్రమ ఫలిస్తుంది. సీతాదేవికి దుఃఖపశమనం కలుగుతుంది. రాముడి కృపవలన శత్రువులంతా మిత్రులౌతారు. సముద్రం గోష్పాదం అవుతుంది. జగన్నాథుడే అనుకూలుడిగా వుంటే, సర్వం అనుకూలం అవుతుంది–" అంది లంకిణి.

హనుమంతుడు మళ్ళీ దోమలా మారి జుయ్యిన నగరంలోకి ఎగురుతూ వెళ్ళాడు. లంకిణి సహకారం ఆ క్షణాన హనుమంతునికి ఒక అనుకోని అవకాశం అయ్యింది.

# లంకలో హనుమంతుడు వెదికిన స్థావరాలు

లంకానగరంలోకి ప్రవేశించి సీతని వెదకడం మొదలుపెట్టేసరికి రాత్రి ఏడుంబావు దాటింది.

అక్కడినించి అడుగడుగునా సీతాదేవి జాడకోసం వెదకడం మొదలుపెట్టాడు.

ఆమె ఇక్కడే ఎక్కడో భద్రంగా వుందనే వార్త అతన్ని ఉత్సాహపరిచింది. ఆమె ఎలా వుంటుందో తెలియకపోయినా, తెలుసుకోవడం పెద్ద కష్టం ఏమీ కాదనిపించింది హనుమంతుడికి.

1. దశగ్రీవుడు, ప్రహస్తుడు, అతికాయుడు, మహాకాయుడు, మహాపార్శ్వుడు, కుంభకర్ణుడు, మేఘనాథుడు, విభీషణుడు, విద్యుజ్జిహ్వుడు, విప్రచిత్తుడు, కుంభుడు, నికుంభుడు, అక్షయకుమారుడు, హ్రస్వరోముడు, దీర్ఘరోముడు, వక్రరోముడు, క్షురికుడు... వీళ్ళంతా రాక్షసులలో ప్రముఖ వీరులు... వీళ్ళందరి ఇళ్ళన్నీ ఒక్కొక్కటే జాగ్రత్తగా గదులన్నీ వెదికాడు.
2. గుర్రపుశాల, ఏనుగులశాల, నర్తనశాలలు వెదికాడు.
3. ఒకచోట పుష్పకవిమానం కన్పించింది. అందులోకూడా వెదికాడు.
4. వీరభటులనదగిన వాళ్ళందరి ఇళ్ళూ వెదికాడు.
5. రావణాసురుడి ఇల్లు కూడా వెదికాడు. అక్కడ రావణుడి కౌగిలిలో ఒదిగిన మండోదరి కన్పించింది. ఆమెని చూసి 'సీతాదేవి' అనుకొని కొన్ని నిమిషాలు భ్రమపడ్డాడు. సీతాదేవి అంత సుందరంగా మండోదరి వుండివుండవచ్చు. లేదా, మండోదరి, సీత ఒకే పోలికలు కలిగి తల్లీ కూతుళ్ళ మాదిరి వుండివుండవచ్చు !
6. రావణుడి కేళీ మందిరంలో నగ్నంగా పడివున్న సుందరీమణులందరినీ చూశాడు. వీళ్ళలో ఎవరైనా సీతాదేవి కావచ్చేమో...

   మహాపతివ్రతామణి సీతాదేవి రావణుడితో ఇలా వుంటుందనే ఊహరావడం కూడా తప్పేననుకున్నాడు.
7. తెల్లవారుఝామున మూడున్నరకి అశోకవనంలోకి ప్రవేశించాడు.
8. అశోకవనం అంతా వెదుకుతుంటే, శింశుపా వృక్షం కింద శోకమూర్తిలా కూర్చొనివున్న సీతాదేవిని చూశాడు.
9. రావణుడు ఆ సమయంలో అక్కడ నిలబడి, తనకు లొంగిపోవలసిందిగా బెదిరిస్తున్నాడు. "రాముడు ఈ స్థావరాన్ని కనుక్కొని ఇక్కడకు రాగలగడం అసాధ్యం" అని చెప్తున్నాడు. ఈ సంభాషణని స్వయంగా విన్నాడు హనుమంతుడు. ఆమే శ్రీరాముడి ధర్మపత్ని సీతాదేవి అని రూఢిపర్చుకున్నాడు.

10. రావణుడు బెదిరించి వెళ్ళిపోయాక, సీతకు తన గురించి చెప్పుకొని ఆమె తనని నిజమైన రామదూతగా నమ్మిన తర్వాత రాముడి ఉంగరం అందించి, రాక్షస వీరులతో యుద్ధంచేసి, అక్షయకుమారుణ్ణి చంపి, ఇంద్రజిత్తుకి పట్టుబడి, రావణుడి దగ్గరకి ఆయన్ని తీసుకెళ్ళేసరికి ఇంకో గంటంబావు కాలం పట్టింది. అంటే, తెల్లవారుఝామున నాలుగు ముప్పావు అయ్యింది అప్పటికి.

11. లంకాదహనం పూర్తిచేయడానికి 48 నిమిషాలు పట్టింది. అంటే ఐదున్నర దాటింది.

12. మళ్ళీ సీతను దర్శించుకొని, ఆమె అందించిన మణిని తీసుకొని బయల్దేరడానికి ఇంకో ఐదారు నిమిషాలు పట్టింది. మొత్తంమీద, ఉదయం ఐదుగంటల ముప్ఫయ్యారు నిమిషాలకి లంకనించి బైటపడ్డాడు హనుమంతుడు.

13. ఆరోజున సూర్యోదయం ఆరుగంటల ఆరు నిమిషాలకు అయ్యింది. సూర్యోదయం కావడానికి ముందే సముద్రం లంఘించి గంటా ముప్ఫయ్యారు నిమిషాలసేపు ఆకాశంలో ప్రయాణించి దక్షిణ సముద్ర తీరానికి చేరుకున్నాడు హనుమంతుడు. అంటే గం॥ 7-12 నిమిషాలకి సముద్రం ఒడ్డున తన కోసం ఎదురు చూస్తున్న అంగద జాంబవంతాదుల్ని కలుసుకొన్నాడు.

14. ఆ పూటకి అందరూ సంతోషంగా మధువనంలోకి వెళ్ళి పూటుగా "మధువు" సేవించారు. ఆ తర్వాత అందరూ కలిసి వేగంగా అదే రోజు ఫాల్గుణ శుద్ధ 14 (చతుర్దశి) మధ్యాహ్నం గం॥ 1-15 ని॥లకు శ్రీరాముడి దగ్గరకు చేరుకున్నారు.

15. సరిగ్గా 13 సంవత్సరాల 11 నెలల 8 1/2 రోజులయ్యింది శ్రీరాముడు అప్పటికి వనవాసం ప్రారంభించి. అంటే 1 నెల 21 1/2 రోజులు మాత్రమే గడువుంది - రావణ వధ చేసి తను అయోధ్యకు తిరిగివెళ్ళడానికి ! అదీ సంగతి !!

## లంకానగరంలో శ్రీరాముడి పేరుతో ఓ ఇల్లు

తులసీదాసు రామాయణంలో విచిత్రమైన విశేషాలు చాలా కన్పిస్తాయి. వాల్మీకి తన మనసుకు తట్టినట్టు, ఊహకందినట్టు రామాయణాన్ని రాశాడు. ఇంకా అనేకమంది అలాగే తమ ఊహాశక్తిననుసరించి అన్ని రామాయణాలు రాశారు. తానుకూడా అలాగే తన రామాయణాన్ని రాస్తున్నట్లు స్వయంగా చెప్పుకున్నాడు కూడా!

తులసీదాసు చిత్రించిన ఈ అందమైన కథలో ఎంత నాటకీయత కన్పిస్తుందో చూడండీ ...

లంకిణి స్వయంగా దారులు చెప్పి మరీ హనుమంతుణ్ణి నగరంలోకి పంపించింది. నగరంలోకి వచ్చాడు గాని, ఇంత మహానగరంలో జానకి ఎక్కడుందో తెలుసుకోవడం

ఎలాగో హనుమంతుడికి అర్థం కాలేదు. లంకలోనే వుంది అనే సమాచారం గట్టిగా తెలిస్తే ఎలాగైనా వెదికి వెదికి కనుక్కోవచ్చు. లంకలోనే వుందని నమ్మడానికి ఆధారమేమీ లేదు కదా ...

అలా వెదుకుతూ పోతూవుంటే విష్ణుమూర్తుల వారి గుడి కన్పించిందట ... 'హరి' పేరు చెబితేనే మండిపడే రావణాసురుడి లంకానగరంలో ఒక 'హరిమందిరం' వుందని చెప్పడానికి తులసీదాసుకు నిజంగా సాహసం కావాలి.

హరిమందిరంలో మూర్తులు ఎవరూ కన్పించలేదు. దాని ఎదురుగా వున్న ఇంటివైపు సూక్ష్మరూపంలో ఎగురుతూ వెళ్ళాడు హనుమంతుడు. ఆ ఇంటి గుమ్మంమీద 'శ్రీరామ' అని రాసి వుందిట ! ఆ ఇంటి చుట్టూ విష్ణుతులసి మొక్కలు తోటలా పెరిగి వున్నాయట. హనుమంతుడికి ఆనందం, ఆశ్చర్యం ఒకేసారి కలిగి ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. ఇది "కలా .... ? నిజమా .... ? లేక రాక్షసమాయ కాదుగదా .... ? మాయకోసం అయినా హరి భజన, రామనామస్మరణ చేసినవాడు పుణ్యాత్ముడు అవుతాడు ... !" ఇలా అనుకొంటున్నాడు హనుమంతుడు. ఆ ఇంట్లో వున్నదెవరో హనుమంతుడికేం తెలుసు ?

హనుమంతుడు బిత్తరపోయి చూస్తూండగా ఆ యింటి యజమాని నిద్రలేచాడు! లేచి రామనామస్మరణ చెయ్యసాగాడు. మొత్తం మీద యీయనెవరో సత్పురుషుడేనని నమ్మకం కుదిరింది హనుమంతుడికి. లోపలికి వెళ్ళి ఆయన్ని కలుసుకోవాలని మనసు తొందర చెయ్యసాగింది. ఆయన్ని ఏ రూపంలో వెళ్ళి కలుసుకోవాలా ... అని ఆలోచించాడు.

బాగా ఆలోచించి, బ్రాహ్మణుడి రూపంలో ముందుకు వెళ్ళి తలుపుతట్టాడు. ఇంటాయన తలుపుతీసి, ఎదురుగా వున్న బ్రాహ్మణుణ్ణి లోపలికి ఆహ్వానిస్తూ నమస్కరించాడు.

"బ్రాహ్మణవర్యా ? తమరెవరు ? ఇక్కడకు ఎలా రాగలిగారు ?" అనడిగాడా ఇంటాయన. "హరిదాసులని నా మనసులో ఆప్యాయత కల్గింది తమరిమీద. ఒకవేళ నేరుగా మీరు రామదాసులే అయితే నా జన్మధన్యం –" అన్నాడు. అలా అనాలని ఆ క్షణాన ఆయనకు ఎందుకు అన్పించిందో తెలియదు.

ఆయన భక్తిశ్రద్ధల్లో ఎక్కడా రాక్షసత్వం, కుటిలత్వం లేకపోడంవలన ఇదంతా నిజమేనని నమ్మకం కల్గింది హనుమంతుడికి. తన పేరు, తన లక్ష్యం, తాను వచ్చిన పని మొత్తం పూసగుచ్చినట్లు చెప్పేశాడు.

పరమానందం చెందాడు ఆ ఇంటాయన.

"వాయునందనా ! తలలో నాలుకలాగా, పళ్ళమధ్య పడి నలిగిపోకుండా నన్ను నేను కాపాడుకొంటూ బతుకుతున్నవాణ్ణి. నేను రాక్షస వంశంలో పుట్టడం వలన తామసుణ్ణి.

నీ అంత బుద్ధికుశలత, భక్తిభావం నాకెలా కుదుర్తాయి ? ఇప్పుడు నా కన్పిస్తోంది... భగవంతుడి కృప కలిగినప్పుడే మీ వంటి సజ్జనుల సాంగత్యం దొరుకుతుందని!" అన్నాడు.

అప్పుడు హనుమంతుడు వినయంగా, మహాత్మా ! తమరెవరో నాకు తెలియదు. ఎలాంటి కల్లాకపటాల్లేకుండా సేవించేవారిపైన శ్రీరాముని కటాక్షం ఎప్పుడూ వుంటుంది. ! తమరు తామసుణ్ణన్నారు. నేనెవరు ? కులీనుణ్ణి. వానరాన్ని. చంచలస్వభావం కల్గినవాణ్ణి. అన్నివిధాలా హీనుణ్ణి. పొద్దున్నే లేచి ఎవరైనా నా పేరు తలుచుకుంటే, ఆ పూట వారికి భోజనం దొరకదు... అలాంటివాణ్ణి - నాకు రాముడి దయ కలగలేదా... " అన్నాడు అంతకన్నా విధేయంగా హనుమంతుడు. ఆ ఇంటాయన మనసు శాంతించినట్లు కన్పించింది ఆ మాటలకి !

"పవనపుత్రా ! నేను రావణుడి సోదరుణ్ణి. అతని మంత్రుల్లో ఒకణ్ణి. నాపేరు విభీషణుడు. సీతాపహరణం చేసినప్పుడు ఇది మంచిది కాదని గట్టిగా వాదించి, రావణుడి మందలింపులకు గురయిన వాణ్ణి. సీతాదేవి అశోకవన వాటికలో వుంది. అదిగో ఆ కన్పించేదే అశోకవనం - " అన్నాడు విభీషణుడు !

హనుమంతుడు మళ్ళీ సూక్ష్మరూపం ధరించి విభీషణుడు చెప్పిన దారిన అశోకవనానికి ఎగిరివెళ్ళాడు.

# మూడుజడల రాక్షసికొచ్చిన కల

సీతకి కాపలా కాస్తున్న రాక్షస స్త్రీల బృందం ఓ మూడు జడల రాక్షసి ఆధీనంలో పనిచేస్తున్నారు. దానిపేరు త్రిజట ! పేరుకుతగ్గ రాక్షసే. దానికి అప్పుడే ఒక కల వచ్చిందిట... ఇంకా తెల్లవారకమునుపే మిగిలిన రాక్షస స్త్రీలందర్నీ లేపి తనకొచ్చిన కల గురించి చెప్పడం మొదలుపెట్టింది -

"స్నేహితులారా ! నాకో వింత కలవచ్చింది. నాకు కలలో శ్రీరాముడు కన్పించాడు.

ఆయన తెల్లని బట్టలు తొడుక్కొని లక్ష్మణుణ్ణి వెంటపెట్టుకొని తెల్లహంసమీద ఆకాశమార్గంలో లంకానగరంలోకి వచ్చాడట!

నాలుగు దంతాల ఏనుగుమీద నగరం అంతా ఊరేగాడట !

ఊరంతా తిరిగి, చివరికి సీతాదేవి దగ్గరకు వచ్చాడట. సీతాదేవికూడ తెల్లని చీర ధరించి, ఆయన ఒడిలోకి చేరిపోయిందట!

ఆకాశమార్గంలో వాళ్ళిద్దరూ అలా హాయిగా ఎగిరిపోతుంటే సీతాదేవి సంతోషం పట్టలేక చేతులు చాచి, సూర్య చంద్రుల్ని పట్టుకొందిట!

రాముడు సకల చరాచరాలతో సహా ఈ బ్రహ్మాండ సృష్టినంతా చేత్తో పట్టుకొని నోట్లో పెట్టుకొని మింగేశాడట !

ఇలా వచ్చిందేమిటీ నాకు కల ! ఇదేమైనా అపశకునం అయివుంటుందా ..."
అనడిగింది కలగురించి గుర్తున్నది గుర్తున్నట్లు చెప్పి త్రిజట !

చెట్టుమీద కూర్చుని అంతా వింటున్నాడు హనుమంతుడు.

త్రిజట తన స్వప్నంలో విశేషాల్ని విడమరిచి చెప్తోంది.

"నాకు కలలో అనంతమైన పాలపుంత స్పష్టంగా సాక్షాత్కరించింది. దాని మధ్య తెల్లని మహాపర్వతం కూడా సాక్షాత్కరించింది. దానిమీద నాలుగు దంతాల ఏనుగు, ఏనుగుమీద శ్రీరాముడు కన్పించారు.

నేను ఎందుకో పక్కకు చూశాను.

అటుపక్కన రాముడు తూర్పుకు తిరిగి మహార్ఘాతాసనం మీద కూర్చున్నాడు. ఆయన పాదపద్మాలకు సురవర కిరీటాశ్రీరత్నాలైన దేవదేవులంతా వరుసగా వచ్చి నీరాజనాలు ఇచ్చుకుంటున్నారు. ఆ పరమేష్ఠి కూడా మహర్షులను వెంటపెట్టుకొని వచ్చి రాముడిని సేవించుకొన్నాడు. సీతాదేవి ఆయన పక్కనే కూర్చునుంది.

నేను అలా చూస్తుండగానే నా దృష్టి మళ్ళీ పక్కకు మళ్ళింది.

అక్కడ రాముడు తన మానవ రూపాన్ని వదిలి, శ్రీ మహావిష్ణువు రూపంలో శంఖచక్రగదాది ఆయుధాలు ధరించి దివ్యాసనంపైన కూర్చుని వున్నాడు. చరాచర భూత వర్గాలన్నీ ఆయన్ని సేవిస్తూ కన్పించాయి. సురలు, గరుడలు, ఉరగలు, పన్నగలు, గంధర్వులు సాష్టాంగాలొనరుస్తూ కన్పించారు. కైవారాలు చేస్తున్నారు. అప్సరసలు తమ నేర్పుకొద్దీ నర్తిస్తూ కన్పించారు. గంధర్వులు అద్భుతంగా పాడుతున్నారు. బ్రహ్మాండ కటాహవిస్ఫోటనంగా వివిధ వాయిద్యాలు మ్రోగుతున్నాయి.

ఆ విష్ణువు రూపంలో సీతను తీసుకొని పుష్పక విమానం ఎక్కి రాముడు ఉత్తర దిక్కుగా బయలుదేరి వెళ్ళాడు.

రావణుడు నూనెలో ముంచిన గన్నేరు పూలదండ మెడలో వేసుకొని ఎర్రటి బట్టలు కట్టుకొని వున్నాడు. అతను అమాంతం పుష్పకవిమానంలోంచి తటాలున ఎవరో తోసేసినట్లు నేలమీదపడ్డాడు... ఈ దృశ్యం నా కలలో స్పష్టంగా కన్పించింది.

ఆయన్ని ఎవరోగాని బోడి తలతో వున్న ఒక ఆడది నల్లటి చీరతో కట్టేసి గాడిదల బండిమీద దక్షిణదిశగా లాక్కుపోతోంది...

గాడిదల బండిమీంచి, దారిమధ్యలో దూరి పిచ్చి పిచ్చిగా ఏవేవో మాట్లాడుతూ మలదుర్గంధ బంధురమైన చీకటి నూతిలోకి దూకాడు రావణాసురుడు.

అప్పుడా నల్లని స్త్రీ రావణుడి మెడలో ఒక తాడుకట్టి బైటకు లాగి, మళ్ళీ దక్షిణ దిశగా ఈడ్చుకుపోతోంది...



ఈ నల్లని స్త్రీ మృత్యుదేవతేనంటావా.... ఇదే నిజంగా జరిగితే రావణుడికి చావూ, సీతకు విముక్తి తప్పకుండా జరుగుతాయి" అని తన కల గురించి వివరించసాగింది త్రిజట ! వింటున్నారు రాక్షసస్త్రీలు.

అంతలోనే రావణుడు పందిమీద, ఇంద్రజిత్తు మొసలిమీద, కుంభకర్ణుడు ఒంటిమీద ఎక్కి యముడి దిశలో వెళ్తున్నారు.

నూనెలు కారుతూ వాళ్ళ వెనక రావణుని పుత్రులు, వాళ్ళ సైనిక పరివారం అంతా అనుసరించి వెళ్తున్నారు... అందరూ యమపురివైపే వెడ్తున్నారు.

లంకానగరాన్ని కోతులు పూర్తిగా తగలబెట్టి భస్మీపటలం చేశాయి ... రాక్షసస్త్రీలు నూనెలు తాగుతూ తగలబడ్తున్న లంకానగరంలో దిక్కుతోచక గుండెలు బాదుకుంటూ అటూ ఇటూ తిరుగుతున్నారు !

విభీషణుడు మాత్రం తెల్లని వస్త్రం కట్టుకొని నలుగురు మంత్రులతో సహా లంకారాజ్యానికి రాజుగా పట్టాభిషేకం చేసుకొన్నాడు. తెల్లటి గొడుగు నీడలో ఆయన సురక్షితంగా వున్నాడు.

సఖులారా ! ఇలాంటి కల తెల్లవారుఝామున వచ్చింది నాకు-నిజమౌతుందంటారా... ?

మనమేమో రావణుడి 'ఆజ్ఞ' మేరకు ఈ సీతమ్మని రకరకాలుగా హింసిస్తున్నాం... రాముడి బలాన్ని తక్కువ అంచనా వేయకూడదు. నాకు కలవచ్చిందని కాదు - రాముడు వచ్చి రావణుణ్ణి చంపి సీతని తీసుకెళ్తాడని ఎందుకో నా మనస్సు స్పష్టంగా చెప్తోంది. మీరు మరీ కన్నుగాననట్లు సీతని హింసించడం మానేయండి !

దుఃఖంలో వున్నవాళ్ళ గురించి ఇలాంటి కలగని, దాన్ని వాళ్ళకు వివరించగలిగితే, వాళ్ళ దుఃఖం ఉపశమిస్తుంది ! ఇవ్వాల్టితో సీత మనస్తాపం తీరినట్లే ! ఇంకనుంచైనా ఆమెని కొంచెం చక్కగా చూసుకోండి !!

"అమ్మా ! సీతమ్మతల్లీ ! నీకు శుభస్కరమైన చక్కని కలగన్నాను - ఇవ్వాల్టితో నీ కష్టాలు ఎండిపోయినట్లే భావించు " అని ఊరడించింది సీతని త్రిజట !!

# అశోకవనంలో శోకమూర్తి సీత

అశోకవనంలో సీతాదేవి తలను వంచుకొని తన పాదాల వంకే చూస్తూ కూర్చుంది. ఆమె మనసంతా శ్రీరాముడి చరణారవిందాలమీదే లగ్నమై వుంది. వియోగానికైనా, సంయోగానికైనా చరణాలే కదా ప్రధానం. ఆమె చరణాలు శ్రీరాముడి దగ్గరకైనా వెళ్ళాలి. లేదా శ్రీరాముడి చరణాలు ఆమెవద్దకు రావాలి...

"ఏకవేణీధరా ... దీనా, భర్తృ చింతాపరాయణా, భూమిశయ్యా వివర్ణాంగీ..." అంటాడు వాల్మీకి మహర్షి - మూర్తీభవించిన శోకంలా వున్నదట సీత ! ఈ రెండేళ్ళకాలంలో సంప్రోక్షణం లేక జుట్టు జడలుగట్టుకొని అంటుకుపోయి వుందట. నిద్రాహారాలు లేక కృశించిపోయి దీనమూర్తిలా వుంది. ఆమె అనుక్షణం రామా రామా... అంటూనే గడుపుతోంది - ఆ నేలమీదే కూర్చుని, ఆ నేలమీదే పడుకొని రోదిస్తోన్న అపర శోకమూర్తి సీతాదేవిని చూసి కళ్ళుచెమర్చాయి హనుమంతుడికి. మనసులోనే ఆమెకు నమస్కరించుకున్నాడు.

దగ్గరలోనే వున్న ఒక చెట్టెక్కి, సూక్ష్మరూపంలో ఆకులచాటున దాగి అంతా గమనిస్తున్నాడు. అంతలో రావణుడు అక్కడకు ప్రవేశించాడు. మొదట బతిమాలడం మొదలుపెట్టాడు. "కన్నెత్తి చూడు సుందరీ ! అంటూ... "అవసరం అయితే మరికొందరితో నీకు ఊడిగం చేయిస్తాను" అని కూడా అన్నాడు.

ఒక గడ్డిపరకని పీకి, తుంచి దూరంగా విసిరేసింది. దాని అర్థం ఏమిటో రావణుడికి తెలుసు. "రాముడొస్తాడు - నీ అంతు చూస్తాడు జాగ్రత్త - " అంది రౌద్రంగా! ఆమె కళ్ళు ఎర్రని చింత నిప్పుల్లా వున్నాయి.

ఆమె మాటలకు రావణుడు ఉగ్రుడైపోయాడు. వజ్రాయుధం తీసి చంపేస్తానంటూ సీతమీదకు హుంకరిస్తూ దూకపోయాడు. సరిగ్గా ఆ సమయానికి మండోదరి అక్కడకు వచ్చింది. అంతపనిచెయ్యవద్దని రావణుణ్ణి వేడుకొంది ! "నువ్వడిగినట్లే సీతకు ఊడిగం చెయ్యడానికి సిద్ధమే ! కానీ, ఆమెను హింసించకు - చంపాలని చూడకు" అని వేడుకొంది మండోదరి ! ఆ సమయానికి మండోదరి అక్కడకురావడం రావణాసురుడికి ఇష్టం వుంటుందా ... ?? కానీ, ఆమె వచ్చింది ! 'ఛిత్' అంటూ చిందులు తొక్కుతూ వెళ్ళిపోయాడు

రావణుడు. వెళ్తూ వెళ్తూ ఈ సీతని మీకూ చేతనైనన్ని హింసలు పెట్టండి. నెలరోజులు గడువిస్తున్నాను, ఈలోపు ఆమె మారిందా సరే... లేకపోతే చంపేస్తానంటూ హెచ్చరించి మరీ వెళ్ళాడు. మండోదరి కరుణ నిండిన హృదయంతో సీతని ఆప్యాయంగా పలకరించి వెళ్ళింది.

సీతకు దుఃఖం ఆగడంలేదు. ఈసారి రాక్షస స్త్రీలు ఆమెను ఓదార్చసాగారు "నెల రోజులు గడువుపెట్టాడు మీ ప్రభువు. నాకు చచ్చిపోయే ఉపాయం చెప్పండి" అని రోదించింది సీత. ఈ అశోకవనంలో చితిని పేర్చుకొని చచ్చిపోవడానికి తనకు నిప్పెక్కడ దొరుకుతుందీ ... ?

"చంద్రుడు నిప్పుల కుప్ప ... నావంటి దౌర్భాగ్యురాలికి ఒక నిప్పయినా వదలడు కదా... అశోకవృక్షమా... పేరుకు తగిన వృక్షానివైతే నా శోకాన్ని పోగొట్టు. కొంచెం నిప్పు ఇప్పించు... ఈ దేహం త్యాగం చేస్తాను... " అని బావురుమంది సీత... వింటోన్న హనుమంతుడి కంటివెంట ధారలుగా నీళ్ళు స్రవించాయి.

ఆమె అలా అంటున్నప్పుడు హనుమంతుడికి ఏంచెయ్యాలో తోచక తనచేతిలో రాముడు ఆనవాలుగా ఇచ్చిన ఉంగరం వుందికదా... దాన్ని ఆకాశంలోంచి ఊడిపడిన నిప్పుకణికలా సీతాదేవి పాదాలదగ్గరపడేలా జారవిడిచాడు. చెట్టుపైన హనుమంతుడు చెట్టుక్రింద శోకమూర్తి సీతాదేవి.

ఉంగరాన్ని చూసింది సీత... ఆమె మనసు పరమానందభరితమయ్యింది. ఇది రాముని ఉంగరమే ! నా రాముని ఉంగరమే... ఇక్కడకు ఎలా వచ్చింది...? ఇదీ ఇంకా రాక్షసమాయ కాదుకదా...

రాక్షసస్త్రీలంతా ఒక్కొక్కరే నిష్క్రమించారు... ఎవ్వరూ ఉంగరం పడటాన్ని గమనించినట్టు లేదు. వంటరిగా వుంది సీతాసాధ్వి... చెట్టుమీద వుండి హనుమంతుడు "తల్లి !" అని పలకరించాడు. ఆశ్చర్యంగా తలెత్తి చూసింది సీత. ఎవరూ కన్పించలేదు.

రెండుచేతులూ జోడించి నమస్కరించాడు హనుమంతుడు. ఆయన చూపుల్లో భక్తి తాండవిస్తోంది. ఆమె చూపుల్లో కరుణ వర్షిస్తోంది. కానీ, ఆయన ఆమెకు కన్పించలేదు.

తన మృదుమధురమైన గాత్రంతో ఆమెకు మాత్రమే విన్పించేలా రామచరిత గానం చేయడం ప్రారంభించాడు హనుమంతుడు. అమృతం చిందుతున్న ఆ మహాపండితుడి మృదువచనాలకు పరమానందం పొందసాగింది సీతమ్మ... ఆమెకు నమ్మకం కుదిరింది. నిస్సందేహంగా ఇది రాక్షస మాయకాదు... కాకూడదు !! కానీ, ఈ పాడిన వారెవరూ ? ఇక్కడకు ఎలా రాగలిగారు.. వచ్చి కన్పించరేం...?

'తమ్ముడా ! పరమపావనమైన రామచరితను గావిస్తున్న నీవెవరు ? ఎదురుగా కన్పించవేమిటీ...' అని ప్రశ్నించింది సీతమ్మ. ఇది రాక్షస మాయకాదని నిర్ధారించుకున్న సంగతి గమనించాడు - హనుమంతుడు. తన నిజరూపంతో చెట్టుదిగి ఆమె ముందు చేతులు జోడించి నిలబడ్డాడు. వానర రూపాన్ని చూశాక మళ్ళీ అనుమానం మొదలయ్యింది సీతలో... ఇది రాక్షసమాయేనేమో ... కాకుండా వుంటే ఎంత బావుణ్ణు... నేనెంత దురదృష్టవంతురాల్నీ... తన్నుకొస్తున్న దుఃఖంతో ముఖం ప్రక్కకు తిప్పుకొంది సీతమ్మ.

"తల్లీ ! జానకమ్మా ! నేను రామదూతను - హనుమను... శ్రీరాముడే నాకు ప్రమాణం... నేను నిజమే చెప్తున్నాను - ఈ ఉంగరాన్ని నేనే తెచ్చాను. నిదర్శనం కోసం మీకు చూపించవలసిందిగా శ్రీరాముడే స్వయంగా నాకిచ్చారు - మీ ఆచూకీ తెలుసుకోవడానికి వెదుకుతూ ఇక్కడికొచ్చాను - మిమ్మల్ని కనుగొనగలిగాను" అన్నాడు హనుమంతుడు.

"నరులకి, వానరులకి స్నేహం ఎట్లా కుదురుతుందయ్యా..." అడిగింది అనుమానంగా సీత.

అప్పుడు, సుగ్రీవుడితో మైత్రి, వాలి వధ కథల్ని వివరించాడు హనుమంతుడు. కొద్ది కొద్దిగా నమ్మకం మొలకెత్తసాగింది సీత హృదయంలో... ఇదంతా నిజమే కావాలని ఆమె ఆశ....

"తమ్ముడా ! దుఃఖసముద్రంలో కొట్టుకుపోతున్న నాకు పెద్ద పడవలాగా నువ్వు కన్పించావు... నువ్వు చెప్పేదంతా నిజమేనంటావా... శ్రీరాముడి మీద ఒట్టేసి చెప్పు... ఆయన క్షేమంగానే వున్నారా..." అనడిగింది.

అప్పుడు హనుమంతుడు మళ్ళీ చేతులు జోడించి నమస్కరించి- "తల్లీ ! నీ బాధ నాకు అర్థం అయ్యింది... రామలక్ష్మణులిద్దరూ కుశలంగానే వున్నారు. నీకోసం వాళ్ళిద్దరూ నిరంతరం దుఃఖిస్తున్నారు. ధైర్యం వహించు తల్లీ! నీకంటే రెండింతల వేదన వాళ్ళుపడ్తున్నారు... నీకోసం వెదకడానికే నన్ను పంపించారు" అన్నాడు.

హనుమంతుని వచనాలు విని కొంత ఊరడిల్లింది జానకి. "తల్లీ ! నీ నాధుడి మాటలు విను...ఖచ్చితంగా ఇవే మాటలు నువ్వు కన్పిస్తే నీకు చెప్పమని నాతో చెప్పారు" అంటూ రాముడి సందేశాన్ని జానకికి విన్పించసాగాడు హనుమ.

"ఓ చల్లని సీతా ! నీ వియోగం వలన అన్నీ విపరీతాలే అయ్యాయి. చల్లటి పదార్థాలు కూడా మండుతున్నట్లే కన్పిస్తున్నాయి. లేత ఆకులుకూడా నిప్పుల్లా వున్నాయి. రాత్రి - కాళరాత్రిలా వుంటోంది. చంద్రుడు వేసవి కాలపు సూర్యుడిలా కన్పిస్తున్నాడు. తామరపువ్వులు ముళ్ళపొదల్లా గుచ్చుకొంటున్నాయి. మేఘాలు సలసలాకాగే వేడినూనెని



వర్షిస్తున్నట్లనిపిస్తోంది. చెట్లనీడలుగూడ దుఃఖాన్నే కల్గిస్తున్నాయి. చల్లని పిల్లగాలులుకూడా తాచుపాముల్లా బుసలుకొడ్తున్నాయి. నా దుఃఖాన్ని ఎవరు తీర్చగలరు ? ఎవ్వరితో చెప్పుకోగలను ? మన ఇద్దరి మనసులూ మన ఇద్దరికే తెలుసు ... !! నా మనసెప్పుడూ నీతోనే లీనమైవుందని తెలుసుకో..." అని రాముడి మాటల్ని యథాతథంగా వివరించాడు.

"తల్లీ ! ఊరడిల్లు ! ధైర్యం కూడగట్టుకో... ఆ శరణాగత వత్సలుణ్ణే ధ్యానించు... ఆ శ్రీరామ చంద్రుని ప్రభావాన్ని స్మరించుకో... దుఃఖంలోంచి బైటకురా !!" అన్నాడు.

సీత కొంత తెప్పరిల్లింది. "ఈ రాక్షసమూక పక్షుల గుంపులాంటిది... రాముడి బాణం అగ్నితో సమానం... వీళ్ళంతా భస్మీపటలం అవుతారు" అని ధైర్యం చెప్పాడు.

"నీ జాడ తెలిసిన వెంటనే రాముడికి తెలియజేయాలని మాత్రమే నాకు ఆజ్ఞ! నేను నిన్ను ఈ లంకానగరం నుంచి అవలీలగా రాముని సన్నిధికి తీసుకువెళ్ళగలను. కానీ, రాముడు ఆ విధంగా చెయ్యవలసిందిగా నాకు ఆజ్ఞ ఇవ్వలేదు ! తల్లీ ! కొద్దిరోజులు ఓపికపట్టు. ధైర్యంగా వుండు..." అంటూ ఊరడించాడు.

సూక్ష్మరూపంలో వున్న హనుమంతుని చూసి సీతకు అప్పుడు అనుమానం వచ్చింది. 'నాయనా నువ్వింత చిన్నవాడివి కదా... నువ్వు, నీ సేనలు ఈ మహా బలసంపన్నులైన రాక్షసమూకని ఎలా ఎదుర్కోగలరూ... ? అని !

ఆమెకు తన బలాన్ని చూపించి, ఆమెలో ధైర్యాన్ని నెలకొల్పి రావణసంహారం జరిగేవరకూ సీత ఎలాంటి అఘాయిత్యానికి తలపడకుండా వుండేందుకే లంకానగర దహనానికి తలపడ్డాడు హనుమంతుడు.

# చూసిరమ్మంటే కాల్చివచ్చినవైనం ఇదీ...

అశోకవనంలో ఒక కోతి నానా భీభత్సాన్నీ సృష్టిస్తోందని విని రావణుడు సైన్యాన్ని పంపించి ఆ కోతిని పట్టుకోమన్నాడు. హనుమని పట్టుకోవడానికి వచ్చిన సైనికుల్లో చచ్చినవాళ్ళు చావగా మిగిలిన వాళ్ళు రావణుడి దగ్గరకు పారిపోయి మొరపెట్టుకొన్నారు. అప్పుడు రావణుడు అక్షయ కుమారుణ్ణి పంపాడు. వచ్చిన క్షణంలోనే అక్షయ కుమారుణ్ణీ, అతని యోధుల్నీ అవలీలగా సంహరించాడు హనుమంతుడు.

అక్షయ కుమారుడు మరణించాడన్న వార్తతో రావణాసురుడి పీఠం కదిలినట్లయింది. ఆలస్యం చెయ్యకుండా మేఘనాథుడు అనే తన కొడుకు ఇంద్రజిత్తుని పంపించాడు. "ఆ కోతిని ప్రాణాలతో పట్టి తీసుకురా... వాడి పూర్వోత్తరాలు తెలియాలి" అన్నాడు.

మేఘనాథుడి వెనక అనేకమంది సైనికులు, అతని దగ్గర దివ్యాస్త్రాలు ! వాళ్ళంతా సాయుధులు. మరి హనుమంతుడు ఒక్కడే, పైగా నిరాయుధుడు. ఒంటరిపోరాటం. అయినా యుద్ధం చేస్తూనే వున్నాడు.

ఒక పెద్దచెట్టుని పట్టుకొని పీకి దాంతో రాక్షసుల్ని చెండాడాడు. ఆ దెబ్బతో మేఘనాథుడి రథం నుజ్జునుజ్జయ్యింది. ఇంద్రజిత్తు తృటిలో తప్పుకొన్నాడు. హనుమంతుడు ఇంద్రజిత్తు మీదపడి ఒక పిడిగ్రుద్దు తగిలించాడు. ఆ దెబ్బతో ఇంద్రజిత్తు మూర్ఛిల్లి వెంటనే తెప్పరిల్లాడు. ఇంక లాభంలేదని మాయోపాయాలతో హనుమంతుణ్ణి పట్టి బంధించాలని చూశాడు. కానీ, హనుమంతుడు వాడి మాయలో పడలేదు. చేసేది లేక బ్రహ్మాస్త్రాన్ని సంధించక తప్పలేదు ఇంద్రజిత్తుకి.

"ఆహా ! ఈ బ్రహ్మాస్త్రం వున్న వీరుడితో ఇంతవరకూ నేను పోరాడలేదు. నరుడు, వానరుడు రావణాసురుడికి మృత్యువులని సాక్షాత్తు బ్రహ్మచెప్పిన విషయమే కదా... కాబట్టి బ్రహ్మవాక్కు నిజంకావాలంటే ఈ బ్రహ్మాస్త్రం నాకు ప్రాణాపాయం కల్గించకుండుగాక" అని ప్రార్థించుకున్నాడు.

మేఘనాథుడు బ్రహ్మాస్త్రం వదిలాడు. అది తిన్నగా హనుమంతుణ్ణి తాకింది. హనుమంతుడు మూర్ఛపోయాడు. నాగపాశాలతో అతణ్ణి బంధించారు.

హనుమంతుడు పట్టుబడేసరికి రాక్షసవీరులు జయజయ ధ్వానాలు చేశారు. కానీ, ఇంద్రజిత్తుకొకడికే తెలుసు – తను ప్రాణాపాయస్థితిలో పడ్డప్పుడు తనకు ఉపకరించే బ్రహ్మాస్త్రాన్ని ఇలా వృథాగా ఉపయోగించవలసివచ్చిందని, ఇంద్రజిత్తుకు చాలా దుఃఖం వచ్చింది. గెలిచినా ఏడవడం అంటే ఇదే !!

రావణసేనని ముప్పతిప్పలు పెట్టిన 'కోతి'ని చూడాలని రాక్షసజనం తిరణాల్లాగా వచ్చారు. హనుమంతుణ్ణి చూడగానే రావణుడికి ఫక్కున నవ్వొచ్చింది. అంతలోనే తన

కొడుకు అక్షయ కుమారుణ్ణి ఈ 'కోతి' చంపేసిందనే సంగతి గుర్తుకొచ్చి దుఃఖము, కోపము రెండూ ఒకేసారి కట్టలు తెంచుకొచ్చాయి. కొంచెం తమాయించుకొని, తోటని ఎందుకు పాడుచేశావని అడిగాడు రావణుడు.

గరుత్మంతుణ్ణి ఎదుర్కొన్న సర్పంలాగా తలెగరేసి పౌరుషంగా చూశాడు హనుమంతుడు. "ఏంటా చూపు ? నేనెవరో తెలుసా ??" కోపంగా అన్నాడు రావణుడు.

ప్రశ్నిస్తున్నవాడు రావణుడు. మహాబలసంపన్నుడు, వ్యాకరణవేత్త, వైద్యుడు కూడా! సమాధానం చెప్పవలసినవాడు హనుమంతుడు. మహాబలసంపన్నుడని అప్పుడే నిరూపించుకున్నవాడు. స్వయంగా విద్యావేత్త, వ్యాకరణవేత్తకూడా ! ఆ ఇద్దరి సంభాషణలో ఎంతయినా రమ్యత వుంటుంది.

రావణుడి ప్రశ్న సంక్షిప్తంగా వుంటే, హనుమంతుడి సమాధానం విలోమంగా వుందని తులసీదాసు వర్ణిస్తాడు. వినేవాళ్ళలో చాలామందికి ఈ సంభాషణలో పూర్తి అంతరార్థం అర్థంకాకపోయి వుండవచ్చుకూడా !

"రావణా ! ఏ మహాత్ముడి బలంతో అనేక కోటి బ్రహ్మాండాల్ని అవలీలగా మాయ సృష్టిస్తోందో, ఆ మహాపురుషుని దయతోనే బ్రహ్మా, విష్ణు, మహేశ్వరులు సృష్టి, స్థితిలయల్ని చేస్తున్నారు" అంటాడు హనుమంతుడు. ముల్లోకాల్ని జయించాననుకొంటున్నావు - కానీ, రాముడు అనేక కోటి బ్రహ్మాండాల్ని నడిపిస్తున్నాడని ఆయన భావన. ఆ లోకారాధ్యుని బలంతోనే ఈ చరాచర బ్రహ్మాండాన్ని ఆదిశేషువు తన వేయి పడగల మీద భరిస్తున్నాడు- అన్నాడు. కైలాస పర్వతాన్నే ఎత్తానని గర్విస్తున్నావు - ఆదిశేషుడు అనేక బ్రహ్మాండాల్నే భరిస్తున్నాడు, ఆ ఆదిశేషువు రాముడికి బంటు - అనేది ఇందులో ఎత్తిపొడుపు.

శివభక్తులు శివుడు మానవావతారాలు ధరించాడని నమ్ముతారు. విష్ణుభక్తులు విష్ణువు అనేక జంతుజాలాల జన్మలెత్తుతాడని నమ్ముతారు. అందుకని, రాముడు సాక్షాత్తూ ఆ మహాపురుషుడేనని చెప్పడం హనుమంతుడి ఉద్దేశం.

ఇంకా గట్టిగా ఒక మాట చెప్పిస్తాడు తులసీదాసు హనుమంతుడితో... "రావణా ! ఏ మహాపురుషుడి బలంలో కొద్దిబలం శంకరుడికి వున్నదో, ఆ శంకరుడి బలంలో మరికొద్ది బలాన్ని నువ్వు వరంగా పొందావు. బలగర్వితుడిగా ఎదిగావు. ఆ కొద్ది బలంతోనే నువ్వు విర్రవీగితే, సాక్షాత్తూ ఆ మహాపురుషుడి దూతని - నేనెంత బలగర్వితుణ్ణి కావాలి... " అనడుగుతాడు.

ఆ మహాపురుషుడి భార్యని అపహరించి, రహస్యంగా దాచావు కాబట్టి వెదుకుతూ నేను ఇక్కడకు రావాల్సివచ్చింది - అని వివరించాడు.

"ఇంక, నీ తోటలు పాడుచేయడం గురించి అడిగావు కదూ... నీ జాతకం అంతా నాకు తెలుసు. కార్తవీర్యార్జునుడితోనూ, వాలితోనూ నువ్వు పోరాడి అవమానాలు పొందడం

కూడా నాకు తెలుసు - ఆకలయ్యింది పళ్ళు కోసుకుతిన్నాను - కోతినికదా! రెండు మొక్కలు పీకాను. అది నా స్వభావం. నా వానర స్వభావాన్ని బట్టి నేను ప్రవర్తించాను. నీ భటులు రాక్షసంగా ప్రవర్తించారు, అందుకని వాళ్ళని చావగొట్టాను" అన్నాడు.

హనుమంతుడు ఆ మాటలు అంటుంటే రావణుడి ముఖం మాడిపోయింది. అప్పుడు హనుమంతుడు తనంతతానే తగ్గాడు. రెండుచేతులూ జోడించి, నమస్కరించి, "మహాప్రభూ ! నీ అభిమానాన్ని కొంచెం తగ్గించుకొని నేను చెప్పేది సావధానంగా విను - ఎలాంటి గొప్పవంశంలో నువ్వు పుట్టావో ఒక్కసారి ఆలోచించు - సాక్షాత్తూ బ్రహ్మకు మునిమనవడివి. పులస్త్యుడికి మనవడివి. విశ్రవసువుకు కొడుకువి. కళ్ళు పొరలు కప్పి ఇలా ప్రవర్తిస్తున్నావు. ఇది నీ స్థాయికి తగదు - ఆ భక్తాభయహరుడు శ్రీరాముడి శరణు కోరుకో... ఆయనతో వైరం నీకు క్షేమం కాదు. జానకిని సగౌరవంగా ఆయనకు సమర్పించు... ఈ పనిని నువ్వు చేస్తే నువ్వు నమ్ముకున్న శివుడు కూడా హర్షిస్తాడు -" అన్నాడు.

రావణుడు వెంటనే ఏమీ మాట్లాడలేదు. హనుమంతుడు తన వేడికోలును కొనసాగించాడు. ప్రస్తుతం ఆయన రామదూత. అందుకని రెచ్చగొట్టకుండా మృదువుగా హితవాక్యాలు చెప్పడం ప్రారంభించాడు.

రావణుడి కళ్ళు ఎర్రబడ్డున్నాయి. అయినా తమాయించుకొంటున్నాడు.

"రాముడి చరణారవిందాల్ని ధ్యానిస్తూ లంకారాజ్యాన్ని శాశ్వతంగా పాలించుకో... పులస్త్యుడి కీర్తి, ప్రతిష్ఠలకు, నీ వంశప్రతిష్ఠకు మచ్చరానీయకు. మదమోహాదులు నీకు అడ్డుపడ్డున్నాయి. నాకు తెలుసు... ఒక్కమాట చెప్పనా... ఎంతో అందంగా అలంకరించు కున్న స్త్రీ బట్టకట్టుకోకపోతే ఆమె అందం ఎలా శోభించదో ... అలాగే రామనామం లేని మాటలు శోభించవు. ఒకటికి ముందు ఎన్ని సున్నలున్నా ఉపయోగం ఏమిటి? ఆ మొదటి అంకె శ్రీరాముడు. ఆయన తర్వాత వాటికే విలువ వుంటుంది. రాముడితో విరోధిస్తే సహస్ర బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సైతం నిన్ను కాపాడలేరు - నామాట నిజం. నమ్ము..... " అన్నాడు.

నిండు సభలో హనుమంతుడు ఇలా పేట్రేగి ప్రసంగిస్తుంటే సభాసదుల ముందు ఆయన పరువేం అయిపోవాలి ? రావణుడు హనుమంతుని నోరు కట్టడిచెయ్యడం అవసరం అని నిర్ణయించుకొని ఒక్కసారి దిగ్గునలేచి నుంచున్నాడు. "ఇంకచాలు... చెప్పింది విన్నాంకదా... ఇన్నాళ్ళకు మా గొప్ప గురువు మాకు దొరికాడులే... " అని వ్యంగ్యంగా నవ్వాడు. "వీణ్ణి వెంటనే తీసుకెళ్ళి వధించండి" అని ఆజ్ఞాపించాడు.

సరిగ్గా అదే సమయానికి విభీషణుడు లేచినుంచుని, రావణుడికి నమస్కరించి, "ప్రభూ ! ఇతను దూత కదా ... దూతని చంపడం ధర్మం కాదు... ఇంకా వేరే ఏదైనా

శిక్ష విధించండి" అని సర్దిచెప్పాడు. సభలో రాక్షస పెద్దలు "అవును ... అలానే చెయ్యండి" అన్నారు.

వానరాలకు తోక అంటే ప్రీతి ఎక్కువ కాబట్టి ఈ తోకకి నిప్పు ముట్టించి, కాల్చి వినోదించాలనుకొన్నారు రాక్షసులు. "తోక కాలిపోయి ఏడుస్తూ వీడు ఆ రాముడి దగ్గరకు వెళ్తాడు కదా ... ఆయన పౌరుషం కూడా చూద్దాం... " అని వాళ్ళలో వాళ్ళు గుసగుసలాడుకోసాగారు.

హనుమంతుడు వీళ్ళ సంభాషణను విని, సరస్వతీదేవి తన ప్రభావంతో వీళ్ళచేత ఇలా మాట్లాడిస్తోందనీ, తద్వారా రాముడి దగ్గరకు తాను నిరపాయంగా వెళ్ళి సీతజాడని తెలిపేందుకు సహకరిస్తోందనీ అనుకున్నాడు.

మూర్ఖులైన రాక్షసమూక హనుమంతుడి తోకకు నూనెగుడ్డలు చుట్టడం ప్రారంభించారు. తోక అంతకంతకూ పెరుగుతోంది. తెచ్చిన గుడ్డలన్నీ అయిపోయాయి. ముంచడానికి నూనె కూడా అయిపోయింది. వున్నంతవరకూ చుట్టి, తోలుడప్పులు వాయిస్తూ హనుమంతుణ్ణి రాక్షసవీధుల్లో తిప్పుకొంటూ తీసుకెళ్ళి తోకకు నిప్పంటించారు.

నిప్పు అంటుకోగానే హనుమంతుడు సూక్ష్మరూపుడయ్యాడు. అతని కట్లన్నీ తెగిపోయాయి. ఆ వెంటనే హనుమంతుడు లంకానగరంలోని బంగారు ప్రాకారాలపైకి ఎగిరాడు. అంతఃపురాల్లోని రాక్షసస్త్రీలు అతన్ని చూసి భయపడి గగ్గోలుపెట్టడం మొదలుపెట్టారు. సరిగ్గా ఆ సమయానికే ఎక్కణ్ణించి వచ్చాయో ... పెద్దపెట్టున గాలులు వీయడం మొదలుపెట్టాయి.

నిప్పుతో చెలగాటాలాడగూడదని రాక్షసులకు అప్పటికి గాని తెల్సిరాలేదు. ఆయన సూక్ష్మరూపంలోనే వున్నాడు. ఆయన తోకమాత్రం నిప్పుమంటలలో వెలుగుతూ ఆకాశంలోంచి నేలమీదకు దూసుకురాసాగింది. ఆకాశంలో నిప్పుల నది ప్రవహిస్తున్నట్లనిపించింది ఆ దృశ్యం.

ఒక ఇంటి మీదనుంచి ఇంకొక ఇంటి మీదకు హనుమంతుడు దూకుతుంటే నిప్పు అంటుకొని ఒక్కో ఇల్లూ తగలబడడం మొదలుపెట్టింది. ఒక్కసారిగా నలుమూలలా లంకానగరం నిప్పురాజుకొని గుప్పుమంది. గుర్రాలు, ఏనుగులు, కంచరగాడిదలు ... మొదలైనవాటిని పశువుల కొట్టంలోంచి వదిలేశారు. అవి భయంతో చెదిరి రాక్షసజనం మీద పడసాగాయి. కొంపలు తగలబడి, ప్రాణ భయంతో పిల్లా జెల్లా, ముసలీ ముతకా అంతా హాహాకారాలు చేస్తూ వీధుల్లోకి వచ్చి గుండెలు బాదుకుంటూ ఏడవడం మొదలుపెట్టారు.

"ఇళ్ళు తగలబడి రాక్షస జనం గగ్గోలుపెడ్తుంటే, సాయపడకుండా అంతఃపురంలో

కూర్చున్న రాక్షసుల్ని పిలిచి, మీకు సిగ్గులేదా... అమ్మానాన్నలు లేరా... అవతల జనం అల్లాడిపోతుంటే చెవులు లేవా ? విన్పించడం లేదా ? మీరు గోళ్ళుగిల్లుకుంటూ కూర్చుంటారా ... ? అని కేకలేసింది మండోదరి.

"అటు విభీషణుడు చెప్తున్నాడు - ఇటు నేను చెప్తున్నాను ... రాక్షస వంశ నాశనానికే ఇదంతా ... ఎంత మొత్తుకున్నా రావణుడు వినిపించుకోవడంలేదు" అంటూ తలబాదుకొని మండోదరి దుఃఖించడం మొదలుపెట్టింది.

అంతఃపురానికి కావలికాస్తున్న రాక్షసులు మండోదరి ఆజ్ఞను కాదనలేక వీధుల్లో జనాన్ని రక్షించడం కోసం కదిలారు.

ఏ ఇంటిముందు చూసినా హనుమంతుడే కన్పించసాగాడు జనానికి. కుంభకర్ణుడి ఇంటిమీదకు ఎగిరినప్పుడు అతని భార్య హనుమంతుడికి నమస్కారంపెట్టి, "రాముడి తోడు - నా భర్త నిద్రలో వున్నాడు. ఇప్పట్లో లేవడు - మా ఇల్లు తగలబెట్టకు ..." అని వేడుకొన్నది.

అప్పుడు రావణుడు ఇదంతా గమనించి, మేఘుణ్ణి పిలిచి "వెంటనే వర్షించి లంకానగరాన్ని చల్లార్చు" అని ఆజ్ఞాపించాడు. మేఘాలు అంతరిక్షంలో నిలబడి వర్షించసాగాయి. నీళ్ళు కురుస్తున్నాయో... నెయ్యి కురుస్తుందో వాళ్ళకి అర్థం కాలేదు - వాన పడ్తున్న చోటల్లా మంట భగ్గుమనిలేవడం మొదలుపెట్టింది - మాల్యవంతుడు ఇదంతా చూసి "ఇది ఈశ్వరుడి క్రోధాగ్ని - జానకి వేడినిట్టూర్పు ... శ్రీరాముడి పగ... " అన్నాడు.

రావణుడికి ఈ దహనకాండని నిలుపుచెయ్యడం ఎలాగో అర్థం కాలేదు. నిప్పు-ధారలై వీధుల్లో ప్రవహిస్తుంటే, రాక్షస జనం ఒళ్ళుకాలి ఎటు పరిగెత్తాలో తెలియక ఆ మంటల్లో పడి మాడి మసైపోసాగారు. రావణుడు యముణ్ణి పిలిచి, "నీ భూతప్రేత పిశాచాది గణాల్ని తీసుకెళ్ళి ఆ హనుమంతుణ్ణి వధించు" అని ఆజ్ఞాపించాడు. దిక్పాలకులంతా రావణుడి ఆధీనులేకదా... యముడు రావణుడి ఆజ్ఞ పాటించాడు. కానీ, హనుమంతుడి వీరవిజృంభణ ముందు యముడి శక్తి చాలలేదు. యముణ్ణి పట్టి, హనుమంతుడు అతని బుగ్గకిందపెట్టుకొని నొక్కిపట్టాడట.

దాంతో విలవిలలాడ్తున్న యముణ్ణి విడిపించడం కోసం దేవేంద్రుడు, బ్రహ్మ పరుగున వచ్చి, హనుమంతుడికి నచ్చజెప్పి కాలయముణ్ణి విడిపించారు... లంకానగరం అంతా తగులబడ్తున్నా అశోకవనం ప్రశాంతంగా వుంది. సీతకు అపకారం జరగకూడదని హనుమంతుడు అటు వెళ్ళలేదు.

"నేను ముందే చెప్పాను కదా... అతను కోతి కాదు - ఎవరో దేవత" అని ఒక రాక్షస స్త్రీ చెప్తోంది అశోకవనంలో.

"నేనే సత్యవంతురాలనయితే, హనుమంతుడికి నీ వేడి తగలకుండుగాక - అని సీతాదేవి అగ్నిని ప్రార్థించింది - అందుకే హనుమంతుడి తోక కాలడం లేదు" అని ఇంకొకరు ...

"పెద్దలు మంచిచెపితే రావణుడు వినడంలేదు... దాని మూలానే ఇదంతా ..." అని ఇంకొకతె అంటోంది.

లంకానగరం మొత్తం భస్మీపటలం అయ్యింది. రామభక్తుడు విభీషణుడి ఇల్లూ, రాముడిపేరు చెప్పి ప్రార్థించిన కుంభకర్ణుడి ఇల్లు మాత్రం క్షేమంగా మిగిలాయి. హనుమంతుడు తన తోకని సముద్రంలో ముంచి చల్లార్చుకొని, మళ్ళీ చిన్నకోతిలా మారి, సీతమ్మ దగ్గరకువచ్చాడు.

ఆమె జాడ కనుగొన్నట్లు తనకు నిదర్శనం ఏదైనా దయచేయమని అడిగాడు. అప్పుడు సీతాదేవి తన తలమీది చూడామణిని తీసి కళ్ళకద్దుకొని హనుమంతుడికిచ్చింది. కాకాసురుడు తనని బాధించినప్పుడు గడ్డిపోచని మంత్రించి వాడిమీద ప్రయోగించిన కథని గుర్తుచేశానని చెప్పు - అన్నది. "మీరు దీనదయాపరులు - మీ బిరుదును నిలుపుకొని నా సంకటాన్ని నివారించండీ" అని వేడుకున్నానని చెప్పు" అన్నది సీత.

ఆ శ్రీరాముని దర్శించుకునే అవకాశం ఆ బ్రహ్మ తనకెప్పుడు రాశాడో అనుకొంటూ!

# ఇదంతా నీ ప్రతాపమే రామా !

కార్తీక శుద్ధపౌర్ణమి. హనుమంతుడు పంపాపురానికి తిరిగివచ్చాడు. సీత జాడ తెలియజేశాడు. జరిగిందంతా పూసగుచ్చినట్లు వివరించాడు. భక్తి పారవశ్యంతో రాముడి కాళ్ళమీద పడి అలాగే వుండిపోయాడు. సీత అందచేసిన చూడామణిని ఒక చేత్తో గుండెలకు హత్తుకొని, ఇంకొకచేత్తో హనుమంతుడి తలనిమురుతూ రాముడు కూడా అలానే శిలావిగ్రహంలా వుండిపోయాడు. "ఈ హనుమంతుడు ఎంతటి అదృష్టవంతుడో కదా... అనుకొన్నారట కైలాసంలోని ఈ దృశ్యాన్ని చూస్తున్న పార్వతీపరమేశ్వరులు.

రాముడు కొద్దిసేపటిలో తెప్పరిల్లి, హనుమంతుని పైకిలేపి గాఢంగా కౌగిలించుకొన్నాడు. అతని చేతులు పుచ్చుకొని తనపక్కన కూర్చోపెట్టుకొన్నాడు.

"హనుమా ! లంకకు ఎలా చేరగలిగావు"... లంకానగరాన్ని ఎలా దహించగలిగావు... అని అడిగాడు కుతూహలంగా శ్రీరాముడు. రాముడి అనుగ్రహానికి హనుమంతుడు ఎంతగానో పొంగిపోయాడు. దురభిమానాన్ని వదిలేశాడు.

"మీరు సర్వజ్ఞులు. అంతా మీకు తెలుసు. మా వానరుల బలం ఏపాటిది ... ? మేం చెట్టుమీంచి చెట్టుమీదకు ఎగరగలం. అంతే కాని, సముద్రాన్ని లంఘించి, లంకను



చేరి రాక్షసుల్ని వధించగలిగే శక్తి మాకెక్కడిది ? మీ ప్రతాపం వలనే కదా నాకు దక్కింది. మీరు ఇచ్చిన ముద్రిక బలంతోనే సముద్రాన్ని గోష్పాదంలాగా లంఘించాను. ఆ ముద్రికని చూసి జానకమ్మ సంతోషించింది. ఆమె శోకాగ్ని లంకాపట్టణాన్ని దహించింది. ఆమె ఇచ్చిన చూడామణి బలంతో నేను మళ్ళీ సముద్రాన్ని లంఘించి మీదగ్గరకు రాగలిగాను. ఇదంతా మీ ప్రతాపమే శ్రీరామా !" అన్నాడు వినయంగా.

## రావణుడికి హితబోధ చేసింది వీరు

సీతను వదిలేయవలసిందనీ, రాముడితో సంధిచేసుకోవలసిందనీ చివరి క్షణం వరకూ అనేకమంది రావణాసురుడికి హితబోధ చేస్తూనే వున్నారు. కానీ, ఆత్మ ప్రబోధానుసారమే నడిచి రావణుడు తన ప్రాణాలకే ముప్పు తెచ్చుకున్నాడు. వాల్మీకి రామాయణం ప్రకారం 12 మంది ప్రముఖులు రావణుడికి హితబోధ చేశారు.

**1. మారీచుడు :**

సీతను అపహరించడానికన్నా ముందే మారీచుడు "అన్నా ! ఇలాంటి తప్పుడు పనులు వొద్దన్నా..." అని బతిమాలుకున్నాడు. "నీకు రాముడెంతటివాడో తెలియడం లేదు. నీలాంటివాడు ఆత్మనాశనాన్నే కాదు, సర్వనాశనాన్ని కొనితెచ్చుకొంటాడు.... " అని మందలించాడు కూడా ! రామో విగ్రహవాన్ ధర్మః - ధర్మాన్ని ఒక విగ్రహంలాగా పోతపోస్తే, ఆ విగ్రహం రాముడి ఆకారంలో వుంటుంది- అని ప్రశంసించినవాడు మారీచుడే !

**2. హనుమంతుడు :**

అశోకవన ధ్వంసం తర్వాత ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రం ప్రయోగించి పట్టుకున్నప్పుడు హనుమంతుడు రావణుని ఎదిరించి మాట్లాడాడు. దీటుగా సమాధానాలు చెప్పాడు.

చివరిగా రెండు చేతులూ జోడించి, దణ్ణంపెట్టి వేడుకొంటూ చెప్పాడు - బ్రహ్మవంశంలో పుట్టిన నీకు సీతాపహరణంలాంటి నీచమైన పనులు తగవు - అని! వంశానికి మచ్చతెచ్చుకోవద్దన్నాడు. సీతని అప్పగిస్తే ముఖ్యంగా శివుడు సంతోషిస్తాడన్నాడు. కానీ, రావణుడు "మా గొప్ప గురువు దొరికాడులే !" అంటూ ఈసడించాడు.

**3. విభీషణుడు :**

రాముడితో తగువు పెట్టుకోవద్దనీ, సీతను సగౌరవంగా అప్పగించేయాలనీ చాలామంది చెప్పినప్పటికీ, రావణుడితో తెగతెంపులు చేసుకొని రాముడి పక్షంలోకి వచ్చేసినవాడు విభీషణుడు ఒక్కడే ! మొత్తం పన్నెండు మంది హితబోధచేసిన ప్రముఖులలో, మిగిలిన పదకొండుమందీ చేసేదేమీలేదన్నట్లు చివరికి రావణుడి ఆజ్ఞలకు లోబడే పనిచేశారు. విభీషణుడు మాత్రమే రాముడి దగ్గరకు వెళ్ళి శరణు కోరాడు. అంత గట్టి నిర్ణయాన్ని మిగిలిన హితబోధకులు తీసుకోలేకపోయారు.

**4. శార్దూలుడు :**

విభీషణుడు రాముడి పక్షంలో చేరిపోయిన తర్వాత రావణుడికి రాముడి బలం ఎంతో తెలుసుకోవాలనే ఆలోచన వచ్చింది. ఇంటిగుట్టు మొత్తం విభీషణుడు చెప్పేసే అవకాశం వుంది కాబట్టి రామదండుని నిలువరించడానికి ఎంత శక్తిని ఉపయోగించాల్సి వుంటుందో తేల్చుకోవాలనుకున్నాడు. 'శార్దూలుడు' అనే నమ్మినబంటుని వానరసేనా బలాన్ని ఖచ్చితంగా అంచనావేసి చెప్పమని పంపించాడు.

ఎటుచూసినా, వానరసేన పదియోజనాలు వ్యాపించివున్నదంటూ, సీతా పరిగ్రహణంకోసం రామలక్ష్మణులు ఉద్యమిస్తున్నారని శార్దూలుడు చెప్పాడు. **"ఉపప్రదానం సాన్త్వం వా భేదోవాఽత్ర ప్రయుజ్యతామ్-"** సీతాసమర్పణమో; సుగ్రీవుడితో మైత్రిని సాధించడమో, సుగ్రీవుడికీ, రాముడికీ మధ్య విభేదాలు కల్పించడమో జరగాలి. ఈ మూడూ సాధ్యం కావనుకొంటే వినాశం తప్పదు -" అని వివరించాడు శార్దూలుడు.

**5. శుకుడు, 6. సారణుడు :**

కొన్ని గ్రంథాల్లో 'శుకసారణుడు' ఒక్కడే మంత్రిగా కన్పిస్తుంది. తులసీదాసు శుకసారణుడు శాపగ్రస్తుడైన ఒక ఋషిగా పేర్కొన్నాడు. వాల్మీకి రామాయణం శుకుడు, సారణుడు అనే ఇద్దరు మంత్రులను పేర్కొంది. శుకసారణులు ఇద్దరూ రావణుడి మంత్రులు. వీళ్ళని వానర వేషంలో, వానర సేనలో చొరబడి విషయసేకరణ చెయ్యవలసిందిగా ఆజ్ఞాపించాడు. రాముడితో విభేదాలు కల్గించడానికి ఆ చివరక్షణంలో అవకాశం వుందేమో చూడడం వీళ్ళ ముఖ్యవిధి. వీళ్ళని విభీషణుడు గుర్తించి పట్టించాడు. రాముడు దయతలిచి



విడిపించాడు. ఇక్కడి సంగతులన్నీ చక్కగా వివరించి చెప్పవలసిందిగా శుకసారణల్ని కోరి పంపించేశాడు.

జరిగిందంతా చెప్పి, అక్కడి యోధుల వివరాలు చెప్పి, "**పురాప్రాకార మాయాన్తి (క్షిప) మేకతరం కురు । సీతాం చాపిక్రియాచ్ఛాయ యుద్ధం వాపి ప్రదీయతామ్ ॥**" వానరసేన తూర్పు ప్రాకారాలకు దగ్గరగా వచ్చేస్తోంది. సీతని ఇచ్చేయడమో, యుద్ధానికి సిద్ధంకావడమో ఏదో ఒకటి త్వరగా తేల్చుకోమని చెప్పారు. సీతని ఇచ్చేయడమే రాక్షసకులానికి మేలని కూడ హితవు చెప్పారు.

"**నైవ సీతాం ప్రదాస్యామి సర్వలోక భయాదపి**" - ఏది ఏమైనా సీతని ఇచ్చే సమస్యే లేదు - అని తెగేసి చెప్పాడు రావణుడు.

**7. మాల్యవంతుడు :**

విభీషణుడి తర్వాత మొట్టమొదటగా బైటపడి రావణుణ్ణి గట్టిగా హెచ్చరించినవాడు రావణాసురుడి తాత మాల్యవంతుడు. ఈయన రావణుడి తల్లికి తండ్రి.

"**తన్మహ్యం రోచతే సన్ధిస్సహ రామేణ రావణ ।**" అని రావణుణ్ణి గట్టిగా వత్తిడిచేశాడు మాల్యవంతుడు. "నువ్వు రాముడితో సంధిచేసుకోవడం నాకు ఇష్టం. ఏ సీత కారణంగా మనం రాముడికి విరోధులమయ్యామో ఆ సీతని గౌరవంగా రాముడికిచ్చేస్తే మంచిది. ఏమైనా రాముడు ధర్మపక్షం, మనం అధర్మపక్షంగా మిగిలిపోతామేమో నన్పిస్తోంది నాకు ! నిజానికి, నువ్వు చాలాసార్లు అధర్మపక్షం వహించావు. దానివలన మనచుట్టూ శత్రువులు ఎక్కువగా పేరుకుపోతున్నారు. పైగా, ఋషుల్ని హింసించి, వాళ్లతో కూడా గొడవ పెట్టుకున్నావు... ఇవన్నీ ఎప్పుడో ఒకప్పుడు మనల్ని దెబ్బకొడతాయి" అని హితబోధ చేసినవాడు మాల్యవంతుడు.

**8. అంగదుడు :**

సామదాన భేద దండోపాయాలు వరుసగా ప్రయోగించడం రాజధర్మం కాబట్టి రాముడు అంగదుణ్ణి రాయబారిగా పంపాడు - యుద్ధాన్ని నివారించి సీతను గౌరవంగా అప్పగించేలా రావణుణ్ణి అంగీకరింపచేయడం అంగదుడి రాయబార లక్ష్యం. అందుకు విభీషణుడి అనుమతి తీసుకొని మరీ పంపించాడు. రావణ వధ జరిగితే, లంకా రాజ్యాన్ని విభీషణుడికి కట్టపెట్టడానికి రాముడు వాగ్దానం చేశాడు. ఈ అంగద రాయబారం విజయవంతం అయి రావణుడు శరణాగతుడైతే విభీషణుడు తన రాజ్యాధికారాన్ని కోల్పో వలసిరావచ్చు. అయినా, రాజ్యాలకోసం కాక, ధర్మంకోసం విభీషణుడు రామశరణు కోరాడు కాబట్టి అంగద రాయబారం విజయవంతం కావాలని ఆశీర్వదించి పంపించాడు.

"సీతను దొంగిలించి తీసుకెళ్ళిన నేరానికి నువు పాల్పడడం వలనే, సాయుధుడినై లంకాద్వారం దగ్గర నిలబడి వున్నాను - నువ్వేబలంతో విర్రవీగుతూ సీతను అపహరించావో ఆ బలాన్ని ఇప్పుడు నా ముందు చూపించు - లేకపోతే, సీతను తెచ్చి ఇచ్చి శరణు కోరుకో - అనే రామసందేశాన్ని విన్పించాడు అంగదుడు. తనవంతుగా కూడ **"విభీషణస్య నైశ్వర్యం భవిష్యతి హతేత్వయి"** రాక్షస కుల నిర్మూలన జరిగి, నీ రాజ్య సంపద అంతా విభీషణుడిపరం అవుతుంది... " అని హెచ్చరించాడు అంగదుడు.

అంగదుడి మాటలు విన్నాక రావణుడు "ఈ దుష్టుణ్ణి పట్టుకొని నిలువునా నరికి చంపండి" అని ఆదేశించాడు. రాక్షసులు పట్టుకోబోతుంటే వాళ్ళని విదుల్చుకొని, ఆకాశంలోకి ఎగిరి **"భంక్త్వా ప్రాసాద శిఖరమ్"** ఆ భవన శిఖరాన్ని పడగొట్టి, రాముడి దగ్గరకు తిరిగి వెళ్ళిపోయాడు అంగదుడు.

**9. ప్రహస్తుడు :**

యుద్ధం జరుగుతోంది. నాగపాశాబద్ధులై రామలక్ష్మణులు మూర్ఛపడివున్నారు. గరుత్మంతుడు వచ్చి నాగపాశ బంధాల్నుంచి వాళ్ళిద్దర్నీ విముక్తుల్ని చేశాడు. వానరసైన్యం గర్జించడం ప్రారంభించింది. రావణ శిబిరంలో ధూమ్రాక్షుడు, వజ్రదంష్ట్రుడు, అకంపనుడు... ఇలాంటి ప్రముఖులంతా హతులైపోయారు. రావణుడికి దిక్కుతోచలేదు. ప్రహస్తుడనే మరో రాక్షస వీరుడితో ఆలోచించడం మొదలుపెట్టాడు.

"ఇప్పుడొచ్చిన ఈ ముప్పుని సమర్థవంతంగా ఎదుర్కోగల శక్తి వున్నవాళ్ళం కొందరమే వున్నాం. నేనుగానీ, కుంభకర్ణుడుగానీ, నువ్వుగానీ, ఇంద్రజిత్తుగానీ, నికుంభుడుగానీ, విజయాలు సాధించగలరు. ముందుగా నువ్వు యుద్ధానికి వెళ్ళు. **"ప్రతిలోమా లోమా వాయత్తు నో మన్యసే హితమ్ -"** ఈ ఉపద్రవాన్ని తప్పించుకోవడానికి యుద్ధమే కర్తవ్యం. ఇందులో లాభనష్టాల గురించి నీ అభిప్రాయం చెప్పు - అని దీనంగా అడిగాడు రావణుడు.

అప్పుడు ప్రహస్తుడు అంతకన్నా శాంతంగా ఇలా సమాధానం చెప్పాడు.... "రాజా! ఇదంతా ఇంతకు మునుపు విభీషణుడు మన పక్షంలో వున్నప్పుడు సుదీర్ఘంగా చర్చించిన విషయమే ! విభీషణుడు నీతో విభేదించి బైటపడి రాముడివైపు వెళ్ళిపోయాడు. సీతను అప్పగిస్తేనే మంచిదని నా అభిప్రాయం కూడా ! అయినా, నీ మీద గౌరవంతో నేను విభీషణుడితోపాటు నిన్ను వదిలి వెళ్ళిపోలేదు. ఇప్పుడు నన్ను యుద్ధానికి వెళ్ళమని నువ్వు కోరుతున్నావు. నువ్వు రాజువి. నేను బంటుని. నీ ఆజ్ఞని పాటించడం నాకు ధర్మం. నేనిప్పుడే యుద్ధానికి వెడ్తున్నాను" అంటూ యుద్ధానికి వెళ్ళిపోయాడు. అలా మహాసేనని వెంటపెట్టుకొని వెళ్ళిన ప్రహస్తుడు నీలుడి చేతిలో మరణించాడు.



**10. కుంభకర్ణుడు :**

సాక్షాత్తూ కుంభకర్ణుడు రావణుణ్ణి ఎవరూ అనలేని మాటలే అన్నాడు. **"శీఘ్రం భిల్వ భ్యుపేతం త్వాం ఫలం పాపస్య కర్మణః ।"** నువ్వు చేసిన పాపకర్మఫలం ఎప్పటికైనా నీకు తగుల్తుంది అనుకున్నాను గానీ, ఇంత త్వరగా తగుల్తుందని అనుకోలేదు – ఇలాంటి తప్పుడు పనులు చెయ్యబోయే ముందు ఆలోచించుకోవాలి... లేకపోతే, ఇంకొకడి భార్యను ఎత్తుకు రావడం ఏమిటీ... అలా ఎత్తుకురావడాన్ని ఆ రోజున వీర్యదర్పం అనుకున్నావు. నువ్వు నమ్మిన నీ మంత్రులు, నీ సలహాదార్లే నీ కొంపముంచారు.... వీళ్ళ తప్పుడు సలహా వలన కదూ నీకు ఈ ఆపద వచ్చిందీ – విభీషణుడు చెప్పిందే సత్యం.... ఇప్పటికైనా అలాచేస్తే మంచిది– అన్నాడు కుంభకర్ణుడు.

**11. మయుడు :**

మండోదరి తండ్రి మయుడు. ఆయన కూడా రావణుడికి ఎంతో నచ్చచెప్పాడు - రాముడితో విరోధం మంచిది కాదు - ఎలాగోలా సంధిచేసుకొనే ఆలోచన చెయ్యమని ! కానీ, రావణుడు ఏకోశానా వినిపించుకోలేదు.

**12. మండోదరి :**

రావణ వధ జరిగిందని తెలిసి యుద్ధరంగానికి వచ్చి విలపిస్తూ మండోదరి అంటుంది - **"విభీషణేనాభిహితం నశ్వతం"** హేతుత్త్వయా॥ మారీచకుంభకర్ణాభ్యం వాక్యం మమపితుస్తదా॥" ఆ రోజున ఎంతగానో మొత్తుకున్నాడు విభీషణుడు, యథాశాస్త్రంగా చెప్పాడు. యుక్తియుక్తంగా చెప్పాడు. అందరికీ శ్రేయస్కరంగా చెప్పాడు. శక్తిదాయకంగా చెప్పాడు. కానీ, నువ్వు లక్ష్యపెట్టలేదు. మారీచుడు, ముందే చెప్పాడు. కుంభకర్ణుడు ఎంతో నచ్చచెప్పాడు. నా తండ్రి యముడు చెప్పాడు. మీ తాత మాల్యవంతుడు చెప్పాడు అయినా వినలేదుకదా....

**"యాస్త్వయా విధవారాజన్ ఏతానైకాః కులస్త్రియాః"** ఎంతమంది స్త్రీలని నువ్వు విధవలుగా చేశావు... ఆ వీరపత్నులందరి శాపాలు ఇవ్వాళ ఇట్లా ఫలించాయి.

అమర తేజస్సుతో లోకాలన్నింటినీ జయించిన నీకు ఈ "నారీచౌర్యం" చెయ్యాలనే బుద్ధి ఎందుకు పుట్టిందయ్యా .... అని ఏడుస్తుంది. అంతేగాని, తన భర్తను చంపాడని రాముణ్ణి ఒక్కమాట అనలేదు మండోదరి. **"లోకానాం హిత కామ్యయా హతనాక"** - లోకహితం కోరే రాముడు రావణుణ్ణి చంపాడు - అని అర్థం చేసుకొంది మండోదరి ! అది అలాగే జరగాలి- జరుగుతుంది - జరిగింది అనేది ఆమె తీర్పు.

ఈ పన్నెండు మంది రాముడి పక్షాన రావణుడితో వాదించినవాళ్ళే ! పద్నాలుగు వేల మంది రాక్షసుల్ని సేనగా కల్గిన ఖరుడు జనస్థానంలో రామబాణాల తాకిడికి సైన్యంతో సహా నశించిపోయిన రోజే రాముడు మానవమాత్రుడు కాదని ఋజువైపోయింది. దేవతలు కూడా ప్రవేశించడానికి అసాధ్యమైన లంకానగరంలోకి అప్రతిహతంగా హనుమంతుడు ప్రవేశించి దహనకాండని విశృంఖలంగా చేసిన రోజే ఋజువైపోయింది రావణ భద్రతా వ్యవస్థ ఎంత లోపభూయిష్టంగా వుందో... ఆరోజే రాక్షస ప్రముఖులంతా భయపడ్డారు రావణ వధ తథ్యం... అని. కొందరు బైటపడి రావణుడితో అన్నారు. మిగిలినవారు అనే ధైర్యం చెయ్యలేకపోయారు అంతే !

# సీత పుట్టింది రావణుడి ఇంటిలోనే

ఒకప్పుడు పద్మాక్షుడనే రాజు లక్ష్మీదేవి తనకు కూతురిగా పుట్టాలని ఆ దేవినుద్దేశించి తపస్సు చేయడం ప్రారంభించాడు. లక్ష్మీదేవి అతనికి ప్రత్యక్షమై, తాను పరతంత్రురాలిననీ, తనకు ఆ నిర్ణయాధికారం లేదనీ, విష్ణుమూర్తినుద్దేశించి తపస్సు చేస్తే అతని కోరిక నెరవేరవచ్చుననీ సూచించింది.

పద్మాక్షుడు ఆమె సూచన మేరకు విష్ణుమూర్తి కోసం తపస్సు చేయడం మొదలుపెట్టాడు. ఒకరోజు విష్ణువు ప్రత్యక్షమై ఒక మాదీఫలాన్ని ఇచ్చి, ఈ ఫలం వలన నీకు ఒక కూతురు పుడ్తుంది - అని చెప్పి అంతర్థానమయ్యాడు.

పద్మాక్షుడు ఆ ఫలాన్ని వలిచి చూశాడు. అందులోంచి ఒక ఆడపిల్ల బైటకు వచ్చింది - ఆ పిల్లకు పద్మావతి అని పేరు పెట్టి పెంచసాగాడు. ఆమె త్రిశక్తి స్వరూపిణి కదా.... ఆమెకు లోపం ఏముంటుంది ?

ఆమెకు యుక్తవయసొచ్చిన తర్వాత, నీలమేఘాన్ని వస్త్రంగా ధరించగలవాడికే తన కూతుర్ని ఇచ్చి పెళ్ళి చేస్తానని ప్రకటించాడు. రాక్షసులు అనేకమంది ఆమెను చేపట్టాలని ప్రయత్నించారు గాని పద్మాక్షుడు ఇలాంటి షరతు పెట్టడంతో, వాళ్ళందరూ కలిసి అతణ్ణి చంపి, నగరాన్ని ధ్వంసం చేశారు. పద్మావతి అగ్నిగుండంలోకి ప్రవేశించింది.

కొంతకాలం గడిచింది. అందరూ పద్మాక్షుడు గురించి, పద్మావతి గురించి మరిచిపోయారు. ఒకరోజు పద్మావతి అగ్నిగుండంలోంచి బైటకువచ్చి వనంలో విహరిస్తోందట... సరిగ్గా రావణాసురుడు అదే సమయానికి అక్కడకు వచ్చి మళ్ళీ చెరబట్టబోయాడు. అంతే ! ఆమె మళ్ళీ గుండంలోకి ప్రవేశించింది.

రావణుడు విమానంలోంచి నేలమీదకు దిగి, గుండాన్ని చల్లార్చి లోపల వెదికాడు. అక్కడ అతనికి పంచరత్నాలు దొరికాయి. వాటిని ఒక పెట్టెలో పెట్టి తీసుకెళ్ళి మండోదరికిచ్చాడు. మండోదరి పెట్టె తెరిచి ఆ రత్నాలను చూడాలనుకుంది కానీ, పెట్టె తెరుచుకోలేదు. రావణుడు కూడా ప్రయత్నించాడు. రాక్షసవీరులు కూడా చాలామంది ప్రయత్నించారు. అయినా పెట్టె తెరుచుకోలేదు. ఇంక లాభం లేదని గొడ్డళ్ళతో పెట్టెని పగలకొట్టారు. ఆ పెట్టెలో ఒక బాలిక పడుకొని కన్పించింది. ఇదంతా ఏమిటో రావణుడికి అర్థం కాలేదు.

రాక్షస పెద్దలు దీన్నిచూసి, "రావణా ! ఈ పిల్ల వలన రాక్షస వంశ నాశనం జరుగుతుంది" అన్నారు. "ఎంత త్వరగా వదుల్చుకుంటే అంత మంచిది" అని సూచించారు.

రావణుడు ఆ పిల్లను ఒక పెట్టెలో పెట్టి తీసుకెళ్ళి మిధిలానగరానికి దగ్గర భూమిలో పాతిపెట్టించాడు. ఆ పెట్టెలో పిల్లే సీతాదేవి. ఆమె పుట్టింది రావణాసురుడి ఇంట. పెరిగింది జనకుడి ఇంట .... ఇది సీత పుట్టుకని తెలిపే అనేక కథల్లో ఒక కథ. రావణుడు సీతని ఎత్తుకు రాలేదని, పుట్టింటికి తీసుకువెళ్ళాడనీ సమర్థించేవారు ఈ కథని ఉదహరిస్తారు.

# కుంభకర్ణుడు రావణుడికి పెట్టిన చివాట్లు

“ఆరోజున దేవాసుర సంగ్రామ సమయంలో మీరంతా కలిసే నాకు విజయం చేకూర్చిపెట్టారు. సంతోషం.

ఇవ్వాళ ఒక కోతి వచ్చి మన లంకానగరంలో విధ్వంసం సృష్టించి వెళ్ళింది. రామలక్ష్మణులనే ఇద్దరు నరులు మన మీదకు యుద్ధానికి వస్తున్నారు... మహావీరులుండగా నేను కోతులకూ, అటువంటి మనుషులకూ భయపడాల్సిన అవసరం ఏముందీ...

సీతను విడిచిపెట్టడానికి మన కులధర్మం ఒప్పుకోదు. రాజనీతి కూడా అందుకు అంగీకరించదు. ఇంక యుద్ధం అంటావా... ధర్మమో, అధర్మమో... రామలక్ష్మణుల్ని సంహరించకా తప్పదు !

ఈ రెండు కార్యాలకీ అనువైన మార్గాన్ని అన్వేషించు... ఏమంటావు ... కుంభకర్ణా.... నువ్వుండగా నాకు భయం దేనికీ !” అన్నాడు రావణుడు.

రావణుడు నిండుసభలో కొలువుతీరి వున్నాడు.

కుంభకర్ణుడు అప్పటిదాకా మౌనంగానే కూర్చున్నాడు. సభలో రాక్షస వీరులు తలా ఒకరకంగా మాట్లాడుతున్నారు. అప్పటికే రెండుసార్లు విభీషణుడు హితబోధ చేశాడు “యుద్ధం వద్దు – సీతను వదిలెయ్” ఇవి రెండే ఆయన నినాదాలు.

కానీ, రావణుడు ‘శాంతి’ గురించి ఎవరు మాట్లాడినా విసుక్కొంటున్నాడు. రాజును మెప్పించడం కోసం రాక్షస వీరులు రావణుడి శక్తిని పొగిడి, రెచ్చగొడ్తున్నారు.

వింటున్నాడు కుంభకర్ణుడు. “ఏమంటావు కుంభకర్ణా” అని రావణుడు పేరుపెట్టి పిలిచాక ఇంక మాట్లాడక తప్పలేదు.

ఆయన కొరకొరా రావణుడి వంక చూశాడు.

“అన్నా! నీ మతం విపరీతంగా వుంది ! అన్నీ నీకే తెలుసన్నట్లు మాట్లాడతావు. నీ ఇష్టం వచ్చినట్లు చేస్తావు – దారి తప్పినప్పుడు ‘మీరు మీరు’ అంటూ మా వెంట పడతావు – ఇది నీకు అలవాటేకదా !

ఆ రోజున సీతను ఎత్తుకొచ్చినప్పుడు గానీ, అంతకు ముందు గానీ ఇలానే సభను జరిపి చర్చించావా....మా అభిప్రాయం అడిగావా ? మేమంతా నిన్ను ఇలా చెయ్యమని చెప్పామా... పోనీ, మాతో చెప్పి చేశావా ?

ఆ రోజున మేము ఏమయ్యామనుకున్నావు ?

మాలో ఒక్కరితోనైనా నీ మనసులో ఆలోచన చెప్పావా ? అప్పుడు అవసరం లేని సలహా ఇప్పుడు మాత్రం దేనికి ?

మంచి, చెడు, న్యాయం, అన్యాయం, ధర్మం, అధర్మం ఇలాంటివి తర్కించి ఆలోచించేవాడు సుఖాలు పొందుతాడు. నీలాంటి వాడికి అలాంటి సంతాపాలు తప్పవు.

మంచి పనులు చెయ్యడానికైనా మంచి ఉపాయాలు కావాల్సి వున్నపుడు, ఇలాంటి నీచమైన పనిని చేయడానికి ఇంకెంత ఉపాయం ఆలోచించుకోవాలి ?

బుద్ధిబలం ఒక్కటే ప్రధానం కాదు... దానికి తగ్గ మనోధైర్యం కూడా కావాలి ! అవి రెండూ జతకూడితేనే విజయం చేకూరుతుంది !

శత్రువెప్పుడూ సహాయం కోసం ఎదురు చూస్తాడు. బుద్ధి తక్కువ వున్నవాడు శత్రువుకి ఆ అవకాశం కల్పిస్తాడు.

సీతని ఎత్తుకొచ్చినందుకు రాముడు ఇంతకాలం నిన్ను బతకనిచ్చాడంటేనే నాకు ఆశ్చర్యంగా వుంది ! అది మా భాగ్యవశాన జరిగిందే అనుకొంటాం !

సరే ... తగునో తగదో ... ఆ పని చేసేశావు. ఇప్పుడు దాన్ని తవ్వుకొని నిన్ను నిందిస్తూ కూర్చున్నందువలన ఉపయోగం ఏమీ లేదు.

ఇప్పుడు చేతులెత్తేసామంటే అంతకన్నా అవమానం ఇంకొకటి వుండదు. అది మన పరాక్రమానికి మాయని మచ్చ ! నలుగురిలో చులకన అయిపోతాం !! అంతకన్నా తలవంపుందా ?

అన్నా ! ఓడిపోకు ! నువ్వు ఓడిపోవాలని నేను కోరుకోవడం లేదు.

గ్రహపతి అడ్డగించుగాక !

అనిలానలులెత్తి వత్తురుగాక !

సురపతి వచ్చుగాక !

నేను అడ్డంగా నిలబడి వాళ్ళని నిరోధిస్తాను.

భయపడకు .... !"

ఇలా గుక్కతిప్పుకోకుండా ఏకబిగిన ఉపన్యసించాడు కుంభకర్ణుడు. సీతను ఎత్తుకొచ్చిన విషయంలో రావణుడికి పెట్టవలసిన చివాట్లన్నీ పెట్టాడు. చివరికి మళ్ళీ రావణుడి మార్గానే నడిచాడు. అదే అతని చావుకు కారణం !

# విభీషణుడికి శరణు దేనికి ?

రాముడి దగ్గరికి విభీషణుడు శరణుకోరి వెళ్ళాడు.

పార్టీలు మారే వాళ్ళని 'విభీషణులు' అని నిందిస్తూ వుంటారు రావణ పక్షపాతులు కొందరు. కానీ, విభీషణుడు చేసిందే సబబు అనీ, రావణుడి నిర్ణయాలు తప్పనీ లంకాపురి ప్రజలు రావణుడు బ్రతికుండగానే భావించుకొన్నారు. అందుమూలాన విభీషణుడు చేసింది ఆయారామ్ గయారామ్ వ్యవహారం కాదనేది స్పష్టం ! లంకాపురి శ్మశానంగా మారడానికి ప్రథమ కారణం శూర్పణఖేనని అక్కడి జనసామాన్యం అనుకోసాగారు.



సరే – విభీషణుడు రాముడి శరణుకోరి వెళ్ళాడు. ఎవరైనా శరణుకోరి వెళ్ళడానికి ఆరు రకాల కారణాలుంటాయని చెప్తారు – పార్టీలు మారేందుకు కూడా ఇవే కారణాలు అనుకోవచ్చు.

1. **అనుకూల్యం :** ఇక్కడికన్నా వారి నీడలో అనుకూలత ఎక్కువగా వుందనిపించినప్పుడు.
2. **ప్రతికూల్యం లేకుండా వుండటం :** అక్కడ స్వేచ్ఛ ఎక్కువగా వుంటుందనే ఓ నమ్మకం ఉన్నప్పుడు.
3. **రక్షణ ఎక్కువ :** ఇక్కడుంటే ఎప్పటికైనా ప్రమాదమే! అది సురక్షిత ప్రాంతం అనుకొన్నప్పుడు.
4. **రక్షణ కోరి :** నీవు తప్ప ఇతఃపరంబెరుంగనన్న పరిస్థితి ఏర్పడినప్పుడు.
5. **ఆత్మార్పణం :** తన వ్యక్తిత్వం, తన అధికారం, తన సౌభాగ్యం అన్నీ నశించిపోయి లొంగిపోవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు ఆత్మార్పణగా.
6. **దీనత్వం :** వేరే దిక్కులేని పరిస్థితి ఏర్పడినప్పుడు.

ఇలాంటి సందర్భాలలో ఇతరుల శరణుకోరతారు ఎవరైనా ! ఆ ఇతరులు అప్పటిదాకా తానూ విమర్శించిన శత్రువులుకూడా కావచ్చు !

యుద్ధకాలంలో తండ్రితో సమానమైన అన్నగారిని వదిలి ఆయన శత్రువుతో చే ు కలిపి, ఆఖరికి రావణ వధోపాయాన్ని కూడా చెప్పినవాడు విభీషణుడు. ఈ ఆరు ారణాలలో ఏ కారణాన్ని ఆశించి ఈ పనిచేశాడంటారూ ?

దీనికి రామాయణంలో చాలా చక్కటి సమాధానం వుంది.

"త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణంగతః" అంటే, భార్యాబిడ్డల్ని రావణాసురుడి దగ్గరే వదిలి, అందరినీ త్యాగం చేసి, ఒక్కడే రాముడిని శరణుకోరి వెళ్ళాడు.

సీతకు రక్షణగా విభీషణుడి భార్య 'సరమ'ని నియమించాడు రావణుడు. ఆ ఉద్యోగంలో విభీషణుడు వెళ్ళిపోయిన తర్వాత కూడా ఆమె కొనసాగింది !

తనకు తండ్రయినా, గురువయినా అన్నీ రావణుడే అయిన విభీషణుడికి, రావణుడు యుక్తాయుక్త వివేచన లేకుండా అధర్మంగా సంచరించినప్పుడు పరిత్యజించి తీరవలసిందే ననిపించడమే రామాయణంలోని యుద్ధకాండలో పెద్దమలుపు.

విభీషణుడికి రావణుడు గురువైతే, రాముడు జగద్గురువుగా కన్పించాడు. అన్నగారి అడుగుజాడల్ని అంటివచ్చిన లక్ష్మణుడు ఎంత గొప్పవాడో, ధర్మంకోసం అన్నగారిని ఎదిరించి వదిలేసి వచ్చిన విభీషణుడు కూడా అంతే గొప్పవాడు.

రామలక్ష్మణుల చేతిలో హతుడైన మారీచుడు గానీ, కుంభకర్ణుడు గానీ, రావణుడు చేసింది తప్పని అతని మొఖానే కుండపగలగొట్టినట్లు చెప్పారు. కానీ, రాజాజ్ఞ పాటించడానికే వాళ్ళు మొగ్గుచూపించి, రావణుడి పక్షాన యుద్ధంచేసి హతులయ్యారు.

కానీ, విభీషణుడు అలాంటి నిర్ణయం తీసుకోలేకపోయాడు. అందుకు కారణాన్ని ఆయన ఇంద్రజిత్తుతో స్పష్టంగా చెప్పాడు.

"బాబాయి ! లంకలో పుట్టి పెరిగి ఇలా లంకకు చేటుతెస్తున్నావు – ఇది నీకు తగునా ?" అని అడిగాడు యుద్ధంలో లక్ష్మణుడితో కలిసి విభీషణుడు ఇంద్రజిత్తుని ఎదుర్కోవడానికి వచ్చినప్పుడు.

అప్పుడు విభీషణుడు చెప్పిన గొప్ప సమాధానం ఇది...

"కులే యద్యప్యహం జాతో రక్షాసాం క్రూరకర్మగామ్
గుణోయః ప్రథమోన్నృణాం తన్మే, శీల మరాక్షసమ్
న రమే దారుణే నాఽహం నచాఽధర్మేణ వైరమే ... ॥"

"నీకులాగే క్రూరస్వభావం కల్గిన రాక్షసకులంలోనే నేను కూడా పుట్టాను. కానీ, నాకు మీ క్రూరస్వభావాలు రాలేదు. నేను సాత్విక స్వభావాన్ని కల్గినవాణ్ణి ! మీరంతా రాక్షసరాజు రావణుడు చేసింది తప్పని తెలిసినా దాన్ని సహించి, యుద్ధంలో పాల్గొంటున్నారు. దారుణ కార్యాలు, అధర్మాలు నా మనసుకు గిట్టవు. నేనేదో స్వజనద్రోహానికి పాల్పడ్డానని నువ్వంటున్నావు – నిజానికి ఇంతమంది రాక్షసవీరులు

నాశనం కావడానికి రావణుడు, ఆ రావణుణ్ణి సమర్థిస్తున్న మీరందరూ ఈ స్వజనద్రోహానికి పాల్పడుతున్నారు. చేత్తో పట్టుకొన్న విషసర్పాన్ని వదిలేయకుండా వుంటామా అని ప్రశ్నించాడు విభీషణుడు.

విభీషణుడు ధర్మపక్షపాలన వహించాడే గానీ, పార్టీ మారలేదనడానికి ఈ సంభాషణ చక్కని సాక్షి !

## విభీషణుడు ధర్మపక్షపాతి ఇలా అయ్యాడు !

రావణుడు శివుడి కోసం ఎంత తపస్సు చేశాడో విభీషణుడు బ్రహ్మ గురించి కూడా అంతే తపస్సు చేశాడు. ఘోరతపస్సు కాబట్టి తప్పనిసరిగా బ్రహ్మ ప్రత్యక్షమైనాడు.

దేవతలు కరుణించి వరమిచ్చిన ప్రతిసారి రాక్షసులు ఆత్మవినాశనాన్ని తెచ్చుకునే విధంగానే వరాలు కోరుతున్నారు. రావణుడు తనకు మరణం రాకుండా చేసేందుకు అన్ని రకాల ప్రాణులు, ఆయుధాల గురించి చెప్పాడు గాని, మామూలు మనుషులు గురించి, వానరుల గురించి అడగడం మరచిపోయాడు. ఇప్పుడదే అతని పుట్టిముంచింది.

కానీ, విభీషణుడు అలాంటి వరాలు కోరలేదు - **"పరమా పద్గత స్యాపి ధర్మే మమ మతిర్భవేత్"** ఎంతటి ఆపదలు ముంచుకొచ్చినా తన బుద్ధి ధర్మం వైపే నడిచేలా వరం ఇమ్మని కోరాడు విభీషణుడు. అలాంటి విభీషణుడి ఆలోచన యుద్ధకాలంలో రాఘవరాముడి పక్షాన వుండడంలో ఆశ్చర్యం లేదు కదా !

## విభీషణుడిని చేర్చుకోవాలా ? వద్దా ?

విభీషణుడు అన్నగారిని వదిలి శత్రుపక్షంలోకి వచ్చేశాడు. తన జ్ఞాతులెప్పుడూ తన హానినే కోరుకొంటారు - ఈ విభీషణుడూ అంతే - అనుకొన్నాడు రావణుడు. శత్రువే గొప్పవాడని భావించేవాణ్ణి తన దగ్గర వుంచుకోవాల్సిన అవసరం లేదనుకొన్నాడు. బైటకు పొమ్మన్నాడు. స్వయానా తమ్ముడు కాబట్టి చంపకుండా వదిలేశాడు.

సరే! రాముడి పక్షంలోకి చేరిపోవాలని సముద్రం దాటి వచ్చాడు విభీషణుడు. రాగానే అతనికి ఎర్రజంపకాణా స్వాగతాలేమీ లభించలేదు. అక్కడ తన విధేయతని చాటుకోవడానికి విభీషణుడు బాగానే శ్రమపడవలసి వచ్చింది. అతన్ని స్వపక్షంలో చేర్చుకోవడానికి ఎదురైన అభ్యంతరాలివి :

1. "శత్రుపక్షం వాడు కాబట్టి, స్వీకరించకూడదు"- సుగ్రీవుడు.
2. "బాగా పరీక్షించి, చేర్చుకోదగినవాడని తెలితేనే స్వీకరించాలి" - అంగదుడు.
3. "అతని గురించి నమ్మకస్తుడెవరైనా చెప్తే తప్ప చేర్చుకోరాదు" - శరభుడు.
4. "పరమ రాక్షసుడు రావణుడి తమ్ముడు ఇతను - అనే సంగతి మనం మరచిపోకూడదు" - జాంబవంతుడు.
5. "కొన్నాళ్ళు అతని నడవడిని, కదలికల్ని పరిశీలించడంకోసం కొందరు అజ్ఞాత వ్యక్తుల్ని నియమించి పరీక్షింపచేయడం మంచిది"- మైందుడు.
6. ఇతని నడకను నేను లంకలోనే పరిశీలించాను. నిరంతరం రామ నామస్మరణలో గడిపినవాడు. అతని ముఖం చూస్తే అమాయకుడని అనిపించడం లేదా... మీరంతా ఇలా మాట్లాడడం ఏమీ బాగాలేదు" - హనుమంతుడు.
7. దుష్టుడే అయినా సరే, శరణాగతుడైనవాడి తప్పులు వెదకడం కూడా తప్పే అవుతుంది. **"దోషోయద్యపి తస్యస్యా త్సతా మేవదగర్హి గతమ్"**
"కోటి పాపాలు చేసినవాడైనా సరే నన్ను శరణుకోరితే, ఆ కోటి పాపాల్నీ క్షమించగలను నేను" - అన్నాడు రాముడు.

"సదుష్టా వాప్యదుష్టో వా కి మేష రజనీచరః
సూక్ష్మమష్యహితం కర్తుం మమశక్తః కథంచన॥"

"విభీషణుడు దుష్టుడు అవునా కాదా - అనే చర్చ వద్దు. అతను దుష్టుడైన రాక్షసుడే ! అయినప్పటికీ మనకి అణుమాత్రం కూడా అపకారం చెయ్యలేదు. పిశాచులు గానీ, దానవులు గానీ, యక్షులు గానీ ఈ భూమండలం మీద వున్న రాక్షసులంతా ఏకమై వచ్చినాసరే - నేను తల్చుకొంటే బొటన వేలి మొనతో అంతం చెయ్యగలను" అన్నాడు రాముడు. "కాబట్టి సుగ్రీవా! అతన్ని లోపలికి తీసుకురండి! నేను అతనికి అభయం ఇస్తున్నాను. అతను విభీషణుడే అయినా సరే, సాక్షాత్తూ రావణుడే అయినా సరే ... అభయం ఇచ్చాను- అంతే!" ఇది రాముడి నిర్ణయం.

## వంతెన నిర్మాతలు నలుడు, నీలుడు

రామబాణానికి భయపడిన సముద్రుడు, తనని తేలికగా దాటడానికి తగిన ఉపాయాన్ని రాముడికి ఇలా చెప్పాడు -

"మీ సైన్యంలో నలుడు, నీలుడు అని ఇద్దరు మహావీరులున్నారు. వీళ్ళు చిన్నప్పుడు ఋషులు తపస్సు చేసుకొంటుంటే, వాళ్ళ సాలగ్రామం, ఇతర వస్తువులు ఎత్తుకొచ్చి

నదిలో పారేస్తుండేవాళ్ళు. వాటిని వెతుక్కోవడం కష్టంగా వుండి, ఈ ఇద్దరూ నీళ్ళలో ఏది పారేసినా మునక్కుండా నిలబడివుంటుందని ఋషులు ఒక శాపం పెట్టారు. ఆ రోజున వారికది శాపంగానీ, ఇప్పుడు మనకు అది వరం. ఆ ఇద్దరిచేతా మీరు పెద్ద పెద్ద బండరాళ్లు తెప్పించి నీటిలో వేయించండి. అవి తేల్తాయి. మీరంతా ఆ రాళ్ళమీంచి నడిచి వెళ్ళవచ్చు. నా శక్తి కొలది నేనుకూడా సహాయం చేస్తాను" – అన్నాడు సముద్రుడు.

రాముడికి సముద్రుడు చెప్పిన ఉపాయం బాగా నచ్చింది. నలుడూ, నీలుడూ రాళ్ళవంతెన కట్టడానికి ముందుకొచ్చారు. వంతెన కట్టాలని నిర్ణయం జరిగిపోయింది.

మరి సముద్రుడి మీదకు ఎత్తిన బాణాన్ని ఏం చెయ్యాలి...? సముద్రుడే సలహా చెప్పాడు– ఉత్తర తీరంలో కిరాతులున్నారు. అక్కడ ప్రయోగించమన్నాడు. సముద్రుడు చెప్పినట్లే కిరాత భూముల మీద రాముడు బాణప్రయోగం చేశాడు. ఆ బాణ ప్రభావం వలన అక్కడ నీటమునిగివున్న భూముల్లోంచి నీరంతా సముద్రంలోకి ప్రవహిస్తూ వచ్చేసింది. నీటమునిగిన ప్రకృతి సంపదలన్నీ గాలిపోసుకున్నాయి.

సరే! సముద్రం మీద వంతెన కట్టాలని నిర్ణయం అయ్యింది. కట్టించేశాడు శ్రీరాముడు. ఆయన తన సంకల్పబలంతోనే ఈ కార్యాన్ని సాధించగలుగుతున్నాడు. కట్టే వాళ్లు ఇద్దరు - నలుడు, నీలుడు. ఇద్దరూ స్వచ్ఛందంగా ముందుకొచ్చారు. నిక్కడం, నీల్గడం వంటివి ఏమీ లేవు. మహాపర్వతాలమీద దొరికిన బండరాళ్ళను అవలీలగా తెచ్చి అందిస్తున్నారు గజబలులైన వానరవీరులు.

యుద్ధవిధుల్లో వంతెనలు కట్టడం ఒక అంశం. కొండల్ని కలిపేటప్పుడు, లోయల్ని దాటేటప్పుడు వంతెనలు కావాలి. నదులు దాటేటప్పుడూ వంతెనలు కావాలి.

వానరులు యుద్ధ జీవులు. వంతెనలు కట్టడం వాళ్ళకి కొత్త విషయం కాకపోవచ్చు. కాకపోతే, మహా సముద్రం మీద వంతెన కట్టడం వాళ్ళకు ఒక మధురానుభవాన్ని ఇచ్చి వుండివుంటుంది.

**హస్తి ప్రాయాన్ మహాకాయః పాషాణాశ్చ మహాబలాః**
**పర్వతాంశ్చ సముత్పాట్యయన్త్రైః పరిహన్తిచ॥**

ఏనుగంత భారీ శరీరాన్ని కల్గిన బలసంపన్నులు కూడా ఈ వానరుల్లో వున్నారట. వాళ్ళు పెద్ద పెద్ద రాళ్ళని పెళ్ళగించి తెచ్చి నలుడికి, నీలుడికీ అందిస్తున్నారు. వాళ్ళు స్వయంగా తమ చేతుల్తో ఆ రాళ్ళని సముద్రంలోకి విసిరేస్తున్నారు. వరమో, శాపమో... దాని ప్రభావాన ఆ రాళ్ళేవీ నీళ్ళలో మునగకుండా తేలియాడుతున్నాయి.

**"సముత్పాట్య యన్త్రైః"** అనే పదాన్ని ప్రయోగించాడు ఆ సందర్భంలో వాల్మీకి. అంటే, ఎక్కడ ఎంత రాయి అవసరమో అంతే రాయిని యంత్రాల సాయంతో తెచ్చి సముద్రంలోకి జారవిడుస్తున్నారని అర్థం.

యంత్రాలంటే, ఏ యంత్రాలు... ? పుల్లీలు, కప్పీలు వున్న క్రేన్ల వంటి యంత్రాలయి వుండాలి. వాటి సహాయంతో వివిధ పరిమాణాల్లోనూ, వివిధ ఆకారాల్లోనూ వున్న రాళ్ళను **"ఉత్పాట్య"** అంటే, పెళ్ళగించి తెచ్చారట.

వానరులంటే తోకలున్న కోతులు అనే అర్థంలోనే రామాయణాన్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తే, మానవ గమ్యానికి దిశానిర్దేశం చేసిన రాముడి చరిత్ర కేవలం ఒక దేవుడి కథగానే మిగిలిపోతుంది గాని, అందులో మనం అనుసరించదగింది ఏమీ వుండదు.

**"దృశ్యంతే... పరిధవంతో దేవదానవ సంనిభాః"** ఈ విధంగా పెద్ద పెద్ద రాళ్ళను అవలీలగా మోస్తూ, వానరులు పరిగెడ్తుంటే, ఆ దృశ్యం చూస్తున్నవాళ్ళకి ఈ వానరులు దేవదానవులకు ఏ మాత్రం తీసిపోనివారని అనిపిస్తోంది అంటాడు వాల్మీకి.

**"సూత్రాణ్యన్యే ప్రగృహ్ణంతి హ్యాయతం శతయోజనమ్ ।**
**దండాన్యన్యే ప్రగృహ్ణంతి విచిన్వంతి తథాపరే ॥**
**నలశ్చక్రే మహాసేతుం మధ్యే నరనదీపతే :**

"సూత్రం" అంటే కొలిచే టేపు లాంటిది లేదా తాడు. ఈ వానరుల్లో ఇంజనీరింగ్ పరిజ్ఞానం వున్నవారిని కొందర్ని నూలుతాడు పట్టుకొని సముద్రం మీదకి నూరు యోజనాల దూరం పంపించాడట. వాళ్ళు బహుశా వంకరలు లేకుండా నేరుగా లంకానగరం వరకూ వంతెనని కట్టడానికి మార్గాన్ని నిర్దేశించేవాళ్ళు కావచ్చు. ఇంకొందరు వెనకాలే "దండం" అంటే కొలబద్ద పుచ్చుకొని వెళ్ళారట. సూత్రం అంటే 'మెజరింగ్ టేప్' అనీ, దండం అంటే మెజరింగ్ పోల్ అనీ అర్థం.

ఇలా ఐదురోజులు కష్టపడి లంకావరణం వంతెన పూర్తిచేశారట. మొదటిరోజు 14 యోజనాలు, రెండోరోజు 20 యోజనాలు, మూడోరోజు 21 యోజనాలు, నాలుగో రోజు 22 యోజనాలు, ఐదోరోజు 23 యోజనాలు మొత్తం 100 యోజనాల పొడవైన వంతెనని సముద్రం మీద నిర్మించారు.

ఇక్కడ ఒక ముఖ్య విషయం చెప్పాలి. నీటిపైన తేలే రాళ్ళున్నాయి. లోపల డొల్లగా వుండి, పైకి రాయిలా కన్పిస్తుంది. అలాంటి రాళ్ళను ప్రత్యేకంగా సేతువు నిర్మాణం కోసం వాడివుండవచ్చు. నీటిమీద తేలేలా చేసినంతమాత్రాన మనుషులు దాని మీద నడవడం సాధ్యంకాకపోవచ్చు. అవి సముద్రపు తాకిడికి అటూ ఇటూ కదలకుండా కర్రలూ, మేకులూ ఉపయోగించివుంటారు కూడా! ఈనాటి మన బుర్రకు అందని ఇంజనీరింగ్ ప్రక్రియ వంటిది ఏదైనా రాముడికో, నీలుడికో, నలుడికో తెల్సివుండవచ్చు.

ఏమైనా, సముద్రంమీద రాళ్ళతో వంతెన కట్టడం అనేది ఓ అద్భుత విన్యాసం !! దాన్ని సాధించినవారు నలుడు - నీలుడు !

# గోవర్ధన పర్వతం కథ

సముద్రం మీద వంతెన కట్టడానికి మహా పర్వతాన్ని పెళ్ళగించుకురావల్సి వచ్చింది. ఎక్కడెక్కడికో వెళ్ళి పర్వతాలంత బండరాళ్ళను మోసుకొచ్చి వానర సేన సముద్రం మీద పడేస్తుంటే, అవి బంతుల్లా తేల్తున్నాయి.

హనుమంతుడు వాయు మనో వేగాలతో హిమాలయాల్లోకి వెళ్ళి అక్కణ్ణించి గోవర్ధన పర్వతాన్ని పెళ్ళగించాడు. "నీకు రాముడి దర్శనం చేయిస్తాను" - అని వాగ్దానం చేసి మరీ ఆ పర్వతాన్ని మోసుకొని వస్తున్నాడు హనుమంతుడు.

ఈలోగా, ఐదురోజుల్లోనే వంతెన నిర్మాణం పూర్తయిపోయింది. ఇంక బండరాళ్ళను మోసుకురావడం ఆపేయాలని రాముడు వానరసేనను ఆజ్ఞాపించాడు. ఎక్కడెక్కడో దూరప్రాంతాలకు వెళ్ళిన వాళ్ళకి ఈ సమాచారం ఎలా తెలుస్తుంది? అందుకని "ఇంకచాలు తేవద్దు" అనే రామాజ్ఞని విన్పించడానికి కొందరు వానరులు ఎదురువెళ్ళారు.

హనుమంతుడు గోవర్ధనగిరిని హిమాలయాల నుంచి మోసుకొని, ఏడు రోజుల పాటు ప్రయాణించి యమునా నదీతీరం బృందావనందాకా వచ్చేసరికి ఆయనకు కబురందింది - రాముడు 'తేవద్దు' అన్నాడని ! అందుకని ఆ గోవర్ధన పర్వతాన్ని బృందావనం దగ్గర దించేశాడు.

అప్పుడు పర్వతుడు మానవరూపం ధరించి, "హనుమా! నాకు రామదర్శనం చేయిస్తానని మాటిచ్చావు- ఇలా మధ్యలో వదిలేసి వెళ్ళడం న్యాయమేనా?" అనడిగాడు.

హనుమంతుడికి ఏం చెయ్యాలో పాలుపోలేదు.

రివ్వున ఎగిరి రాముడి దగ్గరకు వెళ్ళి "ఇలా జరిగింది - ఏం చెయ్యమంటారు -?" అనడిగాడు. రాముడు సంతోషించి, "ద్వాపర యుగంలో మా దర్శనం లభిస్తుందని చెప్పు, అందాకా యమునానదీ తీరంలోనే వుండమని అన్నానని కూడా చెప్పు –" అన్నాడు.

అలా అనడంలో మర్మం ఏమిటో ఆలోచించేంత సమయం హనుమంతుడికి లేదు. ఆయన అసలా ఆలోచనే చెయ్యడు కూడా! చెప్పింది చెప్పినట్లు చేయడమే తన విధి అనుకొంటాడు.

గోవర్ధనుడి దగ్గరకు వెళ్ళి రాముని మాట నివేదించాడు హనుమంతుడు. గోవర్ధనుడు సంతోషంతో ఉప్పొంగిపోయాడు. త్రేతాయుగంలో ఏడు రోజులు హనుమంతుడు దాని బరువును భరిస్తే, ద్వాపరయుగంలో సాక్షాత్తూ శ్రీకృష్ణుడు ఏడు రోజులు గోవర్ధనగిరిని ఎత్తి పుచ్చుకున్నాడు !!

# రామేశ్వరంలో రాముడు శివలింగాన్ని ఎందుకు ప్రతిష్ఠించాడు...?

వంతెన పూర్తయ్యింది. శ్రీరాముడు స్వయంగా వచ్చి వంతెనని పరిశీలించి చూసి చాలా సంతోషించాడు. ఆ ప్రదేశం చాలా రమణీయంగా కన్పించింది రాముడికి. ఆయనకు ఆ క్షణాన ఒక అద్భుతమైన ఆలోచన కల్గింది. చుట్టూ వున్న వానరులతో, "ఇక్కడ ఒక శివలింగాన్ని ప్రతిష్ఠించాలని ఉంది" అన్నాడు.

రాముడు అనీ అనడంతోనే, లింగాన్ని తయారుచేసేందుకు శిల్పులకు పని పురమాయించాడు సుగ్రీవుడు. అలాగే, లింగ ప్రతిష్ఠ జరపడానికి పౌరోహిత్యం కోసం మునుల్ని తీసుకురమ్మని ఇద్దరు వానరుల్ని పంపించాడు.

రావణుడు శివపూజా దురంధరుడు. అలాంటి రావణుణ్ణి వధించేందుకోసం వంతెన కట్టి యుద్ధానికి బయల్దేరేందుకు సిద్ధంగా వున్నారంతా. తన భక్తుడికి అపకారం జరుగుతున్నప్పుడు శివుడు దీన్ని వ్యక్తిగత ప్రతిష్టగా తీసుకోకుండా ఆయన్ని ప్రసన్నుణ్ణి చేసుకోవాలి. 'రావణ వధ' శివుడికీ సమ్మతం కావాలి. అందుకు శివుణ్ణి ప్రసన్నం చేసుకోవడం అవసరం.

సుగ్రీవుడు పంపిన వానరులిద్దరూ అనేకమంది వేద పండితులైన మహర్షుల్ని పిలుచుకువచ్చారు. అందరి సమక్షంలో రాముడు అక్కడ శివలింగాన్ని ప్రతిష్ఠించాడు. వేదోక్తంగా మునులు షోడశోపచారాలతో అర్చిస్తుండగా రాముడు ఆ లింగానికి ప్రాణ ప్రతిష్ఠచేశాడు.

అప్పుడక్కడ చేరిన అందరినీ ఉద్దేశించి రాముడు ఇలా ప్రకటించాడు. 'శివుడు' అందరికన్నా నాకు ఎక్కువ ప్రీతిపాత్రుడు. నా భక్తుణ్ణని చెప్పుకొంటూ ఎవరైనా సరే శివనిందకు పాల్పడితే వాణ్ణి నేను సహించను. కలలోకూడా వాడికి నా కటాక్షం కలగదు. శివుడికి భక్తుడు కానివాడు నాకు భక్తుడు కాలేడు" - అన్నాడు రాముడు. "శివ నిందచేసేవాడు బుద్ధిహీనుడు" అని రాముడు చెప్పిన సంగతిని ఈనాటికీ విష్ణుభక్తులు చాలామంది పట్టించుకోరు. శివాలయాలకు వెళ్ళని వైష్ణవులు అనేకమంది వున్నారు. బహుశా ఈ కారణంచేతనే కాబోలు, తులసీదాసు తన రామాయణంలో 'లంకాకాండ'లో ఈ విషయాన్ని ఇంత స్పష్టంగా రాశాడు.

# సుగ్రీవా ! మధ్యలో నీకేం సంబంధం ?

విభీషణుడు రాముడి పక్షంలో చేరిపోయిన తర్వాత, శార్దూలుడు వెళ్ళి రాముడి బలగం ఎంతో, బలాలు ఎంతో చూసివచ్చి మరీ రావణాసురుడికి వివరించాడు.

ఈ సైనికులంతా ఎవరు ?

సుగ్రీవుడి సైన్యమే ..... !

శార్దూలుడు చక్కగా వివరించి చెప్పాడు. "రాముడితో సంధి, సీతను అప్పగించడం సంగతి అలా వుంచండి ..... గతంలో వాలితో సంధి ఒప్పందాలున్నాయి కదా ..... సుగ్రీవుడితో వాటిని కొనసాగిస్తే సరి ..... సుగ్రీవుడూ, రాముడూ విడిపోతే యుద్ధం సమస్యే వుండదు కదా ....." అని !

"మీ ముందు మూడు మార్గాలున్నాయి".

1) సీతను రాముడికి ఇచ్చేయడం

2) సుగ్రీవుణ్ణి మన పక్షానికి రప్పించుకోవడం

3) సుగ్రీవుణ్ణి చావుదెబ్బకొట్టడం

అన్నాడు శార్దూలుడు. మంత్రిగా ఉపాయాలు చెప్పడం ఆయన బాధ్యత. ఆయన చెప్పవలసింది ఆయన చెప్పాడు. ఇప్పుడు నిర్ణయించుకోవలసింది రావణుడు.

శార్దూలుడు చెప్పిన విషయాల్లో సుగ్రీవుణ్ణి మంచి చేసుకోవడం మేలైన ఆలోచనగా కన్పించింది రావణాసురుడికి !

తంపులు పెట్టగల నేర్పరి ఇందుకు కావాలి ..... శుకుడనే మంత్రిని పిలిచి కావలసిందేదో చూడమని ఈ పనిని పురమాయించాడు.

చూశాడు ఒంటరిగా, రహస్యంగా వెళ్ళి సుగ్రీవుడితో మాట్లాడాడు.

**"త్వంవై మహారాజ కుల ప్రసూతో మహాబల శ్శర్క్ష రజ స్సుతశ్చ !"**

"సుగ్రీవ మహారాజా ! నువ్వు గొప్ప కులంలో పుట్టిన వాడివి. సాక్షాత్తూ సూర్యుడికి పుట్టిన వాడివి. అవతార పురుషుడివి. నీతో మాకు యుద్ధం ఏమిటీ ..... నువ్వు అజాత శత్రువువి. నీతో గాని, నీ సైన్యంతో గాని, మాకు ఏ విరోధమూ లేదు కాబట్టి నీతో యుద్ధం చెయ్యడం కుదరదు –

సుగ్రీవా ! నువ్వు మహాబలుడివి. నీకన్నా తక్కువ బలం ఉన్న వాడు నిన్ను ఆశ్రయించాలి గాని, నీ అంతటి వాడివి – నువ్వెళ్లి ఆశ్రయించడం మాకు ఆశ్చర్యాన్ని కల్గించింది !

సుగ్రీవా ! నువ్వు బ్రహ్మకు మనవడివి. బ్రాహ్మణుడివి – మా ప్రభువు రావణుడు కూడా బ్రహ్మ వంశజుడే ..... కాబట్టి మీరూ మీరూ బంధువులు అవుతారు.

నువ్వు రాముణ్ణి ఆశ్రయించినందు వలన ఇప్పుడు అదనంగా కలిగే లాభంగానీ, ఆశ్రయించకపోతే కలిగే నష్టం గాని ఏమీ లేదు.

రావణుల వారికి వాలి ఎంతో, వారి తమ్ముడివైన నువ్వు కూడా అంతే ! రావణుల వారికి సాక్షాత్తూ తమ్ముడివి –

సుగ్రీవా ! నువ్వు బుద్ధిమంతుడివి. ఆలోచించగలవు –

మా రావణుల వారికి అనేక వ్యవహారాలు. ఏదో ఒక వ్యవహారంలో తప్పనిసరి అయి ఎవడో ..... ఒకడి భార్యను ఎత్తుకు రావలసి వచ్చింది ..... ఆయన ఎత్తుకొస్తే నీకేం పోయింది ..... ? నీ భార్యల్లో ఎవరి జోలికి ఆయన రాలేదు కదా ..... !

నీకు ఆయన మీద ఎందుకు కక్ష !

నిన్నెప్పుడూ ఆయన పల్లెత్తు మాట అని ఎరుగడు కదా !! అందుకని నా మాట విని కిష్కింధకు తిరిగి వెళ్ళిపో .....

"నహీయం హరి భిర్లంకా
ప్రాప్తుం శాక్య కథంచన !
దేవైరపి సగంధర్వైః కింపునర్నర వానరైః

మిత్రమా ! ఈ లంకా రాజ్యం వున్నది చూశావూ ..... ఇది ఆ హరికే కాదు – ఏ ఒక్క దేవతకీ సాధ్యం కాని నగరం.

దేవతలు, గంధర్వులు, కింపురుషులు, చివరికి నర వానరులు కూడా లంకని జయించాలనీ, లోపలికి చొచ్చుకు రావాలని చాలాసార్లు చాలామంది ప్రయత్నించి ఘోరంగా దెబ్బతిన్నారు. అందుకని, నువ్వూ నీ సేనా వెనక్కు పోవడం మంచిది – అన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు అన్నాడు – నీ రావణుడికి చెప్పు – నువ్వు నాకు ఏ నాడూ ఏ కోశానా ఉపకారం చెయ్యలేదు. ఒకింత మంచి కూడా చెయ్యలేదు. నువ్వు నాకు ఏ విధంగా సోదర సమానుడివి అవుతావు – ? నా మిత్రుడికి, నాకు సాయపడిన వాడికి నువ్వు శత్రువు కాబట్టి, నీతో నాకు విరోధం, అంతే. దీనికి ఇంతకన్నా బలమైన కారణం వుండనవసరం లేదు –

"నిహన్మ్యహం త్వాం ససుతం
స్కన్ధుం సజ్ఞాతి వర్గం రజనీచరేశ .....
రజనీచరుడివైన రావణా !

నీ జ్ఞాతుల్ని, నీ బంధువుల్ని, నీ పరివారాన్ని, నీ పుత్రుల్ని అందర్ని పట్టుకుని నిశ్శేషంగా నిర్మూలించడానికే నేనిక్కడకు వచ్చాను - " అని - ఇవే మాటలు యధాతథంగా చెప్పమని చెప్పాడు సుగ్రీవుడు.

దూతగా వచ్చిన వాణ్ణి పట్టి రాముడి దగ్గరకు తీసుకు వెళ్ళాడు.

అప్పుడు రాముడు ఐదురోజులు వంతెన నిర్మాణం పూర్తి అయ్యేవరకూ శుకుణ్ణి అక్కడే వుండమన్నాడు.

వంతెనని కూడా చూసిన తర్వాత వెళ్ళి రావణుడికి యథాతథంగా వున్నదంతా చెప్పవలసిందిగా ఆజ్ఞాపించి శుకుణ్ణి వదిలాడు.

శుకుడు తిరిగి రావణుడి దగ్గరకు ప్రాణాలతో వెడతాననుకోలేదు - వెళ్ళి, **"పురాప్రాకార మాయాన్తిక్షిప్రమేకతరం కురు ! సీతాం చాపి ప్రయచ్ఛశు యుద్ధం వాపి ప్రదీయతామ్ -"**

శ్రీరాముడి బలగం అంతా మన ప్రాణాల దాకా చేరిపోతోంది. రాయబారాలు, బేరసారాలూ ఇంక ఉపయోగపడవు. యుద్ధానికి సన్నద్ధం కావడమో, సీతను ఇచ్చేయడమో ..... రెండే మార్గాలింక !" అని వివరించాడు.

"నైవ సీతాం ప్రదాస్యామి
సర్వలోక భయాదపి -"

ఏది ఏమైనా, ఈ లోకాలన్నీ భయంతో వణికిపోతున్నా సరే - నేను మాత్రం సీతను వదిలే సమస్యే లేదు - అన్నాడు రావణాసురుడు కఠినాతి కఠినంగా !!

# రావణుణ్ణి విస్మయపరచిన వంతెన

"ఏమిటీ... సముద్రుణ్ణి బంధించారా...?" ఆశ్చర్యంగా అడిగాడు రావణాసురుడు. శ్రీరాముడి కదలికల్ని ముందుగానే పసిగట్టడంలో విఫలమైన ఆయన గూఢచార వ్యవస్థ అసలేం చేస్తోందో అర్థంకాలేదు-

"జలనిధి, నీరనిధి, జలధి, సింధు, వారీశ, హోయనిధి, కంనిధి, ఉదధి, నదీశ... ఇన్ని పేర్లతో ప్రసిద్ధికెక్కిన సముద్రజలాల ఊపుని అరికట్టి దానిమీద వంతెన కట్టడమా... నిజమేనా?" అని మళ్ళీ ప్రశ్నించాడు. గూఢచారులు తలలు వంచుకొనే అవునని చెప్పారు.

రావణుడుకి పది ముఖాలున్నప్పటికీ ఆయన ఎప్పుడూ ఒక్క ముఖంతోనే ప్రసంగిస్తాడట... చారులు చెప్పింది వినేసరికి, మతిపోయినట్లయి పది ముఖాలతోనూ "అవునా?" అని ఆశ్చర్యపడి పదేపదే ప్రశ్నించాడట.

ఏ రోజున పది ముఖాలతో రావణుడు మాట్లాడతాడో, ఆ రోజున మృత్యువు అతనికి దగ్గరవుతుందని ఒక శాపం వుందిట రావణుడికి. తులసీదాసు లంకా కాండలో ఈ విషయం రాస్తూ అంటాడు- పది ముఖాలతోనూ మాట్లాడానంటే అపశకునం అని ముని శాపం వుందని గుర్తుకు తెచ్చుకొని, "... అయినా శాపాలు నన్నేం చేయగలుగుతాయి?" అని సరిపెట్టుకొన్నాడట - ఇదంతా నా మనోభ్రాంతేగాని, వాస్తవం అయివుండదు- లేకపోతే, రాముడు వానరసేనతో వంతెన కట్టించడం ఏమిటీ- వానరులకు ఇంతపాటి శక్తి వున్నట్లయితే, ఈ పనిని ఎప్పుడో చేసివుండేవారు కదా... కనీసం అందుకు ప్రయత్నించైనా వుండేవారు కదా... ఇదంతా అబద్ధం అయ్యే వుంటుంది- అనుకున్నాడు.

అందుకే, ముందుగా పసిగట్టి వంతెనని కట్టకుండా అవరోధాలు కల్పించడంలో రాక్షస గూఢచారులు ఎందుకు విఫలమైనారని అడగలేకపోయాడు రావణుడు.

మొత్తంమీద వంతెన వార్త వినేసరికి రావణుడి ముఖంలో రంగులు మారడం మొదలయ్యాయి. తను భయపడ్తున్నట్లు మంత్రులు, సేవకులు గమనిస్తారేమోననిపించి, ముఖం పక్కకు తిప్పుకొని తన అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు.

## వానరులంటే యుద్ధజీవులు

రామాయణాన్ని పైపైన చదివితే తోకలున్న కోతులే వానరులంటే అనిపిస్తుంది! కానీ, వాళ్ళ గురించిన వివరాలు, వాళ్ళ శక్తి సామర్థ్యాలు పరిశీలించినప్పుడు వీళ్ళు కేవలం రాక్షస వధకోసం తయారయిన సుశిక్షితులైన సైనికులుగా కన్పిస్తారు.

**1) వానరులెక్కడ ఉంటారు ?**

**వనచారిణః శైలాన్ కాననానిచ .....**

వీళ్లు అడవుల్లోనూ, పర్వత లోయల్లోనూ ఉంటారు.

**2) వానరుల శరీరం :**

వానరులు వజ్రంతో సమానమైన కఠిన శరీరులు. దివ్య శరీరధారులు, దివ్య సంవాహనాన్వితులు, వజ్ర సంహననోపేతులు, వపుష్మంతులు, మహాకాయులు, గజాచాల సంకాశులు అంటే పెద్ద ఏనుగులంతటి, మహా పర్వతాలంతటి శరీరాలు కల్గిన వాళ్ళు.

**3) వానరుల వేగం :**

వానరులు వాయువేగ సమానులు. చాలా వేగంగా ఒక చోటు నుంచి ఇంకో చోటుకి చేరుకోగల వారు. దేవలోకాలకు రాకపోకలు చేయగల దైవాంశ సంభూతులుకూడా వానరుల్లో ఉన్నారు.

**4) వానరుల బలం :**

అతి బలవంతులు, అప్రమేయ బల సంపన్నులు అంటే, ఇతరులెవ్వరితో పోల్చడానికి తగిన వాళ్ళు లేనంత గొప్ప బలవంతులు. తేజోమయ శక్తులు కలవారు. తమ బలదర్పాలతో సింహం, పెద్దపులితో సమానమైన శక్తిగలవాళ్ళు.

మదించిన గజరాజాల్ని అవలీలగా నియంత్రించ గలిగిన శక్తిమంతులు. కొందరు గరుత్మంతునితోనూ, కొందరు వాయువుతోనూ సమానులు. శూరులు, వీరులు, విక్రాంతులు, విపుల విక్రములు, విష్ణు తుల్య పరాక్రమవంతులు, మనో సంకల్ప మాత్రంగానే ఎక్కడికైనా వెళ్ళగలవారు.

**5) వానరుల బుద్ధి సంపన్నత :**

వానరులు బుద్ధి సంపన్నులు. ఉపాయజ్ఞులు, నీతినియమాలు తెలిసిన వాళ్ళు, రాజనీతి ఎరిగిన వాళ్ళు.

రాక్షసులకు మాదిరే మాయా వీరులు. అంటే, మాయలు చేయడం తెలిసిన వాళ్ళు. హనుమంతుడు వ్యాకరణ పండితుడు. యుద్ధ విద్యలలోనే కాదు, రాజనీతి, పరిపాలనా, భాషా విషయాలపైన కూడ పరిజ్ఞానం కల్గినవారే !

**6) వానరుల యుద్ధ కౌశలం :**

చేతిలో ఎలాంటి ఆయుధాలు లేకుండానే ఘోర యుద్ధం చేయగల నేర్పరులు వానరులు. పెద్ద పెద్ద చెట్లు, పెద్ద పెద్ద బండరాళ్ళే ఆయుధాలుగా రాక్షసులతో యుద్ధం చేశారు వానరులు.

ఎంతటి పెద్దపని చెయ్యడానికైనా వెనుకాడని సాహసవంతులు.

గోళ్ళు, పళ్ళు వీటిని ఆయుధాలుగా ఉపయోగించి విజయాలు సాధించగలరు.

పిడిగ్రుద్దులతో బండరాళ్ళను పగలగొట్టగలరు. ఏనుగు కుంభస్థలాన్ని చేతులతో ఛేదించగలరు. పెద్దపెద్ద రాళ్ళను తాళ్ళకు కట్టి గిరగిరా తిప్పుతూ గురిచూసి శత్రువుకు తగిలేలా విసరడంలో దిట్టలు. పారిపోతున్న వాడిలా నటిస్తూ, వెన్నాడి వస్తున్న శత్రువు మీద పడేలా రాళ్ళను వెనక్కి విసిరి ఒకే దెబ్బకు శత్రువును మట్టుపెట్టగల నేర్పరులు.

ఈ నాటి ఫిరంగుల వంటి అయుధాలేవో వారి పద్ధతిలో వారికుండేవి అనడానికి సాక్ష్యంగా ఎన్నో వర్ణనలు రామాయణంలో కన్పిస్తాయి.

నిప్పులు కురిసే బాణాలు, మీదకు దూసుకు వచ్చే పెద్దపెద్ద బండరాళ్ళను ప్రయోగించడానికి తగిన ఆయుధ సంపత్తి వారికి వుండి వుండాలి.

**7) వానరుల చాకచక్యాలు :**

వానరులు రాక్షసుల మాదిరే కామరూపులు. ఎప్పుడు ఏ రూపంలోకి మారాలంటే ఆ రూపంలోకి, ఆ వేషంలోకి మారిపోగలరు. శరీరాన్ని పెంచుకోవడం, తగ్గించు కోవడం వంటివి చెయ్యగలరు. యోగ విద్యా సంపన్నతతో ఇలాంటి విధానాలు సాధించుకున్న వానర వీరులు చాలా మంది ఉన్నారు.

యుద్ధ సమయంలో వానర రూపంలో వుండటం వారికి అలవాటు. అది వారికి మిలిటరీ యూనీఫాం కావచ్చు.

వానరుల చాకచక్యానికి ఇంకా అనేక ఉదాహరణలు రామాయణంలో కన్పిస్తాయి.

1. **క్రితిందారయేయుః** : భూమిని నిలువునా చీల్చగలరు.
2. **నభస్తలం విశాయు** : ఆకాశంలో ఎగరగలరు.
3. **శైలేంద్రాన్ విచాలయేయుః** : పెద్దపెద్ద పర్వతాల్ని పిండిపిండిగా కొట్టగలరు.
4. **నర్ధమానా నాదేను విహంగమాన్ పాతయేయు** : విపరీత శబ్దాలు చేసి, అకాశంలో ఎగిరే పక్షుల్ని కింద పడేయగలరు.
5. **తోయ తాన్ గృహ్ణీయుః** మబ్బుల్ని పట్టి నీటిని పిండగలరు.
6. **స్థిరాన్ ద్రూమాన్ భేద మేయుః** మహా వృక్షాల్ని పెళ్ళగించగలరు.
7. **సముద్రాన్ క్షోభయేయు** : సముద్రాన్ని క్షోభింపచేయగలరు. అంటే సముద్రపు నీటిని అల్లకల్లోలం చేసి లోపల వస్తు సామగ్రిని బైటకు లాగగలరు.
8. **మహార్ణవం ప్లవ యేయు** : ఎంతటి మహాసముద్రాన్నయినా ఈదగలరు. పర్వతాల్ని సముద్రాల్ని దాటి భూ ప్రదక్షిణం చేసిన యోధులున్నారు.

మొత్తం మీద ఈ లక్షణాలన్నీ అటు రాక్షసులకూ, ఇటు వానరులకూ సరిసమానంగానే వున్నాయి. మనం రాక్షసుల్ని దేవతలతో సమాన బల సంపన్నులుగా భావిస్తాం గాని, వానరుల్ని మాత్రం కోతులుగానో, ఆటవికులుగానో అనుకొంటూ వుంటాం.

నిజానికి, రాక్షసుల్ని మట్టుపెట్టడం కోసమే వాలి, సుగ్రీవులు పుట్టారు.

వాలి తన జన్మ రహస్యాన్ని మరిచిపోయి, రావణుడితో చెలిమి పెంచుకొన్నాడు. శ్రీరాముడు కేవలం ఈ కారణంగానే అతన్ని శిక్షించినట్లు కొన్ని రామాయణాలలో స్పష్టంగా వుంది!

బహుశా రావణాసురుడు, వాలి మధ్య పరస్పరం ఒకరిమీద ఒకరు ముందుగా దాడి చేసుకోకూడదనే ఒప్పందం ఏదైనా వుండి వుండాలి - అందుకే, వాలి చనిపోబోయే ముందు రాముడితో - "ఇంత దానికి నన్ను చెట్టు చాటు నుంచి కొట్టాలా ..... నాతో చెప్పి ఉంటే సీతని నేనే తెచ్చి ఇచ్చేవాణ్ణి కదా ....." అని అన్నాడు.

జాంబవంతుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, నీలుడు, నలుడు ..... వీళ్ళంతా రామరావణ యుద్ధంలో ప్రముఖ పాత్ర వహించారు. బహుశా 'వాలి' పాలనా కాలంలో వీరికి తగిన గుర్తింపు వుండి వుండకపోవచ్చు. రావణుడితో నిర్యుద్ధ సంధికి వాళ్లు అనుకూలం కాకపోవడం కూడా అందుకు కారణం కావచ్చు.

రావణుడితో యుద్ధం కోసం సాయం కోరి వచ్చిన శ్రీరాముడితో తేలికగా చెలిమి కలుపుకోవడమే కాకుండా, ఆయనకు పరమ భక్తులుగా వానర సేన మారిపోవడానికి రావణ వ్యతిరేకత వారిలో మొదటి నుంచి గూడు కట్టుకోవడం మూల కారణం అనిపిస్తుంది!

వాలి మరణం తర్వాత, రావణ వ్యతిరేకులు, రాక్షస వ్యతిరేకులకు తిరిగి రాజ్యాధికారం వచ్చిందని మనకు చక్కగా అర్థం అవుతుంది.

## వానర వేషం - మిలిటరీ యూనిఫాం

రామాయణంలోనే అనేక సందర్భాల్లో చెప్పిన విషయాల్ని ఇంకొంచెం లోతుగా పరిశీలించినప్పుడు, ఈ వానర సేన నిజంగా కోతులేనా... లేక కోతుల వేషంలోవున్న మామూలు మనుషులా అనే సందేహం తప్పకుండా కలుగుతుంది.

యుద్ధకాండలో ఈ శ్లోకాలు చూడండీ... రాముడు పన్నిన యుద్ధ వ్యూహం ఇలా వుంది.

"సచైవ మానుషం రూపం కార్యాలకపిభరాహవే
ఏష భవతునః సంజ్ఞా యుద్ధేఽస్మిన్ వానరేబలే ॥"

"ఈ యుద్ధం పూర్తయ్యేవరకూ మీరంతా ఇలా కోతుల రూపాల్లోనే వుండాలి! మామూలు మానవాకృతుల్లో తిరగకూడదు. మీరంతా మనవాళ్ళు అనడానికి ఈ కోతివేషమే గుర్తు" అని ఆజ్ఞాపించాడు రాముడు. అంటే, వానర రూపం అనేది ఒక "మిలిటరీ యూనిఫాం" వంటిదని దీన్నిబట్టి అర్థం అవుతుంది.

"అహమేవ సహభ్రాత్రో లక్ష్మణేన మహీజనా
ఆత్మానా పంచ వశ్యయం సభామమవిభీషణా"

"నేనూ, నా సోదరుడు లక్ష్మణుడు, మన మిత్రుడు విభీషణుడు... అతని మంత్రులు నల్గురూ మొత్తం ఏడుగురం మాత్రమే మనుష్య రూపంలో యుద్ధంలో పాల్గొంటాం" అని ప్రకటించాడు రాముడు. ఇది యుద్ధ వ్యూహం.

దీన్నిబట్టి వానర రూపం అనేది యుద్ధ రంగానికి సంబంధించిన ఒక వేషమేననేది సుస్పష్టమౌతోంది.

వానరులు నిత్య యుద్ధజీవులు. కాబట్టి వాళ్ళు నిత్యం మిలిటరీ యూనిఫాంలోనే వుండేవాళ్ళు... అందుకే వానర రూపం అనేది వాళ్ళకి 'జాతి'కి సంబంధించిన విషయంగా మారింది. వాలి, సుగ్రీవులు వంటి వానరవీరుల భార్యలు మానవ రూపంలోని అందగత్తెలు కావడం ఏమిటీ... ఇదంతా మిలిటరీ వ్యూహంలో భాగమే అనేది తేలికగానే మనం అర్థం చేసుకోవచ్చు.

బహుశా కొమ్ములు, కోరలు తగిలించుకొన్న రాక్షస రూపాలు కూడా ఇలాంటి మిలిటరీ రూపాలే అయివుండవచ్చుకూడా. రాక్షస సైనికులు అలాంటి రూపంలో వుంటే, రావణుడు, విభీషణుడు, ఇంద్రజిత్తు వీళ్ళంతా మానవరూపంలో ఎందుకు కన్పిస్తారు ? కాబట్టి సైనికులకు మిలిటరీ డ్రెస్ లాంటిదే కావచ్చు వానర, రాక్షస రూపాలు కూడా... అన్పిస్తుంది !

సరే! యుద్ధం ముగిసింది. సీతాదేవి శీలపరీక్ష కూడా అయిపోయింది. పుష్పకవిమానం ఎక్కి అందరూ అయోధ్యకు బయల్దేరారు. తమ రాక సంగతి ముందుగా భరతునికి తెలియజేయడం ఎలా? వాయుమనోవేగాలతో వెళ్ళగలవాడని హనుమంతుణ్ణి అయోధ్యకు పంపాలని నిర్ణయించారు.

**"ఇతి ప్రతిసమాదిష్టో హనుమా న్మారుతాత్మజః**

**మానుషం ధారయన్ రూపమయోధ్యాం త్వరితోయయౌ...॥"**

రాముడి ఆజ్ఞ ప్రకారం, రాముడి సందేశం తీసుకొని, మనుష్య రూపంలో హనుమంతుడు అయోధ్యకు వెళ్ళాడు. యుద్ధకాండలో ఈ విషయాన్ని స్పష్టంగా రాశాడు వాల్మీకి. మనుష్య రూపంలోనే ఎందుకు వెళ్ళాడు...? వెళ్తోన్న కార్యం యుద్ధానికి సంబంధించింది కాదు కాబట్టి వానర రూపాన్ని అంటే, మిలిటరీ యూనిఫాం వదిలేసి తన అసలు రూపంలో వెళ్ళాడని వాల్మీకి రాసినట్లు అర్థం అవుతోంది. వానరులూ, రాక్షసులూ మానవరూపం కల్గిన వారేనని అనుకోవడం వలన రామాయణ వైభవానికి తక్కువ అయ్యేదేమీ లేదు కూడా !

# రావణుడికి ఉత్తరం రాసిన లక్ష్మణుడు

శుకసారణుడిని కోతి వేషంలో వెళ్ళి వానర సైన్యంలో కలిసిపోయి అక్కడి సంగతులు తెచ్చి వివరించమన్నాడు రావణుడు. విభీషణుడి కంట్లోపడి దొరికిపోయాడు. అతను రాముడి దయవలన విడుదలై రావణుడి దగ్గరకు వచ్చి రాముడి బలసంపన్నత గురించి పొగడడం మొదలుపెట్టాడు. అక్కడ మొదలైంది అసలు కథ. శుకసారణుడు రాముడి బలసంపన్నత గురించి చెప్పిన విషయాలివీ...

"ఆ రోజున తోటలోకి దూరిన హనుమంతుడు అసలైన వానర సేనతో పోలిస్తే చాలా స్వల్పం అన్నాడు. రాముడి సాన్నిహిత్యం వలన ప్రతి వానరుడూ మహా బలవంతుడయ్యాడని చెప్పాడు శుకసారణుడు.

వానర సైన్యానికి సేనాపతులు వీళ్ళు : ద్వివిదుడు, మైందుడు, నీలుడు, నలుడు, వికటుడు, దధిముఖుడు, కేహరి, కుముదుడు, గఘుడు, గవాక్షుడు, జాంబవంతుడు... ఈ మహాబలులు... ఒక్కొక్కళ్ళూ వెయ్యేసి ఏనుగుల బలంకల్గిన వాళ్ళు అన్నాడు.

వీళ్ళ ఆధీనంలోని సైనికుల్లో వీళ్ళతో సమానమైన బలంకల్గిన వాళ్ళు కోట్ల సంఖ్యలో వున్నారు. ఎందరినని లెక్కపెట్టగలం ?

వాళ్ళు 18 పద్మాల వానరులని తెలిసింది. ఒక్కో పద్మానికి వేర్వేరు సేనాపతులు ఉన్నారట -

నిజం చెప్పమంటారా ప్రభూ ! ఆ వానర సైన్యంలో "అమ్మో రావణుడా!" అని తమకు భయపడే వానరుడు మచ్చుకి ఒక్కడు కూడా కన్పించలేదు – అంతా 'జయించేస్తాం' అనే ఊపులోనే వున్నారు. రాముడు అలాంటి అభిప్రాయాన్ని తన సైన్యంలో కల్గించాడు" ఇలా శుకసారణుడు రాముడి గొప్పల్ని పొగడడం మొదలుపెట్టాడు... రావణుడు విని భరించలేకపోయాడు. "ఒరేయ్ – మా విభీషణుడిలాంటి పిరికిపందని మంత్రిగా పెట్టుకొన్నాడంటేనే రాముడి తెలివి ఏపాటిదో అర్థం అవుతోంది" – అని బిగ్గరగా నవ్వాడు.

అప్పుడు శుకసారణుడు, రావణుడికోసం లక్ష్మణుడు రాసిన ఒక ఉత్తరాన్ని తీసి ఇచ్చాడు. రావణుడు ఆ ఉత్తరాన్ని మరో మంత్రి చేతికిచ్చి చదవమన్నాడు... లక్ష్మణుడు రాసిన అక్షరాలా ఇవి :

"ఓరి మూర్ఖుడా! రావణా! మాటలతో ఉపయోగం ఏముందీ.. అనవసరంగా నీ వంశాన్ని ఎందుకు నాశనం చేసుకుంటావు – రాముడితో యుద్ధం పెట్టుకొన్నాక, ఇంక త్రిమూర్తులొచ్చినా నిన్ను కాపాడగల వాళ్ళు వుండరు. విభీషణుడి మార్గంలో నువ్వుకూడా తుమ్మెదలా వచ్చి రాముడి చరణకమలాలు ఆశ్రయించు. ఒరే మూర్ఖుడా! అగ్నిలోపడి

కీటకాలు చచ్చిపోతాయి. రాముడి బాణాగ్నిలోపడి నువ్వూ నీ పరివారం అంతా చచ్చిపోతారు. నీ మంచికోరి చెప్తున్నాను"- ఇదీ లక్ష్మణుడు రావణుడికి రాసిన ఉత్తరం. సుందరకాండలో తులసీదాసు ఈ ఉత్తరం గురించి వ్రాశాడు.

రావణుడు కోపంతో ఊగిపోతుంటే, శుకసారణుడు కల్పించుకొని "మహారాజా! లక్ష్మణుడు చెప్పింది నిజమే! మీరు కాస్త నిదానించి ఆలోచించండి. రాముడు కోమల స్వభావి. క్రూరంగా ఆలోచించడు. మిమ్మల్ని తప్పకుండా స్నేహితుడిగా అంగీకరిస్తాడు. మీ తప్పుల్ని మరచిపోగలుగుతాడు. నా మాట విని సీతని అతనికి ఇచ్చేయండి" - అని వేడుకున్నాడు.

ఇంక కోపాన్ని తమాయించుకోలేకపోయాడు రావణుడు. కాలెత్తి చాచి ఒక తన్ను తన్నాడు అతన్ని. ఆ అవమానభారాన్ని భరించలేకపోయాడు శుకసారణుడు. ఒక రాజు తన మంత్రిని ఇలా అవమానించడం బహుశా ఎప్పుడూ జరిగి వుండదు. రావణుడికి ఒకసారి నమస్కరించి, తిన్నగా రాముడి దగ్గరకు వెళ్ళిపోయి ఆయన పాదాల్ని ఆశ్రయించాడు.

శివుడు ఈ సంఘటనంతా పార్వతికి దృశ్యీకరించి చూపిస్తూ రాముడి పాదాలు ఆశ్రయించిన ఈ శుకసారణుడు ఎవరో తెలుసా... ఒకప్పుడు అగస్త్యుని నిరాదరించిన కారణంగా శాపగ్రస్తుడైన ఒక రుషి. శ్రీరాముడి కాలిస్పర్శతో ఆయనకు శాపవిమోచనం అయ్యింది. పూర్వపు ఋషి జ్ఞానం కల్గింది. ఇంక రాముడి అనుమతితో తన స్వస్థానానికి తపస్సు కోసం వెళ్ళిపోయాడు శుకసారణుడు.

# రావణుడి మేజువాణీ రసాభాస

రాముడు వానరసేనతో సహా వంతెనదాటి లంకారాజ్యపు ఇసుక తిన్నెలమీద విడిది చేసివున్నాడు. ఎక్కడికక్కడ గుడారాలు వేసుకొని సైనికులు విశ్రాంతి తీసుకొంటున్నారు. బహుశా రేపో, ఆ మర్నాడో యుద్ధం ప్రారంభం కావచ్చు.

దూరంగా బంగారపు శిఖరాలతో వెన్నెట్లో మెరుస్తోంది రావణ రాజసౌధం ! పూర్తిగా సురక్షితమైన రావణ రాజ్యం లంకానగరం.

దూరంగా, దక్షిణ దిక్కున, ఆకాశం అంత ఎత్తులో మేఘాల మధ్య మెరుపులా వెలుగు రేఖలు కన్పిస్తున్నాయి. రాముడు వాటిని గమనించి విభీషణుణ్ణి పిలిచి, అకాలంలో మెరుపులు మెరుస్తున్నాయి. వాన కురుస్తుందంటావా ? అనడిగాడు. చాలా దూరంగా వెలుతురు కన్పించడంతో, అక్కడి ధ్వనులేవో అస్పష్టంగా విన్పిస్తున్నాయి. పైపెచ్చు సముద్ర హోరు కూడా ఎక్కువగా వుండడంతో ఆ ధ్వనులు ఏమిటో తెలియడం లేదు. "పిడుగులేమైనా

పడ్తాయంటావా?" అని మళ్ళీ అడిగాడు రాముడు. ఎందుకంటే ఆ సమయంలో వర్షం కురిస్తే తన వానరసేనకు రక్షణ కల్పించే ఉపాయాలు ఆలోచించాలి కాబట్టి!

అప్పుడు విభీషణుడు ఆ దక్షిణ దిక్కును తేరిపార చూసి, "అవి మేఘాలు, మెరుపులూ కావు - పిడుగులు అంతకన్నా కావు, లంకా నగరంలో ఒక ఎత్తయిన పర్వత శిఖరం వుంది. దానిపైన రావణుడికి ఒక అతిథి గృహంవుంది. అక్కడ నిత్యం మేజువాణీలు సాగుతుంటాయి. రావణుడు మేళాలతో అక్కడ వినోదిస్తుంటాడు. వాళ్ళ నృత్యగీత మేళతాళధ్వనులే మనకి విన్పిస్తున్నాయి. అక్కడి దీపాల వెలుగులే మసక మసకగా మనకు కన్పిస్తున్నాయి. ఇంక ఆ మెరుపులంటారా... అవి మండోదరీ దేవి చెవి తాటంకాల మెరుపులు..."అని వివరించాడు.

విభీషణుడు చెప్పింది విన్నాక రాముడికి ఒక సరదాపని చెయ్యాలనిపించింది. ఒక బాణం తీసుకొని, ధనుస్సుతో సంధించి, తిన్నగా ఆ మెరుపు మీదకి వదిలాడు.

ఆ బాణం రావణాసురుడికి పట్టిన గొడుగును చీల్చుకొని వెళ్ళి దాన్ని పడదోసి, తిన్నగా మండోదరి చెవులకు వున్న వజ్రపు దిద్దుల్ని తాకి, వాటిని పెళ్ళగించుకొని రివ్వున వెనక్కి తిరిగి వచ్చి రాముడి అమ్ములపొదిలో దూరింది. రావణుడి కిరీటం, మండోదరి చెవికమ్మలు కిందపడిపోయాయి. ఛత్రచామరాలు చిరిగిపోయాయి.

బాణం అక్కడికి వెళ్ళి ఏం చేసి తిరిగివచ్చిందో రాముడిచుట్టూ వున్న వానరులకు ఏమీ అర్థం కాలేదు.

అక్కడ - నృత్యగీతాల వేడుక ఒక్కసారిగా రసాభాస అయిపోయింది. రావణుడికిది అశుభం అని అనుకోవడం మొదలుపెట్టారు రాక్షసులంతా! రాముడికి వాళ్ళు అలా అనుకోవడమే కావాలి.... రాక్షసులు భయపడటం గమనించాడు రావణుడు కూడా !

భూకంపం లేదు, పెద్ద తుఫాను గాలులు కూడా ఏమీ లేవు - ఏ శత్రుబాణమో మరొకటో వచ్చినట్టు వాళ్ళకి ఏమీ అన్పించలేదు కూడా! ఇది ఎలా జరిగిందీ...???

అప్పుడు రావణుడు వాళ్ళని ఆపి ధైర్యంచెప్పడం మొదలుపెట్టాడు-

"నా తలకాయల్నే హోమం చేసి వరాలు పొందినవాణ్ణి - అప్పుడే నాకు అమంగళాలు కలగలేదు - ఇప్పుడు కిరీటం పడిపోయిందని, ఛత్రచామరాలు చిరిగిపోయాయని, అమంగళం అని బయపడ్తారు దేనికీ... పిచ్చి పిచ్చి అనుమానాలు పెట్టుకోకండీ - ఇళ్ళకు పోయి హాయిగా పడుకోండి"- అన్నాడు.

పైకి గంభీరంగా వున్నాడు గానీ, రావణాసురుడికీ ఈ భయం వుండి వుండాలి... అయినా ఏదో మొండి ధైర్యం... తనంతవాడికి అలా జరగదులెమ్మనే ఒక గుడ్డినమ్మకమే రావణుణ్ణి మొండిగా నడిపించింది.

# రాముడి శక్తిని ఏనాడో గుర్తించిన మారీచుడు !

రాముడి వ్యక్తిత్వాన్ని ఆయన భక్తులకన్నా, ఆయన ఆశ్రితులకన్నా, ఆయన శత్రువులే ఎక్కువ గుర్తించగలిగారు.

అరణ్యకాండలో, మారీచుడు రావణాసురుడితో రాముడు ఎలాంటివాడో చెప్పిన విషయాలు చూస్తే రామతత్త్వం బాగా అర్థం అవుతుంది.

"రామో విగ్రహవా న్ధర్మ స్సాధుస్సత్యపరాక్రమః
రాజాసర్వస్య లోకస్య దేవానామివ వాసవః **13-37-3**

ఈ ప్రపంచంలో వున్న ధర్మాన్నంతా ఒక మూసలో పోస్తే అది రాముడి విగ్రహంలా వుంటుంది. మూర్తీభవించిన ధర్మమే శ్రీరాముడు. సత్యవంతుడు, సౌమ్యుడు కూడా !

అకారణంగా ఎవ్వరినీ రెచ్చగొట్టడు, ఎవ్వరితోనూ రెచ్చిపోడు. అలాగని చేతకానివాడిలా చేతులూ ముడుచుకోడు - అమిత పరాక్రమశాలి.

దేవతలకు ఇంద్రుడు రాజు అని ఎలా మనం అనుకొంటామో అలాగే, రాముడు కూడ సర్వలోకాలకూ రాజు అనదగినవాడు.

"అప్రమేయం హి తత్తేజో యస్యసాజనకత్మజా" **18-37-3**

అతని బలం అప్రమేయం. అతని భార్య జానకి! జనకుడి కూతురు -

"వృక్షేవృక్షే హి పశ్యామి చీర కృష్ణాజినాంచరమే
గృహీత ధనుషం రామం పాశహస్త మివాంతకమ్" **14-40-3**

నార చీరలు, జింక చర్మాలు కట్టుకొని, మామూలు ఆటవికుల్లా కన్పిస్తూ ఈ అడవుల్లో తిరుగుతున్నారుగానీ, ఆయన చేతిలో ధనస్సు చూస్తుంటే, యమపాశం పుచ్చుకున్న యముడిలా ప్రతి చెట్టుమీద, ప్రతి మొక్కమీదా ఆయనే నాకు కన్పిస్తున్నాడు.

"రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతిమ్"

ఈ అరణ్యం అంతా రాముడితోనే నిండిపోయిందా అనిపిస్తోంది. "అంతా రామమయం"లా వుంది నా కళ్ళకి!

"అపి రాక్షసలోకస్య భవే దంతకలోఽపిహి" **22-40-3**

"రాక్షసలోకాన్నంతా అంతం చేసేస్తాడేమోననిపిస్తుంటుంది అతన్నిచూస్తుంటే" అని చెప్పాడు మారీచుడు రావణుడితో! "రామో విగ్రహవాన్ ధర్మః" అనే మారీచుడి మాటలు రావణాసురుడి గుండెల్లో గుబులు రేకెత్తించి వుంటాయి.

# తారకు ముందే తెల్సిన శ్రీరాముడి మహాత్మ్యం

రాముడి వ్యక్తిత్వాన్ని గుర్తించిన వైరివర్గాలలో 'తార' కూడా ముఖ్యమైన వ్యక్తే! 'వాలి'కి హితబోధ చేస్తుంది -

"రామః పరబలా మర్దీ యుగాంతాగ్నికి వోత్థితః"

ప్రత్యర్థి బలాన్ని లాగేసుకోగలిగే వరపుత్రుడు వాలితో అతని భార్య తార - "రాముదు "పరబలమర్ది" అంటే, శత్రువు బలాన్ని మాడ్చి మసిచేసే యుగాంత అగ్నిలా వున్నాడు జాగ్రత్త"- అని హెచ్చరిస్తుంది.

నివాస వృక్ష స్సాధూనా మాపన్నానాం పరాగతిః
ఆర్తానాం సంశ్రయశ్చైవ యశశ్చైక భాజనమ్" ***19-15-4***



"సాధువులకు నివాస వృక్షంలాంటివాడు. ఆపన్నులకు, ఆర్తులకు ఆయన ఆశ్రయం లాంటివాడు. యశస్సుకి ఏకైక భాజనంగా కన్పిస్తున్నాడు" అని మెచ్చుకుంటుంది తార! రాముడి పరమతత్వాన్ని, పరమేశ్వరతత్వాన్ని గుర్తించిన పాత్రలు అహితుల్లో కూడా చాలామంది వున్నారనడానికి ఇవి సాక్ష్యాలు.

ఆఖరికి రావణాసురుడు కూడా రాముణ్ణి చూడగానే మనసులో ఆహాఁ! అనుకొంటాడు.

"యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనంగతాః
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయం" ***11-72-6***

"ఎవరి విక్రమం అసాధ్యులైన రాక్షసుల్ని కూడా కూలగొట్టిందో ఆ రాఘవ వీరుడు అనామయుడైన నారాయణుడే అయివుంటాడు - అని నాకనిపిస్తోంది" - అని తనలోతాను అనుకొంటాడు.

# రావణుడి చావుకు ఎన్నెన్నో కారణాలు

రావణుడు బలగర్వంతో విర్రవీగుతున్నప్పుడు అతను చేసిన అనేక పొరబాట్లు ఒకేసారి కట్టకట్టుకొని పనిచేయడం ప్రారంభించాయి. తన తప్పులన్నింటినీ ఒక్కొక్కటే తలచుకోవడం మొదలుపెట్టాడు రావణుడు.

**"సర్వం తత్ఫల మేమోఘం యత్తప్తం పరమం తపః"**

నేను చేసిన మహా తపస్సు వ్యర్థమైపోయింది. మహేంద్రుడినే జయించిన నన్ను ఒక మామూలు మనుష్యుడు జయించే స్థితి వచ్చింది.

ఆ రోజున బ్రహ్మను వరం కోరుకోవడంలో నేను పొరబాటే చేశాను - దేవదానవ యక్ష రాక్షసాదులతో మరణం వుండకూడదని కోరానేగానీ, ఆ వరుసలో మనిషిని చేర్చకపోవడం తప్పేనని ఇప్పుడు అర్థం అవుతోంది.

బ్రహ్మ ఆనాడే చెప్పాడు - మనుషుల నుంచే నాకు ప్రాణ భయం అని! ఆ మనుష్యుడు ఎవడో ఇప్పుడు నాకు అర్థం అవుతోంది... ఇక్ష్వాకు వంశంలో పుట్టిన రాముడే అయివుంటాడు. **"తమిమం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"** - ఆ మనుష్యుడు ఈ రాముడే అని భావిస్తున్నాను.

**"శప్తోஉహం వేదవత్యా చయదా సాధర్షితా పురా"** అప్పట్లో వేదవతిని నేను బలాత్కరించబోయినప్పుడు తన మూలానే నాకు వినాశనం కలుగుతుందని ఆమె శపించింది. బహుశా ఆ వేదవతి ఈ సీతగా పుట్టివుంటుందని ఇప్పుడనిపిస్తోంది.

**"ఉమా నన్దీశ్వర శ్చాపి రంభా వరణ కన్యకా**
**యధోక్తా స్త న్మయా ప్రాప్తమ్"**

పార్వతీదేవి శాపం, నందీశ్వరుడి శాపం, రంభ కారణంగా నలకూబరుడు ఇచ్చిన శాపం, పుంజికస్తలం కోసం బ్రహ్మ ఇచ్చిన శాపం... ఇవన్నీ కలగలిసి ఒక్కసారిగా ఇప్పుడు పనిచేస్తున్నాయి. ఒక్కణ్ణి జయించడానికి ఇంతమంది కట్టగట్టుకొని నామీద ముప్పేట దాడిచేస్తున్నారనిపిస్తోంది... అనుకొన్నాడు రావణుడు!

# సీతాదేవిపై హత్యాయత్నం

ఇన్ని అనర్థాలూ సీతను ఎత్తుకు రావడమే కారణంగా కలుగుతున్నాయని లంకానగరంలో అందరూ రావణాసురుణ్ణి దుమ్మెత్తి పోస్తుంటే, ఇన్ని అనర్థాలూ సీత కారణంగానే జరుగుతున్నాయి కాబట్టి, ఆమెను చంపేస్తానంటూ కత్తి తీసుకొని బయల్దేరాడు రావణుడు.

ఇంద్రజిత్తు మరణించిన రోజు రాత్రి జరిగిన సంఘటన ఇది.

అంతకు మునుపు మాయా సీతని సృష్టించి, ఆమెను ముక్కలు ముక్కలుగా నరుకుతున్నట్లు ఒక దృశ్యాన్ని ఆకాశంలోంచి ప్రదర్శింపచేశాడు ఇంద్రజిత్తు. సీత చచ్చిపోయిందని రాముడు విరక్తితో యుద్ధం వదిలేసి వెళ్ళిపోతాడని! కానీ, ఇది రాక్షస మాయేననీ, సీతకు వచ్చిన ప్రమాదం ఏదీ లేదనీ గ్రహించాడు రాముడు. ఇంద్రజిత్తు ఎత్తుగడ విఫలం అయ్యింది. ఆఖరికి ఇంద్రజిత్తే హతమైపోయాడు.

ఇప్పుడు రావణుడు కత్తిపట్టుకొని ఈసారి నిజంగానే సీతను చంపేస్తానంటూ హూంకరించసాగాడు. అశోకవనంవైపు రావణుడు దూసుకువెళ్తూ **"వైదేహీం నాశయిష్యామి"** అని అరవడం మొదలుపెట్టాడు - వైదేహిని నాశనం చేసేస్తాను - అంటూ!

అది గమనించి, సుపార్శ్వుడనే మంత్రి రావణాసురుడి వెంట పరిగెత్తి అశోకవనంలో రావణుడికి అడ్డంపడి ఆయన్ని శాంతింపచేశాడు.

"సాక్షాత్తూ ఆ కుబేరుడికి తమ్ముడివి - వేదవిద్యావ్రతస్నాతుడివి - స్వకర్మ నిరతుడివి.. అంతటి మహానుభావుడివైన నీకు ఒక ఆడదాన్ని చంపాలనే ఆలోచన రావడం వీరలక్షణం అంటావా...?" అనడిగాడు. "ఆడదాన్ని చంపడం నీ స్థాయికి తగిన పనేనా?" అని ఆలోచించమన్నాడు.

"కోట బయట శత్రుమూక వుంది. కోపం వుంటే అక్కడ చూపించాలిగానీ, ఇక్కడ వంటరి ఆడదానిమీద చూపించడంలో గొప్ప ఏముందీ..." అని నిలదీశాడు.

రావణుడికి తన తప్పు తెలిసింది. ఎత్తిన కత్తిదించి మౌనంగా వెనక్కు తిరిగాడు.

అప్పుడన్పించింది అక్కడ కావలి వున్న రాక్షస స్త్రీలకు

**"కథం శూర్పణఖా వృద్ధా కరాలం నిర్గతోదరీ**
**ఆససాదవన్ రామం కందర్ప సమరూపిణిమ్"**

"కందర్ప సమానుడైన ఆ రాముణ్ణి అడవుల్లో చూసి మోహించిన ఆ ముసిల్ది శూర్పణఖ మూలానే కదా... ఇంత నష్టం జరిగిందీ.." అని ! "కథం శూర్పణఖా వృద్ధా-" అనుకొన్నారట రాక్షసస్త్రీలు. ఈ ముసిల్దానికి బుద్ధిలేకపోతే సరి - జుట్టునెరిసిన వయసులో కుర్రాడు కావాల్సివచ్చాడా... ఎవరైనా వింటే నవ్విపోకుండా వుంటారా? దాని పేరు తలచుకొంటేనే అసహ్యంగా వుంది - దాని మూలానకదూ ఇన్ని అనర్థాలు రావణుడు కొనితెచ్చుకున్నాడు-అని బాధపడ్డారు.

ఆ రోజున విభీషణుడు చెప్పిన మాటలు విన్నా ఈ రోజున లంకాపురి ఇలా శ్మశానంలా అయ్యేదికాదు కదా.. అని అన్పించిందేమో వాళ్ళకి ! ఇది సగటు రాక్షసప్రజల జనాభిప్రాయం!!

# రావణుడికి నందికేశుడి శాపం

**యస్మాద్వానర రూపం మాయవజ్ఞాయ దశానన ।**
**అశనీపాత సంకాశ మవహాసం ప్రముక్తావాన్ ॥**

కైలాసానికి వెళ్ళినప్పుడు రావణాసురుడికి నంది ఎదురయ్యాడొకసారి. వరబల గర్వితుడు రావణుడు నందికేశ్వరుడి వానర రూపాన్ని చూసి హేళన చేస్తూ పెద్దగా నవ్వాడట.

**"తస్మా న్మద్రూప సంయుక్తా మద్వీర్య సమతేజసః**
**ఊత్పత్స్యన్తి వధార్థం హికులస్య తవ వానరాః"**

రావణుడా! నవ్వుతున్నావు కదూ... నీ కులనాశనానికి వానరులే పుడతారు. మహాబలవంతులు... గొప్ప గోళ్ళే ఆయుధాలుగా కలిగివుంటారు. మనోవేగంతో ప్రయాణం చేయగలిగి వుంటారు.. నీ బలగర్వాన్ని అణిచిపారేస్తారు"- అని శాపంపెట్టాడట. ఈ శాపం నిజం కావాలంటే రావణ వధ చెయ్యగల వానరులు పుట్టాలి.

**"యస్య దేవస్య యద్రూపం వేషో యశ్చ పరాక్రమః**
**అజాయత సమస్తేన తస్యతస్య సుతఃపృథక్॥"**

వానర రూపంలో పుత్రుల్ని సృష్టించండని బ్రహ్మ, దేవతల్ని ఆదేశించాడు. దేవతలు **"వనచారిణః వానరరూపిణః పుత్రాన్ సస్నజుః"** - వనచరులైన వానర రూప పుత్రుల్ని దేవతలు సృష్టించారు...! బాలకాండలో వాల్మీకి చెప్పిన విశేషం ఇది !

# వ్యూహాలు - ప్రతివ్యూహాలు

మంత్రి సామంతాది జనులందరిని పిలిపించి యుద్ధ వ్యూహ రచన చేశాడు రావణుడు.

1. తూర్పు దగ్గర ప్రహస్తుడి నాయకత్వంలో సైన్యం యుద్ధంలో పాల్గొంటుంది.
2. దక్షిణ ద్వారం దగ్గర మహోదరుడు, మహాపార్శ్వులు ఇద్దరూ సైన్యాన్ని నడిపిస్తారు.
3. పడమటి ద్వారం ఇంద్రజిత్తు ఆధీనంలో ఉంటుంది.
4. తాను అంటే, రావణుడు స్వయంగా ఉత్తర ద్వారం దగ్గర సైన్యంతో సిద్ధంగా వుంటాడు. శుకసారకులిద్దరూ ఆయనకు సహాయకులుగా ఉంటారు.

రాముడి బలాన్ని అంచనా వేసి రమ్మని శుకసారకులిద్దరిని గూఢచారులుగా పంపించడం వాళ్లిద్దరూ వానరులకి దొరికిపోవడం, రాముడు వాళ్లని క్షమించి, వాళ్ళకు

కావల్సిన సమాచారం అంతా తానే స్వయంగా చెప్పి మరీ పంపించడం జరిగిపోయింది. శుకసారకులిద్దరూ చెప్పిన సమాచారం మేరకూ తమ వ్యూహాన్ని రచించారు.

గూఢచారుల్ని రాముడి పక్షం నుంచి కూడా ప్రయోగించారు.

అంతకుమునుపే లంకానగరం అంతా చుట్ట చుట్టిన హనుమంతుడు, చెప్పిన సమాచారం కొంతా, స్వయంగా విభీషణుడే అక్కడ వున్నాడు కాబట్టి ఆయన చెప్పిన సమాచారం కొంతా రావణుడి మూలబలాన్ని అంచనా వేయడానికి బాగా ఉపయోగపడింది. అయితే, రావణుడు సరిగ్గా ఇప్పుడు ఎలాంటి వ్యూహాన్ని అనుసరించబోతున్నాడో తెలియాలి. అందుకోసం "అనలుడు" మరో ముగ్గురు తన మనుషుల్ని గూఢచారులుగా పంపించాడు విభీషణుడు.

ఈ అనలాది వీరులు నలుగురూ విభీషణుడికి నమ్మిన బంట్లు.

ఈ నలుగురూ పక్షి రూపంలో లంకాపురానికి వెళ్ళి అక్కడ జరుగుతున్న విశేషాల్ని తెలుసుకొని రాముడి దగ్గరకు వచ్చారు.

నాలుగు ద్వారాల దగ్గర కావలి ఏర్పాట్లు గురించి వాళ్లు రాముడికి చెప్పారు.

నగరాన్ని మాత్రం విరూపాక్షుడు అనే రాక్షసుడు సంరక్షిస్తున్నాడని !

వెయ్యి మంది గజయోధులు, పదివేల మంది రథికులు, ఇరవైవేల మంది సాయుధులైన దళాలు, ఒక కోటిమంది కాల్బలం రావణుడి సైన్యంలో వున్నారని చెప్పారు వాళ్ళు.

ప్రతి పది లక్షల మంది రాక్షస సైనికుల మీద ఒక అధికారిని నియమించాడట !

వేగులు నలుగురూ ఇలా చెపుతుంటే, విభీషణుడు అందుకొని, ఒకప్పుడు కుబేరుడి మీదకి యుద్ధం చెయ్యడానికి వెళ్ళినప్పుడు తన వెంట అరవై లక్షల రాక్షస సైన్యాన్ని తీసుకువెళ్ళాడు ! ఆ రోజు బలంతో పోలిస్తే, స్వస్థానం నుంచి యుద్ధానికి సిద్ధమౌతున్న ఈనాటి రావణుడి బలం చాలా తక్కువేననుకొంటున్నాను –" అన్నాడు.

అప్పుడు, రాముడు ఒక్కో రాక్షస వీరుడిని ఢీకొనడానికి తగిన వానర వీరుల్ని ఎంపిక చేయడం మొదలుపెట్టాడు.

ప్రహస్థుడి మీద పోరుకు నలుడనే వానర వీరుణ్ణి నియమించాడు.

"మహాపార్శ్వుదుల్ని అంగదుడు ఎదుర్కొంటాడు. ఇంద్రజిత్తుని అత్యధిక సేనతో హనుమంతుడు నిలువరిస్తాడు.

ఇంక రావణాసురుడి సంగతి. అతన్ని నేరుగా నేను లక్ష్మణుడితో కలిసి ఎదుర్కొంటాను" అన్నాడు.

వానరులంతా వానర రూపంలో మాత్రమే యుద్ధం చెయ్యాలి.

నీలుడు, అంగదుడు, హనుమంతుడు, సుగ్రీవుడు, నా మిత్రుడు విభీషణుడు – వీళ్లంతా నర రూపంలో యుద్ధం చేస్తారు.

"ఈ రాత్రికి మనం సుచేలాద్రి పైకి వెడదాం. అక్కడ్నుంచి చూస్తే లంకాపురం స్పష్టంగా కన్పిస్తుంది" అన్నాడు రాముడు. విభీషణుడు, సుగ్రీవుడు, లక్ష్మణుడు, హనుమంతుడు ఇంకా మరికొంత మంది వానరవీరులు సుచేల పర్వతం పైకి వెళ్లారు.

త్రికూట మహా పర్వతం చీకట్లో ఏమీ కన్పించడం లేదు. ఈ పర్వతం పైన వున్న నగరం మినుకుమినుకు మంటూ ఆ చీకట్లో ఆకాశంలోనే వ్రేలాడుతున్నట్లు కన్పించసాగింది. నగర ప్రాకారం మీద బారులు తీరి నిలుచున్న నిశాచరులు కన్పించారు. ఆ మసక వెలుతురులోనే నగరాన్ని అధ్యయనం చెయ్యసాగాడు రాముడు.

## సుగ్రీవుడికి రాముడి చివాట్లు

రెండోరోజు యుద్ధానికి సన్నద్ధులౌతున్నారంతా! రత్నాభరణ భూషితుడై రావణుడు ఐరావతం ఎక్కి యుద్ధరంగానికి వచ్చాడు.

సుగ్రీవుడు కూడా అదే సమయానికి యుద్ధరంగానికి వచ్చాడు. వస్తూనే రావణుణ్ణి చూశాడు. ఆయన కోపం తారాస్థాయికెళ్ళింది. చురచురా చూస్తూ, కోపంగా అతని మీదకి దూసుకొచ్చాడు -

"రాక్షసాధముడా! లోకనాథుడైన రాముడికి ఇష్టుడైన సుగ్రీవుణ్ణి నేను...! ఆ పార్థివేంద్రుడి తేజోవిశేషాలతో విరాజిల్లే ఈ సుగ్రీవుడు నిన్నింక వదలడు - అంటూ ఎగిరి రావణాసురుడి తలమీద కిరీటాన్ని కిందపడేలా తన్నాడు.

రావణాసురుడు కోపోద్రిక్తుడయ్యాడు -

"సుగ్రీవా! నీ తలకాయ లేపేస్తా" అంటూ సుగ్రీవుణ్ణి పట్టి కిందపడేసి అతని మీద విరుచుకుపడ్డాడు. కిందపడిన సుగ్రీవుడు అంతేవేగంగా పైకిలేచి రావణాసురుణ్ణి అవతలికి ఒక్కతోపుతోశాడు.

ఇద్దరూ మల్లయుద్ధానికి దిగారు -

గుద్దుకున్నారు, గుచ్చుకున్నారు, గిచ్చుకున్నారు

నెత్తురుతో శరీరం మోదగుపువ్వులా ఎర్రబారింది.

రెండు ఏనుగులు పరస్పరం తలపడినట్లుంది దృశ్యం. ఎదుటి వాడి గుండెలు చీల్చేయాలన్నంత కసిగా రొమ్ములు గుద్దుతున్నారు ఒకరికొకరు.

ఒకసారి చక్రాకారంలో! ఇంకోసారి వైష్ణమండలగతి ! మరోసారి గోమూత్రికాగత ప్రత్యాగత తిర్యగమనాలు -

దెబ్బని తప్పించుకొంటూ - దెబ్బతీయాలని ప్రయత్నిస్తూ చుట్టూ తిరుగుతూ, కప్పలా గెంతుతూ, కాకిలా ఎగురుతూ మల్లయుద్ధ ప్రావీణ్యాన్ని ఇద్దరూ ప్రదర్శించసాగారు.

రావణుడే ముందు అలిసిపోయాడు. ఈ ప్రచ్ఛన్నయుద్ధం కన్నా మాయాబలాన్ని ప్రదర్శించడమే అతనికి తేలికనిపించింది. ఒక్కసారిగా వెయ్యిమంది రావణాసురులుగా మారిపోయి, ఈ వెయ్యిమంది కలిసి ఒకేసారిగా సుగ్రీవుడిమీదపడ్డారు. సుగ్రీవుడు అదిచూసి, ప్రమాదాన్ని పసిగట్టి రివ్వున ఆకాశంలోకి ఎగిరాడు. ఇంకా కిందికి దిగొస్తాడని ఎదురుచూస్తూ నుంచున్నారు రావణులంతా !

ఆకాశంలోకి వెళ్ళిన సుగ్రీవుడు తిన్నగా రాముడి దగ్గరకు వచ్చి వాలాడు. రాముడు సుగ్రీవుణ్ణి సేదతీర్చాడు. అన్నాడుగదా -

"సుగ్రీవా! మాటమాత్రం నాతో చెప్పకుండా యింత సాహసం దేనికి చేశావు ... నీకు ఆలోచన ముందుగా వుండాలి! నువ్వు సామాన్య వానరసైనికుడివి కాదు - కిష్కింధకు రాజువి! రాజు అయినవాడు ఇలా శత్రువుతో ముఖాముఖి తలపడతాడా? పొరబాటునో, గ్రహబాటునో నువ్వు రావణుడికి చిక్కుబడితే ఏమయ్యేది..? ప్రమాదాన్ని ముందుగా వూహించుకోవడంలోనే తెలివితేటలుంటాయి !

ఇంకెప్పుడూ ఇలా చెయ్యకు !

మిత్రమా! నీకు గోరంత అపకారం జరిగినా నాకు సీత దేనికి ? భరతాదులు దేనికి ?

ఒకవేళ ఇవ్వాళ నీకు ఏదైనా జరిగివుంటే నేనేం చేసివుండేవాణ్ణో తెలుసా... రావణాసురుణ్ణి, వాడి సంతతినీ మట్టుబెట్టి, విభీషణుడికి లంకని, భరతుడికి అయోధ్యనీ అప్పగించి, దేహత్యాగం చేసుకొని వుండేవాణ్ణి !

నువ్వు చాలా తొందరపడ్డావు. ఇంకెప్పుడూ ఇలా చెయ్యకు-" అన్నాడు మందలింపుగా.

రాముడు పెట్టిన చివాట్లు తిన్నాక సుగ్రీవుడు సిగ్గుపడి అన్నాడు -"రామా! నీ భార్యను అపహరించిన ఆ దుర్మార్గుడు నా కళ్ళలో పడగానే నా సహనం నశించిపోయింది. ఒళ్ళు పైనా తెలీలేదు - ఏం చేస్తున్నానో నాకే తెలియనంత ఆవేశం వచ్చింది. కోపావేశుణ్ణి అయిపోయాను" - అని!

## నువ్వు గొప్పవాడివైతే వాలి చంకల్లో ఎలా చిక్కావు ?

రామాయణంలో రావణుడితో రాయబారాలు నెరపినప్పుడు గానీ, ఇతర సందర్భాల్లో హితబోధ చేసినప్పుడు గానీ ఇతరులంతా మాట్లాడిందంతా ఒక ఎత్తు - అంగదుడు ఒక్కడే మాట్లాడింది ఒక ఎత్తు.

తులసీదాసు అంగద రాయబారాన్ని చాలా అద్భుతంగా వర్ణించాడు. అనేక కొత్త విషయాలు, గమ్మత్తయిన విషయాలూ ప్రస్తావించాడు. ఇది చదవండి...

అంగదుడు వచ్చాడని రావణుడికి చెప్పారు. తక్షణం లోపలికి తీసుకురమ్మన్నాడు రావణుడు. అంగదుణ్ణి రావణుడు చూడడం బహుశా అదే ప్రథమం. వాలితో స్నేహం వుండివుంటుంది గానీ, రావణుడికి వాలి కుటుంబంతో అంత పరిచయం వుండివుండకపోవచ్చు. అంగదుడు కూడా రావణుణ్ణి బహుశా మొదటిసారే చూస్తుండవచ్చు.

రావణుణ్ణి చూడంగానే నడుస్తున్న కాటుక పర్వతంలా వున్నాడనుకొన్నాడట మనసులో అంగదుడు.

రావణుడి రెండు చేతులూ రెండు మహావృక్షాల్లాగానూ... పది తలకాయలూ పది పర్వత శిఖరాల్లాగానూ వున్నాయి... శరీరం మీద పెరిగిన వెంట్రుకలు చెట్ల దుబ్బల్లా, ముఖమూ, కళ్ళు, నోరు, ముక్కు... ఇవి పర్వత గుహల్లానూ కన్పించాయట...

రావణుడికి ఒకటే ఆశ్చర్యం... ఈ వానరుడెవడూ తన దగ్గరకు ఒక్కడే వస్తున్నప్పుడు కూడా కనీసం భయపడడేమిటా... అని !

అంగదుడు సభలోకి రాగానే సభలో కూర్చున్న రాక్షస ప్రముఖులంతా ఒక్కసారి లేచి నిల్చున్నారట... "నేను కూడా లేచినుంచోవాలా... వీడొస్తోంటే..." అనుకున్నాడట రావణుడు.

సరే ! అంగదుడు తన పేరు చెప్పుకున్నాడు. వాలి కొడుకునని కూడా చెప్పుకున్నాడు. రామదూతగా వచ్చానన్నాడు.

అది వినంగానే రావణుడేమన్నాడో తెలుసా... "ఒరే ! అంగదా... ఎలాంటి వాడికి ఎలాంటి కొడుకువి పుట్టావురా... నీ జన్మతగులడా... నువ్వు ఆ మునివేషంలో తిరుగుతున్నవాడికి దూతనంటావుట్రా... మీ నాన్న బావున్నాడా...?"అని !

వాలి చనిపోయిన సంగతి రావణుడికి తెలిసినట్లు లేదు. రావణుడికి చాలా విషయాలు తెలీవు. బలదర్పంతో విర్రవీగాడే గాని, శత్రువు కదలికల్ని తెలుసుకునే ప్రయత్నాలేవీ చెయ్యలేదు. రాముడి భార్యని ఎత్తుకొచ్చిన తర్వాత రాముడు ఏం చేస్తున్నాడో కనీసం తెలుసుకునే ప్రయత్నం కూడా రావణాసురుడు చెయ్యకపోవడం మితిమీరిన అతని అహంకారాన్ని, నిర్లక్ష్యాన్ని సూచిస్తోంది. కాబట్టి రావణాసురుడికి తనచుట్టూ వున్న చాలా సంగతులు తెలియకపోవడంలో ఆశ్చర్యం ఏమీలేదు.

తండ్రి ఇంట్లోంచి వెళ్ళగొడితే అడవుల వెంటపడి తిరుగుతున్నాడు, అడవి మృగాలతో స్నేహం చేస్తున్నాడు, దీనుడు, నరుడు – ఈ రాముడు నాకన్నా శక్తిమంతుడా – అని అందరితోనూ అనేవాడు గానీ, రావణుడు ఏనాడు వాలిని చెట్టుచాటునుంచి చంపిన చేతకాని వాడు – అనలేదు. ఎట్లా చంపినా, వాలిని చంపగలగడం అసాధ్యం అని రావణుడికి బాగా తెలుసుకాబట్టి.

సరే ! "మీ నాన్న బావున్నాడా..." అని రావణుడడిగినప్పుడు అంగదుడు, "రేపు రాముడొచ్చి నిన్ను కూడా మా నాన్న దగ్గరకే పంపుతాడులే- అక్కడకు వెళ్ళి 'బావున్నావా?' అని కావులించుకొని మరీ అడుగుదువుగానీ అన్నాడు.

ఇలా ఇద్దరిమధ్యా నువ్వెంత అంటే నువ్వెంత అనే పద్ధతిలో వాగ్వివాదాలు జరిగాయి. రావణుడు అన్నాడు గదా...

"నువ్వు ప్రభువూ ప్రభువూ అంటున్న నీ రాముడు తన పెళ్ళాం కన్పించకపోవడంతో ఏడ్చీ ఏడ్చీ నీరసించాడు. ఇప్పుడతను బలహీనుడు. అతను అలా దుఃఖంతో కృశించిపోతుంటే, అతని తమ్ముడు లక్ష్మణుడు కూడా దుఃఖంతో కృశించిపోతున్నాడు. నీరసించిపోయిన ఇద్దరూ నాతో ఏం పోరాడగలరనుకొంటున్నావు...

ఇంక నీ బాబాయి సుగ్రీవుడి సంగతి... ఒరే అంగదా... నువ్వూ, సుగ్రీవుడు పరస్పర విరోధులే కదరా... మీ ఇద్దరికీ రాజ్యకాంక్ష లేదంటే నమ్మడానికి నేను అమాయకుణ్ణా... మీ ఇద్దరూ ఒకణ్ణి ఒకరు వెన్నుపోట్లు పొడుచుకొంటారు గానీ, ఇద్దరూ కలిసి వచ్చి నా మీద యుద్ధం చేస్తార్రా ?

సరే ! మావాడున్నాడు విభీషణుడు... వాడు పిరికిపంద! ఆ పిరికిపంద గురించి నేను భయపడవలసిందేమీ లేదు.

మీ జాంబవంతుడు బలవంతుడే గానీ, ఇప్పుడు ముసిలివాడైపోలేదూ... ఆయనేం యుద్ధం చేస్తాడ్రా ?

నలుడు, నీలుడూ గురించి మీరంతా పొగుడ్తున్నారు... వాళ్ళు శిల్పకారులేగాని యుద్ధనిపుణులు కాదుగదా... వాళ్ళు చేయాల్సిన సాయం ఏదో చేసేశారు మీకు - వంతెన కట్టి ! ఇంకా వాళ్ళు చెయ్యగల్గిందేం వుందీ...?

వీళ్ళ సంగతి సరే గానీ, ఒక వానరుడెవడో... వాడి పేరేమిటో గుర్తులేదు... వాడు నిజంగా బలవంతుడు. మా నగరాన్ని తగలబెట్టిపోయాడు..."

రావణాసురుడు అంగదుడితో ఇలా ఏకధాటిగా మాట్లాడుతుంటే, హనుమంతుడి ఊసెత్తగానే అంగదుడు ఫక్కున నవ్వాడు.

రావణా! నువ్వు బలవంతుడని ఒప్పుకొన్న ఆ వానరుడు సుగ్రీవుడి దూత. మిగతా వానర వీరులతో పోలిస్తే వాడేమీ పెద్ద బలవంతుడు కాదు నిజానికి ! వాడికన్నా చాలా బలవంతులు మా వానర సేనలో ఇంకా చాలామంది వున్నారు కూడా ! వాడు వేగంగా వెళ్ళగలడు ఎక్కడికైనా... అందుకని మీ లంకా పట్టణానికి వాణ్ణి మేమే పంపాం.

ఇక్కడ నీకో విషయం చెప్పాలి...! రాముడి ఆజ్ఞలేకుండా వాడు మీ నగరాన్ని, మీ తోటల్ని ధ్వంసంచేశాడు. అందుకని, రాముడికి మొహం చూపించడానికి సిగ్గుపడి

ఎక్కడో దాక్కున్నాడు. ఇప్పుడు మాకూ కన్పించడం లేదు - అని నవ్వాడు. హనుమంతుడంతటి వీరులు చాలామంది వున్నారని రావణుడికి చెప్పడం అంగదుడి ఉద్దేశ్యం.

రావణుడు నేరుగా తిట్టేస్తున్నాడు. అంగదుడు వక్రోక్తులతో మాటల బాణాలు వదుల్తున్నాడు. ఒకదశలో తిట్టడానికి కొత్తగా మాటలేమీ దొరకలేదు రావణుడికి.

"ఒరే అంగదా! ఇలాంటి బుద్ధిమంతుడివి కాబట్టే మీ నాన్నని భక్షించావు" అన్నాడు.

"మా నాన్న సంగతి అలావుంచు, ప్రస్తుతం నిన్నే భక్షించేవాణ్ణి. కానీ, నాకో ఆలోచన కలుగుతోంది-" 'వాలి చంకల్లో చిక్కుకొని విలవిలలాడిన రావణుడు' అని మానాన్న పేరుని గొప్పగా చెప్పుకొంటారు జనం. ఇప్పుడు నిన్ను నేను భక్షిస్తే మానాన్న కీర్తిని తగ్గించినట్లవుతోందికదా... అందుకని నిన్ను భక్షించలేదు" - అన్నాడు.

రావణుడి కోపం అప్పటికే తారాస్థాయిలో వుంది. ఇంకా అంతకు మించి వెళ్ళేందుకు అవకాశం లేనంత ఎత్తుకు అతని కోపం ఎగిరింది. అంగదుడు తన వాగ్ధాటిని కొనసాగిస్తూనే వున్నాడు...

"నాకు చాలా మంది రావణుల కథలు తెలిశాయి... ఒకప్పుడు పాతాళలోకంలో పిల్లలు ఒక రావణుణ్ణి పట్టుకొని గుర్రపుశాలలో కట్టేసి కర్రలతో కొట్టారు. అప్పుడు బలిచక్రవర్తి జాలిపడి ఆ రావణుణ్ణి వదిలిపెట్టించాడు. ఒకవేళ ఆ రావణుడివి నువ్వుకాదు గదా ...?

అలాగే ఇంకో రావణుణ్ణి కార్త్యవీర్యుడు జంతువుల్ని బంధించే బోనులో పెట్టించాడు.

మరో రావణుణ్ణి మా నాన్న చంకల్లో ఇరికించి నొక్కిపట్టివుంచాడు.

ఇంతమంది రావణుల్లో నువ్వు ఎవడివి... కొంపదీసి ఈ ముగ్గురు రావణులూ నువ్వేనా ... అన్నాడు వ్యంగ్యంగా.

రావణుడు కోపంగా 'ఒరే పిల్లకోతి...' అని అరిచాడు. కానీ అంగదుడు ఆగకుండా -

"ఎంతసేపూ కైలాసాన్ని ఎత్తాను - శిరస్సుల్ని హోమం చేశాను అని గొప్పలు చెప్పుకొంటావుగానీ, ఈ ముగ్గురూ నిన్ను చావగొట్టినప్పుడు నీ బలదర్పాలేమయ్యాయో ముందు అది తేల్చిచెప్పవయ్యా" అని నిలదీశాడు. అన్నింటికీ రావణుడు ఒక్కటే సమాధానం చెప్పాడు -

"ఆకాశంలో ఎగిరే గాలిపటం కూడా ముళ్ళపొదల్లోనూ, మంటల్లోనూ చిక్కుకోవచ్చు... గాడిద, బరువుల్ని మోయడం లేదా..." అని సమర్థించుకున్నాడు. అంగదుడూ, రావణుడూ మాటలతో యుద్ధం అలా చాలాసేపు కొనసాగించారు. అంగదుడు శ్రీరామ స్తుతీ, రావణుడు రామనింద చేస్తూనే వున్నారు. చివరిగా అంగదుడు తేల్చిచెప్పాడు-

"నేను నీతో స్నేహం చెయ్యడానికో, రాముడితో సంధి కుదర్చడానికో రాలేదు - అలా చెయ్యమని రాముడు నాకు చెప్పలేదు కూడా...

విష్ణు నింద ఇంకా నువ్వు ఇలా చేస్తుంటే నేను చూస్తూ సహించడం గోహత్యతో సమానం... ఇంకా ఉపేక్షించకూడదు - అంటూ దిగ్గున లేచి పెద్దగా సింహనాదం చేస్తూ రెండు పిడికిళ్ళూ బిగించి నేలమీద గట్టిగా ప్రహరణం ఇచ్చాడు.

భూమి కంపించినట్లయ్యింది.

సభలో వున్నవారంతో ఒక్కసారి అదిరారు. రావణుడు గిరగిర తిరిగి తూలి, సవరించుకొంటూ లేచాడు. అతని పది కిరీటాలూ కదిలి నేలమీదపడ్డాయి.

చెకచెక ఆరు కిరీటాలు ఏరుకొని తలమీద పెట్టుకొంటుంటే మిగిలిన నాలుగు కిరీటాల్ని అంగదుడు లాక్కొని అక్కడి నుంచే వానరసేన విడిది చేసిన దిక్కుకు బలంగా వాటిని విసిరేశాడు.

ఆ కిరీటాల్లోంచి వజ్రపు ముక్కలు ఆకాశంలోంచి ఉల్కలు రాలిపడ్తున్నట్లు పడ్డాయిట. రాముడు అది చూసి, భయపడకండి. అవి ఉల్కలు కావు, ఉత్పాతాలు కావు...రావణాసురుడి కిరీటాలు. మనవాడు అంగదుడు రావణుడికి పరాభవం ఏదో చేసినట్టున్నాడు. ఆ వార్త మనకు తెలియడం కోసం ఈ కిరీటాల్ని ఇలా విసిరేశాడు అన్నాడు.

## రావణ సభలో అంగదుడిదే గెలుపు

రావణుడు తన భటులతో ఈ అంగదుణ్ణి వధించవలసిందిగా ఆజ్ఞాపించాడు. అప్పుడు అంగదుడు రావణుణ్ణి తిట్టినన్నితిట్లు బహుశా ఎవరూ ఎవర్నీ ఎప్పుడూ తిట్టివుండరు.

"ఓరీ మూర్ఖుడా! నీ ముఖానికి సిగ్గులేదా...

ఓరీ కులఘాతకుడా.... ఉరిపోసుకొని చావరాదుట్రా...

ఓరీ స్త్రీ చోరుడా... దుష్టుడా... బుద్ధిహీనుడా... పాపాత్ముడా.. కామార్తుడా... నీకు రోజులు మూడాయిరా...

రణరంగంలో ఒక్కోవానరుడూ వచ్చి నీ శిరస్సుల్ని కాళ్ళతో తన్నుతుంటే, నీ పాపాలకు ఫలితాన్ని అప్పుడు అనుభవిస్తావు...

నీచుడా! నీ జన్మని కాల్చా

ఇరవై కళ్ళున్నాయి ఎందుకురా... కాలిపోయాయా... వాలిని చంపినవాడు మానవమాత్రుడా... వాలి చంకలో ఇరుక్కొని గిలగిలా కొట్టుకున్న నువ్వు వీరుడివా...



కార్త్యవీర్యుడి చేత జంతువుల బోనులో బంధించబడింది నువ్వు - ఆ కార్త్యవీర్యుణ్ణి చంపిన పరశురాముడు నా రాముడికి దణ్ణంపెట్టి వెళ్ళాడు తెలుసా...? అతను మానవ మాత్రుడు ఎలా అవుతాడు... ? నీ నాలుక తెగకొయ్యా ? రామనింద చేసినందుకు నీ పది నాలుకలూ తెగిపడ్తాయిలే...

నిన్ను చంపేందుకు నాకు రామాజ్ఞ లేదు- అందుకే బతికిపోయావు" - అన్నాడు.

అనడమే కాదు - తన పాదాన్ని ఎత్తి ఒక మెట్టు మీదపెట్టి, "మీలో ఎవడైనా ఈ పాదాన్ని కదిల్చి చూడండి, శ్రీరాముడు ఓడినట్లే ఒప్పుకుంటాను" - అన్నాడు ధైర్యంగా!

నిజానికి ఇలాంటి పందెం కాయడానిక్కూడా రామాజ్ఞ అంగదుడికి లేదు. కానీ, రావణుడి చేతకానితనం మీద, అతని స్వశక్తిమీదా అంగదుడికున్న నమ్మకం అతనిచేత అలా మాట్లాడించింది. పైగా, తన ఈ బలం అంతా రాముడివలనే తనకు కల్గుతోందనే నమ్మకం అతనిది ! ఆ విశ్వాసమే అంగదుడిచేత అలా మాట్లాడించింది !

మేఘనాథుడితో సహా రాక్షసవీరులు చాలామంది ప్రయత్నించారుగానీ, ఎవరూ అతన్ని పడతొయ్యలేకపోయారు.

చివరికి రావణుడంతటివాడు వచ్చి అంగదుడి పాదం పట్టుకోబోయాడు. అప్పుడు అంగదుడు విజ్ఞత ప్రదర్శించాడు.

"రావణా ! నా తండ్రి తర్వాత తండ్రి అంతటివాడివి. నా పాదం కాదు - శ్రీరాముడి పాదాలు పట్టుకో, నీకు ముక్తి కలుగుతుంది" - అంటూ ఎగిరి వెళ్ళిపోయాడు అంగదుడు.

# రావణ కిరీటాల వైనం

అంగద రాయబారం విజయవంతం అయ్యింది. రావణాసురుణ్ణి మాటలతో హింసించడం, నైతికంగా అతన్ని బలహీనుణ్ణి చేయడం... గెలవలేమేమోననే అభిప్రాయం రాక్షసుల్లోనూ, రావణుడిలో కూడా కలిగించడం రాముడి వ్యూహంలా కన్పిస్తుంది. వీలైన ప్రతిసారీ, వీలైన ప్రతిచోటా రావణుణ్ణి మానసికంగా బలహీనుణ్ణి చేయడమే ధ్యేయంగా పథకరచన చేశాడు. అంగద రాయబారం ఈ వ్యూహంలో ముఖ్యభాగం.

రాముడు చెప్పకుండానే హనుమంతుడు దానిని సాధించాడు. రాముడి ఆజ్ఞతో అంగదుడు మరింత ఉత్సాహంగా తన విధిని పూర్తి చేశాడు.

రాయబార విజయం సాధించి అంగదుడు తిరిగి వచ్చాడు !! ప్రేమగా శ్రీరాముడు అతన్ని దగ్గరకు తీసుకున్నాడు. 'నా మనసులో ఒక కోరిక రగిలిపోతోందయ్యా... రావణుడు రాక్షస కులంలో మహాబలసంపన్నుడు. అతని కిరీటాలు నువ్వెలా సంపాదించగలిగావు, వాటిని ఎలా నాకు పంపగలిగావు... తెలుసుకోవాలని చాలా కుతూహలంగా వుంది" - అనడిగాడు రాముడు.

అంగదుడు అంతకన్నా వినయంగా నమస్కరించి తన యోగ్యతకొద్దీ అద్భుతమైన సమాధానం చెప్పాడు - "శ్రీరామా! మీకు అన్నీ తెలుసు. దీనదయాపరమూర్తులు. నా చేత చెప్పించాలని చూస్తున్నారంతే ! నిజానికి రావణుణ్ణి నిండు సభలో పడగొట్టి అతని కిరీటాల్ని కిందపడేలా చేశాను. వాటిలో నాలిగింటిని పట్టుకొని మీ దగ్గరకు విసిరేశాను. అవి కిరీటాలు కావు. రాజధర్మానికి సంబంధించిన సామదానభేద దండాలు. అవి నాలుగూ ధర్మాలు కాబట్టి ఆ నాలుగూ వాటంతట అవే మీ దగ్గరకు వచ్చాయి. నేను ఇంతదూరం విసరగలిగిగాననుకోవడం లేదు" - అన్నాడు.

"రావణుడు ధర్మహీనుడు కాబట్టి ఈ నాలుగు ధర్మాలు అతని చెరవిడిపించుకొని బైటపడి మిమ్మల్ని ఆశ్రయించాయి" అని అంగదుడు అన్నప్పుడు అతని చమత్కారానికి రాముడు చాలా సంతోషించాడు.

# యుద్ధరంగాన్ని సందర్శించిన సీత

ఇంద్రజిత్తు నాగాస్త్రం వేశాడు.

రామలక్ష్మణులు నాగపాశాబద్ధులై మూర్ఛపడివున్నారు.

ఇంద్రజిత్తు సంతోషంగా "రామలక్ష్మణుల్ని చంపేశా..." అంటూ అరుచుకొంటూ తండ్రి దగ్గరకు వెళ్ళాడు.

వానరసేన కలవరం చెందింది ! నిజంగా రామలక్ష్మణులు మరణించారా... ?

విభీషణుడు వచ్చి పరిశీలనగా చూశాడు. సుగ్రీవుణ్ణి, హనుమంతుణ్ణి ఓదార్చాడు. అధైర్యపడవద్దన్నాడు. రామలక్ష్మణులమీద మృత లక్షణాలు లేవు - వాళ్ళిద్దరూ కాసేపట్లోనే తెప్పరిల్లుతారు.

మీరు ధైర్యంగా నిలబడండి. సైన్యానికి ధైర్యం చెప్పండి ! ఆలస్యం జరిగితే భయపడి మన సైన్యం పలాయనం చిత్తగించే ప్రమాదం ఉంది- అన్నాడు.

ఎక్కడి వాళ్ళక్కడ ధైర్యంగా నిలబడ్డారు. రామలక్ష్మణులకు రక్షణ కల్పించి, సైన్యాన్ని ఉత్తేజితుల్ని చేసే ప్రక్రియ మొదలుపెట్టారు.

ఈలోగా రావణుడు ఇంద్రజిత్తును అభినందించి సీతకు కావలివున్న రాక్షసస్త్రీలకు కబురుపెట్టించాడు.

"వెళ్ళి, రామలక్ష్మణులు చచ్చిపోయారని ఆ సీతకు చెప్పండి. ఆవిడ అంత తేలికగా మీ మాటల్ని నమ్మదు - పుష్పక విమానం ఎక్కించి తీసుకెళ్ళి అక్కడ చచ్చిపడివున్న రామలక్ష్మణుల్ని చూపించండి. అప్పుడు నమ్ముతుంది" - అని ఆజ్ఞాపించాడు.

లంకాపురంలో విజయధ్వజం ఎత్తించాడు.

"రావణుడు గెలిచాడు. రామలక్ష్మణులు మరణించారు" అంటూ చాటింపు వేయించాడు. విజయదుందుభులతో లంకానగరం మార్మోగిపోయింది. అప్పటికప్పుడు పండగ సంబరం అయ్యింది రాజ్యానికి.

రాక్షసస్త్రీలు సీతని పుష్పకవిమానం ఎక్కించి ఆకాశంలోంచి రణరంగాన్ని ఆమెకు చూపించారు. ప్రాణాలు కోల్పోయిన వానర సైన్యంతో యుద్ధభూమి ఎండుటాకులు కప్పిన నేలలాగా ఉంది. ఉత్సాహంగా ఊగుతున్నారు రాక్షస మూక... నిర్లిప్తంగా పడివున్నారు వానర వీరులు.

ధనుర్బాణాలు వదిలి రామలక్ష్మణులు ప్రాణావశేషంగా రణభూమిలో నేలకూలిన దృశ్యం గుగుర్పాటు కలిగిస్తోంది-

"వైధవ్యం నీకు కలగదు" అని జ్యోతిష్య శాస్త్రవేత్తలు చెప్పిన మాటలన్నీ సీత విషయంలో అబద్ధాలని తేలిపోయాయా... ? నిత్యసుమంగళివని ఆశీర్వదించిన బ్రహ్మాది దేవతల వాక్కులన్నీ అసత్యాలయిపోయాయా...? పాదపద్మాలలో వున్న పద్మరేఖ తను సామ్రాజ్య పట్టమహిషిగా అవుతుందని, కాలజ్ఞులు చెప్పిన మాటలు అడియాసలేనా...

దుఃఖపూరితురాలైన సీతను చూసి పక్కనే కూర్చున్న త్రిజట నవ్వింది...

"ఏవిటమ్మా! ఇంత వెర్రిదానివనుకోలేదు.. రాక్షసులేదో దృశ్యాన్ని చూపించగానే నమ్మేయడమేనా?

రామలక్ష్మణులు సజీవంగానే వున్నారు చూడు...

వాళ్ళు నిజంగా మరణించివుంటే, ఒక్కటే గుర్తు - ఈ దివ్య విమానం విధవరాలివైన నిన్ను ఎక్కనిచ్చేది కాదు -

అంతేననుకొంటున్నావా... సేనాని చచ్చిపోయాక సైన్యం అలా ధైర్యంగా నిలబడివుంటుందా... ఈ పాటికి మూటాముల్లె సర్దుకొని వారధి దాటి, కిష్కింధ దాకా వెళ్ళిపోయేవాళ్ళు కాదూ..

భలేదానివి... అంతమాత్రానికే బేలపడిపోతే ఎలా ?

వానరులు యుద్ధోత్సాహంతో రంకెలు వేస్తున్నారుగాని పారిపోయే ఉద్దేశ్యంలో లేరు-

అంటే, రామలక్ష్మణులు బతికేవున్నారన్నమాట !

బహుశా మూర్ఛలో వుండివుంటారు.

ఇంతమాత్రానికే కంగారుపడితే ఎట్లా !!

త్రిజట ఓదార్పుకు సీత కొంచెం తెప్పరిల్లింది. "త్రిజటా... నిజమేనంటావా..?" అంది ! త్రిజట మళ్ళీ నవ్వింది.

అంతలో పుష్పక విమానాన్ని వెనక్కితిప్పి తిరిగి అశోకవనానికి తెచ్చారు. సీతాదేవి రామలక్ష్మణులను తలచుకొంటూ, లోలోపల దుఃఖిస్తూనే, గుండె దిటవు చేసుకొని విమానం దిగింది.

తాను కూర్చుని వున్న చెట్టు దగ్గరకు యథాప్రకారం వెళ్ళిపోయింది !

# రావణుడి తొలి యుద్ధం

ఒక్కొక్కరే రాక్షస సైనికులు నేలకొరుగుతుండడంతో అంతకంతకూ ఖంగారు ఎక్కువ కాసాగింది రావణుడిలో ! ఈగలకు శలభాలు బలి అయినట్లుంది - ఇంక లాభం లేదు - నేనే స్వయంగా బయల్దేరి యుద్ధానికి వెడతాను -" అంటూ బైటకు కోపంగా వచ్చి రథం ఎక్కాడు.

భేరీనాదాలు ఒక్కసారిగా మోగాయి. సమర శంఖాలు పూరించి వీరులు తమ ఆధీనాల్లోని సైనికుల్ని ఉత్తేజితుల్ని చేశారు. వందిమాగధుల పొగడ్తలు, స్తుతులు, స్తవాలతో ఆ ప్రాంతం ప్రతిధ్వనించింది. మహా పర్వతాకారులైన రాక్షసులంతా యుద్ధానికి సన్నద్ధం అయ్యారు.

రావణుడు అలా రాక్షస వీర పరివేష్టితుడై భూతగణాలను వెంటబెట్టుకొని బయల్దేరిన ప్రళయ రుద్రుడిలా వున్నాడు.

వానర సైన్యం రావణుడి అట్టహాసాన్ని చూసింది. పౌర్ణమి రోజు సముద్రంలా వాళ్ళ గుండెలు ఉప్పొంగాయి. ఒక్కో వానర వీరుడి చేతిలో ఒక్కో పెద్ద బండరాయి ఉంది. పెద్దపెద్ద రాళ్లను తీసుకొని యుద్ధ వ్యూహంతో ముందుకు దూసుకుపోయారు.

రావణుడి సమర వైభవాన్ని చూశాడు రాముడు. విభీషణుడితో అన్నాడు -

"ఒక్కో రాక్షస వీరుడి రథానికి ఒక్క పతాకం కన్పిస్తోంది. ఒక్కో రాక్షసుడి దగ్గర ఒక్కో శస్త్రం కన్పిస్తోంది. నడిచొస్తున్న పర్వతంలా రాక్షస సైన్యం వస్తోంది. ఈ సేనా వాహినికి "సేనాని" ఎవరు ?" అని అడిగాడు - దూరంగా వస్తున్న సైన్యం దండుని చూసి రాముడు !

విభీషణుడు చెప్పాడు - వేగుల సమాచారం ప్రకారం, రావణుడు స్వయంగా యుద్ధానికి వస్తున్నాడు అన్నాడు - ఒక్కో రాక్షస వీరుడి గురించి రాముడికి వివరించాడు- ..... అదిగో ..... బాలార్క ముఖ కాంతి దీప్తిస్తోంటే, ఏనుగు పైన పరమ పటాటోపాలతో వస్తున్నాడు చూశారా ..... అతనే రావణుడి కొడుకు ప్రకంపనుడు.

అవతల రథం మీద బండి చక్రంలాంటి ధనస్సు పుచ్చుకొని, వింటినారిని ఝుమ్మని ధ్వనిస్తూ వస్తున్నాడు చూశారా ..... అతను ఇంద్రజిత్తు.

వింధ్యపర్వతం అంత శరీరం కలిగిన ఆ మహావీరుడే అతికాయుడు.

అదిగో మండుతున్న అగ్ని గోళాల్లా ప్రకాశిస్తున్న కళ్లతో ఏనుగుపైన వస్తున్నవాడు మహోదరుడు.

కాంచన చిత్రాభరణ భూషితమైన గుర్రం ఎక్కి ధగద్ధగాయమాన ప్రాసాన్ని చేత్తో పుచ్చుకొని సంధ్యాభ్ర గిరిలాగా వస్తోన్న ..... వాడే పిశాచుడు ..... !

ఆ పెద్ద ఎద్దు మీద ఎక్కివస్తున్నవాడు త్రిశిరుడు.

పాముగుర్తు జెండా పెట్టుకొని వస్తున్న ఆ వీరుణ్ణి కుంభుడంటారు.

అతడే నికుంభుడు ..... రాక్షస సైన్యంలో చాలా ముఖ్యుడు. నిర్దయుడు. ఘోరంగా యుద్ధం చేస్తాడు.

అవతల అగ్ని రాశిలా ఉన్నవాడు నరాంతకుడు. వాడు మహాపర్వతాల్ని భుజాన పెట్టుకొని మోసుకొచ్చి యుద్ధంచేస్తాడు.

కిరీట కుండలాలు ధరించి ఆ రథంపైన సూర్యుడిలా వెలుగుతున్న ఆయనే రాక్షసేంద్రుడు రావణుడు, అని విభీషణుడు వివరించి చెప్పాడు.

రావణాసురుణ్ణి పరిశీలించి చూశాడు శ్రీరాముడు. "విభీషణా ! రావణుడి దివ్యతేజం అతని ప్రతాపాన్ని చాటుతోంది ! తేజః పుంజమైన ఆయన రూపాన్ని చూడడం సామాన్యులకు కష్టమే ! దేవ దానవుల్లో ఇంతటి తేజశ్శా లి వుంటాడనుకోను. కాలయముడిలా వున్నాడు ..... కొడితే ఇలాంటి వాణ్ణి కొట్టాలి - సీతాపహరణం చేసిన వాడిమీద పగ ఇవ్వాళ్టితో తీరుగాక -" అంటూ రౌద్రంగా బాణంతీసి రావణాసురుడికి ఎదురుగా నడుచుకొంటూ వెళ్ళాడు.

# రావణుడి నెత్తిన హనుమంతుడి పిడిగ్రుద్దులు

ఎవడ్రా నువ్వు - నా రథం ఎక్కావు అని అరిచాడు. అప్పటికే హనుమంతుడు తన ఎడంచేతినెత్తి రావణాసురుడి నెత్తిన ఒకే ఒక గుద్దును ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నాడు.

"రావణా ! దేవ దానవ గంధర్వ యక్షరాక్షస వర్గాల్ని జయించానని విర్రవీగుతున్నావు - కానీ, ఈ వానరుడి దెబ్బ ఎలా ఉంటుందో ఒకసారి రుచి చూడు - అంటూ ఎడం చేత్తోనే చాచి ఒక పిడిగ్రుద్దు ఇచ్చాడు.

రావణుడి కళ్ళు ఎర్ర బడ్డాయి. అయినా తమాయించుకున్నాడు. ఒక కోతి తన రథం ఎక్కి తనతో పిడిగ్రుద్దుల యుద్ధానికి తలపడడం అయనకి ముచ్చటేసింది - "హనుమంతా ! ప్రగల్బాలు ఆపెయ్ - ఎంత గ్రుద్దుతావో గ్రుద్దుకో ..... నేనేం అనుకోను - రావణాసురుడంతటి వాడికి పిడి గ్రుద్దులు ఇచ్చాననే చిరకీర్తి మిగుల్చుకో ..... నీ పరాక్రమాన్ని చవిచూసిన తర్వాతే నిన్ను యమపురికి పంపిస్తాను" అన్నాడు వ్యంగ్యంగా!

రావణుడి ఎద్దేవా హనుమంతుణ్ణి బలంగానే తాకింది. "రావణా ! నా పిడి గ్రుద్దు ఎలా ఉంటుందో ముందు రుచి చూడు -" అంటూ బలంగా రావణుడి తల పగిలేంత ముష్టిఘాతం ఇచ్చాడు. ఆ దెబ్బకు రావణాసురుడికి భూకంపం వచ్చినంత పనయ్యింది! కొద్దిసేపటికి గానీ తెప్పరిల్లలేక పోయాడు.

"సెబాసు హనుమంతా ! నీ శక్తి మెచ్చుకోదగ్గది ! నీకు నా అభినందనలు" అన్నాడు. రావణుడంతటి వాడు యుద్ధరంగంలో మెచ్చుకొంటే హనుమంతుడు పొంగిపోతాడా ..... ? ఎట్టి పరిస్థితుల్లోనూ తన శత్రువుగా భావించిన వ్యక్తి ప్రశంసలు ఆయనకి ఆనందం ఎలా కల్గిస్తాయా ..... ?

రావణుడి ప్రశంసలకి హనుమంతుడి సమాధానం ఇది -

"రావణా ! ఇంత దెబ్బ కొట్టినా ఇంకా నువ్వు బతికే వున్నావంటే, నా పరాక్రమం తగలబడనా ?"

రావణుడు, హనుమంతుడు ఆ రథం మీదే నిలబడి ఒకరినొకరు పిడి గ్రుద్దులతో పీడించుకొన్నారు. ఇద్దరూ సొమ్మసిల్లిపోయారు. ఆఖరికి హనుమంతుడు సోలిపోయాడు-

హనుమంతుడి నిష్క్రమణ తర్వాత, రావణాసురుడు విల్లు తీసుకొని నీలుడి మీద బాణాలు వేయడం మొదలుపెట్టాడు.

నీలుడు పెద్దపెద్ద పర్వత శిఖరాల్ని తెచ్చి రావణుడి మీదకు విసర సాగాడు.

బండరాళ్ళను తప్పించుకోవడానికి రావణుడు బాణాల వర్షాన్నే ప్రయోగించాల్సి వచ్చింది.

ఇంక విసిరేందుకు అక్కడ ఏమీ దొరకని పరిస్థితి. కనిపించిన చెట్లూ, చేమల్ని కూడా పెకలించి రావణుడి మీద ప్రయోగించాడు నీలుడు. రావణుడు వాటన్నింటినీ తుత్తునియలు చేయసాగాడు.

ఇదంతా కాదని, నీలుడు చిన్న "ఈగ" అంత సూక్ష్మ రూపంలో మారిపోయి, ఎగిరి రావణాసురుడి ధ్వజం మీదకి చేరాడు. అతని తలచుట్టూ పెద్దగా రొదచేస్తూ ఎగురుతూ చికాకుపెట్టసాగాడు.

రావణాసురుడు నీలుణ్ణి గుర్తుపట్టి, నీ మాయా లాఘవానికి మెచ్చు కొంటున్నాను- ఇప్పుడు నీ ప్రాణాలు దక్కించుకో -" అంటూ అతని మీద ఆగ్నేయాస్త్రాన్ని సంధించాడు.

నీలుడు అగ్ని దేవుడి కొడుకు అనే సంగతి బహుశా రావణాసురుడికి తెలియక పోవచ్చు. అందుకే ఆగ్నేయాస్త్రం నీలుడికి ఎలాంటి ప్రాణహాని కల్గించలేకపోయింది ! మూర్ఛిల్లి మోకాళ్ల మీద వాలిపోయాడు నీలుడు.

## రావణుడితో లక్ష్మణుడి యుద్ధం

రావణుడు వేగంగా లక్ష్మణుణ్ణి లక్ష్యంగా చేసుకొని అటువైపు బాణాలు వేసుకొంటూ సైన్యాన్ని చీల్చుకొంటూ దూసుకు రాసాగాడు.

లక్ష్మణుడు రావణుడి వైపు హేళనగా చూసి, కోతులతో ఏం యుద్ధం చేస్తావులే రావణా ! నాతో పోరాటానికి సిద్ధంగా రా !" అన్నాడు.

"లక్ష్మణా ! చావు మూడినందు వలనే ఇక్కడకు వచ్చావులే ..... యమపురికి పంపిస్తాను నిన్ను ఇప్పుడే" అన్నాడు రౌద్రంగా !

"చేసేవాడు ఎప్పుడూ ప్రగల్భాలతో కాలం వెళ్ళబుచ్చడు - బాణం పుచ్చుకొని యుద్ధానికి వచ్చి దాన్ని ప్రయోగించకుండా ఊరకే చంపుతా చంపుతా నంటూ రంకెలేస్తావు దేనికి !" అన్నాడు హేళనగా !

రావణుడు ఏడురకాల దివ్యాస్త్రాలైన బాణాల్ని లక్ష్మణుని మీద ప్రయోగించాడు. లక్ష్మణుడు వాటిని తృటిలో తుంచి నిశ్చలంగా నిలబడ్డాడు.

నిప్పులు కక్కే బాణాలను రావణుడు, లక్ష్మణుడు ఒకరిమీదకు ఒకరు ప్రయోగించుకున్నారు.

భవిష్యత్తులో రావణుడితో యుద్ధం తప్పదని ముందే వూహించి, విశ్వామిత్రుడు తగిన పద్ధతిలో నేర్పించిన యుద్ధ విద్యలు, ప్రసాదించిన దివ్యాస్త్రాలు ఇప్పుడు అక్కరకు వచ్చాయి లక్ష్మణుడికి !

రావణాసురుడి విల్లు విరిగేలా బాణం వేసి, క్షణం ఆలస్యం చెయ్యకుండా మూడు వరుస బాణాలు వేసి రావణాసురుణ్ణి దెబ్బతీశాడు.

ఆ బాణాల తాకిడికి ఒకింత సేపు రావణాసురుడు సొమ్మసిల్లాడు కూడా. అంతలోనే తెప్పరిల్లి, బ్రహ్మదేవుడు ప్రసాదించిన శక్తిని బైటకు తీసి, దాన్ని లక్ష్మణుడి మీదకు ప్రయోగించాడు రావణుడు.

ఆ బాణ వేగాన్ని చూస్తున్న వాళ్ళే స్పృహతప్పి పడిపోయేలా ఉంది ..... దాని భయంకర స్వరూపం - అది లక్ష్మణుడి గుండెల్ని తాకి, వెనక్కి వచ్చి మళ్ళీ రావణాసురుడి దగ్గరకు చేరింది.

ఆ శస్త్రం తాకిడికి లక్ష్మణుడు మూర్ఛపోయాడు. పడిపోతున్న ఆయన్ని లేపి నిలబెట్టాలని రథం దిగి పరిగెత్తుకొంటూ లక్ష్మణుడి దగ్గరకు వచ్చాడు రావణుడు. చేతులతో పైకెత్తే ప్రయత్నం చేశాడు. కానీ, ఆయన వల్ల కాదు - "అహో ..... కైలాసాన్ని ఎత్తాను, హిమాలయాల్ని ఎత్తాను. మందర పర్వతాన్ని, మేరు పర్వతాల్ని కూడా ఎత్తాను. కానీ, ఇంతటి బరువును మోసిన ఈ భుజాలు ఇవ్వాళ లక్ష్మణుణ్ణి ఎత్తలేకపోతున్నాయేమిటా ..... అని ఆశ్చర్యపోయాడు.

ఇంతలో మూర్ఛనించి తేరుకున్న హనుమంతుడు లక్ష్మణుల వారి మూర్ఛ దృశ్యాన్ని చూసి పరిగెత్తుకొంటూ వచ్చి, బలం అంతా కూడ గట్టుకొని చాలా శక్తివంతమైన ముష్టి ఘాతంతో రావణుణ్ణి పొడిచాడు. ఆ పిడికిలి గ్రుద్దుకు దూరంగా విసిరేసినట్లు వెళ్ళి పడి, నేలమీద దొర్లాడు రావణాసురుడు. ఆయన నోట్లోంచి ఆ దెబ్బకి నెత్తురు ధారాపాతంగా కారింది. నిశ్చేష్టుడై పడిపోయాడు రావణాసురుడు. మూర్ఛలో ఉన్న లక్ష్మణుణ్ణి హనుమంతుడు భుజాలకేసుకొని శ్రీరాముడి దగ్గరకు చేర్చాడు.

# కుంభకర్ణుడొక మహాయంత్రం

కుంభకర్ణుని నిద్రలేపడం ఒక మహాయజ్ఞం !

మందిరంలో పరిచిన మహాపర్వతంలా పడివున్నాడు కుంభకర్ణుడు ఒక మహాశయ్యమీద !

మృగ, మహిష, వరాహ మాంసరాసుల్ని తెచ్చి దగ్గరపెట్టారు. నెత్తురునింపిన బానల్ని, మద్యంనింపిన భాండాల్ని సిద్ధం చేశారు. అతని వంటికి చందనాన్ని అలది, సుగంధి మాల్యాలు కప్పి ధూపం వేసి జోహారులు పలికారు.

ఎన్ని ఉపాయాలు చేస్తే ఆ మహాకాయుడు నిద్రలేచాడూ...? చెవుల్లో మేఘగర్జనలు, శంఖారావాలు చేశారు. గదలతో భయంకరంగా కొట్టారు. బల్లేలతో దారుణంగా పొడిచారు.



సూది గుచ్చినంతకూడా బాధ అన్పించలేదు అతనికి... ఏనుగులతోనూ, ఒంటెలతోనూ తొక్కించారు. కొరడాలతో కొట్టారు - నెత్తిన జుత్తు పట్టుకొని పీకారు. చెవులు గట్టిగా కొరికారు. చెవుల్లో నీళ్ళకుండలు బోర్లించారు ... ఏంచేసినా లేవలేదా మహాకాయుడు !

వెయ్యి ఏనుగుల్ని తెచ్చి తొక్కిస్తే ఒక్కరవ్వ కదిలాడు. కదిలి బిగ్గరగా ఆవులించాడు. ఆ ఆవులింతకు అక్కడున్న రాక్షస సైనికులు అతని కడుపులోకి దూసుకుపోయి, అతను నిశ్వాసం వదిలినప్పుడు మళ్ళీ ముక్కుల్లోంచి బైటకు విసిరేసినట్లు వచ్చారు. చచ్చినవాళ్ళు చచ్చారు. బతికినవాళ్ళు బతికారు.

కొంచెం మెలకువ వచ్చేసరికి సురాభాండాలు, రక్తభాండాలు, మాంసాహారం పళ్ళాలు గుభాళించాయి. ఒక్కగుటకలో వాటిని మింగి తృప్తిగా త్రేన్చాడు.

అప్పుడు పూర్తిగా మెలకువ వచ్చింది !

“ఎందుకు లేపార్రా?” అనడిగాడు... “అన్న బాగానే వున్నాడా?” అని మళ్ళీ ప్రశ్నించాడు. “ఏం కొంపలంటుకొన్నాయని లేపారు?” అని ఆవులించాడు !

రాక్షస సైనికులు యుద్ధం విషయం నివేదించారు.

“రాముడి చేతిలో మన రావణుల వారు చిక్కారు. చావు తప్పించుకొని ఎలాగో బైటపడ్డారు.” అని చెప్పారు.

“కుంభకర్ణుడు కోపంగా- ముందు, ఆ వానరుల్ని భోజనం చేస్తా... ఆ తర్వాతే మా అన్నని చూస్తా...” అంటూ రంకెలేస్తూ పెద్ద పెద్ద అంగలేసుకుంటూ నేరుగా యుద్ధభూమికే బయల్దేరాడు.

నడిచివస్తున్న మహా పర్వతంలా వున్నాడు కుంభకర్ణుడు. వానరసేన ఆ భయంకర ఆకారాన్ని చూసి భయభ్రాంతులై ఒక్కొక్కరే మూర్ఛపోయినంత పనయ్యింది వాళ్ళకి ! ఎక్కడి వాళ్ళక్కడ పారిపోవడం మొదలుపెట్టారు. యుద్ధవ్యూహం చెల్లాచెదురయ్యింది. కొంతమంది నేలమీద బోర్లా పడుకున్నారు. కొంతమంది రాముడి వెనక దూరి ప్రాణాలు నిలబెట్టుకోవాలని చూశారు... వానరసైన్యం తారుమారైపోతుంటే చూశాడు రాముడు.

విభీషణుణ్ణి పిలిచి, విభీషణా ! "పెనుధ్వజంతో వున్న ఈ మహాకాయుడు ఎవరోయ్! ఇంత భూతాన్ని ఎప్పుడూ చూడలేదు"– అనడిగాడు రాముడు.

అప్పుడు విభీషణుడు చెప్పాడు –

"రామా ! ఇతనే కుంభకర్ణుడు ! మా తమ్ముడు ! రావణుడికి నమ్మినబంటు ! ఇలాంటివాడు మళ్ళీ పుట్టడు !!

ఇతన్ని ఓడించాలని దేవ, దానవ పన్నగ రాక్షస గంధర్వ విద్యాధర కిన్నెరులు ఒక్కటై వచ్చి కూడా, ఆ 'ఒక్కణ్ణి' ఓడించలేక ప్రాణాలు వదిలారు. శూలం పుచ్చుకునుంచుంటే ఇతను మూడు లోకాల్ని సంహరించే కాలుడిలా వుంటాడు.

నిజానికి రావణుడి బలం వరాలతో సంపాదించుకొంది. కానీ, కుంభకర్ణుడి బలం సహజం. పుట్టడమే ఇంత బలంతో పుట్టాడు వీడు !

వీడు పుడుతూనే ఆకలికి ఆగలేక వెయ్యిమందిని ఒకేసారి మింగి ఆకలి తీర్చుకున్నాడు.

వీడు ఇలా తిండి తినే పద్ధతి చూసి జనం భయపడిపోయి దేవేంద్రుడికి చెప్పుకొన్నారు. దేవేంద్రుడు కుంభకర్ణుణ్ణి చూద్దామని వస్తే ఐరావతం దంతాలు పీకి, దేవేంద్రుడి గుండెమీద ఒక్కగుద్దు ఇచ్చేసరికి, దేవేంద్రుడు కూడా భయపడిపోయి ప్రజాపతి దగ్గరకు వెళ్ళి మొత్తుకున్నాడు.

అప్పుడు ప్రజాపతి, రావణ కుంభకర్ణులిద్దరినీ పిలిపించాడు.

కుంభకర్ణుడికి ఎప్పుడు నిద్రముంచుకొస్తుందో, ఎప్పుడు మెలకువవస్తుందో తెలియదు – ప్రజాపతి దగ్గరకు రాగానే నిద్రముంచుకొచ్చి విరుచుకుపడిపోయాడు.

అప్పుడు రావణుడు ప్రజాపతితో – "మేము నీకు మునిమనవళ్ళమే గాని, ఇతరులం కాదుగదా... మావాడి మీద కనికరించు. వీడి నిద్రకి ఒక పద్ధతిని అనుగ్రహించు అన్నాడు. అప్పుడు ప్రజాపతి ఆరుమాసాలు నిద్ర – ఒక రోజు మెలకువ వుండేలా అనుగ్రహించాడు. సంవత్సరంలో ఆ రెండు రోజులు మెలకువలోనే వీడు సృష్టిమొత్తాన్ని మింగేయగలడు. అంతటి శక్తి వాడికి వున్నది కూడా !

రావణుడు నీ పరాక్రమానికి భయపడి, నిద్రమధ్యలో వీణ్ణి లేపినట్లు కన్పిస్తోంది. వానరుల్ని తింటానంటూ వస్తున్నాడు వీడు.

వీడు ఒక్కోసారి తొమ్మిదినెలలు నిద్రపోతాడు. ఒక్కోసారి ఆరు నెలలే నిద్రపోతాడు. మొన్ననే లేచాడు. లేచి ఇప్పటికి తొమ్మిది రోజులయ్యింది. ఇప్పటికిప్పుడే వాడంత వాడు లేచే అవకాశం లేదు. బలవంతంగా లేపారనేది స్పష్టం.

కుంభకర్ణుణ్ణి లేపవలసి వచ్చిందంటే, రావణుడు భయంతో వణికిపోతున్నాడని అర్థం...!" అన్నాడు విభీషణుడు.

"వీడు భూతం కాదు –

ఒక మహాయంత్రం...!!" అనుకున్నాడు శ్రీరాముడు.

# మందుల కొండ కథ

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. "లక్ష్మణా ! అంతర్హితుడై ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రబలాన్ని పెంపొందించాడు. అదృశ్యంగా వున్నాడు కాబట్టి అతన్ని సంహరించడం సాధ్యంకాదు. అయినా, బ్రహ్మ అతనికి ఇచ్చిన వరాన్ని మనం గౌరవించాలి. కొద్దిసేపు బ్రహ్మాస్త్ర ప్రభావం వలన వచ్చిపడ్తోన్న బాణవృష్టిని ఓర్చుకో–" అన్నాడు రాముడు. "మనం నేలమీద పడిపోతే, విజయం సాధించానని గర్వంగా వెళ్ళిపోతాడు ఇంద్రజిత్తు" అంటూ నేలమీద విరుచుకుపడిపోయాడు రాముడు. బ్రహ్మాస్త్రానికి గౌరవంగా లక్ష్మణుడు కూడా వొరిగిపోయాడు –

రాముడు, లక్ష్మణుడు మూర్ఛలో వున్నారు. వానర వీరులెందరో బ్రహ్మాస్త్రప్రభావాన నేలరాలిపోయారు –

లంకానగరంలో సుషేణుడనే రాక్షసవైద్యుడు ఈ మూర్ఛలోంచి లక్ష్మణుణ్ణి వెలికితెచ్చి జీవింపచేయగలడని జాంబవంతుడు చెప్పాడు.

సుషేణుణ్ణి రాముడి శిబిరంలోకి లంకానగరంలోంచి రప్పించగలవాడెవ్వరు.. ? ఎవరు వెళ్ళగలరు ? ఎవరు పిలవగలరు ? ఎవరు పిలిస్తే సుషేణుడు బయల్దేరివస్తాడు ...?

అంతా ఈ మీమాంసలోవుండగా హనుమంతుడు మళ్ళీ సూక్ష్మరూపంలో లంకానగరంలోకి ప్రవేశించి సుషేణుడి ఇంటితోసహా పెళ్ళగించుకొని రాముడి శిబిరందగ్గరకు తెచ్చాడు.

పర్వతం పేరు, మూలిక పేరూ చెప్పి వెంటనే దాన్ని తెప్పించమన్నాడు సుషేణుడు. చికిత్స చేయడానికి తన అంగీకారం తెలిపాడు –

'అనుమానం పులిపాలు' అన్నట్లుగా వుంది పరిస్థితి.

మళ్ళీ హనుమంతుడే నడుంబిగించాడు. పర్వతం దగ్గరకు బయల్దేరాడు.

ఇక్కడినుంచీ రకరకాల నాటకీయ పరిణామాలు జరిగాయి.

హనుమంతుడు తిన్నగా వెళ్ళి పర్వతాన్ని ఎత్తుకొచ్చేస్తే, అందులో చెప్పుకునేందుకు ఏముంటుంది? గోస్వామి తులసీదాసు అద్భుతంగా సృష్టించిన ఓ గొప్ప కథా సంవిధానాన్ని ఇప్పుడు మీరు దర్శించబోతున్నారు...

హనుమంతుడు సంజీవినీ పర్వతం దగ్గరకు బయల్దేరాడనే వార్త రావణుడికి చేరింది. ఆఘమేఘాలమీద కాలనేమి అనే శీఘ్రవేఘుడైన రాక్షసుడి దగ్గరకు వెళ్ళాడు, తక్షణం అతను చెయ్యవలసిన విధిని సూచించాడు. రావణుడు చెప్పిన విషయానికి తలపంకించాడు కాలనేమి. అతనికో సందేహం కల్గింది -

"రావణా! ఆ వచ్చేవాడు హనుమంతుడంటున్నావు. వాడు నీ కళ్ళముందే నీ నగరాన్ని కాల్చి తగలబెట్టాడని కూడా చెప్తున్నావు. నువ్వే వాణ్ణి ఆపలేకపోతే, ఇంక నేను నిరోధించగలననుకొంటున్నావా-?" అని సందేహంగా అడిగాడు.

"నిరోధించి తీరాలి- అంతే!" అన్నాడు రావణుడు. అతని ఆజ్ఞ పాటిస్తే హనుమంతుడితో చావు - పాటించకపోతే రావణుడిచేతిలో చావు. ఆరోజున మారీచుడు తీసుకున్న నిర్ణయమే కాలనేమికూడా తీసుకోవాల్సిన పరిస్థితి అది -

అయినా ఇంకోసారి చెప్పిచూశాడు- "ఎందుకొచ్చిన యుద్ధం ఇదీ - సీతను రాముడికి ఇచ్చేయ రాదా... నువ్వు అతన్ని జయించగలననుకొంటున్నావు గానీ అది సాధ్యం కాదేమోననిపిస్తోంది -" అన్నాడు. రావణుడు కాలనేమివైపు ఉరిమి చూశాడు. కాలనేమి ఇంక మారుమాట్లాడలేదు. రావణుడి ఆజ్ఞ రాక్షసులకు తిరుగులేనిది కదా !

హనుమంతుడు, పర్వతం దగ్గరకు వెళ్ళే మార్గానికి అతనికన్నా ముందే తన రాక్షసమాయతో చేరుకున్నాడు కాలనేమి.

ఒక సరోవరాన్ని, ఉద్యానవనాన్ని కల్పించాడు. తానొక ఋషి రూపంలో తపస్సు నటిస్తూ కుటీరంలో కూర్చున్నాడు.

హనుమంతుడు అక్కడికి వచ్చాడు. మాయప్రభావమో, కాలవశమో ఆయనకు దాహం అన్పించింది. 'కాసిని మంచినీళ్ళు తాగి వెడదాం' అనుకొని కుటీరంలోకి ప్రవేశించాడు.

మారీచుడు పన్నిన మాయకు రాముడంతటివాడే పడిపోయి మాయలేడివెంట పడలేదూ... హనుమంతుడూ అలానే కాలనేమి మాయలో తగులుకోబోతున్నాడు కాబోలు-

ముని వేషంలో వున్న కాలనేమి రామనామస్మరణ చేస్తున్నాడు. హనుమంతుని మోసం చేయాలంటే రామనామ జపంచెయ్యడం తేలికైన మార్గం కదా !

హనుమంతుడు ఈ ఋషి తప్పకుండా 'మనవాడే' అనుకున్నాడు. "మహర్షీ ! కొంచెం దాహం కావాలి!" అనడిగాడు. వాడు తన కమండలంలో కాసిని నీళ్ళిచ్చాడు - ఇవి చాలవు - బాగా దాహంగా వుంది - అన్నాడు హనుమంతుడు.

అప్పుడు కాలనేమి, "పక్కనే సరోవరం వుంది. అందులో స్నానం చేసి, దాహం తీర్చుకొని రా! నీకు జ్ఞానోపదేశం చేస్తాను" అన్నాడు. హనుమంతుడు సరేనని సరోవరంలో దిగాడు.

ఆయనలా సరోవరంలో దిగంగానే ఒక పెద్ద మొసలి వచ్చి హనుమంతుడి పాదాలు పట్టేసింది. చాలాసేపు పెనుగులాడి హనుమంతుడు మొసలిని చంపగలిగాడు.

చనిపోయిన మొసలిలోంచి ఒక గంధర్వపురుషుడు వచ్చి అసలు కథ చెప్పాడు.

"ఆంజనేయా ! కాలనేమీ, నేనూ ఒకప్పుడు గంధర్వులం. దుర్వాస మహర్షిని పరిహసించి, ఆయన శాపానికి గురయి రాక్షసులుగా పుట్టి రావణుడి కొలువు చేరాం. హనుమంతుడి వలన శాపవిమోచనం అవుతుందని దుర్వాసుడు చెప్పాడు. నీ దయ కారణంగా నాకు విమోచనం అయ్యింది - ఆ లోపల వున్న కపటముని 'కాలనేమి' అనే రాక్షసుడే" అని ఉప్పందించి వెళ్ళిపోయాడు.

నిజానికి, రావణుడికి హితవు చెప్పాడు గాని, హనుమంతుని చంపగలిగితే అర్ధరాజ్యం ఇస్తానని వాగ్దానం చేసేసరికి మెత్తబడ్డాడు కాలనేమి. అర్ధరాజ్యం కోసం ఆంజనేయుడిని హత్యచెయ్యక తప్పదు ఇప్పుడు -

హనుమంతుడు స్నానంచేసి వచ్చేలోగా, రావణుడు తనకు అర్ధరాజ్యం ఇచ్చినట్లు, అందులో పుష్పకవిమానం నిలబెట్టి వున్న భాగాన్ని తాను కోరుకున్నట్లు, సముద్రతీరంలో ఉప్పెనలు, వరదలూ రావచ్చు కాబట్టి, దక్షిణ భాగం తనకి కావాలని అడిగినట్లు... ఏవేవో కలలుకంటూ హనుమంతుడి రాకకోసం ఎదురు చూస్తున్నాడు - కాలనేమి !

హనుమంతుడు లోపలికి వచ్చాడు.

కాలనేమి కంగారుగా - "వచ్చావా... రా! జ్ఞాన బోధ చేస్తాను వచ్చికూర్చో" అన్నాడు.

హనుమంతుడు ఆ మునికి నమస్కరించి, "మొదట తమరు గురుదక్షిణ స్వీకరించండి స్వామీ... తర్వాత జ్ఞానబోధ చేద్దురుగానీ అంటూ, తన తోకను వాడి మెడకు చుట్టి గిరగిర తిప్పి నేలకేసికొట్టి ఒక్కదెబ్బతోనే చంపేశాడు. వాడు చచ్చేప్పుడు రామా రామా అంటూ చచ్చాడు. హనుమంతుడికి అదే సంతోషం !

కథ సంజీవనీ పర్వతం దాకా, అక్కణ్ణించి వేగంగా పరిగెత్తింది !

పర్వతాన్ని గుర్తించాడుగానీ, పర్వతంమీద సుషేణుడు చెప్పిన మూలిక ఏదో గుర్తుపట్టడం కష్టం అయ్యింది. హనుమంతుడు ఆ ఓషధిని ప్రత్యక్షం కావలసిందిగా ప్రార్థించాడు. కానీ, ఓషధి ప్రత్యక్షం కాలేదు. చేసేదిలేక పర్వతాన్నే పెకళించి భుజానికెత్తుకొని, తిరుగుప్రయాణం కట్టాడు హనుమంతుడు.

## హనుమంతుని గాయపరచిన భరతుడు

ఒక మహాబలసంపన్నుడు, ఇంకో మహా పర్వతాన్ని తీసుకొని ఆకాశమార్గంవైపు ఎగిరి వెడుతుంటే, ఆ చీకటి సమయంలో కూడా చాలామంది ప్రజలు హనుమంతుని గమనించే వుంటారు కదా...

హిమాలయాలనుంచి హనుమంతుడు అయోధ్య మార్గం గుండా వస్తున్నాడు.

అర్ధరాత్రి సమయం అది -

ఆరుబయట కూర్చుని భరతుడు జపం చేసుకొంటున్నాడు.

ఇదే అయోధ్య ! రాముడెప్పుడూ భరతుడు గురించి గొప్పగా చెప్తుంటాడు కదా... ఒకసారి ఆయనెలా వుంటాడో చూస్తే బావుణ్ణు... అని మనసులో అనుకొంటూ అయోధ్య పట్టణాన్ని చూసుకొంటూ వేగంగా ఎగిరివెడుతున్నాడు.

దశమి చంద్రుడి కాంతిలో కూర్చుని జపం చేసుకుంటున్న భరతుడి మీద ఆకాశంలోంచి హనుమంతుడి నీడ ప్రసరించేసరికి కళ్ళు తెరిచి చూశాడు భరతుడు. ఎదురుగా ఆకాశంలో అనూహ్యమైన దృశ్యం - ఒక మహా శరీరం - ఒక మహా శిఖరం...

రాజు అయినవాడు ఆ దృశ్యం చూడగానే ఏం చెయ్యాలో భరతుడు కూడా అదే చేశాడు - విల్లు తీసుకొని బాణం ఎక్కుపెట్టాడు.

ఆకాశంలో ఎవడో రాక్షసుడు పెద్ద పర్వతాన్ని పెళ్ళగించుకొచ్చి అయోధ్య మీద వెయ్యడానికి సిద్ధంగా వున్నాడని అనుమానించాడు భరతుడు.

అంతే, రివ్వున బాణాన్ని వదిలాడు. అది హనుమంతుడికి బలంగానే తగిలింది.

హనుమంతుడు రామా రామా అని అరచుకొంటూ పర్వతంతో సహా నేలమీదకు పడిపోయాడు.

భరతుడు పరుగున హనుమంతుడు పడిన చోటుకు చేరుకున్నాడు. రాముడి కార్యం మీద వెడ్తున్న వాణ్ణి తాను అకారణంగా నిరోధించానని గ్రహించాడు భరతుడు. ఇప్పుడు తనేం చెయ్యగలడు ?

"మనోవాక్కాయ కర్మలతో నేను రాముణ్ణే నిరంతరం ధ్యానిస్తున్న వాణ్ణయితే, నా మీద రాముడి దయవుంటే, ఈ రామభక్తుడెవరో తక్షణం బతకాలి" - అని ప్రార్థించాడు భరతుడు.

భరతుడు ఆ మాట అనగానే హనుమంతుడు లేచి కూర్చున్నాడు. "స్వామీ! రాముని సోదరులు మీరు. మిమ్మల్ని చూడాలనే నేను కిందికి దిగాను. మీ మనసు తెలుసుకోవాలనే పడిపోయినట్లు పడుకున్నాను" - అన్నాడు నవ్వుతూ. విషయం అంతా వివరించాడు. వెంటనే లక్ష్మణుడి ప్రాణాలు కాపాడటానికి బయల్దేరాలన్నాడు.

హనుమంతుణ్ణి భరతుడు కౌగిలించుకొన్నాడు. తమ ముగ్గురు తల్లులకీ హనుమంతుని పరిచయం చేశాడు. లక్ష్మణుడు ప్రాణాపాయస్థితిలో వున్నాడని తెలిసి ఆ ముగ్గురు తల్లులూ దుఃఖించారు. సుమిత్ర శతృఘ్నుణ్ణి తమ్ముడికి సహాయంగా వెళ్ళమని చెప్పింది.

వాళ్ళని యుద్ధరంగానికి తీసుకువెళ్ళేందుకు తనకు రాముడి అనుమతి లేదనీ, భయపడవలసిందికూడా ఏమీ లేదనీ, త్వరలోనే రాముడు విజయం సాధించి తిరిగి అయోధ్యకు వస్తాడనీ చెప్పి, ఆలస్యం చెయ్యకుండా హనుమంతుడు మళ్ళీ పర్వతాన్ని ఎత్తుకొని ఆకాశంలోకి ఎగిరాడు.

రామరావణ సంగ్రామం విషయాలు ముందే అయోధ్యకు చేరవేయడమే కాకుండా భరతుడి ఔదార్యము, రామభక్తి, ముగ్గురు తల్లుల మధ్య వున్న ఐక్యతల గురించి రాముడికి చెప్పే అవకాశాన్ని కూడా తులసీదాసు తన రామాయణంలో ఇలా హనుమంతునికి కల్గించాడు.

లక్ష్మణుడు మూర్ఛలోంచి లేచిన తర్వాత సుషేణుడి ఇంటినీ, సంజీవినీ పర్వతాన్ని తెల్లవారేలోపు ఎక్కడివక్కడ పెట్టేశాడని కూడా తులసీదాసు వర్ణించాడు.

# యుద్ధం ఆపేసి తలుపులు తాళాలు వేయించిన రావణుడు

హనుమంతుడు మందుల కొండనే తెచ్చాడు. మందును వెదికి లక్ష్మణుణ్ణి స్పృహలోకి తెచ్చారు.

మందు ప్రభావమో - శ్రీరాముడి ప్రభావమో... చనిపోయిన వానరులంతా బతికారు. దురదృష్టం ఏమంటే ఎంతమంది రాక్షసులు చనిపోయారో వానరులకు లెక్కతెలియకుండా వుండాలని రాక్షసుల శవాల్ని రాత్రికి రాత్రే సముద్రంలోకి

విసిరేయించాడు రావణుడు. అందువలన మందుల కొండ మీది మూలికల ప్రభావంతో ఒక్క రాక్షసుడు కూడా తిరిగి ప్రాణాన్ని పొందే అవకాశం లేకుండా పోయింది. వానరులు మాత్రం అందరూ బతికారు.

హనుమంతుడు సంజీవనీ పర్వతాన్ని తిరిగి తీసుకెళ్ళి యథా స్థానంలో వుంచి వచ్చాడు.

తెల్లారిన తర్వాత చూస్తే పోతాడనుకున్న లక్ష్మణుడే కాదు, పోయారనుకున్న వానరవీరులు కూడా ఒక్కగాయం కూడా లేకుండా ఎలా వుండగలిగారో రావణ సేనకు ఏమాత్రం అర్థం కాలేదు. "వీళ్ళేం శత్రువులండీ చచ్చినట్టే చచ్చి బతుకుతుంటారు..." అని ఆశ్చర్యపోసాగారు.

రావణుడు తక్షణం నగర ద్వారాలన్నీ మూయించి తాళాలు వేయించాడు. ఒక్కడూ లోపల్నుంచి బైటకు రాలేదు ఆ మర్నాడు యుద్ధానికి. ఒక రోజు... రెండు రోజులు... మూడు రోజులు... చివరికి ఐదు రోజుల పాటు రాముడి సేన, రావణుడి కోసం ఎదురుచూసింది... ఒక్కడూ యుద్ధానికి రాడాయె... యుద్ధం అలా మధ్యలో నిలిచిపోయింది.

పరిస్థితి చూసి సుగ్రీవుడికి నవ్వొచ్చింది. "ఈ మూర్ఖుడు రావణుడు తను యుద్ధంలో గెలిచాననుకొంటున్నాడా... ఓడాననుకొంటున్నాడా..." అన్నాడు. "యుద్ధం మధ్యలో నిలిపేయడానికి రావణుడి వ్యూహం ఏమై వుంటుందంటావ్?" అనడిగాడు రాముడు. "ప్రాణాలకు భయపడి లోపలే దాక్కున్నాడు-అంతే!" అన్నాడు సుగ్రీవుడు.

వానరులంతా బిగ్గరగా నవ్వారు.

రావణుడంతటి వీరుడు అలా అభాసుపాలయ్యాడు.

# రెండోసారి లంకానగరాన్ని తగులబెట్టారు

తలుపులు వేసుకొని లోపలకూర్చుంటే యుద్ధం ఆగిపోతుందా ? దొంగలొచ్చారని ప్రజలు ఇళ్ళలో దాక్కుని తలుపులు బిగించుకోవడం సహజం. కానీ, రక్షకభటులొచ్చారని దొంగలు ఇళ్ళలో ఎంతకాలం దాక్కోగలుగుతారు ?

"ఏం చేద్దామంటావు జాంబవంతా?" సౌమ్యంగా అడిగాడు రాముడు.

"లంకలో కన్పించిన ప్రతి కొంపనీ తగలబెట్టడం తక్షణం మన కర్తవ్యం" అన్నాడు రౌద్రంగా జాంబవంతుడు.

రాముడు వెంటనే అవుననిగానీ, కాదనిగానీ చెప్పలేదు. మౌనాన్ని అంగీకారంగానే తీసుకున్నాడు సుగ్రీవుడు... వెంటనే వానర సేనను లెక్కకు మించిన సంఖ్యలో వెళ్ళి లంకానగరం మీదకు లంఘించమన్నాడు... లంకలో చెయ్యగలిగినంత అరాచకం చెయ్యడానికి పూర్తి స్వేచ్ఛ నిచ్చేశాడు.

తలుపులూ, తాళాలూ వానరులకా అడ్డంకి... లక్షల కొద్దీ వానర వీరులు నగరంలోకి దూసుకువచ్చారు. కోతి మూక దాడి ఎలా వుంటుందో మొదటిసారిగా తెలిసొచ్చింది రాక్షసులకి.

చీమలపుట్టల్లాగా వానరులు కుప్పలుకుప్పలుగా వచ్చి పడ్తుంటే ఇళ్ళలో పిల్లలూ, స్త్రీలూ, ముసలిముతకా బెంబేలెత్తిపోయి, ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని పరుగులు పెట్టసాగారు.

వానరులు రాక్షసుల కొంపల్లోకి దూరి విధ్వంసం సృష్టించారు. వంటగదుల్లోకి వెళ్ళి తిన్నంత తిని పాడుచేసినంత పాడుచేయసాగారు. బంగారం, వజ్రాలు, వైఢూర్యాలు అనంతమైన సంపద... ఖరీదైన బట్టలు చించిపారేశారు... కుండల్లో వెన్న, బంగారు పాత్రలో మద్యం... ఏదీ ఆ వానరాల ముందు ఆగలేదు...

ప్రతి వానరుడు రెండేసి కాగడాలు పుచ్చుకొన్నాడు... ఇంటిలోపలంతా విధ్వంసాన్ని సృష్టించి, పోతూపోతూ దాన్ని తగలబెట్టిపోయారు...

లక్షలాది వానరులు... వేలాది రాక్షస కొంపల్ని ఇలాగే తగలబెట్టారు. వారి బంగారపు వాకిళ్ళు మంటల్లో మాడిమసి అయిపోసాగాయి. ఇళ్ళను శోభాయమానంగా అలంకరించిన రత్నాలు, ముత్యాలు కాలిబూడిదైపోయాయి.

పెంపుడు చిలకలు, తోటల్లో ప్రేమగా పెంచుకొంటున్న అందమైన నెమళ్ళు స్వేచ్ఛను పొంది గాల్లోకి ఎగిరిపోయాయి... వేలాది ఏనుగులు, గుర్రాలు అగ్నికి ఆహుతైపోయాయి... చూస్తూండగానే లంకానగరం భస్మీపటలం అయిపోసాగింది.

అంగదుడు హనుమంతుడితో ... "లంకానగరానికి నాలుగువైపులావున్న ద్వారాల దగ్గర మనం నలుగురం ఒక్కొక్కళ్ళం ఒక్కొక్కచోట నిలబడదాం... ప్రాణభయంతో పారిపోయివచ్చే ఏ రాక్షసుడూ బతికుండకూడదు– అంతే!" అన్నాడు.

ఆకాశంలోకి లేచిన జ్వాలల ధ్వనులు లంకానగరం అంతా నినదభీషణంగా విన్పించసాగాయి.

నగర ద్వారాలకు తాళాలు వేసినంత మాత్రాన ఒరిగేదేమీలేదని పూర్తిగా అర్థం అయ్యింది రావణుడికి... అవమానం...అవమానం... అంటూ కాలుకాలిన కోతిలా అరవసాగాడు. తన కాలుని కాల్చింది కోతులే కదా !!

# రామ మహిమను రాసిన ఇంద్రజిత్తు చెయ్యి

ఇంద్రజిత్తు, లక్ష్మణుల మధ్య యుద్ధం చాలాసేపు వినోద ప్రదర్శనలా సాగింది. అతను జరుపుతోన్నదంతా మాయాయుద్ధం. లక్ష్మణుడు ఆ మాయని విచ్ఛిన్నం చేయడంతోనే కాలం గడిచిపోతోంది.

ఇంక కోపోద్రిక్తుడైన లక్ష్మణుడు ఇక్కడితో ఈ 'ఆట'ని ఆపాలని నిర్ణయించి ఆ కర్ణాంతం... అంటే వింటినారిని తన చెవుల దాకా లాగి ఒక బాణాన్ని విడిచిపెట్టాడు.

ఆ బాణం మేఘనాథుడి భుజాన్ని తెంచుకొని, తిన్నగా లంకానగరంలో అతని ఇంట్లోకి వెళ్ళి పడింది.

పక్షిలా ఎగిరొచ్చి పడిన ఈ చెయ్యి ఎవరిది ?

మట్టిగొట్టుకొని రక్తంవోడుతోన్న ఆ చేతిని పరిశీలనగా చూసింది సులోచన. రతీదేవికంటే అపురూపవతి ఆమె! వాసుకి కూతురు. రావణాసురుడి కోడలు - దేవతాస్త్రీల కన్నా సుందరమైనదామె !

పరిచారికలు ఆ హస్తాన్ని తెచ్చి చూపిస్తున్నారు. బంగారపు సింహాసనం మీద కూర్చున్న సులోచన దిగివచ్చి, ఆ చేతికున్న బంగారపు ఆభరణాలను గుర్తించింది.

నిస్సందేహంగా ఈ చెయ్యి ఆయనదే ! మేఘనాథుడు మరణించలేదు కదా... అమంగళం అప్రతిహతం అగుగాక !!

"మహావృక్షం అంతటి నా ఇంద్రజిత్తు చెయ్యే యిది... ఆయన ప్రభావం మీకు తెలియదు - పన్నెండేళ్ళు నిద్ర, ఆహారం, స్త్రీ సాంగత్యాన్ని వదిలి జీవించగలవాడే నా భర్తను చంపగలడు... రాముడి పక్షంలో అంతటి మహానుభావుడున్నాడా ?"

సులోచన ఒక్కక్షణం కళ్ళుమూసుకొంది. "నేనే పతివ్రతనైతే ఈ చెయ్యి నా సందేహాల్ని పోగొడ్తుంది-" అని మనసులో సంకల్పించుకొంది -

ఈ చెయ్యి ఎవరిది ?

దానిని ఖండించగలిగిందెవరు ?

ఆమె అలా అనుకోగానే నేలమీద పడివున్న ఆ చెయ్యి ముడుచుకొని వున్న తన వేళ్ళను చాచింది.

ఒక చెలికత్తె పరుగెత్తుకొంటూ వెళ్ళి ఒక సుద్దముక్కని తెచ్చి ఆ చేతికందించింది...

చెయ్యి అమోఘమైన రీతిలో నేలమీద చాలా విశేషాలు రాసింది.

"సులోచనా! నూరు సంవత్సరాలు నిద్రాహారసంగమాలు మానినవాడు కూడా శ్రీరాముని సోదరుడు లక్ష్మణుడితో సమానుడు కాడు" - అని రాసింది ఆ చెయ్యి.

సులోచన సందేహాలన్నీ ఆ వాక్యంతో తీరిపోయాయి....

"నా శిరస్సు రఘురాముడి దగ్గర వుంది. నీకు విశ్వాసం కలగడం కోసం నా చేతిని నీ దగ్గరకు పంపారు..." అని రాసింది ఆ చెయ్యి.

రామలక్ష్మణుల మీద ద్వేషాన్ని పోగొట్టడానికే ప్రయత్నించింది మేఘనాథుడి నిర్జీవమైన జడశరీరం.

అది చదువుతూనే మూర్ఛితురాలయ్యింది సులోచన...

ఏ చెయ్యిని చూసి దేవేంద్రుడు భయపడి పారిపోయాడో, ఆ చెయ్యికి ఇలాంటి దుర్దశ కలిగిందా... అంటూ ఆమె దుఃఖంలో మునిగిపోయింది.

ఆమె మహాపతివ్రత...

ఇంద్రజిత్తు చేతిని ఒక పల్లకిలోకెక్కించి తాను పక్కనే నడుస్తూ రావణాసురుడి ఇంటివైపు బయల్దేరింది.

పల్లకీముందు ఇంద్రజిత్తు బిరుదచిహ్నాలు నడిచాయి.

ఢంకా, నౌపత్తు వాయిద్యాలు మోగుతుంటే, లంకానగర ప్రజలు, స్త్రీ పురుషులంతా పల్లకివెంట నడిచారు.

సులోచన తన మామగారు రావణాసురుణ్ణి కలుసుకొంది.

చెయ్యితెగి ఎగిరివచ్చి తన దగ్గర పడిన వైనం వివరించింది. చెయ్యి చెప్పిన రామలక్ష్మణుల మహిమకూడా రావణుడికి తెలియజేసింది.

లక్ష్మణుడు వేసిన బాణపు దెబ్బకు 'చెయ్యి' నా దగ్గరకూ, 'తల' రాముడు దగ్గరకూ వెళ్ళిపడినాయిట.

"స్వామీ! మేఘనాథుడి తలను తెప్పించండి... నా కోసం తెప్పించండి... మీరు ప్రయత్నిస్తే అది దొరుకుతుంది..." అని వేడుకొంది సులోచన.

రావణుడు దుఃఖం పొంగుకొస్తున్నా తమాయించుకున్నాడు.

"సులోచనా..." అంటూ ఆమెను ఓదారుస్తూ అన్నాడు -

"కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు ఉన్నారు గదా... ఈ యుద్ధాన్ని వాళ్ళే చూసుకొంటారని నేను ఇంతవరకూ అందులో పాల్గోలేదు.

సులోచనా ! నాలుగు ఘడియల సమయం నాకివ్వు...

నా బలపరాక్రమాల్ని యుద్ధంలో చూస్తావింక.." అన్నాడు. సులోచన రావణుడి మాటలు విని నిర్లిప్తంగా నవ్వింది!

'మామగారూ! మన్నించండి'. నరవానరుల పురుషార్థాన్ని కళ్ళారా చూసిన తర్వాతకూడా వాళ్ళకి ఏ ప్రభావమూ లేదని మీరు ఎలా అనగలుగుతున్నారో నాకు అర్థంకావడం లేదు"- అన్నది.

మహారాజా ! మీరు యుద్ధంలో జయిస్తారనే అనుకొంటున్నాను– రామలక్ష్మణులు ఓడిపోవచ్చుగాక... కానీ, అందువలన నాకు కలిగే లాభం ఏముంది...నా నాథుడు పోయిన తర్వాత మీకెంత రాజ్యం వుంటే మాత్రం నాకేమిటీ..!" అంది.

సులోచన బతిమాలే ధోరణిలోంచి నిష్ఠూరంగా మాట్లాడే స్థితిలోకి వచ్చింది. ఆయన్ని బతిమాలడం కూడా పాపం అనే అనుకొంది. "ఈ లంకానగరంలో సుఖాలు ఇంకనుంచి నరకాలతో సమానమే" – అన్నది.

మండోదరి ఆ సమయానికి అక్కడకువచ్చింది –

పుత్రుణ్ణి కోల్పోయిన సంగతి ఆమెకు తెలిసింది. కోడలు ఎదురుగా వచ్చి నిలబడింది – సాక్షాత్తూ మామగారిని నిలదీసింది – తన భర్త శిరస్సు కావాలని అడుగుతోంది – మండోదరి గుండెదిటవు చేసుకొని అంది –

"సులోచనా ! నువ్వు బుద్ధిమంతురాలివి... నువ్వు మాట్లాడినవన్నీ పచ్చినిజాలు ! ఈ విషయాలన్నీ ఏనాడో నారద మహర్షి నాకు చెప్పాడు. ఇలా జరుగుతుందని నాకు ముందే తెలుసు... ప్రాణాలు పోతున్నా సరే ఈ మగాళ్ళు నీతిమార్గాన పోరు... ఏంచేస్తాం... ఇది మనప్రారబ్ధం.

చివరికి, జానకి తన భర్తను చేరుతుంది.

వానర భల్లూకాలు ఈ రాజ్యాన్ని కొల్లగొడతాయి...

నా మాట విను ! ఈయన్ని బతిమాలి ఉపయోగం లేదు – తిన్నగా ఆ రఘురాముడి దగ్గరకు నువ్వే వెళ్ళు. నీ భర్త శిరస్సును ఇప్పించమని నువ్వే అడుగు–" అన్నది అత్తగారు మండోదరి.

"ఇక్కడ ఈ మామగారు చలించకపోయిన, అక్కడ నీకు ఇంకో మామగారున్నారు – విభీషణులు... ఆయన నీకు తప్పకుండా సహకరిస్తారు" – అని సలహా చెప్పింది.

అంగదుడు నాకు కొడుకులాంటివాడు.

ఏకపత్నీవ్రతుడు.

అతను నీకు తప్పకుండా సహకరిస్తాడు.

మహావీరుడు హనుమంతుడు బ్రహ్మచారి. ఆయన సాక్షాత్తూ ఆ శివుడి అవతారం.

శ్రీరాముడు ఎప్పుడూ నీతిమార్గాన్నే అనుసరిస్తాడు.

కోడలా ! రాముడిదగ్గరకు వెళ్ళు... ఆయన్ని బతిమాలుకో... ఆయన్నే శరణుకోరుకో...

అంటూ దుఃఖిస్తూ తన గదిలోకి వెళ్ళిపోయింది మండోదరి. రావణుడు నిశ్చేష్టుడై అలా నిలబడిపోయాడు.

సులోచన క్షణం ఆలశ్యం చేయకుండా, రాముని దగ్గరకు వెళ్ళింది. ఆయన మహిమను కీర్తించింది. తన భర్త చెయ్యి తనకు కల్గించిన జ్ఞానోదయాన్ని వివరించింది. తన అత్త మండోదరి తనకు అనుజ్ఞ ఇచ్చి ఇక్కడకు పంపిన సంగతి చెప్పుకొంది.

రాముడు సులోచనను మనసారా అభినందించాడు. ఆమె దుఃఖాన్ని చూసి చలించిపోయాడు.

"తల్లీ! నీ భర్తను బతికిస్తాను- మీ ఇద్దరూ నూరుకల్పాల దాకా సుఖంగా జీవించండి" - అన్నాడు.

రాముడు ఆ మాట అంటోన్నప్పుడు ఉలిక్కిపడిన వానర వీరుల్లో గుబులు ప్రారంభం అయ్యింది. "కానున్నది కాకమానదు కదా... ఈశ్వరేచ్ఛ ఎలావుంటే అలా జరుగుతుంది." అని సముదాయించుకున్నారు.

1. ఈ ఇంద్రజిత్తు మళ్ళీ బతికితే ఏమౌతుంది ? చచ్చిబతికిన ఉత్సాహంతో ఇంతకు రెట్టింపు యుద్ధం చెయ్యకుండా వుంటాడా...?
2. ఒకవేళ రావణుడు మరణించాడనే అనుకొందాం... ఈ ఇంద్రజిత్తు చేతులు కట్టుకొని విభీషణుడికి సేవలు చేయగలడా ?
3. పూర్వవైరాలన్నీ మరచిపోయి, రాముడితోనూ, విభీషణుడితోనూ అతను స్నేహం పాటించగలడా ?

వానరవీరులందరి సందేహాల్ని పటాపంచలు చేస్తూ సులోచన రాముడికి నమస్కరిస్తూ అంది -

"స్వామీ! మీరు గొప్ప ఔదార్యంతో ఎలాంటి అసాధ్యాన్నయినా సుసాధ్యం చెయ్యగలరనే నమ్మకం నాకుంది. మీరు తలచుకొంటే నా భర్తను పునరుజ్జీవితుణ్ణి చెయ్యగలరు కూడా! మీ కరుణా హృదయం అంతటిదే ! కానీ, నా ప్రాణేశ్వరుడు తిరిగి బతకడం కంటే, మరణించడమే మంచిదని నా మనసు చెప్తోంది..." అన్నది సులోచన.

ఆమె మాటలకు రాముడితో సహా వానరులంతా ఆశ్చర్యపోయారు.

"నా ప్రాణేశ్వరుడు గెలిచిన యుద్ధాలన్నీ సొంత భుజబలంతో గెలిచినవే! 14 భువనాల భోగాలు అనుభవించాడాయన. యుద్ధరంగంలో లక్ష్మణుడనే యాచకుడికి తన ప్రాణాలే ధారపోశాడనుకొంటాను- ఆయన ప్రాణాల్ని నేను బహుమతిగా పుచ్చుకోవడం కులసతిగా ఉచితంకాదు - అది నా భర్తకు ప్రాణాలివ్వవచ్చునేమోగానీ, ఆయనకు ప్రతిష్ఠను ఇవ్వలేదు.

నేను సహగమనం చేయాలనే నిర్ణయించుకొన్నాను. మరణించి... రఘునాథా! మీలో ఐక్యం కావాలని కోరుకొంటున్నాను... నదులు సముద్రంలో కలిసిన తర్వాత తిరిగి వెనక్కి రాలేరు కదా... నేను యింకా అటువంటి మోక్షాన్నే కోరుకొంటున్నాను" అన్నది.

సుగ్రీవుణ్ణి వెంటనే మేఘనాథుడి శిరస్సు తెప్పించమన్నాడు రాముడు !

# ఇంద్రజిత్తు శవం నవ్వింది

ఇదంతా వింటున్న సుగ్రీవుడికి ఈ వింత ఏమిటో బోధపడలేదు- "చచ్చినవాడి చెయ్యి రాయడం ఏమిటీ..."

శ్రీరాముడు ఇంద్రజిత్తు శిరస్సును సులోచనకందించాడు. ఆమె ఏడుస్తూ అతని ముఖంమీది ధూళిని, రక్తపు మరకల్ని తుడిచింది-

సుగ్రీవుడు అనుమానం ఆపుకోలేకపోతున్నాడు -

"ఈమె చెప్పిన మాటలు నిజమేనా?" అనడిగేశాడు... ఉలిక్కిపడ్డారంతా "ఈ శిరస్సు నవ్వితే అతని చెయ్యి రాసిందని నేను నమ్ముతాను" - అన్నాడు.

సుగ్రీవుడు అనాలోచితంగా ఆ మాటలు అనేసరికి రాముడు కోపగించుకున్నాడు.

"సుగ్రీవా! ఏం కుతర్కాలు చేస్తున్నావయ్యా" అన్నాడు మందలింపుగా ! ఒక్కక్షణం ఆగి - "ఇప్పుడు ఈ శిరస్సు నవ్వుతుంది. నవ్వి తీరుతుంది" - అని ప్రకటించాడాయన !

అది సులోచన సత్య ప్రమాణానికి పరీక్షలాంటిది. శిరస్సు నుంచి నవ్వు తెప్పించాలి... అంతే! అవును ! ఇంద్రజిత్తు మరణించినా సరే నవ్వాలి !!

"స్వామీ ఒక్కసారి నవ్వండి ! లేకపోతే తెగిపడిన మీ చెయ్యి రాసిందనే మాట అబద్ధం అవుతుంది" - అని వేడుకొంది సులోచన.

కానీ, ఇంద్రజిత్తు శిరస్సు నవ్వలేదు.

అనేక విధాల బతిమాలుకొంది సులోచన.

కానీ, సిరస్సు నవ్వనే లేదు -

"నా పరువుతీస్తారా ? మీ పరువు నిలుపుకోరా ? నా పాతివ్రత్యం నిజం అయితే మీరు తప్పకుండా నవ్వుతారు" - అన్నది. అయినా శవం నవ్వలేదు.

అప్పుడు సులోచన అన్నది -

"స్వామీ ! మీ తండ్రి మృత్యువుతోసహా ముల్లోకాల్నీ జయించాడు కదా... అయినా మీకీగతి పట్టనే పట్టింది... ఇప్పుడాయన్ని ఇక్కడకు పిలిపించి మీకు సహాయపడమని కోరతాను... ఆయన పరమేశ్వరుడితో పోరాడి మీచేత నవ్వించగలడు..." అనడిగింది...

సులోచన అలా అడుగుతుంటే ఇంద్రజిత్తు శిరస్సు పెద్దగా నవ్వింది. రెండోసారి మళ్ళీ నవ్వింది. ముచ్చటగా మూడుసార్లు నవ్వింది.

తన పాతివ్రత్య మహిమను చాటుకున్న సులోచన ఇంక శ్రీరాముని సెలవు అడిగింది ! "కోసలాధీశ... నా కోసం ఈ ఒక్కరోజుకీ ఈ యుద్ధాన్ని చాలించండి" - అని కోరింది.

మేఘనాథుడి శిరస్సు తన ఒడిలో పెట్టుకొని ఆమె సహగమనం చేసింది. నదీసాగర సంగమం దగ్గర ఆమె సహగమనం ఆచరించింది. మండోదరి, రావణులతో సహా సపరివారంగా అంతా అక్కడే వున్నారప్పుడు.

# యుద్ధంలో దూర శ్రవ్య యంత్రాల వినియోగం

లంకానగరం పది యోజనాల విస్తీర్ణం, ఇరవై యోజనాల పొడవు కల్గి వుంది. కొన్ని రామాయణాల్లో నూరుయోజనాల పొడవు, ముప్పది యోజనాల వెడల్పు అని వర్ణన కన్పిస్తుంది.

ఒక యోజనం అంటే ఐదు మైళ్ళు.

ఈ లెక్కన 50 మైళ్ళు పొడవూ, 100 మైళ్ళు వెడల్పూ వున్న నగరం లంకానగరం.

ఇంతే వుండి వుంటుందని అనుకున్నా లంకానగరం తక్కువదేమీ కాదు. 'నగరం' అంటే, రాజ్యమేనని ఇక్కడ మనం అర్థం చేసుకోవాలి.

ఈ నగరానికి నాలుగు వైపులా నాలుగు ద్వారాలున్నాయి.

వానరసేన ఈ నాలుగు ద్వారాల మీదా ఒకేసారి ముట్టడించింది.

ఉత్తర ద్వారం వైపు రామలక్ష్మణులు రావణాసురుడితో తలపడ్తున్నారు. పశ్చిమ ద్వారం వైపు హనుమంతుడు ఇంద్రజిత్తుతో యుద్ధం చేస్తున్నాడు.

యుద్ధం మొదలైన తర్వాత ఒకరోజున సన్నివేశం ఇది !

ఆ రోజున హనుమంతుడు, ఇంద్రజిత్తు ఒకరితో ఒకరు భీకరంగా పోరాడుతున్నారు. ఇంద్రజిత్తు ధాటికి తట్టుకోలేక వానరసేనలు విలవిలలాడ్తున్నాయి.

హనుమంతుడు చేస్తోన్న యుద్ధ ధ్వనులు పడమటి ద్వారం నుంచి ఉత్తర ద్వారంలో వున్న రాముడికి వినపడుతున్నాయట !

**"రాఘవశ్యాపి విపులం తద్రాక్షస వనౌకసామ్".** హనుమ, ఇంద్రజిత్తుల భయంకర యుద్ధం చాలా విపులంగా విన్నాడట .....

**"శృత్వా సంగ్రామ నిర్ఘోషం జాంబవంత ఉవాచహ".** ఆ సంగ్రామ ఘోషని వినీ వినంగానే జాంబవంతుణ్ణి పిలిచి చెప్పాడు -

**"సౌమ్య న్యూనం హనుమంతాకృతం కర్మ సుదుష్కరమ్"**

ఓ సౌమ్యుడా ! హనుమంతుడు చేస్తున్న యుద్ధంలో శస్త్రాస్త్రాల ధ్వని భయంకరంగానూ, విశేషంగా కూడా వినిపిస్తోంది. హనుమంతుడేదో సుదుష్కరమైన రీతిలో యుద్ధం చేస్తున్నట్లు కన్పిస్తోంది.....

**శ్రూయతేచ యథా భీమః సుమహాన్ అయుధ స్వనః**
**తత్‌గచ్ఛా కురు సాహాయ్యాం స్వబలే నాభి సంవృతః**

"అతను ప్రయోగిస్తున్న ఆయుధాలు చాలా వింత ధ్వనులు చేస్తున్నాయి. అతనికేమైనా సహాయం అవసరం అవుతుందేమో ..... జాంబవంతా ! నీ భల్లూక సైన్యాన్ని వెంటబెట్టుకొని పశ్చిమ ద్వారం వైపు వెళ్ళు ....."

హనుమంతుడికి సహాయంగా అదనపు బలగాలను అక్కడికి శీఘ్రముగా పంపించాడన్నమాట !

ఉత్తర ద్వారం దగ్గర శ్రీరాముడు, పశ్చిమ ద్వారం దగ్గర హనుమంతుడూ సేనలకు నాయకత్వం వహిస్తుంటే, మధ్యలో వాయువ్య మూలన జాంబవంతుడు తన సేనతో సిద్ధంగా వున్నాడు. ఎటువైపు తన అవసరం వుంటే అటు వెళ్ళడానికి రాముడు అతనికి కబురు పెట్టి పశ్చిమద్వారం వైపు పంపాడు.

జాంబవంతుడు రాముడికి 50 మైళ్ళ దూరంలోనూ, హనుమంతుడికి 12 మైళ్ళ దూరంలోనూ వున్నాడు. ఉత్తరం ద్వారానికి పశ్చిమ ద్వారం దగ్గరి ఆయుధ ఘోష వినిపించడానికి 60 మైళ్ళ దూరం పైనే వుంటుంది. రాముడు ఎలా వినగలిగాడు...? ధ్వనులను వినే దూర శ్రవ్య యంత్రాల వంటివి ఈ యుద్ధంలో శ్రీరాముడు వినియోగించి వుండాలి ..... అని కొందరు పరిశోధకులంటారు. అవి ఈనాటి టెలిఫోన్లు, సెల్‌ఫోన్ల వంటివి కాకపోవచ్చు. ఈ ఆలోచనకు మాతృకలు అయివుండొచ్చు.

సీతా స్వయంవరంలో పాల్గొన్నప్పుడు, మధ్యలో రావణుడికి ఇలానే ఒక సందేశం విన్పిస్తుంది - తన భార్యని ఎవడో అపహరించుకు పోతున్నాడని ..... అంతే, వెంటనే స్వయంవరాన్ని వదలి వెళ్ళిపోయినట్లు తులసీదాసు వర్ణించాడు. సెల్‌ఫోన్, మెసేజ్ లాంటిదే ఇది ! 'ఆకాశవాణి వినిపించింది' అంటుంటారు దీన్నే !

దూరధ్వని గ్రాహక సాధనాల వంటివి రామ రావణ సంగ్రామంలో వినియోగించ బడ్డాయి - సముద్రంపైన వంతెన కట్టడం, విమానాలను వినియోగించడం వంటివి చేయగలిగిన వారికి ఇది అసాధ్యం కాకపోవచ్చని పండితుల ఊహ. వైర్‌లెస్ రేడియోలు, హామ్ రేడియోల వంటివేవో వాళ్ళకి తెలుసు. వాటి సహాయంతోనే, శ్రీరాముడు నాలుగు ద్వారాల వైపు మోహరించి, ఎప్పటికప్పుడు యుద్ధ సమాచారాన్ని తెలుసుకొంటూ, అందుకు అనుగుణంగా నిర్ణయాలు తీసుకొంటూ యుద్ధాన్ని సమర్థవంతంగా నడిపాడు.

ఈ విషయంలో సంపదలున్నా, ఆధునిక శాస్త్ర పరిజ్ఞానంలో రాక్షసులు వెనకబడి వున్నారని అర్థం అవుతోంది. విశ్వామిత్రుడు చిన్ననాడే అడవులకు తన వెంట తీసుకు వెళ్ళి నేర్పించింది ఇలాంటి యుద్ధ సామగ్రిని తయారుచేయడం కూడా కావచ్చు .....

వానరులు అనాగరకులు కాదు - గొప్ప నాగరక సంపన్నులే ! వారికి తెలియని అనేక విషయాల్ని వారిచేతనే వినియోగింప చేయగలిగాడు శ్రీరాముడు. రావణాసురుడికి అదే ఆశ్చర్యం ..... ఈ వానరులు ఇంత గొప్పగా ఎలా యుద్ధం చేయగలుగుతున్నారని !!

# రామలక్ష్మణుల అదృశ్యం

యుద్ధం ముగింపుకు చేరుకొంది.

రావణుడు ఒక్కడే మిగిలాడు.

తెల్లవారుఝామయ్యింది. రావణుడు ఎప్పటిలానే సంధ్యావందనం చేసుకొంటూ నిశ్చింతగా వున్నాడు.

ఇరవై చేతులతో ఒకేసారి శివుణ్ణి ధ్యానిస్తున్నాడు.

రావణుడు మహాశివపూజా దురంధరుడు. వెయ్యి రేకులున్న పద్మాలు ఒక కోటి తీసుకొచ్చి శివుని రోజూ అర్చిస్తాడు. కోటి పుష్పాలతో కోటి లింగాల్ని పూజిస్తాడు.

తాను స్వయంగా రచించిన మహాన్యాసంతో శివుణ్ణి అర్చించి ఆయన్ని ప్రసన్నం చేసుకొంటాడు.

ఆరోజు మహాన్యాసం జపిస్తూ ఆకర్షణ మంత్రాన్ని కూడా జపించసాగాడు.

రావణుడు ఇలా ఘోరంగా శివార్చన చేస్తుంటే, పాతాళంలో వుండిపోయిన అతని మరో కొడుకు "అహిరావణుడి"కి ఏదో సంకేతం అందినట్లయ్యింది. రావణుడి మనసు ఏదో వ్యాకులపడ్తోందని అతని మనసుకన్పించింది.

మనసు ఆపుకోలేకపోయాడు.

తండ్రికి ఏదో ఆపద వాటిల్లుతోందని అతని అంతరాత్మ చెప్తోంది... ఎందుకీ రోజున ఎన్నడూ లేనిది ఇలా అన్పిస్తోందీ...???

వుండబట్టలేక, పాతాళంలోంచి శివమందిరంలోకి తక్షణం వచ్చి చేరుకున్నాడు అహిరావణుడు.

రావణుడి విషణ్ణవదనం చూసేసరికి అహిరావణుడికి కడుపు తరుక్కుపోయింది. లంకానగరం కళావిహీనంగా వుంది. శోభస్కర చిహ్నాలేవీ ఎక్కడా కన్పించడం లేదు... రాజ్యం అంతా మృత్యుదేవత తాండవిస్తున్నట్లనిపించింది అహిరావణుడికి.

తండ్రిని ఆ స్థితిలో చూస్తూనే బావురుమన్నాడు కొడుకు. ఆకర్షణ మంత్రం పఠించి తన కొడుకును తన దగ్గరకు తక్షణం రప్పించుకోగల్గిన రావణుడు అహిరావణుణ్ణి చూస్తూనే అతని రెండు చేతులూ పుచ్చుకొని దుఃఖిస్తూ నేలమీద కూలబడిపోయాడు... "నువ్వే కాపాడాలిరా అబ్బాయీ..." అన్నాడు వేడుకొంటూ !

తండ్రి దుఃఖాక్రాంతుడు కావడాన్ని కలలోకూడా ఎన్నడూ ఊహించని అహిరావణుడికి కూడా ఆ క్షణాన దుఃఖం తన్నుకురాసాగింది.

ఖరదూషణుల మరణం దగ్గర్నించి, కుంభకర్ణ, ఇంద్రజిత్తుల మరణం వరకూ జరిగిందంతా చెప్పుకొచ్చాడు రావణుడు. వింటున్నాడు అహిరావణుడు.

ఈ కథనంతా శివుడికి పార్వతి చెప్తున్నట్లుగా వర్ణిస్తాడు తులసీదాసు. పార్వతి వింటోంది. వింటూ...

"ఈ అహిరావణుడెవరూ ? అకస్మాత్తుగా ఇతన్ని కథలోకి తీసుకొచ్చారేమిటీ?"- అనడిగింది !

అప్పుడు శివుడు అహిరావణుడి గురించి కొన్ని రహస్యాలు చెప్పాడు.

1. రావణుడికి ఇంద్రజిత్తు ఒక్కడే కాదు - చాలామంది కొడుకులున్నారు. వారిలో అహిరావణుడొకడు.
2. తండ్రికి ఇరవై చేతులు, పది తలకాయలూ వుంటే, అహిరావణుడు మండోదరి గర్భంలోంచి ఇరవైపాదాలతో పుట్టాడు.
3. వీణ్ణి ఇంట్లో వుంచడం మంచిది కాదని 'శ్వానానుడు'అనే నమ్మకమైన సేవకుణ్ణి పిలిచి వీణ్ణి గొయ్యితీసి పాతిపెట్టి రమ్మని పంపించాడు రావణుడు.
4. సేవకుడు వాణ్ణి నైరుతీమూల గొయ్యితీసి చెప్పినట్టే పాతిపెట్టి వచ్చేశాడు.
5. గోతిలో శిశువు అలానే సొరంగమార్గం తవ్వుకుంటూ తిన్నగా సముద్రతీరానికి చేరి నీళ్ళలోంచి బయటకు వచ్చాడు !
6. రాహువు తల్లి ఆ పిల్లవాణ్ణి చూసి ఇంటికి తీసుకెళ్ళి పెంచుకోవడం మొదలు పెట్టింది.
7. శుక్రాచార్యుడు ఇరవైపాదాల ఈ శిశువు రావణాసురుడి కొడుకుగా గుర్తించి, వాడికి అహిరావణుడని పేరుపెట్టి రహస్యంగా పెంచమని చెప్పాడు.
8. శుక్రాచార్యుడు చెప్తుంటే తన జన్మరహస్యం విన్న అహిరావణుడు అవమానం భరించలేక సముద్రంలోకి దూరి వితలలోకానికి చేరాడు.
9. వితలలోకంలో నాగులపట్టణం అది. దానిపేరు భోగవతి. 70 యోజనాల వైశాల్యం వున్న పట్టణం. దర్వీశరుడు దాని రాజు. వాసుకికి ఇతను బావమరిది.
10. భోగవతి పట్టణంలో ఒకరోజున పురాణ కాలక్షేపం జరుగుతుంటే చూద్దామని వెళ్ళాడు అహిరావణుడు. అక్కడ తపస్సు విధానం, దాని మహోత్మ్యం చెప్తుంటే వింటూ కూర్చున్నాడు. అతనికి తపస్సు చేయాలని కోరిక కల్గింది. అనేక సంవత్సరాలు తపోదీక్షలో కూర్చున్నాడు.
11. ఒకరోజు "కామదాదేవి" అతన్ని కరుణించి ప్రత్యక్షమయ్యింది. చేతులు ముకుళించి అహిరావణుడు ప్రార్థించాడు.
    రాక్షసులకన్నా, దేవతలందరికన్నా అతను అధికుడు కావాలి - "నన్ను జయించేవాళ్ళే వుండకూదు" - అని వరం కోరాడు అహిరావణుడు.
12. కామదాదేవి నవ్వింది. "నీకు వరం ఇవ్వడానికి నువ్వు యోగ్యుడవే ! అన్నీ నువ్వడిగినట్లే ఇస్తాను. కానీ, వానరులు మాత్రం నాకు లొంగరు. అందుకని వానరుల జోలికి నువ్వు వెళ్ళకుండా వుంటే, నిజంగా నువ్వు అమరుడివి"- అన్నది దేవి. "మా నాన్న

నన్ను బతికుండగానే పాతిపెట్టించాడు. ఎప్పటికైనా సరే, ఆయన నా చేతులు పుచ్చుకొని బ్రతిమాలుకునే వరం ప్రసాదించు తల్లీ"- అని ఇంకో కోరిక కోరాడు. కామదాదేవి అన్ని వరాలూ అతనికి ఇచ్చేసింది. ఒక్క వానరుడితో ఓటమి తప్ప! త్రేతాయుగాంతంలో రావణుడు నీ చేతులు పట్టుకొని బతిమాలుకుంటాడు కూడా... అన్నది దేవి.

రెండు చేతులూ పుచ్చుకొని తన తండ్రి రావణుడు తనని కాపాడమంటూ ఘోరుమనడం... దేవి ఆ రోజున ఇచ్చిన వరం కారణంగానేనని భావించాడు అహిరావణుడు.

త్రేతాయుగం ముగియబోతోందన్నమాట - తన తండ్రి చేసిన అనేక తప్పులు అన్నీ ఒకేసారి కట్టకట్టుకొని ఇప్పుడు పనిచేస్తున్నాయని అతనికి అర్థం అయ్యింది. విషయాన్ని ఇక్కడ దాకా రానివ్వకుండా వుంటే బావుండునని అనిపించింది అతనిక్కూడా! కానీ, తండ్రి తప్పులు ఎన్నడం పద్ధతికాదని పైకి అనకుండా ఆగిపోయాడు. ఏది ఏమైనా తన తండ్రికి రక్షణగా నిలబడడం ఇప్పుడతని కర్తవ్యం.

అప్పటికప్పుడు తన పథకం గురించి తండ్రికి వివరించాడు అహిరావణుడు. "తెల్లవారేసరికి రామలక్ష్మణుల్ని ఎత్తుకుపోయి, పాతాళలోకానికి తీసుకెళ్ళి దేవికి బలి ఇచ్చుకొంటాను- సరేనా.." అన్నాడు. రావణుడు కృతజ్ఞతగా చూశాడతని వంక!

అహిరావణుడు తన మాయాబలంతో చిమ్మచీకటిని ఆవహింపచేశాడు. కళ్ళుపొడుచుకున్నా కానరాని కటికచీకటి. ఏదో రాక్షసమాయ ఆవహించబోతోందని వానరవీరులు తక్షణం భద్రతా ఏర్పాట్లు ముమ్మరం చేశారు.

హనుమంతుడు రామలక్ష్మణులు పడుకొని వున్నచోట చుట్టూ గుండ్రంగా తోకని పెంచుకొంటూ పెద్ద కోటలా కట్టాడు. ఆ కోట సింహద్వారానికి అడ్డంగా అక్కడే తాను కూర్చున్నాడు.

అదృశ్యరూపంలో వున్న అహిరావణుడికి హనుమంతుడి అడ్డు తొలగించి రామలక్ష్మణుల్ని ఎత్తుకుపోయే ఉపాయం ఏమిటో అర్థంకాలేదు. కాసేపు ఆలోచించాడు.. ఆలోచించి, విభీషణుడి రూపంలోకి మారి, హనుమంతుడి దగ్గరకు వెళ్ళి లోపల రాములవారితో అతిముఖ్యమైన విషయం మాట్లాడాలన్నాడు.

"మన విభీషణుడే కదా..." అనుకొంటూ లోపలికి పోనిచ్చాడు హనుమంతుడు ఆ 'మాయా విభీషణుణ్ణి'.

హనుమంతుడు కట్టిన తోక కోటలోపల నలుడు, నీలుడు, సుగ్రీవుడు, జాంబవంతుడు, అంగదుడు, సుషేణుడు వీళ్ళంతా ఒకేచోట రామలక్ష్మణులతో కలిసి పడుకొని నిద్రపోతున్నారు.

రాముడు ఒకపక్కకు తిరిగి లక్ష్మణుడి గుండెలమీద చెయ్యివేసి పడుకున్నాడు.



లోపలకు ప్రవేశించగల్గిన అహిరావణుడు మోహన మంత్రాన్ని జపించాడు. చుట్టూ మేలుకొని కావలికాస్తున్న వానరులంతా మంత్ర ప్రభావాన మోహితులయ్యారు.

అహిరావణుడు నెమ్మదిగా రామలక్ష్మణుల్ని పట్టుకొని అక్కడ నుంచి అదృశ్యమైపోయాడు. రెప్పపాటుకాలంలో రామలక్ష్మణులిద్దరూ అహిరావణుడి స్థావరంలో పాతాళంలో వున్నారు.

సరిగ్గా అదే సమయంలో రావణుడికి సంకేతంగా ఒక మెరుపుని కన్పింపచేశాడు. రావణుడు అదిచూసి సంతోషించాడు.

కొంతసేపటికి రామలక్ష్మణులు అదృశ్యమైపోయారనే సంగతి వానరులకి తెలిసింది. పెద్ద హాహాకారమే పుట్టింది అక్కడ.... సుగ్రీవుడి దుఃఖానికి అంతం లేదప్పుడు.

హనుమంతుడు తిన్నగా విభీషణుణ్ణి పట్టుకొని, "నువ్వే వచ్చావు లోపలికి వెళ్ళావు - నాకు తెలుసు. ఏం జరిగిందో చెప్పు" - అంటూ నిలేశాడు.

అప్పుడు విభీషణుడు బాగా ఆలోచించాడు. రాక్షస వీరుల్లో ఒక శేషం ఇంకా వుందన్న సంగతి అప్పుడు గుర్తుకొచ్చింది. రాక్షసుల్లో అచ్చం తనరూపాన్నే ధరించగలవాడు అహిరావణుడే ! ఇది వాడిపనే అయి వుంటుంది - అన్నాడు.

"వాడెక్కడ వుంటాడు ?" అనడిగాడు కోపంగా హనుమంతుడు.

"పాతాళంలో"! విభీషణుడు సమాధానం చెప్పాడు.

"హనుమంతుడా! ఆలస్యం చెయ్యకు తెల్లవారేసరికి పాతాళానికి వెళ్ళి రామలక్ష్మణుల్ని వెదికి తీసుకురావడం అవసరం. రామలక్ష్మణులు లేరని తెలిస్తే రాక్షస విజృంభణాన్ని ఆపడం కష్టం" - అన్నాడు జాంబవంతుడు.

హనుమంతుడు పాతాళలోకానికి బయల్దేరాడు.

కథ ఇక్కడి నుంచి ఇంకా అనేక మలుపులు తిరగడం మొదలౌతోంది.

# అహిరావణుడి వధ

పాతాళానికి ప్రయాణంకట్టిన హనుమంతుడు వేగంగా ప్రయాణిస్తూ ఒక చెట్టుకింద ఒక్కక్షణంపాటు ఆగాడు.

చెట్టుమీద రెండు పక్షులు మాట్లాడుకొంటున్నాయి..

"నరమాంసం తిని చాలారోజులయ్యింది" అంటోంది ఒక పక్షి.

"ఇవ్వాళ తిందాంలే!" అన్నది రెండో పక్షి !

"ఏమిటో విశేషం"

"అహిరావణుడు ఇద్దరు మనుషుల్ని భూలోకం నుంచి తీసుకొచ్చాడు. వాళ్ళని దేవికి బలి ఇస్తాడట.... మనం తిన్నంత మనుష్య మాంసం మనకి ఈ పూట–" సంతోషంగా అన్నది మగ పక్షి !

"పాపం ఎవరో ఆ మనుషులు...?"

"ఎవరో రామలక్ష్మణులట... ఎవరైతే మనకేంటి... నీకు కావలసిన నరమాంసం తెచ్చి ఇస్తాను– సరేనా...?" అన్నది మగపక్షి.

విన్నాడు హనుమంతుడు.

"ఆలస్యం చేయకూడదు –

మనం సరైన దారికే వచ్చాం ..." అనుకొన్నాడు.

అక్కడే ఎక్కడో రామలక్ష్మణులు బందీలై వుంటారని ఊహించాడు. వెదుకుతూ అహిరావణుని నగరంలోకి ప్రవేశించాడు.

లంకానగరానికన్నా ఎక్కువ భద్రతా ఏర్పాట్లున్నాయి ఇక్కడ. చుట్టూ మహాప్రాకారం, మధ్యలో నగరం వుంది. ప్రాకారానికి ఒక్కటే ద్వారం.

దానికి మకరధ్వజుడనే ఒక వానరుడు కాపలాకాస్తున్నాడు.

ద్వారం దగ్గరకు చేరుకున్నాడు హనుమంతుడు. ఆపాడు మకరధ్వజుడు.

ఇద్దరూ వానరులే !

ఇద్దరూ ఒకే రూపులో వున్నారు.

"ఎవర్నువ్వు ?"

"ఎవర్నువ్వు??"

ఇద్దరూ ఒకే ప్రశ్నని ఒకేసారి ఒకరికొకరు వేసుకున్నారు. ముందు ఎవరు సమాధానం చెప్పాలి ?

"ఏం భయంలేకుండా లోపలకు దూసుకువస్తున్నావు. నేనెవరో తెలుసా? వాయు పుత్రుడికి పుత్రుణ్ణి" అన్నాడు మకరధ్వజుడు.

హనుమంతుడికి కోపం రెట్టింపయ్యింది.

"ఒరేయ్ మూర్ఖా! వాయుపుత్రుణ్ణి నేనురా... నాకు కొడుకువెట్లా పుట్టావు నువ్వు... అస్థలిత బ్రహ్మచారినిరా నేను" - అన్నాడు హనుమంతుడు. "సిగ్గులేదా ఇలా ఎవరినో తండ్రిగా చెప్పుకోవడానికి?"అని మందలించాడు.

మకరధ్వజుడు చలించలేదు. "తండ్రీ! నీకు నమస్కారం. ఒకసారి సముద్రమధ్యంలో మీరు ప్రయాసపడ్తున్నప్పుడు మీ చెమట బిందువుల్ని ఒక చేప తాగింది. నేను ఆ చేపకడుపులోంచి పుట్టానట! ఇది నా జననం. ఇందులో రహస్యంగా దాచుకునేదేమీ లేదు" - అన్నాడు.

హనుమంతుడికి మకరధ్వజుణ్ణి తన కొడుకుగా ఒప్పుకోక తప్పలేదు. అవసరార్థం ఇప్పుడు ఒప్పుకోవడం కూడా తప్పనిసరే కదా...

తను రామలక్ష్మణుల్ని వెదుకుతూ వచ్చిన సంగతి చెప్పాడు హనుమంతుడు.

"రామలక్ష్మణుల్ని అహిరావణుడు లోపలకు తెచ్చిన మాట వాస్తవం. దేవీ హోమానికి అన్నీ సిద్ధం చేయిస్తున్న మాటకూడా వాస్తవం. రామలక్ష్మణుల్ని ఈపూటే బలి ఇస్తారనేది అంతకన్నా వాస్తవం... అయినా, నేను నా యజమాని అహిరావణుడికి ఆశ్రితుణ్ణి. ఆయన దయవలనే ఇంతవాణ్ణయ్యాను. కాబట్టి మిమ్మల్ని లోపలికి పోనిచ్చి నేను యజమానికి ద్రోహం చేసే సమస్యే లేదు" - అని స్పష్టంగా చెప్పేశాడు మకరధ్వజుడు.

తన కొడుకు స్వామిభక్తికి సంతోషించక తప్పలేదు హనుమంతుడికి ! కానీ, పని నెరవేరడం ఎట్లా ?

ఒక్కటే ఒక ఉపాయం. సాక్షాత్తు తన కొడుకుని పట్టుకొని రెండు పిడిగుద్దులు ఇచ్చాడు. మకరధ్వజుడు తండ్రికి ఏమీ తీసిపోడు ! అతనూ రెండు పిడిగుద్దులు తండ్రికి తగిలించాడు. ఇద్దరూ 'అబ్బా' అనుకున్నారు. ఈ పెనుగులాట ఇలా చాలాసేపు జరిగింది.

చివరికి హనుమంతుడిదే పైచేయి అయ్యింది. మకరధ్వజుణ్ణి సూక్ష్మరూపంలోకి మార్చి తన తోకకు కట్టుకొన్నాడు. తానుకూడా సూక్ష్మరూపం వహించాడు. వెదుక్కొంటూ దేవీ మంటపానికి వెళ్ళాడు. నెత్తురునిండిన కుండలు... లెక్కలేనన్ని కన్పించాయి అక్కడ... రకరకాల వంటలు తయారుచేసి చేరుస్తున్నారు. పూలు తెచ్చేవాళ్ళు పూలు తెస్తున్నారు. పళ్ళు తెచ్చేవాళ్ళు పళ్ళు తెస్తున్నారు.

సూక్ష్మరూపంలోంచి మరింత అణురూపంలోకి మారాడు హనుమంతుడు. మారి ఒక పూలదండలో దూరాడు.

పువ్వుకన్నా తేలికైనంత బరువులోకి మారడం వలన, పూలదండను తెస్తున్న వాడికి బరువులో తేడా తెలియలేదు. అందువలన ఎలాంటి అనుమానమూ రాలేదు.

అహిరావణుడు పూలమాలను అమ్మవారికి సమర్పించాడు. అమ్మవారి విగ్రహం దగ్గర హనుమంతుడు నోరుతెరిచి నిలబడ్డాడు.

అహిరావణుడు అమ్మవారికి సమర్పిస్తున్న ఆహారపదార్థాలన్నీ నోరుతెరుచుకొని నుంచున్న హనుమంతుడికి ఆహారం అయ్యాయి.

అమ్మవారే సాక్షాత్తూ నోరు తెరిచిందని రాక్షసులు భావించుకోసాగారు.

ఏ పదార్థాలూ మిగలకుండా కిలకిలమంటూ సంతోషంగా భుజించసాగాడు హనుమంతుడు.

అమ్మవారే స్వయంగా భుజించిందనీ, దీక్ష విజయవంతం అయ్యిందనీ రాక్షసులు కూడా సంతోషించారు.

ఇంక రామలక్ష్మణుల్ని తీసుకొచ్చారు.

మొదట రాముని కాళ్ళూ, చేతులూ కట్టి విగ్రహం దగ్గర నిలబెట్టారు. చుట్టూ విచ్చుకత్తులు పట్టుకొని రాక్షసులు చుట్టుముట్టి వున్నారు. కొందరు కత్తులు పట్టుకున్నారు. కొందరు గదలు పట్టుకున్నారు. కొందరు ధనుర్బాణాలు, కొందరు త్రిశూలాలూ ధరించి నిలబడ్డారు.

ఆ రాక్షస రూపాల్ని మామూలు మనుషులు చూస్తే పై ప్రాణాలు పైకే పోతాయి.

రాజనీతిని అనుసరించి మూడు ఘడియలు అవకాశం ఇచ్చాడు అహిరావణుడు.

"ఓయీ రాముడా ! నీకు ఇష్టమైన వాళ్ళని తలచుకో మీ ఇద్దరి అన్నదమ్ముల ప్రాణాలూ ఇక్కడితో సరి" – అన్నాడు.

రాముడు కళ్ళుతెరచి చూశాడు. లోకం అంతా నా నామస్మరణ చేస్తోంది... నేనెవరి నామస్మరణ చేయాలి... అనుకొంటూ దేవీనామస్మరణ చేస్తూ కళ్ళుతెరిచాడు! ఎదురుగా అమ్మవారి విగ్రహం. దాని దగ్గర అణురూపంలో నోరుతెరిచి నుంచున్న హనుమంతుడు.

గుర్తించాడు రాముడు. లక్ష్మణుడివైపు చూశాడు. లక్ష్మణుడు కూడా విగ్రహం వంక చూశాడు. హనుమంతుడు ఆ ఇద్దరికీ కన్పించాడు. సంతోషించాడు లక్ష్మణుడు.

చుట్టూ రాక్షసులు...

"ఏం తలచుకున్నావా.... మూడో ఘడియ అయిపోవస్తోందీ"– అంటూ గద్దించారు.

వాళ్ళ ప్రశ్నలకు రాముడికి నవ్వొచ్చింది.

"ఓరి నిశాచరులారా ! యముడికి ఆహారంగా పడివున్న మిమ్మల్ని చూస్తే జాలేస్తోంది" – అన్నాడు నవ్వుతూ.

"ఆయ్" అంటూ అరిచారు రాక్షసులు.

రాక్షసులు అదిరిపడేలా సింహగర్జనచేశాడు హనుమంతుడు.

"చూశారా! దేవికి కోపం వచ్చింది. మీదేవి ఇప్పుడు మిమ్మల్ని భక్షించడానికి సిద్ధంగా వుంది... మీకు ఇష్టమైన వ్యక్తుల్ని స్మరించుకొని చావుకు సిద్ధంగా వుండండీ-" అన్నాడు రాముడు.

హనుమంతుడు అణురూపంలోనే రాక్షసుల్ని హింసించాడు...

"నిజమే ! అమ్మవారికి ఆగ్రహం కల్గింది" - అనుకొన్నారు రాక్షసులు.

మన అహిరావణుడు దేవదేవుణ్ణే బలి ఇవ్వడానికి తెచ్చాడన్న సంగతి వాళ్ళకు అర్థం అయ్యింది. "పొరబాటయ్యింది తల్లి... కాపాడు తల్లీ" - అంటూ మొక్కుకున్నారు రాక్షసులు.




హనుమంతుడు తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. రామలక్ష్మణుల్ని బంధన విముక్తుల్ని చేసి భుజానికెత్తుకున్నాడు. తన తోకను అనంతంగా పెంచి కోట చుట్టూ ద్వారాలన్నీ మూసేశాడు. లోపలివాడు ఎవడూ బైటకు పారిపోకుండా అలా కట్టడిచేసి కన్పించిన వాణ్ణి కన్పించినట్టు చంపడం మొదలుపెట్టాడు.

అప్పుడు అహిరావణుడు కత్తి తీసుకొని హనుమంతుణ్ణి నిలువరించాడు... కాసేపు ప్రగల్భాలు పలికి, తన కత్తితో హనుమంతునిపైన ఒక్క వేటువేశాడు.

ఆయన శరీరం వజ్రతుల్యం.

ఈ కత్తిదెబ్బ చీపురు పుల్లలా తాకింది ఆయన శరీరాన్ని. అహిరావణుడి చెయ్యి పట్టుకొని, అతని చేతిలో కత్తి లాక్కొని దాంతోనే అతని తలని నరికేశాడు హనుమంతుడు.

ఆ విధంగా రావణ వంశం అక్కడితో నిశ్శేషం అయిపోయింది.

తన పుత్రుడు మకరధ్వజుణ్ణి తోకనించి విడిపించి, అహిరావణుడి రాజ్యాన్ని ఏలుకోమని ఇచ్చేశాడు. రామలక్ష్మణులకు నమస్కరించమని ఆదేశించాడు. "ఆ ఇద్దరి నామస్మరణ చేస్తూ ఈ రాజ్యాన్ని బుద్ధిగా ఏలుకో" - అన్నాడు హనుమంతుడు.

సమయం లేదు - యుద్ధరంగంలోకి తక్షణం వెళ్ళాలి. ఈపాటికే రామలక్ష్మణులు మాయమయ్యారన్న వార్త పెద్ద అల్లకల్లోలాన్ని సృష్టించి వుంటుంది.

వాయుమనోవేగాలతో రామలక్ష్మణుల్ని తీసుకొని వానరసేన మధ్యకు చేరుకున్నాడు హనుమంతుడు.

రామలక్ష్మణులు తిరిగి రావడంతో వానర సేనలో కోలాహలం ద్విగుణీకృతం అయ్యింది.

రాక్షస శిబిరం విషణ్ణం అయ్యింది !!

# రావణుడి మరో కొడుకు నరాంతకుడు

శ్రీరాముడి అపహరణ ఉదంతం ఘోరంగా విఫలమైన తర్వాత రావణుడు నిజంగానే దిక్కుతోచని స్థితిలో పడ్డాడు.

చివరగా ఒక కొడుకు మిగిలివున్నాడనుకొంటే, ఆ అహిరావణుణ్ణీ హనుమంతుడు వధించాడు.

ఇంక నిస్సందేహంగా రావణుడు నిస్సంతువే ! అప్పటికే మూల రాక్షసబలం పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది.

మిగిలివున్న చిల్లరా చితకా రాక్షసులతోనే ఇంక రావణుడు యుద్ధకార్యం నడపవలసి వుంది !

ఆ దశలో ఎవరైనా వచ్చి తనని పలకరించినా ప్రతివాడూ హితబోధ చేసేవాడే గానీ, ఎవ్వడూ విజయం సాధించే ఉపాయాలు సూచిస్తున్న పాపాన పోవడం లేదు.

అందుకని ఎవర్నీ కలుసుకోవడానికి కూడా రావణుడు ఇష్టంగా లేడు.

ఆ దశలో, సింధురనాథుడనే ఓ పెద్దాయన వచ్చి రావణుణ్ణి పలుకరించాడు. సింధురనాథుడెప్పుడూ గతంలో రావణ సభకు రాలేదట. విభీషణుడితో మాత్రం ఆయనకు స్నేహం ఉండేది. అంతవరకే వుండేవాడు.

సింధురనాథుడు కూడా మొదట హితబోధే మొదలుపెట్టేసరికి రావణుడు విసుగ్గా "ఇంకేవైనా మంచి విషయాలు చెప్పండి" - అన్నాడు.

"రాజా! నీ వాళ్ళంతా పోయారు. నువ్వొక్కడివే మిగిలివున్నావు- అనుకొంటున్నావు కదా..." అనడిగాడు. రావణుడు అవునని తలవూపాడు.

అప్పుడు సింధురనాథుడు ఒక గొప్ప సంగతి చెప్పాడు -

"నీ ఇంకో కొడుకు - మహావీరుడు, నరుడివలన చావులేని వాడు నరాంతకుడు వున్నాడు- మరచిపోయావా" అన్నాడు.

రావణుడికి అప్పుడు నరాంతకుడి పుట్టుక గూర్చి జరిగిన కథంతా గుర్తుకు రాసాగింది.

ఒకప్పుడు మూలానక్షత్రంలో లంకానగరంలో ఒకేసారి 72 కోట్లమంది మగ పిల్లలు పుట్టారట. అంతమంది ఒకేసారి పుట్టడం రావణుడికి సంతోషమే అయ్యింది. కానీ, శుక్రాచార్యుడు వచ్చి, "ఈ నక్షత్రంలో పుట్టిన పిల్లల్ని తండ్రులు చూస్తే వారికి అపాయం. పూర్తిగా నశించిపోతారు" అన్నాడు. ఈ నక్షత్రంలో పుట్టిన పిల్లలందరినీ సముద్రంలో పారేయమని సలహా చెప్పాడు.

వెంటనే రావణుడు తన ఆజ్ఞగా, మూలానక్షత్రంలో పుట్టిన పిల్లలందరూ కులనాశకులౌతారనీ, వెంటనే వాళ్ళని తెచ్చి సముద్రంలో పారేయండనీ ప్రకటింపచేశాడు.

తన ఇంట్లో పుట్టిన నరాంతకుణ్ణి కూడా అలాగే తెచ్చి సముద్రంలో పారేయించాడు.

సముద్రంలో పడిన ఈ పిల్లల్లో పోయినవాళ్ళు పోగా, మిగిలినవాళ్ళు ఒక మర్రిచెట్టును ఆశ్రయించి, దాని పాలు తాగుతూ ఏడు సంవత్సరాలు బతికారు. కొంచెం శరీరానికి పుష్టి కలిగిన తర్వాత గంగానది సముద్రంలో కలిసేచోటికి వచ్చి కూర్చున్నారు. నరాంతకుడు వాళ్ళకి నాయకుడిగా వున్నాడు-

అక్కడ బ్రహ్మనుద్దేశించి తపస్సు చేశారు. బ్రహ్మ వాళ్ళకి ఒకరి వలన ఒకరికి మృత్యువులేకుండా వరం ఇచ్చాడు. "మీలో మీకు విరోధాలు ఏర్పడి, మీ వలన మీకు కూడా మృత్యువు ఏర్పడదు" అన్నాడు. "అయితే, సుగ్రీవుడి కొడుకుతో మాత్రం మీకు విరోధం రాకూడదు. అతనితో యుద్ధం చెయ్యకూడదు" - అంటూ ఒక మెలిక పెట్టాడు.

నరాంతకుడు ఈ వరం తీసుకొని మళ్ళీ బ్రహ్మని ప్రార్థించి దేవాసుర యుద్ధంలో తమకే జయం కలిగేలా వరం ఇమ్మని అడిగాడు. అప్పుడు బ్రహ్మ - వానర భల్లూకాలతో తప్ప మీకు ఏ ఒక్కరితోనూ ప్రాణభయం వుండదు అని స్పష్టంగా చెప్పాడు.

నరాంతకుడు ఈసారి శివుణ్ణి మెప్పించి "రాజు-ప్రజ అనే తేడా లేకుండా సకలైశ్వర్యాలూ తన రాజ్యంలో వుండాలనీ, తనకో మంచి నగరం సునాయాసంగా కట్టుకునేట్లు కావాలనీ అడిగాడు. శివుడి వరంతో నిర్మించిన ఆ నగరాన్ని 'విహ్వాబలపురం' అని పేరుపెట్టాడు. బిందువు అనే పాతాళ రాక్షసుడి కూతురిని పెళ్ళిచేసుకున్నాడు. అనేక

విద్యలు నేర్చుకున్నాడు. సుఖంగా జీవిస్తున్నాడు. అతని రాజ్యంలో ప్రజలు కూడా రాజకుమారుల్లాగానూ, రాజకుమార్తెల్లాగానూ వుంటారు. ఇదీ నరాంతకుడి కథ !

రావణుడు, ఉత్తరం ఇచ్చి ధూమకేతువు అనే దూతని పంపించాడు. తెల్లవారేసరికి, అతికష్టం మీద అతడు నరాంతకుణ్ణి కలుసుకోగలిగాడు. రావణుడు రాసిన ఉత్తరం ఇచ్చాడు. అందులో రాముడితో యుద్ధం ప్రస్తావన వుంది.

నరాంతకుడు తన భార్యతో ఆ ఉత్తరం గురించి చర్చించాడు. "మా నాన్నకి గొప్ప కష్టం వచ్చింది. వచ్చి ఆదుకోవలసిందిగా ఉత్తరం రాశాడు" - అని చెప్పాడు.

అప్పుడతని భార్య బిందుమతి-"సహాయానికి వెళ్తే వెళ్ళావు గానీ, రాముడితో మాత్రం ముఖాముఖీ యుద్ధం చెయ్యకు - క్షేమంగా తిరిగొచ్చి హాయిగా నీ రాజ్యాన్ని నువ్వుపాలించుకో" - అని హితవు చెప్పింది. అయినా నమ్మకం కుదరక నీతోపాటు నేనూవస్తాను. అత్తగారినీ, మామగారినీ చూసినట్లు వుంటుంది అని తనూ బయల్దేరింది.

నరాంతకుడు తన 72 కోట్ల రాక్షససైన్యాన్ని వెంటబెట్టుకొని లంకానగరానికి అప్పటికప్పుడు వచ్చాడు. వీళ్లెవరూ మృత్యుభయం వున్నవాళ్ళుకాదు నిజానికి ! కానీ, వానరులతో వైరం తగదన్న బ్రహ్మదేవుని హెచ్చరిక బహుశా మర్చిపోయివుంటారు లేదా, నరుడితో మాత్రమే యుద్ధం అనుకొని వుంటారు.

లంకానగరాన్ని చేరిన నరాంతకుడి సేనను చూసి శ్రీరాముడు చిరునవ్వు నవ్వాడు. "హనుమా ! వీళ్ళంతా వరగర్వితులు. అహిరావణుడి లాంటివాళ్ళే ! వానరుల వలన మాత్రమే మృత్యువు కలిగినవాళ్ళు. మీ చేతుల్లో చావడంకోసమే వచ్చారు. హనుమా ! వాళ్ళతో ఆడుకోవచ్చు నువ్వు ! నీ ఇష్టం వచ్చినంత విజృంభించు" - అన్నాడు.

నరాంతకుడికి దడపుట్టేలాగా, హనుమంతుడు పెద్దపెట్టున సింహనాదం చేశాడు.

"వీడెవడు ? మహాపర్వతంలా వున్నాడు. సింహంలా గర్జిస్తున్నాడు" సందేహంగా అడిగాడు నరాంతకుడు ధూమకేతువుని.

ధూమకేతువు హనుమంతుడి గురించి వివరాలు చెప్పడం మొదలుపెట్టాడు.

1. లంకలో దూరి లంకానగరాన్ని భస్మీపటలం చేసింది ఇతనే.
2. సీతజాడని రాముడికి చెప్పింది ఇతనే.
3. లక్ష్మణుణ్ణి ఇంద్రజిత్తు కొడితే సంజీవని పర్వతాన్ని ఎత్తుకొచ్చి మూలికలతో బతికించింది ఇతనే !
4. పాతాళానికిపోయి అహిరావణుణ్ణి వధించింది ఇతనే !

ఇప్పుడు నీమీదకొస్తున్నాడు- కొంచెం జాగ్రత్త - అన్నాడు. నరాంతకుడు లంకలో అడుగుపెట్టకమునుపే హనుమంతుణ్ణి ఎదుర్కోవల్సి వచ్చింది. "జాగ్రత్త! తొందరపడు! అతను నీమీదకు ఎగిరి దూకబోతున్నాడు" - అని మళ్ళీ హెచ్చరించాడు ధూమకేతువు.

నరాంతకుడు చెవిదాకా వింటినారిని లాగి గట్టి బాణాన్ని హనుమంతుడి మీదకు సంధించాడు. హనుమంతుడు ఆ బాణాన్ని గాలిలోనే పట్టుకుని రెండు ముక్కలు చేశాడు. మీదకు దూకి విల్లంబులు లాక్కొని రెండు ముక్కలు చేశాడు. ఇద్దరూ చాలాసేపు ముష్టియుద్ధం చేశారు -

హనుమంతుడు గర్జిస్తూ తోకనిపెంచి నరాంతకుణ్ణి చుట్టి గిరగిరా తిప్పి నేలకి కొట్టాడు. వాడు అక్కడికక్కడే కుప్పకూలిపోయాడు. ఒక ఘడియకు గానీ వాడు తెప్పరిల్లుకోలేదు. లేస్తూనే మళ్ళీ యుద్ధానికి తయారయ్యాడు.




నరాంతకుడు, అతని 72 కోట్ల మంది రాక్షస సైనికులతో హనుమంతుడు వంటరిపోరాటం చెయ్యడం చూసి, అంగదుడు, అతని సైనికులు సహాయంగా వచ్చారు.

రాక్షస మాయను పటాపంచలు చేస్తూ రాముడు ఒక బాణాన్ని ప్రయోగించాడు. అది మాయను ఛేదించి తిరిగి రాముడి సన్నిధికి చేరింది.

ఆ పూటకు ఆరు కోట్లమంది నరాంతకుడి సైనికులు హతం అయ్యారు.

నరాంతకుడు నేరుగా కోటకు వెళ్ళాడు. రావణాసురుడు అతన్ని స్వాగతించాడు. వస్తూనే కోటబయట యుద్ధంలో అపశకునాలు ఎదురైనందుకు విచారించాడు.

మండోదరి యథాప్రకారం మళ్ళీ తన గోడు మొదలెట్టింది. సీతను రాముడికి ఇచ్చేయండి- యుద్ధాన్ని ఆపేయండీ- కావాలంటే మీ కొడుకుని రాయబారిగా పంపండి - వెనకాల మీరు వెళ్ళండి" - అంది రావణుడితో !

"ఛీత్" అంటూ చిందుతొక్కి అరిచాడు రావణుడు - కొడుకు నరాంతకుణ్ణి తీసుకొని ఇంకో గదిలోకి లేచివెళ్ళిపోయాడు.

రాత్రి తెల్లవార్లూ యుద్ధ వ్యూహం మీద మంతనాలు జరిపారు ఆ యిద్దరూ.

తెల్లవారుతూనే భేరీ భాంకారాలు మ్రోగాయి.

కొంతసేపు రావణసేనది పైచేయి - కొంతసేపు వానరసేనది పైచేయిగా యుద్ధం సాగుతోంది.

సాయంత్రం దాకా ఇదేవరస.

రెండు వైపులా భారీగానే జననష్టం జరిగింది.

చివరిగా -

జాంబవంతుడు మీదకి ఒక బల్లెం విసిరాడు నరాంతకుడు.

దాన్నించి తప్పించుకొంటూనే, దాన్ని చేత్తో పట్టి వెనక్కి తిప్పి "జయత్యతి బలో రామః" అని బిగ్గరగా అరుస్తూ రివ్వున దాన్ని నరాంతకుడి మీదకు విసిరాడు. అది గుండెలో దిగబడి నరాంతకుడు మూర్ఛపోయాడు. అంతేగాని, చావలేదు -

జాంబవంతుడు వాణ్ని అక్కడితో వదలకుండా, ఆ బల్లెంతో సహా వాణ్ణి ఎత్తి గిరగిరా తిప్పి విసిరి నేలకేసికొట్టాడు. అయినా వాడు చావలేదు.

ఇంత కొట్టినా వీడు చావట్లేదని తీసి తలకిందులుగా చేసి ఇసుకలో పాతిపెట్టాడు. అప్పటికీ వాడికి మరణం రాలేదు.

ఇంక లాభం లేదని, రెండు కాళ్ళు పుచ్చుకొని ఇసుకలోంచి బైటకు లాగి ఇష్టం వచ్చినట్లు గుద్ది, తన్ని హింసించాడు. అయినా చావు రాలేదు వాడికి. పాదాలు పట్టుకొని గిరగిర తిప్పి దూరంగా లంకలోకి వెళ్ళి పడేలాగా బలంగా విసిరేశాడు.

వాడు అలా వెళ్ళి వెళ్ళి రావణుడి దగ్గర పడ్డాడు.

రావణుడు వాడికి ఉపచారాలు చేసి, లేపి, సేదతీర్చాడు.

నరాంతకుడు కన్పించకపోయేసరికి, వాడిసైన్యం బెంబేలుపడిపోయి లంకలోకి పారిపోయి వచ్చేయడం మొదలుపెట్టారు.

అప్పటికే సాయంకాలం అయిపోయింది.

ఆ మర్నాటి యుద్ధంలో నరాంతకుడి సేనలు 42 కోట్ల మంది మరణించారు.

కొంతసేపు నరాంతకుడు మూర్ఛపోతున్నాడు - కొంతసేపు అంగదుడు, హనుమంతుడూ మూర్ఛపోతున్నారు. ఆ పూట యుద్ధం అంతా అలాగే సాగింది.

"ఇదంతా బ్రహ్మ వరప్రభావమే ! ఇంకమీరు ధైర్యంగా వుండండి. మీకు కలలో కూడా యుద్ధ శ్రమ కలగకుండా నేను వరం ఇస్తున్నాను" అని వాళ్ళిద్దర్నీ భుజంతట్టి, లేపి, ఆశీర్వదించాడు రాముడు.

"మీ ఇద్దరూ నిర్భయంగా లంకానగరంలోకి వెళ్ళండి. అక్కడ కారాగారంలో పడివున్న మన వానరసేనని విడిపించి తీసుకురండి" - అని ఆదేశించాడు.

అంగదుడు, హనుమంతుడు నరాంతకుడితో యుద్ధాన్ని ఆపి, అడ్డుపడిన రాక్షసుల్ని నరుక్కుంటూ లంకానగరంలోకి దూసుకుపోయారు.

ఇంకా యుద్ధం ముగియడానికి ఒక 'యామం' మాత్రమే ఉంది.

నరాంతకుడు అదృశ్యరూపంలో తన శరీరాన్ని మరుగుపరచుకొని రహస్యంగా వానరుల్ని చంపడం మొదలుపెట్టాడు.

ఇంతకన్నా నీచమైన యుద్ధం ఇంకొకటి వుండదు. గెలవడమే ముఖ్యంగాని, ఎలా గెలిచాడన్నది ముఖ్యం కాదని కలియుగపు రాజనీతిని ఆరోజుల్లో రాక్షసులు మాత్రమే పాటించేవారు.

రాముడు నరాంతకుడి మాయను ఛేదించమని లక్ష్మణుణ్ణి అక్కడికి పంపాడు. నరాంతకుడు నిజరూపంలోకి వచ్చేలోగా మాయా ఛేధం చేశాడు.

సాయంకాలం దాకా అలాగే గెలుపు ఓటములుగా సాగింది యుద్ధం.

యుద్ధం ఆ పూటకు ముగిసింది.

వానరులందరినీ వారి వారి స్వస్థానాలకు వెళ్ళి విశ్రమించవలసిందిగా ఆజ్ఞాపించాడు రాముడు. లంకలోని వానరసేనను విడిపించుకొని అంగదుడు, హనుమంతుడు తిరిగివచ్చేశారు.

అందరూ కూర్చుని సమాలోచన జరపసాగారు.

అంతలో నారదముని రాముడి శిబిరానికి వచ్చాడు. "బ్రహ్మ దేవుడు స్వయంగా ఒక విషయం మీతో చెప్పమని నన్ను పంపించాడు" అన్నాడు. నరాంతకుడికి బ్రహ్మ ఇచ్చిన వరప్రభావంతో వాణ్ణి ఎంత నిలువరించి హింసించినా వాడు చావడం లేదుకదా...

ఒక్క సుగ్రీవుడి కొడుకు జోలికి మాత్రమే వెళ్తే ప్రాణాపాయం వుందని ఆరోజున నరాంతకుడికి వరం ఇచ్చేప్పుడే చెప్పాడు బ్రహ్మ. ఆ విషయాన్ని మీకు గుర్తు చేయమన్నాడు" - అన్నాడు.

గొప్ప సమాచారం తెచ్చినందుకు ధన్యవాదాలు చెప్పుకున్నాడు రాముడు. వెంటనే సుగ్రీవుడు హనుమంతుణ్ణి కష్కిందకు వెళ్ళి తన పుత్రుడు దధిబలుణ్ణి తెల్లవారేలోగా తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు.

నారదుడు రాముడికి స్పష్టంగా చెప్పాడు -

"నరాంతకుడి మీద మీరు బాణం వదలకండి. అనవసరమైన యుద్ధం మీరు చెయ్యకండి. వాణ్ణి చంపగలిగిన వరపుత్రుడు దధిబలుడు మాత్రమే - అతన్ని తెల్లవారేసరికి రప్పించడమే ముఖ్యం" అన్నాడు మళ్ళీ ! సరేనన్నాడు రాముడు.

తెల్లవారింది.

దధిబలుడు, నరాంతకుడూ పూర్వపరిచయస్థులే - స్నేహితులు కూడా ! అతనితో వైరం వద్దని బ్రహ్మ చెప్పాడు కాబట్టి నరాంతకుడు అతని స్నేహాన్ని కాంక్షించాడు... ఇద్దరికీ ఒకరివలన ఇంకొకరికి ఏనాడూ ఎలాంటి ఇబ్బందీ కలగకపోవడం మూలాన వారి స్నేహం స్థిరంగానే వుంది. పైగా నరాంతకుడి చావు తనచేతిలోనే వుందన్న సంగతి దధిబలుడికి తెలిసే అవకాశం కూడా లేదు.

ఇద్దరూ అనూహ్యంగా ఈ యుద్ధంలో ఇలా చెరోపక్షాన నిలబడాల్సి వస్తుందని బహుశా ఇద్దరూ వూహించి వుండరు... ఏనాడూ !

ఇద్దరూ "నీకెందుకురా ఈ యుద్ధం?" అనీ, "నువ్వెందుకు తలదూరుస్తావురా ఇందులో...?" అనీ, "నీకేం సంబంధం వుందని వచ్చావు?" - అనీ ప్రశ్నించుకున్నారు.

మీనాన్న మానాన్నల మూలంగా ఇద్దరం కొట్టుకోవాల్సిన పరిస్థితి వచ్చింది- అనుకొన్నారిద్దరూ ! చావో బతుకో దధిబలుడితో యుద్ధం తప్పని పరిస్థితి వచ్చింది నరాంతకుడికి !

"నేను శత్రువుతో స్నేహం చెయ్యను" అన్నాడు దధిబలుడు.

"నేను శత్రువుని ఉపేక్షించను" అన్నాడు నరాంతకుడు.

ఇద్దరి మధ్య ద్వంద్వ యుద్ధం జరిగింది.

వానరసేన, రాక్షససేన చెరొక ప్రక్క నిలబడి ఆ ద్వంద్వ యుద్ధాన్ని చూస్తున్నారు.

అది మామూలు యుద్ధం కాదు.

కజ్జల-సువర్ణ పర్వతాల్లాగా ఇద్దరూ పోరాడుతున్నారు.

అంతకంతకూ రౌద్రకారులై పోరాడసాగారు.

శాస్త్రంలో చెప్పిన షట్ప్రకారాలనూ వాళ్ళు ప్రయోగిస్తూ పోరాడుతున్నారు.

బ్రహ్మ వరప్రభావం కారణంగా సుగ్రీవుడు తనకుమారుణ్ణి ఈ యుద్ధంలోకి ఈ చివరిక్షణంలో తెచ్చాడు. ఆ ఇద్దరి పోరూ చూస్తుంటే అది అనంతంగా సాగేలా వుంది.

సుగ్రీవుడి మనసులో ఆందోళన మొదలయ్యింది. జాంబవంతుణ్ణి పిలిచి, "ఇంకా ఎంతసేపట్లో మావాడు ఆ నరాంతకుణ్ణి చంపుతాడంటావు?" అనడిగాడు ఖంగారుగా!

జాంబవంతుడు సుగ్రీవుడికి ధైర్యం చెప్పాడు.

"దధిబలుడు ఇంకాసేపట్లోనే జయించబోతున్నాడు" అన్నాడు.

రెప్పపాటుకాలంలో దధిబలుడు శ్రీరాముణ్ణి స్తుతించి నరాంతకుణ్ణి బలంగా పట్టుకొన్నాడు. ఆ క్షణాన అంతకుమునుపు లేని బలమేదో అతడిలోకి ప్రవేశించినట్లయ్యింది.

అంతే ! నరాంతకుణ్ణి గిరగిరా తిప్పి నేలకేసికొట్టాడు.

ఒక్క దెబ్బతోనే వాడు భయంకరంగా అరుస్తూ ప్రాణాలు వదిలాడు.

వాడి తలని నరికి శరీరాన్ని లంకలో పడేలాగా బలంగా విసిరేశాడు దధిబలుడు. ఆ తలను పట్టుకొని రాముడిదగ్గరకు వచ్చాడు.

రామలక్ష్మణులు ఎదురువెళ్ళి దధిబలుణ్ణి గౌరవించి, కౌగిలించుకొని తమపక్కన కూర్చోబెట్టుకున్నారు.

నరాంతకుడి తలను భద్రపరచవలసిందిగా ఆజ్ఞాపించాడు రాముడు. దాన్ని పారేయకండి - అన్నాడు.

నరాంతకుడి రాజ్యం విహ్వాబలపురాన్ని పాలించుకోవలసిందిగా దధిబలుడికి ఆ రాజ్యాన్ని ధారపోశాడు రాముడు.

సుగ్రీవుడి సంతోషానికి అవధులు లేకుండా పోయాయి.

అన్యాయంగా ఈ యుద్ధంలో తన భర్తను పోగొట్టుకున్న నరాంతకుడి భార్య బిందుమతితో అత్తగారు మండోదరి స్వయంగా చెప్పింది - ఇంద్రజిత్తు భార్య సులోచన నడిచిన దారిలోనే నువ్వు నడుచుకో ! రాముని శరణుకోరి మోక్షాన్ని పొందు-" అన్నది.

ఒక బంగారు పల్లకీలో నరాంతకుడి తల లేని శరీరాన్ని పెట్టుకొని బిందుమతి రాముడి శిబిరంవైపు నడిచింది. ఆమెతోపాటు ఆమె సవతి చిత్రలేఖ కూడా తోదు నడిచింది.

ఆమె వస్తుందని రాముడికి తెలుసు -

అందుకే నరాంతకుడి శిరస్సుని భద్రం చెయ్యమన్నాడు రాముడు.

కానీ, ఆ సవతులిద్దరికీ తాను దర్శనం ఇవ్వడానికి నిరాకరించాడు రాముడు. వాళ్ళు వానరదూతల్ని రకరకాలుగా బతిమాలుకున్నారు. వాళ్ళు లోపలికి వెళ్ళడానికి వీల్లేదంటే వీల్లేదన్నారు -

శిరస్సు లేకుండా సహగమనం ఎలా చెయ్యగలం... శిరస్సు ఇప్పించండి అని వేడుకున్నారు.

చివరికి, చాలాసేపు వాళ్ళు బ్రతిమాలుకున్నాక లోపలికి అనుమతించాడు వాళ్ళని రాముడు. శిరస్సునిచ్చి ఆశీర్వదించి పంపాడు.

బిందుమతి, చిత్రలేఖలతోపాటు నరాంతకుడి ఇతర భార్యలు, మరో పదహారు మంది సహగమనం చేశారు.

విభీషణుడు రావణుడితో వైరాన్ని వదిలి ఈ సహగమనాన్ని స్వయంగా జరిపించాడు. మండోదరి కూడా అక్కడే వుంది.

కొడుకు చనిపోయాడని విని మూర్ఛపోయిన రావణుడు తెప్పరిల్లి ఆయన కూడా సహగమనం జరిగేచోటుకు బయల్దేరాడు. ఆ సంగతి తెలిసి, విభీషణుణ్ణి వెనక్కి వచ్చేయమని కబురంపాడు రాముడు.

అక్కడితో నరాంతకుడి కథ ముగిసింది.

# కుంభకర్ణుడి కొడుకులు హతం

ఇంక ఉపేక్షించి లాభం లేదు - తాడో పేడో తేలిపోవాల్సిందే...

కుంభకర్ణుడి కొడుకులు మహావీరులైన కుంభ, నికుంభుల్ని పిలిపించాడు... లంకకు ఏ దుర్గతి పట్టిందో చూశారు గదా... అన్నాడు. అందర్నీ కోల్పోయిన వంటరీ... తన కోసం నేనున్నానంటూ ముందుకొచ్చే వీరుడెవరూ మిగిలిలేని స్థితిలో పడిన రావణుడికి దుఃఖం తప్ప మిగిలిందేమీ లేదు.

కుంభుడు అస్త్రశస్త్రాలతో బయల్దేరాడు. అతనిది బాణాలతో యుద్ధం. అంగదుడు, మహేంద్రుడు, దేవేంద్రుడు తదితర వానర నాయకులు అతన్ని ఎదుర్కొన్నారు. వాళ్ళకి మహావృక్షాలు, బండరాళ్ళు ఆయుధాలు.

బాణాల ముందు బండరాళ్ళు నిలవలేని స్థితి...

సుగ్రీవుడు తన బలమైన పిడికిళ్ళను గట్టిగా బిగించి కుంభుడి వాహనంగా వున్న ఏనుగు కుంభస్థలాన్ని ఒకే గుద్దుతో పగలకొట్టాడు. ఏనుగు నేలకూలడంతో దానిపైన కూర్చున్న కుంభుడు ఒక్కసారిగా నేలమీదపడి, సుగ్రీవుడి చేతుల్లో దొరికిపోయాడు.

క్షణం ఆలస్యం చెయ్యకుండా కుంభుడి పీక పుచ్చుకొని అరచేత్తో కొబ్బరికాయ పగలకొట్టినట్లు అతడి తలకాయని తన పిడిగుద్దులతో నుజ్జు నుజ్జు చేశాడు.

కుంభుడు చచ్చిన తర్వాత నికుంభుడు హనుమంతుడు కావలిగా వున్న ద్వారం వేపుగా వచ్చాడు.

హనుమంతుడు వాణ్ణి ఒడుపుగా పట్టుకొని చంకలోపల బిగించాడు. 'వదర్రా! వదర్రా ! అంటూ అరవడం మొదలు పెట్టాడు నికుంభుడు. వానరుడి చేతికి దొరికిన తర్వాత వదలడం అనేది అసాధ్యం... రావణుడంతటివాడే వాలి చంకల్లో వారం రోజులపాటు చెమటకంపు భరించవలసి వచ్చింది. నికుంభుడిక్కూడా ఆ కష్టం ఎంతటిదో ఇప్పుడు అనుభవంలోకి వచ్చింది ! కానీ, ఆ దుర్భర శ్రమ ఎక్కువసేపు కల్గించదలచుకోలేదు కరుణామయుడైన హనుమంతుడు -

నికుంభుడి పొడవైన కేశరాసిని పిడికిలితో పట్టుకొని మెలితిప్పి రెండు పాయలుగా చేశాడు. రెండు చేతుల్తోనూ రెండు పాయల్ని పట్టుకొని ఒకేసారిగా చీల్చాడు... నికుంభుడి తలకాయ రెండుగా చీలిపోయింది. వాడి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

కుంభ నికుంభులిద్దరూ అంతఃపురం దాటి బైటకు వచ్చారు. లంకానగరద్వారం దాటకుండానే నగరం లోపలే అంతం అయిపోయారు.

హనుమంతుడు సింహగర్జన చేస్తూ నికుంభుడి తలకాయ ముక్కల్ని తీసుకొని రాముడి దగ్గరకు వెళ్ళిపోయాడు.

# రామరావణ మహాసంగ్రామం

రావణుడి మూలబలం చెదిరిపోయింది. ముఖ్యమైన సేనా నాయకులంతా ముందే యమపురికి వెళ్లిపోయారు. రాక్షస వీరుల్ని మట్టుపెట్టి వానరసేన సింహనాదాలు చేస్తోంది.

అన్నింటికన్నా ముఖ్యం దేవతలు రావణ పరాజయానికి సంతోషిస్తూ పుష్పవర్షం కురిపిస్తున్నారు. భరించలేకపోతున్నాడు రావణాసురుడు.

ఒకవైపు విషాదం ..... ఆత్మీయుల్ని, ముఖ్యబలగాన్నంతటిని కోల్పోయినందుకు.

ఇంకొక వైపు రోషం ..... తనంతటి వాడిని అతి మామూలు మనుషులు ఇద్దరు - కొందరు వానరులు కలిసి జయించేందుకు పూనుకోవడం .....

ఇంక ఇలా దడిసి కూర్చుంటే ఏమీ ప్రయోజనం లేదు - ఇదే ..... సమయం ..... రామ లక్ష్మణుల్ని వధించి తీరాలి ..... !!

ఏ మహావృక్షానికి సుగ్రీవాది వానరులు చిగురు కొమ్మలుగా వున్నారో ఆ మహావృక్షాన్ని నేలకూల్చాలి .....

రథం ఎక్కి తిన్నగా దశరథ రాముడి వైపు పోనీయమన్నాడు రావణుడు.

ఆ రథం కదుల్తుంటే, మెరుపులతో కూడిన జడివానలో పిడుగులు పడ్తున్న ధ్వని విన్పించసాగింది. దాని వేగానికి భూమి కంపించసాగింది. రావణుడి రథానికి ఆమడదూరం వరకూ నిప్పులు వర్షించసాగాయి. సాహసించి ఎవరూ ఆయన దగ్గరకు చేరుకోలేనంత ఆగ్రహోదగ్రుడుగా వున్నాడు రణరంగంలో రావణుడు.

ఎదురుగ్గా ప్రశాంత వదనంతో రాముడు. చిరునవ్వు ఆయన నైజం ..... తన వంశజులందరిని మట్టుబెట్టిన వాడు ఇతనే కాదా .....

దారుణాతి దారుణమైన తామసాస్త్రాన్ని తీసి నిర్దయగా ప్రయోగించాడు రాముడి మీదకు రావణుడు.

దాని తీవ్రతకు చుట్టూ వున్న వానరులంతా పండుటాకుల్లా నేలమీద వాలిపోసాగారు. రాముడు ఆ అస్త్రాన్ని ఎదుర్కోవడంకోసం వింటి నారిని సంధించి ధనుర్విష్ఫారం చేశాడు. ఆ వింటినారి ధ్వనికి రావణుడు మరింత ఆగ్రహోదగ్రుడయ్యాడు. తామసాస్త్రం రాముని ఏమీ చేయలేక ఆగిపోయింది.

రావణుడు తీక్షణమైన బాణాల్ని గుక్క తిప్పుకొనే అవకాశం ఇవ్వకుండా వరుసగా శ్రీరాముడిమీదకు ప్రయోగించాడు.

వానరులు, రాక్షసులు ఆ యుద్ధ తీవ్రతను చూస్తూ భయంతో కంపించి పోయారు. కొందరు మూర్ఛపోయారు కూడా !

సూర్య చంద్రుల ఎదుట రాహువులాగా రావణుడు, రామలక్ష్మణుల ముందు నిలబడ్డాడు.

నిప్పులు కురిసే బాణాలు రాముడు వేస్తుంటే, రావణుడు వాటిని విరిచేస్తున్నాడు. రావణుడు వేస్తుంటే రాముడు విరిచేస్తున్నాడు.

యుద్ధం సమాన స్థాయిలో సాగుతోంది. బాణాల తుఫాను అది ! రౌద్రాస్త్రాలు మంత్రజపాలే కన్పిస్తున్నాయి.

రావణుడు అసురాస్త్రాన్ని ప్రయోగించాడు. అందులోంచి సింహాలు, పెద్ద పులులు, రాబందులు మొదలైన క్రూర జంతువులు బైటకు వచ్చి నోరప్పళిస్తూ భయంకరంగా రాముడిమీదకు దూసుకు రాసాగాయి.

దానికి విరుగుడుగా రాముడు ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. క్రూర జంతువులన్నీ ఆ అగ్నికి దగ్ధం అయిపోయాయి. వానరులు సంతోషంతో చప్పట్లు చరిచారు.

తన రాక్షసాస్త్రం విఫలం అయినందుకు రావణుడు రగిలిపోయాడు. మయుడు ప్రసాదించిన రౌద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. అందులోంచి పదునైన బల్లెం, శూలం, కత్తి, గద ..... ఇలాంటి ఆయుధాలు బైటకు వచ్చి ఒక్కసారిగా రాముడిమీద దాడిచేయసాగాయి. రాముడు గాంధర్వాస్త్రం ప్రయోగించి వాటిని విరిచేశాడు.

రావణుడు సౌరాస్త్రం వేస్తే మంటలు చిమ్ముతున్న పెద్ద పెద్ద బండిచక్రాలు అందులోంచి పుట్టుకు వచ్చి దొర్లుకుంటూ రాముడి మీదకు దూసుకు రాసాగాయి. శ్రీరాముడు వాటినికూడా విరిచేశాడు.

రావణుడు పదిబాణాల్ని తీసుకొని ఒకేసారి నేరుగా రాముడి మర్మస్థానాలలో నాటుకునేలా ప్రయోగించాడు. రాముడు వాటిని మధ్యలోనే నిలువరించాడు. తనే మరో పది బాణాలను రావణాసురుడి మర్మస్థానాల మీద ప్రయోగించాడు. అవి ఆయన్ని బలంగా తాకాయి. 'అబ్బా' అన్నాడు రావణుడు. శ్రీరాముడు కొంతసేపు ఈ యుద్ధానికి విరామం ప్రకటించాడు.

# ప్రాణాలు కాపాడిన సారథికి రావణుడి తిట్లు

రామరావణులు ముఖాముఖి పోరాడుతున్నారు -

మహోగ్రమూర్తుల్లా వున్నారు -

ప్రాణాలకు తెగించిన పోరాటం అది !

దేవతలు దాశరథికి జయజయధ్వానాలు పలుకుతున్నారు. రావణుడికి కళ్ళల్లోంచి నిప్పులు రాల్తున్నాయి. నైతికంగా అతన్ని దెబ్బతీయడం దేవతల వ్యూహం... యుద్ధ రంగంలో ప్రోత్సాహం అంతా రాముడి పక్షాన వుంది.

స్వస్థానంలో కూడా రావణుడు స్తుతిపాఠకుల్ని తెచ్చుకోలేకపోయాడు -

"ఇదిగో ఈ బాణంతో నిన్ను యముడి దగ్గరకు పంపిస్తా" అని ఈయనంటే, "ఈ బాణం తగిలాక మరి నువ్వుండవు" అని ఆయన అంటున్నాడు.

రావణుడి మాయలు రాముడి ముందు పటాపంచలౌతున్నాయి. రాముడి బాణాలు రావణాసురుడి ముందు నిప్పులోపడ్డ కీటకాల్లా మాడిపోతున్నాయేగాని ఫలితాలివ్వడం లేదు.

'మాతలి' ప్రసాదించిన శక్తిని ప్రయోగించాడు రాముడు. అది రావణుడి చేతి శూలాన్ని తాకి దాన్ని ముక్కలు ముక్కలు చేసింది. రావణుడి గుర్రాల్ని కూలగొట్టి, అతని గుండెల్లోనూ, నుదురుమీదా మూడు బాణాలు వేశాడు. ఆ రాక్షసేశ్వరుడు నెత్తురు మడుగులో కూలబడినట్లయ్యాడు.

వెంటనే తమాయించుకొని ఒకేసారి వెయ్యి బాణాల్ని ప్రయోగించాడు. ఆ క్షణంలో అనేక దివ్యాస్త్రాలు రాముడికి సంక్రమించాయి. వీర్యబలహర్షోత్సాహాలు రెట్టింపు అయ్యాయి. ఆ శుభచిహ్నాలకు రాముడు మహోత్సాహంగా నిజశర ప్రయోగలాఘవాన్ని ప్రదర్శించాడు.

**ఒకవైపు రాముడి బాణవర్షం**

**ఇంకొకవైపు వానరుల రాళ్ళవర్షం**

**ఉక్కిరిబిక్కిరయ్యాడు రావణుడు**

ఎప్పుడైతే అతని మనసులో ఒకరకమైన పిరికితనం ఆవహించిందో, రావణుడు అప్పుడే నీరసించిపోవడం మొదలుపెట్టాడు. ఒక దశలో ఎండు చెట్టులా నిలబడిపోయాడు. తన ప్రభువులో కన్పిస్తున్న ఈ మార్పును గమనించాడు అతని రథసారథి.

నెమ్మదిగా రణరంగంలోంచి తప్పించి రావణుణ్ణి అవతలకు తీసుకుపోయాడు. చూస్తూండగానే తెలివితప్పి కూలబడిపోయాడు రావణుడు.

ఎప్పటికోగాని తెప్పరిల్లుకోలేకపోయాడాయన.

కళ్ళు తెరుస్తూనే తాను యుద్ధరంగంలోంచి దూరంగా తేబడిన సంగతి గమనించాడు. తనకు తెలిసి జరిగినా, తెలియక జరిగినా, యుద్ధంలో వెన్ను చూపించి పారిపోయిన వాడితో సమానమే కదా...

సారధిమీద రావణుడికి చాలా కోపం వచ్చింది!

"బుద్ధిహీనుడా! ఎంత పనిచేశావురా..."అని అరిచాడు. సారధికి మతిపోయినట్ల య్యింది. "ఈయన్ని రక్షించాలని తను అంతగా ప్రాణాలకు తెగించి రథాన్ని మళ్ళించి సురక్షితంగా పక్కకు చేరిస్తే తిడతాడేమిటా..." అని !

రావణుడు ఇంకా కోపంగా...

"ఏరా! ఈ రావణుడంటే శక్తిహీనుడు, వీర్యహీనుడూ అనుకున్నావా... నా పౌరుషాలు నశించిపోయాయనుకున్నావా... పిరికిపందలా పారిపోవడం నా చరిత్రలో ఎప్పుడైనా వుందా... నీ అవివేకంతో నా పరువు తీశావు కదరా!" అన్నాడు.

"చిర సమార్జిత మదీయ యశోవీర్య పరాక్రమాలకు క్షణకాలంలో తీరని మచ్చ కల్గించావు" అని తిట్టిపోశాడు.

"దుర్బుద్ధీ- శత్రువు పెట్టిన లంచం ఏమైనా మెక్కావా? నా మేలు కోరేవాడు ఇలా చేస్తాడా" అంటూ వాణ్ణి నానారకాలుగా నిందించాడు.

సారధికి ముఖాన నెత్తురు చుక్కలేదు.

"నువ్వు చేసిన పనికి వెనకాల రాముడో, సుగ్రీవుడో నన్ను వెదుక్కొంటూ రాకమునుపే... పద... మళ్ళీ యుద్ధరంగంలోకి పద.... ఎక్కణ్ణించి తెచ్చావో అక్కడికే తీసుకెళ్ళు –" మళ్ళీ అరిచాడు రావణుడు.

సారధి చాలా బాధపడ్డాడు. మనసు గాయపడినట్లయ్యింది. "ఇది కాలవరం గానీ మరొకటి కాదు. రోజులు బాగోకపోతే ఇలానే జరుగుతుంది. ఏనాడైనా నన్నింత మాట అని ఎరగని రావణుడు తనను లంచం తిన్నావా... అని అడిగాడు – అదే బాధ!

"రాక్షసేశ్వరా! యుద్ధరంగంలో రథం నడపడం అంటే గుర్రబ్బండీ తోలడం ఎంత మాత్రమూ కాదు – దేశకాల పరిస్థితుల్ని, శుభాశుభ నిమిత్తాల్ని, స్వపక్షంలోనూ, వైరిపక్షంలోనూ ఇతర రథికుల కదలికల్ని, అప్పటి పరిస్థితుల్ని, సమయాసమయాల్ని అన్నింటినీ దృష్టిలో పెట్టుకొని, శత్రువు శక్తినిబట్టి రథాన్ని నడపాలి. అది నా బాధ్యత. రథికుడికి, రథానికి, గుర్రాలకూడా విశ్రాంతి అవసరం అయిన పరిస్థితుల్లోనే రథాన్ని వెనక్కి తీసుకొచ్చాను. ఇందులో మిమ్మల్ని అగౌరవపరిచే ఉద్దేశం ఏదీ లేదు. ఇప్పుడు చెప్పారు గదా... పదండి ... యుద్ధరంగానికి వెడదాం..." అన్నాడు సారధి.. వినయంగానే!

సారధి ఆ మాటలు అంటున్నప్పుడు అతని కళ్ళలో నీళ్ళు గిర్రున తిరగడం గమనించాడు రావణుడు.

"సూతాగ్రణీ! రాముడి దగ్గరకే తిన్నగా రథాన్ని నడిపించు- శత్రువును వధించకుండా వెనక్కి రావడం ఎన్నడూ జరగకూడదు!" అన్నాడు.

# సుగ్రీవుడికి చావు దెబ్బలు

అంతలో రావణుడికి ఓ సందేహం కల్గింది ..... ఈ వానరులు ఎటుతిరిగీ చావుకు తెగించే వచ్చారు. ఈ రాక్షస సేనా వాహినిని చూసి, ఊళ్ళో మనుషులనే వారే లేకుండా అందరూ తరలివచ్చేశారనుకొని వాళ్ళు దేశంమీద పడి అకార్యాలు చేసే ప్రమాదం ఉంది ..... ఎక్కడికక్కడే కాపలా పటిష్టంగా వుండేలా చూడండి. నాలుగు వీధుల కూడళ్ళు అన్నీ భద్రంగా వుంచండి. నగర ద్వారాల దగ్గర కావలి పెంచండి అని ఆదేశించాడు.

వానర సైన్యం, రాక్షస సైన్యం ఒకరినొకరు చుట్టు ముట్టేందుకు ప్రయత్నించసాగారు.

తిమింగలం సముద్ర జలాల్లో అల్లకల్లోలం సృష్టించినట్లు వానర సేన మధ్యలోకి దూసుకు వెళ్ళి వాళ్ళని చెల్లాచెదురు చెయ్యసాగాడు రావణుడు.

సుగ్రీవుడు పెద్ద బండరాయిని తీసుకొని రావణుడి రథం మీదకి విసిరాడు.

రావణుడు ఆ రాతి మీదకు తన కత్తిని ఎదురు వేసి గాల్లోనే దాన్ని తుత్తునియలు చేశాడు. చేస్తూనే బాణం ఒకటి తీసి, చెవిదాకా వింటినారిని లాగి, రయ్యిన సుగ్రీవుడి మీదకి వదిలాడు. నిప్పులు కక్కుకొంటూ ఆ బాణం వాయువేగంతో వచ్చి బలంగా సుగ్రీవుణ్ణి తాకింది. సుగ్రీవుడు ఆ దెబ్బకి, స్పృహతప్పి నేలమీద పడిపోయాడు.

రాక్షసులు అది చూసి సింహనాదం చేశారు. సుగ్రీవుడు అలా పడిపోవటం చూసి గావాయుడు, గావాక్షుడు, ఋషభుడు, జ్యోతిర్ముఖుడు, నీలుడు ..... వీళ్ళంతా కోపంతో తమ శరీరాల్ని ఆకాశం అంత ఎత్తు పెంచి, పెద్దపెద్ద బండరాళ్ళు తీసుకొని ఒక్కుమ్మడిగా రావణుడి మీదకు విసిరారు.

వాళ్ళు వేసిన ప్రతి బండరాయినీ, అతిచాకచక్యంగా బాణాలతో చెల్లాచెదురు అయ్యేలా చేశాడు రావణుడు ..... చూస్తుండగానే బాణాలతో వాళ్ళందరిని నేలకూల్చాడు.

ఎక్కడ చూసినా రావణుడే అన్నట్లు వానర సైన్యం మొత్తాన్ని కలియచుడుతూ, బాణాల వర్షాన్ని కురిపించాడు వాళ్లమీద. వారిని నడిపించే సుగ్రీవుడు స్పృహ తప్పి పడివున్నాడు ..... ఏం చెయ్యాలో తోచక తిన్నగా రాముడి దగ్గరికి పారిపోయి జరిగిందంతా ఆయనకు విన్నవించుకున్నారు.

అప్పుడు శ్రీరాముడు రావణాసురుడున్న వైపున బయల్దేరాడు. లక్ష్మణుడు ఆయన్ని ఆపి, "అన్నా ! ఇంతమాత్రం యుద్ధానికి నువ్వు దేనికి ..... నీతో యుద్ధం చేసేంత అతిశయం రావణుడికెక్కడిది ..... నాకు అనుజ్ఞ ఇవ్వండి. వాడి కావరాన్ని అణిచి వస్తాను –" అన్నాడు.

రాముడు చెప్పాడు - లక్ష్మణా ! రావణుడు మహావీరుడు. అతని పరాక్రమం రణరంగంలో మహాద్భుతంగా ఉంటుంది. మూడు లోకాల్నీ భయభ్రాంతుల్ని చేసిన వాడు రావణుడు.

మొదట మనవైపు ఏఏ లోపాలున్నాయో సరిచేసుకో ..... తరువాత వాడి వైపు ఏఏ లోపాలున్నాయో వెదికి అక్కడ దెబ్బ కొట్టాలి మనం.

నిన్ను కాపాడవలసినవి మొదట నీ కళ్ళు - తర్వాత నీ విల్లు ..... ఈ రెండింటిని సక్రమంగా వినియోగించు -" హెచ్చరించి పంపాడు శ్రీరాముడు రావణుడి మీదకి లక్ష్మణుణ్ణి!

లక్ష్మణుడు వేగంగా రావణుడి మీదకు వెళ్ళడం చూసి, హనుమంతుడు వచ్చి ఆయనకు అడ్డం పడి ఆపాడు - "నేనుండగా నీకు శ్రమ దేనికి ?" అంటూ తిన్నగా ఎగురుతూ వెళ్ళి రావణాసురుడి రథం పైన నిల్చున్నాడు.

ఒక్కసారిగా మీదకొచ్చి పడిన ఈ హనుమంతుడి ధైర్యాన్ని చూసి విస్తుపోయాడు రావణుడు !!

# రావణుడితో శ్రీరాముడి రెండో యుద్ధం

రాముడు విరామం తీసుకొన్నాక రావణుడు కొంతసేపటికి తెప్పరిల్లి కళ్ళు తెరిచి చూశాడు. ఎదురుగ్గా లక్ష్మణుడు ..... విల్లంబులతో సిద్ధంగా !

ఏ మాత్రం రావణుడికి అవకాశం ఇవ్వకుండా, అతను తెప్పరిల్లిందే తరువాయి దాడి ప్రారంభించాడు లక్ష్మణుడు. రావణాసురుడి రథంపై ఎగిరే జెండామీద "మనిషి తల" బొమ్మ ముద్రించి ఉంటుంది. లక్ష్మణుడు దాన్ని ఎగరకొట్టాడు. మరో బాణంతో సారథి తల తెగనరికాడు. పక్కనుంచి విభీషణుడొచ్చి గద పుచ్చుకొని రావణాసురుడి గుర్రాల్ని చావచితక కొట్టాడు.

రామాయణంలో గుర్రాల ప్రసక్తి చాలా తక్కువ కన్పిస్తుంది. బహుశా ఉత్తమ జాతి అశ్వాలను రావణుడు సేకరించి వుంటాడు.

స్వయంగా తన తమ్ముడు విభీషణుడే తనకు ఇష్టమైన గుర్రాలను చంపడంతో రావణుడి కోపం ఆకాశం అంత అయ్యింది. రథంలోంచి నేల మీదకు దూకి నిప్పులు కురిసే బాణాల్ని విభీషణుడి మీదకు వేశాడు.

లక్ష్మణుడు ఆ బాణాల్ని మధ్యలోనే తుంచివేసి విభీషణుణ్ణి కాపాడాడు.

అప్పుడు మరింత కోపంతో ఊగిపోతూ రావణుడు "మహాశక్తి" ఆయుధాన్ని విభీషణుడి మీదకు ప్రయోగించాడు. క్షణం ఆలస్యం చెయ్యకుండా లక్ష్మణుడు పరుగున మహాశక్తికి ఎదురు వెళ్ళి విభీషణుడికి అడ్డంగా నిలబడ్డాడు.

తన 'మహాశక్తిని' విఫలంచేసి విభీషణుణ్ణి కాపాడినందుకు రావణుడి ఆగ్రహానికి అంతులేకుండా పోయింది. "లక్ష్మణా ! విభీషణుడిని తప్పించావు కదా ! దాని ఫలితాన్ని అనుభవిస్తావు చూడు" అంటూ మయుడు నిర్మించి ఇచ్చిన మహాశక్తి ఆయుధాన్ని లక్ష్మణుడి మీదకే ప్రయోగించాడు రావణుడు. అది పిడుగులు పడ్తున్నట్లు భయంకరంగా శబ్దిస్తూ లక్ష్మణుణ్ణి బలంగా తాకింది. రాముడది చూసి లక్ష్మణుడికి ప్రాణాపాయం కలిగిందనుకొంటూ పరిగెత్తుకొంటూ అటువైపు రాసాగాడు.

లక్ష్మణుడి గుండెల్లోకి దిగిన మహాశక్తిని పట్టి పెకలించడానికి వానరసేనకు శక్తి చాలలేదు.

రావణుడు బాణాలు వేస్తూనే వున్నాడు. లక్ష్మణుణ్ణి బతకనివ్వకూడదనేది ఆయన లక్ష్యం ! రాముడు ఒకవైపు రావణుడి బాణాలు ఎదుర్కొంటూనే ఇంకొకవైపు తమ్ముడి గుండెలో దిగిన శక్తి ఆయుధాన్ని రెండు చేతులతో బలంగా పెకలించాడు.

వానరవీరుల్ని లక్ష్మణుడి చుట్టూ కావలి పెట్టి, ఈ రావణాసురుడి సంగతి చూసి వస్తాను - లక్ష్మణుడు జాగ్రత్త ! "అన్నాడు.

"వానర వీరులారా ! మీరంతా అలాగే నిలబడి రావణాసురుడితో నేను చేసే యుద్ధం చూస్తూ వుండండి ! ఈ భూమండలం వున్నంత కాలం మా యుద్ధం గురించి కథలు కథలుగా ప్రజలు చెప్పుకొంటారు –" అన్నాడు.

అది మొదలు శ్రీరాముడు వరుసగా బాణాల వర్షం కురిపించాడు. రావణుడు వాటిని ఎదుర్కోవడంలో సతమతం అవుతూనే సందు చూసుకుని తనూ బాణ వృష్టిని సృష్టించాడు. బాణమూ బాణమూ గ్రుద్దుకొని, వాటి ములుకులు ఉల్కల్లా నేలమీదకు రాలసాగాయి.

భూగోళం అంతా అల్లకల్లోలం అవుతోందా అన్నట్లనిపించింది ఆ క్షణాన యుద్ధం చూస్తున్నవారికి !

కళ్ళముందు మూర్చితుడైన లక్ష్మణుడు కన్పిస్తుంటే, ఆగ్రహం పట్టలేక రెట్టింపు క్రోధంతో విజృంభించి రావణుడి మీదకు శరపరంపరతో లంఘించాడు రాముడు.

ఇంక ఇది అనువైన సమయం కాదని గ్రహించాడు రావణుడు. ఉన్నకొద్దీ శ్రీరాముడు విజృంభిస్తున్నాడు. అంతకంతకూ ఆయన బలం రెట్టింపవుతోంది. తట్టుకోలేక

పోయాడు రావణుడు. ఎంత త్వరగా పలాయనం చిత్తగిస్తే అంత మంచిదిగా భావించాడు. చల్లగా యుద్ధ రంగంలోంచి జారుకున్నాడు.

యుద్ధరంగంలో పడివున్న లక్ష్మణుణ్ణి చూశాడు హనుమంతుడు. గుండె ఆడుతోంది. సూషేణుడు వచ్చి, "లక్ష్మణుడు జీవించేవున్నాడు" అని ప్రకటించాడు. మళ్ళీ సంజీవనీ మూలిక వున్న ఓషధీ పర్వతాన్ని తీసుకురావడంకోసం తక్షణం హనుమంతుడు బయల్దేరాడు. ఈసారి చాలా తేలికగా ఆ వనమూలికని గుర్తించగలిగాడు. మూలికని మాత్రమే తీసుకువచ్చాడు. లక్ష్మణుడు జీవించాడు. వనమూలిక ప్రభావంతో మరణించిన వానర వీరులంతా బ్రతికారు.

# మూడో యుద్ధం

పారిపోయిన రావణుడు ఇంకో రథం తీసుకొని మళ్ళీ యుద్ధరంగంలోకి రంకెలేసుకొంటూ వచ్చాడు. రాహువు, సూర్యుడి మీదకు వచ్చినట్లు వచ్చాడు.

రథం మీద రావణుడు

నేల మీద శ్రీరాముడు -

"ఇది అన్యాయం ..... రాముడు నేలమీద నిలబడి యుద్ధం చేస్తుంటే, రావణుడు రథం మీద వుంటే సమాన యుద్ధం ఎలా అవుతుంది ..... అధర్మ యుద్ధమే అవుతుంది -" అనుకోసాగారు పైనుంచి దేవతలు.

అప్పుడు దేవేంద్రుడు తన సారథి 'మాతలి'ని పిలిచి, నా రథాన్ని, ధనుస్సుని, కవచాల్ని, అస్త్రశస్త్రాల్ని తీసుకువెళ్ళి రాముడికిచ్చి రమ్మని పంపించాడు.

రావణుడు అలా చూస్తూండగానే రథమూ, అస్త్రశస్త్రాలన్నీ దేవలోకం నుంచి తక్షణమే శ్రీరాముణ్ణి చేరాయి. ఇంద్రుడు పంపించిన బహుమతుల్ని సగౌరవంగా స్వీకరించాడు శ్రీరాముడు.

తానే స్వయంగా రథసారథిగా వ్యవహరిస్తానని, శ్రీరాముణ్ణి రథాన్ని అధిరోహించమని కోరాడు మాతలి.

రాముడు ఆ రథానికి ప్రదక్షిణం చేసి నమస్కరించి దానిమీద ఎక్కినుంచున్నాడు. శ్రీరాముడు సామాన్య మానవుడు కాదని అదివరకే గ్రహించాడు రావణుడు. ఇప్పుడు అది నిజం అని రూఢీ అయ్యింది. స్వయంగా తన కళ్లతో తనే చూశాడు ఇంద్రుడి రథం ఇక్కడకు రావడం.

ఇద్దరు మహారథికుల మధ్య ఘోరమైన యుద్ధం జరుగుతోంది.

రావణుడు వేసిన గాంధర్వాస్త్రాన్ని శ్రీరాముడి గాంధర్వాస్త్రం నిష్ప్రయోజనం చేసింది. రావణుడు వేసిన ప్రతి అస్త్రానికి రాముడు కూడా ఎదురు ప్రయోగించి, వాటిని నిష్ఫలం చెయ్యసాగాడు.

రావణుడి దగ్గరున్న దివ్యాస్త్రాలన్నీ తన దగ్గరకూడా వున్నాయని నిరూపించుకోవడం రాముడి లక్ష్యం అయ్యింది. ఇంక కొత్తగా ప్రయోగించేందుకు రావణుడికి ఆయుధం లేకుండా పోయింది !

రావణుడు ఆఖరుగా రాక్షసాస్త్రం ప్రయోగిస్తే దానిమీద గరుడాస్త్రాన్ని సంధించాడు శ్రీరాముడు. రాక్షసాస్త్రంలోంచి బయటకు కుప్పతెప్పలుగా వచ్చిన విష సర్పాల్ని చూసి వానర సేన చెల్లాచెదురౌతుంటే, రాముడి గరుడాస్త్రంలోంచి వచ్చిన గ్రద్ద పక్షులు లెక్కలేకుండా వచ్చి ఆ విష సర్పాల్ని ఎగరేసుకుపోయాయి.

ఇంక రావణుడు తన ఇరవై చేతుల్ని వినియోగించి బాణాలు ప్రయోగించడం ప్రారంభించాడు. ఇంద్రుడి రథం మీది జెండాని కూలగొట్టి, గుర్రాన్ని సంహరించాడు. ఇంద్రుడి సారథి మాతలిని కూడా గాయపరిచాడు. విభీషణుడు, వానరులు ఇదంతా చూసి, రావణుడి విజృంభణకు కంగారుపడ్డారు.

వరుసపెట్టి రావణాసురుడు బాణాల్ని ప్రయోగిస్తూ శ్రీరాముడి నఖశిఖపర్యంతం గాయాలు చేశాడు. ఒక బాణాన్ని సూటిగా ఆయన నుదుటి మీదకు ప్రయోగించాడు. ఇంక శ్రీరాముడు కూలిపోతాడేమో అనిపించిన క్షణంలో రావణుడు – నిన్నూ, నీ తమ్ముణ్ణీ యమలోకానికి పంపి, నీ కోతులు తల్లడిల్లేలా చేస్తానంటూ రంకె వేస్తూ పొడవైన పెద్ద శూలాన్ని రాముడి మీదకు ప్రయోగించాడు.

ఆ శూలం తనకు తగలకుండా వుండేందుకు బాణాలు ప్రయోగించి దాన్ని చెదర గొట్టాలని ప్రయత్నిస్తున్నాడు శ్రీరాముడు. ఆయన బాణాలన్నీ రావణాసురుడి ముందు భస్మీపటలం అయిపోతుంటే, ఇంద్రుడు మాతలితో పంపించిన మహాశక్తి ఆయుధాన్ని ప్రయోగించాడు. అప్పటికి రావణాసురుడి శూలం ఖండఖండాలై విరిగి కిందపడింది.

ఈసారి శ్రీరాముడు అవకాశాల్ని సద్వినియోగం చేసుకొని, వేగంగా బాణాలు వేస్తూ మళ్ళీ రావణాసురుడి రథాన్ని, గుర్రాల్ని, సారథిని నేలకూల్చాడు. విజృంభించి బాణవర్షాల్ని కురిపిస్తుంటే, వానరులు కూడా తోడై రావణుడి రథం మీదకు బండరాళ్ళను విసిరేయడం మొదలు పెట్టారు. ముప్పేట దాడి జరుగుతూండటంతో రావణుడు ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. రాక్షసులు ఎవరూ రావణాసురుడికి సహాయం రాకుండా వానరులు కట్టుదిట్టంగానే వ్యవహరించారు.

ఇంద్రుడి తోడ్పాటు వలన శ్రీరాముడు ప్రయోగించిన దివ్యాస్త్రాలన్ని తిరిగి ఆయన అమ్ములపొదిలో ఆవిర్భవించసాగాయి. అలసట పోగొట్టుకొని, శక్తిని పుంజుకొని శ్రీరాముడు మరింత బలసంపన్నుడైనాడు. రెట్టించిన ఉత్సాహంతో రావణుడిమీదకి బాణాలు కురిపిస్తూండే సరికి రావణాసురుడికి భయం పట్టుకొంది. మనసులో పిరికితనం ఏ క్షణాన ప్రవేశించిందో ఆ క్షణాన రావణుడు అసమర్థుడిగా ..... కూలిపోతున్న ఎండు చెట్టులా ..... నిలబడిపోయాడు.

రావణుడి పరిస్థితి గమనించిన ఒక సారథి చెకచెకా ఆయన్ని తన రథం మీద ఎక్కించుకొని దూరంగా తీసుకుపోయాడు.

శ్రీరాముడితో జరిపిన మూడు యుద్ధాల్లో రెండు సార్లు తెలిసి, ఒకసారి తెలియకుండానూ యుద్ధరంగంలోంచి రావణుడి పలాయనం ఇది మూడోసారి !!

# అగస్త్యుడు చెప్పిన ఆదిత్యహృదయం

రావణుడు సొమ్మసిల్లిన తర్వాత ఏర్పడిన విరామంలో అగస్త్య భగవానుడు శ్రీరాముడి దగ్గరకు వచ్చాడు. ఆయన్ని ఊరడించాడు. యుద్ధంలో తగిలిన గాయాల నుంచి తెప్పరిల్లచేశాడు.

మనుష్య రూపం ధరించావు కాబట్టి మానవ స్వభావం సహజంగా ఉంటుంది. రావణుణ్ణి జయించడానికి దైవత్వం తోడుగా వుంటుందేగాని, అది ఒక్కటే సరిపోదు. మనుష్య స్వభావం చాలా అవసరంకూడా. అతన్ని తేలిగ్గా సంహరించే ఒక ఉపాయం ఉంది. పరమ రహస్యమైన ఒక మంత్రం నీకు ఉపదేశిస్తాను – సర్వ శత్రువినాశక మంత్రం ఇది ..... సూర్యభగవానుణ్ణి స్తోత్ర రూపంగా ఈ మంత్రాన్ని పఠిస్తే, పరమ శుభకరంగా ఉంటుంది. దీన్ని “ఆదిత్య హృదయం” అంటారు – అంటూ అగస్త్యుడు ఆ మంత్రాన్ని శ్రీరాముడికి ఉపదేశించాడు.

ఈ మంత్రానికి అధిష్ఠాన దేవత సర్వ సృష్టి స్థితి లయకారకుడైన సూర్యభగవానుడు. కష్టాలు వచ్చినప్పుడు, అడవుల వంటి దుర్గమ మార్గాలలో చిక్కినప్పుడు, భయహేతువులు కల్గినప్పుడు, ఈ మంత్రాన్ని జపిస్తే, సర్వాపదలూ సమసిపోతాయి.

ఈ మంత్ర జపం చేయడానికి ఎలాంటి అధికార నియమాలు లేవు. అందరూ దీన్ని జపించవచ్చు. దీన్ని ఏకాగ్రతతో సంకల్ప పూర్వకంగా మూడుసార్లు జపించు ..... రావణుణ్ణి అతి సులువుగా జయించగల్గుతావు –” అన్నాడు అగస్త్యుడు.

శ్రీరాముడు ఆదిత్యుడిమీదే దృష్టి నిలిపి, ఆచమించాడు. ఆదిత్య హృదయం మంత్రాన్ని జపించాడు. మళ్ళీ ఆచమించాడు. శుచి అయి నిలిచాడు.

సూర్యభగవానుడు దేవతలందరితో కలిసి శ్రీరాముడికి ప్రత్యక్షమయ్యాడు - 'రామా! రావణ వినాశ కాలం ఆసన్నమయ్యింది. త్వరపడు .....” అని పలికి అదృశ్యం అయ్యాడు.

రావణుడి సంహారానికి సిద్ధంగా విల్లు పుచ్చుకొని నిలబడ్డాడు శ్రీరాముడు.

రావణుడి రథం ఘంటాకింకిణీ నినాదాలతో గణగణమంటూ మహావేగంగా వచ్చింది.

అగ్ని పర్వతం బ్రద్దలైనంత శబ్దంతో ధనుష్టంకారం చేశాడు శ్రీరాముడు. రథసారథి మాతలితో అన్నాడు - “అదిగో హడావిడిగా బయల్దేరి వస్తోన్న ఆ రావణుడి రథం చూడు ఖంగారులో అపసవ్యంగా వస్తోంది. అతనికిది నిస్సందేహంగా అపశకునమే !

అలాంటి అపశకునాలు మనకు కలగకుండా రథాన్ని సవ్యంగా రావణుడి వైపు తీసుకెళ్ళు - అని ఆదేశించాడు. యుద్ధ సమయం కదా ..... జాగ్రత్త కోసమే చెప్పాను గాని, నీకు తెలియదనికాదు. ఇంద్రుడి సారథివి కదా .....” అన్నాడు ..... గౌరవిస్తూనే!

దుమ్ము లేపుకుంటూ భూకంపం పుట్టించేట్లు రథాన్ని అమితవేగంతో నడుపుకొంటూ మాతలి శ్రీరాముణ్ణి రావణాసురుడి దగ్గరగా తీసుకెళ్ళాడు. ఆ వేగానికి రాముడి రథంకూడా కొద్దిగా కంపించింది.

ఎర్రబడ్డ కళ్ళతో మహారౌద్రంగా చూశాడు రావణాసురుడు రాముడి వంక !

ఆ సమయంలో ఆకాశంలోంచి రక్తం వానలా కురిసింది రావణాసురుడి రథం మీద. సుడిగాడ్పులు వచ్చి రావణుడి రథాన్ని అపసవ్యంగా చుట్టుముట్టాయి. లంకానగరం పట్టపగలే చీకటిలో మునిగినట్లు దుమ్ములేచి నగరాన్ని ముంచెత్తింది. ఫెళఫెళ మంటూ పెద్దపెద్ద ఉల్కలు రాలాయి. వంటరిగా అక్కడకు వచ్చిన శ్రీరాముణ్ణి సంహరించడంకోసం కత్తులు పుచ్చుకొని చేతులెత్తిన రాక్షసుల చేతులు ఎత్తినవి ఎత్తినట్లే ఉండిపోయాయి.

నక్కలు ఊళబెడ్తున్నాయి. గుడ్లగూబలు కూస్తున్నాయి.

పెంధూళి లేచి రావణుడి ముఖంనిండా తట్టెడంత దుమ్ము వచ్చిపడింది.

మబ్బులు పట్టకుండానే ఆకాశంలోంచి పిడుగులు పడి అనేకమంది రాక్షసులు ఒక్కసారిగా చచ్చిపోయారు. దిక్కులన్నీ చీకట్లతో నిండిపోయాయి.

యుద్ధానికి బయల్దేరిన రావణుడికి కీడును సూచించే ఈ ఉత్పాతాలను చూసి రాక్షసులు చాలా కలత చెందారు.

రావణుడే మొదటి బాణం వేశాడు. ఆ బాణం శ్రీరాముడి రథానికి తగిలి విరిగి రెండుముక్కలై క్రిందపడింది. ప్రతిగా శ్రీరాముడు వేసిన బాణానికి రావణాసురుడి రథమే రెండుముక్కలుగా విరిగింది.

రావణాసురుడు కోపంగా శ్రీరాముడి రథాన్ని లాగుతున్న గుర్రాల మీదకి బాణప్రయోగం చేశాడు. రాముడి గుర్రాలు రవ్వంతకూడా ఆ బాణానికి చలించలేదు.

ఈ వింతలేమిటో రావణుడికి అర్థం కాలేదు. ఈ ప్రత్యక్ష యుద్ధం వలన ఉపయోగం లేదని ఇంక మాయా యుద్ధానికి పూనుకొన్నాడు రావణుడు.

అసురేశ్వరుడి ప్రతి బాణానికి అడ్డుపుల్లలుగా శ్రీరాముడు అంప వృష్టి గురిపిస్తే ఆకాశం యావత్తూ ఎగుర్తున్న బాణాలతో నిండిపోయింది.

ఆ వీర శిఖామణుల్ని చూసి ఉభయపక్షంలోని వీరులు పరస్పర పోరును ఆపి కళ్ళప్పగించి చూస్తూ నిలబడిపోయారు.

యుద్ధం పరాకాష్టకు చేరిందని అందరకూ అర్థం అయిపోయింది. శ్రీరాముడు విజయానికి చేరువలో ఉన్నాడని కూడా అర్థం అయిపోయింది.

కాళనాగు ఆకారంలో బుసలుకొట్టే బాణాన్ని సూటిగా రావణుడి కంఠానికి గురిచూసి వదిలాడు శ్రీరాముడు. తలతెగి రివ్వున ఎగిరి అవతలకు పడింది ! కానీ తలకాయి లేని రావణుడి శరీరం వెనక్కు విరుచుపడిపోలేదు తెగిన తల స్థానంలో మరో తల మొలిచింది.

మొలిచిన ఆ తలని తిరిగి శ్రీరాముడు ఖండించాడు. మళ్ళీ ఇంకో తల మొలిచింది.

నూటొక్కసార్లు రావణుడి తలల్ని ఎగరగొట్టాడు శ్రీరాముడు. నూటొక్క తలలూ తిరిగి మొలిచాయి. 'రావణుడి తలల్ని నరికే పరిశ్రమ మొత్తం వృథా' అని శ్రీరాముడు గుర్తించక తప్పలేదు ..... ఈ రావణుడికి చావులేదా ..... నిజంగానే ఇతన్ని వధించడం అసాధ్యమా ..... ??

ఫాల్గుణ శుద్ధ చతుర్దశి రోజున హనుమంతుడు లంకాదహనం చేశాడు. పౌర్ణమి రోజు రాముడు వంతెన నిర్మాణం చేపట్టాడు. నవమి రోజున యుద్ధం ప్రారంభం అయ్యింది. ఈ రోజు అమావాస్య ..... ఇన్నాళ్ళు విరామం లేకుండా జరుగుతున్న ఈ మహాఘోరమైన యుద్ధంలో రామరావణుల పోరు చూస్తూ నిలబడిపోయిన రాక్షస సైన్యానికి, వానరసైన్యానికి ఇప్పుడే కాసింత విరామం, ఊరట ..... దొరికాయి. అలసట తగ్గి సేద తీరుతూ ఆ యుద్ధ విన్యాసాల్ని నిశ్చేష్టంగా చూస్తున్నారు.

రాముడి బాణం తగిలినప్పుడు వానరసైన్యం చప్పట్లు చరిచింది. రావణుడి బాణం తగిలినప్పుడు రావణుడి సైన్యం ఉత్సాహంగా కేరింతలు కొట్టింది.

శ్రీరాముడు బాణాలు వేస్తూనే ఉన్నాడు. రావణాసురుడి తలలు తిరిగి మొలకెత్తుతూనే వున్నాయి.

ఒకే దృశ్యం మొదటిసారి చూసినప్పుడు అద్భుతం అనిపిస్తుంది. రెండోసారి – మూడోసారి ..... నాలుగోసారి ..... పదే పదే తలలు తెగడం తిరిగి మొలవడం ..... ఎంతసేపని అదే దృశ్యాన్ని చూడగలరూ ఎవరైనా ? చూస్తున్న వానరులకే కాదు, రాక్షసులకృూడా విసుగే అన్పించడం మొదలు పెట్టింది.

"కొట్టవయ్యా రామా ! ఇంకా ఎంతసేపు ఈ తలకాయలతో బంతులాడుకొంటావు ....." అనుకోసాగారు రావణాసురుడి శత్రువులు.

రథసారధి "మాతలి"కి కూడా విసుగొచ్చింది. ఆయన శ్రీరాముడి వైపు తిరిగి, వీరాగ్రణీ ..... రావణ వినాశకాలం ఆసన్నమయ్యింది. బ్రహ్మాస్త్రాన్ని మరిచిపోయారు ..... ? దాన్ని ప్రయోగించు ..... తప్పదు –" అని సూచించాడు.

# స్పృహ తప్పిన రావణుడు

చాలా సేపటికి గాని రావణాసురుడు స్పృహలోకి రాలేదు. అందాకా మూర్ఛలో ఉన్న ఆయన్ని రాక్షసులు కావలి కాశారు.

తెప్పరిల్లిన తర్వాత మళ్ళీ విల్లు – బాణాలు పుచ్చుకొని వానర సైన్యం మీద విరుచుకుపడ్డాడు. వానర వీరులు ఆ బాణ ఘాతాలకు బెదిరిపోయి చెల్లాచెదురై పారిపోసాగారు.

ఇదంతా గమనించాడు శ్రీరాముడు. అటువైపు వేగంగా నడక సాగించాడు. హనుమంతుడు వచ్చి, శ్రీమహావిష్ణువు గ్రద్ద మీద ఎక్కినట్లు నా వీపు మీద ఎక్కి కూర్చొని రావణాసురుడి మీద పోరాడవలసిందిగా కోరాడు రాముణ్ణి. ఆ విధంగా హనుమంతుడి మీద ఎక్కికూర్చొని పోరాడటం మొదలు పెట్టాడు శ్రీరాముడు.

రావణాసురుడి రథచక్రాలు విడిపోయి, రథం కూలిపోయింది. సారధిని చంపి, రావణుడికి ఎవరి సహాయమూ అందకుండా చేశాడు ..... మరో బాణంతో రావణాసురుడి చేతిలో విల్లు విరిగి క్రింద పడిపోయింది ! అర్ధచంద్రాకారంలో వున్న బాణాన్ని తీసుకొని, రావణాసురుడి కిరీటాన్ని ఎగర కొట్టాడు.

కోరల్లో విషం అయిపోయిన కోడెనాగులాగా, మంట చల్లారిపోయిన అగ్ని జ్వాలలాగా, మబ్బు పట్టిన భాస్కరుడిలాగా నిస్తేజంగా నిలబడి పోయాడు రావణాసురుడు.

చూశాడు శ్రీరాముడు. రావణుడి దుఃస్థితికి జాలిపడ్డాడు.

"రాక్షసేశ్వరా !" అని పిలిచాడు రాముడు. నీరసంగా కళ్ళు తెరిచి చూశాడు రావణుడు. యుద్ధరంగంలో అలిసిపోయి సొమ్మసిల్లి వున్న నిన్ను చంపడం ధర్మం కాదు. కాబట్టి నిన్ను వదిలేస్తున్నాను. ఇవ్వాల్టికి ఇంటికి వెళ్ళిపో ..... రేపు రా !" అన్నాడు.

సిగ్గుపడిపోయాడు తన స్థితికి రావణాసురుడు. మరో రథం ఎక్కి భారంగా లంకాపురానికి వెళ్ళిపోయాడు.

రావణుడు పరాజయం పాలయ్యాడన్న వార్త రాక్షసుల్లో కలవరాన్ని సృష్టిస్తే వానరుల్లో కలకలాన్ని సృష్టించింది.

దేవతలు, ఋషులు సంతోషించారు.

# రావణాసురుడి వధ

శ్రీరాముడు బ్రహ్మాస్త్రాన్ని బైటకు తీశాడు. వింటిని సంధించాడు. అంతే ..... సమస్త జీవరాశి భయంతో చలించిపోసాగింది. వసుంధరా రాసి గడగడవణికింది.

రఘురాముడు చెవికొన దాకా వింటినారిని లాగి బ్రహ్మాస్త్రాన్ని సంధించాడు. అది సూటిగా వెళ్ళి రావణుడి గుండెను చీల్చి తిరిగి వచ్చి రాముడి తూణీరంలో చేరింది.

# సీతను రెండవసారి సందర్శించిన హనుమంతుడు

సీతాదేవి అశోకవనంలో వున్నప్పుడు హనుమంతుడు రెండుసార్లు దూతగా వెళ్ళి ఆమెతో సంభాషించాడు.

1. మొదటిసారి వెళ్ళింది సీత జాడ తెలుసుకోవడానికి లంకా నగరానికి వెళ్ళినప్పుడు. అప్పుడు రాముడి ముద్రికను సీతాదేవికిచ్చి, సీత ఇచ్చిన చూడామణినీ, కాకాసురుడి కథనీ రాముడికి అందజేయడంలో విజయవంతంగా ప్రవర్తించాడు.
2. రావణవధ జరిగింది. విభీషణుడికి ఆ యుద్ధరంగంలోనే పట్టాభిషేకం జరిపించాడు రాముడు. అంతా అయిన తర్వాత హనుమంతుణ్ణి పిలిచి, రావణ సంహారం అయ్యిందని, సీత దగ్గరకు వెళ్ళి చెప్పు. ఆమె ఏమన్నదో నాకు వెంటనే వచ్చి తెలియజెయ్యి అన్నాడు.

హనుమంతుడు ఈ విధంగా రామదూతగా రెండోసారి సీతాదర్శనం చేసుకొన్నాడు.

**"సాఽబ్రవీ ద్ద్రష్టు మిచ్ఛామి భర్తారం భక్తవత్సలమ్"** అని సమాధానం చెప్పింది సీత. "భక్తవత్సలుడు, నా భర్త అయిన శ్రీరాముని దర్శనం చేయాలని నా మనసు ఆరాటపడ్తోంది" అని! ఈ సంగతి అంతేవేగంగా వెళ్ళి రాముడికి తెలిపాడు హనుమంతుడు. రాముడు చాలా సంతోషంగా "పదండి! త్వరగా వెళ్ళి సీతను కలుసుకొందాం" అంటాడని అక్కడున్న అందరూ ఊహించారు.

కానీ, రాముడు పెద్దగా నిట్టూర్చాడు. తలవంచుకొని కన్నీళ్ళు కార్చడం మొదలుపెట్టాడు.

రాముడి చింత ఏమిటో ఎవరికీ అర్థం కాలేదు. రాక్షస చెరలో ఇన్నాళ్ళూ వున్న ఒక స్త్రీని ఎలా పరిగ్రహించడమా... అని కావచ్చు... సీత వంటి పవిత్ర వ్యక్తి గురించి అలా ఆలోచించడం కన్నా పాపకార్యం వుందా... అనీ కావచ్చు.

ఒక్కక్షణం చింతా మగ్నుడై, విభీషణుడివైపు తిరిగి –

"దివ్యాంగరాగాం వైదేహీం దివ్యాభరణ భూషితామ్
ఇహ సీతాం శిరస్స్నాతా ముపస్థాపయ మాచిరమ్"

అన్నాడు - సీతాదేవికి మంగళ స్నానాలు చేయించి దివ్యాంగరాగాలతో అలంకరించి ఇక్కడికి తీసుకురమ్మని !

విభీషణుడు అప్పటికప్పుడు అంతఃపుర స్త్రీలను ఆ మేరకు సీతను అలంకరించే పనికి నియోగించాడు. కానీ, సీత అందుకు అంగీకరించలేదు.

"నేను ఇప్పటిదాకా ఎట్లా వున్నానో... అట్లాగే రామదర్శనం చేసుకోవాలని వుంది" అన్నది. అప్పుడు విభీషణుడు రాముడు ఎలా ఆజ్ఞాపిస్తే అలా చెయ్యడం మంచిది - అన్నాడు. సీత అప్పుడు అంగీకరించింది... ఆ అలంకారానికి!

రాచమర్యాదలతో సీతను తీసుకువచ్చారు. ఈ కథ ఇక్కడితో సుఖాంతం కావాలని మనసులోనే వేడుకొంటున్నాడు రాముడు!

# "సీతా! నీ ఇష్టం వచ్చినచోట వుండు!"

సర్వాలంకారభూషితగా వచ్చి వినమ్రంగా నిలబడిన సీతతో రాముడు పలికిన పలుకులు. వింటున్న ప్రతి ఒక్కరికీ బాణపు ములుకుల్లా గుచ్చుకోసాగాయి అవి.

1. నేను శత్రుసంహారాన్ని తలపెట్టాను. దాన్ని దిగ్విజయంగా పూర్తిచేశాను. మా అందరి శ్రమ ఇవ్వాళ్టితో సఫలం అయ్యింది.
2. నేను దగ్గరలేనప్పుడు రావణుడు నిన్ను అపహరించుకువెళ్ళాడు. భార్యను పోగొట్టుకున్న అవమానాన్ని రావణ వధతో తొలగించుకొన్నాను.
3. ఇంతమంది సహృదయంతో ఈ యుద్ధకార్యంలో తోడ్పడ్డారు. వీళ్ళ సహాయాన్ని నేను పొందింది కేవలం నా భార్యను నేను తెచ్చుకోవడానికి కాదు. దుష్ట శిక్షణ చేయడానికి !
4. ఇంతకాలం పరాయి ఇంట రాక్షస చెఱలో వుండడం వలన నీ చరిత్ర సందేహించే అవకాశం ఏర్పడింది. కళ్ళకలక వచ్చినవాడు దీపాన్ని సరిగా చూడలేకపోయినట్టు, లోకం నిన్ను కళంకితగా చూసే ప్రమాదం వుంది.
5. నాకు నీ మీద ప్రేమ మునుపటి ప్రేమే ! అందులో మార్పేమీ లేదు. నా ప్రేమ నిన్ను స్వీకరించమని చెప్తోంది. కానీ, జనాపవాద భయం మాత్రం పరిత్యజించాలనే అంటోంది.
6. **"నాస్తి మేత్వయ్యభిష్వంగో యథేష్టం గమ్యతామితి"** - నాకు నీ మీద ఎలాంటి ఆసక్తి లేదు. నీ ఇష్టం వచ్చిన చోటకు పోయి ఉండవచ్చు.

7. నా తమ్ముళ్ళు లక్ష్మణుడు, భరతుడు, శతృఘ్నుడు, సుగ్రీవుడు, విభీషణుడు... ఎవరి దగ్గరయినా వుండవచ్చు. లేదా మిథిలానగరానికి వెళ్ళి నీ తల్లిదండ్రుల దగ్గరైనా వుండవచ్చు.

బహుశా రాముడు ఇలా అంటాడని సీత ముందుగా ఊహించి వుండవచ్చు. ఇలా అన్నప్పుడు తట్టుకోగలిగేలా మనసు దిటవుచేసుకొని వుండవచ్చు. సీత మానసికంగా ఇందుకు ముందే సిద్ధంగా వుందనిపించేందుకు కొన్ని సాక్ష్యాలున్నాయి.

రావణ వధ జరగంగానే సీతను దర్శించే ఉత్సాహం రాముడు చూపించకపోవడం లోనే ఆమెకు అనుమానం ధృవపడివుండాలి. విభీషణుడి పట్టాభిషేకం అన్నీ అయ్యేవరకూ సీత గురించి ఆలోచనే రాకపోయినప్పుడే ఆమెకు అర్థం అయివుండాలి. సీత ఏమంటోందో కనుక్కోమని హనుమంతుణ్ణి పంపడం కాలయాపనకే ! తాను ఏమంటుందో మొదటిసారే హనుమంతుడికి చెప్పి పంపింది సీత ! ఇంక కొత్తగా రావణవధ జరిగిన తర్వాత అనేందుకు ఏముంటుందీ ? కాబట్టి, రాముడు కావాలనే సీతను పరిగ్రహించడానికి తాత్సారం చేస్తున్నాడని స్పష్టంగా అర్థం అయిన స్థితిలోనే ఆమె రాముడి సన్నిధికి చేరింది.

అయినా రాముని సందర్శించాలనే తాపత్రయం వలన ఆమె అక్కడకు రావడానికి అంగీకరించింది. లేకపోతే, తన దగ్గరకు వచ్చి తనను పరిగ్రహించమనే అడిగివుండేది !

రాముడు తనతో "నీ ఇష్టంవచ్చిన చోట వుండవచ్చు" అన్న తర్వాతే ఆమె మాట్లాడడం మొదలుపెట్టింది –

1. భర్త అయినవాడు ఏ మాట అనకూడదో ఆ మాట అనేశావు – రామా ! నువ్వు అనుకునే దోషం ఏదీ నాలోలేదు. ఒట్టు !
2. నన్ను వెదకడం కోసం హనుమంతుణ్ణి పంపినప్పుడో, నన్ను తీసుకురమ్మని పంపినప్పుడో ముందుగా ఇవే మాటలు చెప్పివుంటే, నలుగురిలో ఈ అవమానం నాకు జరిగి వుండేది కాదు.
3. నేను భూమి పుత్రిని ! ఈ వసుధాతలం వల్ల నాకా పేరు కల్గింది. నేనింకా బాల్యావస్థలో వున్నప్పుడే నన్ను పెళ్ళిచేసుకొన్నావు. కానీ, నా భక్తినీ, నా శీలాన్ని అర్థం చేసుకోలేకపోయావు.
4. నన్ను వివశురాల్ని చేసి ఒక మహారాక్షసుడు నన్నపహరిస్తే ఆ దోషం నాకు ఆపాదించడం అన్యాయం.
5. ఇష్టంలేని భర్త వదిలేసిన ఆడదాన్ని – నాకు అగ్నిప్రవేశమే కర్తవ్యం.
6. "లక్ష్మణా" నా కోసం అగ్నిని ప్రజ్వరిల్ల చెయ్యి.

సీత పలికిన ఈ మాటలు వింటున్నప్పుడు రాముడు తలకాయి వంచుకునే వున్నాడు. కన్నెత్తి ఆమె వంక చూడలేదు.

లక్ష్మణుడు రాముడివైపు చూశాడు. రాముడి వైపునుండి ఎలాంటి ప్రతిస్పందనా లేదు. బహుశా అగ్నిని ప్రజ్వరింప చేయవలసిందిగా రాముడు కూడా కోరుకుంటూ వుండాలి. ఆయన మనసెరిగిన లక్ష్మణుడు తక్షణం అగ్ని రాజిల్లచేశాడు.

ఆమెకు ఇష్టమైన చోటుకు వెళ్ళవచ్చనేది రాముడి ఆజ్ఞ ! ఆమె తనకు ఇష్టమైన చోటుకే వెళ్తోంది. ఆమెను ఆపేందుకు ఎవరికి హక్కుంది... ?

**యథా మాం శుద్ధ చారిత్రాం దుష్టాం జానాతి రాఘవః ।**
**తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతుపావకః ॥**

"ఏ చరిత్ర నన్ను శంకిస్తుందని రాముడు భయపడ్తున్నాడో ఆ నా చరిత్ర శుద్ధమైనదైతే, లోకసాక్షి అయిన అగ్ని దేవుడు నాకేశాంబరాలకు కూడా ఎలాంటి హాని చెయ్యకుండుగాక" - అంటూ అగ్నిచుట్టూ ప్రదక్షిణం చేసింది.

"నా హృదయం ఏ క్షణంలోకూడా రామప్రభువుని విడిచి వుండనిమాట నిజమే అయితే, అగ్ని నన్ను రక్షించుగాక" - అని రాముడి చుట్టూ కూడా ప్రదక్షిణం చేసింది సీత.




ఆమె నిర్భయంగా సర్వజన సమక్షంలో అగ్నిప్రవేశం చేస్తున్నప్పుడు దేవతలు, గంధర్వులూ కళ్ళప్పగించి చూస్తూనే వున్నారు. రాక్షసులు, వానరులు హాహాకారాలు చేశారు. రాముడు లోపల్లోపల చింతిస్తూనే వున్నాడు. కానీ చలించలేదు. సీత అగ్నిగుండంలో ప్రవేశించి అదృశ్యమైపోయింది.

అప్పుడు బ్రహ్మదేవుడు అక్కడకు వచ్చాడు. "రామచంద్రా!" అని పలకరించాడు. "నువ్వు సర్వలోకకర్తవి - సర్వజ్ఞుడివి - సీతమ్మ అగ్నిప్రవేశం చేస్తుంటే చూస్తూ ఎలా ఊరుకున్నావు" - అన్నాడు. రాముడు తలఎత్తి బ్రహ్మదేవుడి వంక చూశాడు. ఆయన

నేత్రాలు దుఃఖంతో ఎర్రబడిన అగ్నిగోళాల్లా వున్నాయి. "సాక్షాత్తూ ఆ దేవదేవుడివి అని నిన్ను నువ్వు ఎరగవెందుకనీ" - అని మళ్ళీ ప్రశ్నించాడు. మామూలు మనిషిలా సీతను ఆక్షేపిస్తావేమిటీ- అని నిలదీశాడు.

దానికి రాముడు బ్రహ్మతో చెప్పిన సమాధానం ఇది -

**"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్।"** మహనీయులారా! మీరంతా ఇక్కడకు రావడం, మీ దర్శనభాగ్యం నాకు కలగడం నా అదృష్టం. కానీ, మీరు చెప్తోన్నదేమిటో నాకు అర్థం కావట్లేదు. నేనిప్పటిదాకా మనిషేననీ, దశరథుడి కొడుకుననీ మాత్రమే అనుకొంటున్నాను.

మీరు ఇప్పుడు వచ్చి, **"ఆత్మానం నావబుధ్యసే"** అంటున్నారు. నన్ను నేను ఏం తెలుసుకోవాలో నాకు తెలీడం లేదు. నేననుకొన్నట్టు దశరథుడి కొడుకుని, మనిషినీ కాకపోతే "మరి నేనెవరినీ" ఎక్కడనించి వచ్చాను ? యతశ్చాహం...? దయచేసి చెప్పండి - అన్నాడు.

బ్రహ్మకి ఇది మంచి అవకాశం... శ్రీరాముడి అవతారం ప్రయోజనం లోకానికి చాటిచెప్పడానికి ! తనచేత చెప్పించడం కోసమే రాముడు నేనెవర్నీ, ఎక్కడినించి వచ్చాను - ఇలా అడిగాడనేది సుస్పష్టం. ఆ అవకాశం తనకే వచ్చినందుకు బ్రహ్మదేవుడు కూడా సంతోషించి వుండాలి. ఆయన అందరికీ వినపడేలా ఇలా ప్రకటించాడు-

**"భవాన్నారాయణో దేవః శ్రీమాంశ్చక్రాయుధః ప్రభుః ।**
**సీతా లక్ష్మీర్భవాన్ విష్ణుర్దేవాః"**

"రామచంద్రా! నువ్వు నారాయణుడివి. సీతాదేవి స్వయంగా లక్ష్మీదేవి. రావణవధ కోసమే నువ్వు మనుష్య శరీరాన్ని ధరించి ఈ భూమ్మీద అవతరించావు. రావణ సంహారం అయ్యింది. ఇంక సీతాదేవితో సహా ఈ మహారాజ్యాన్ని పాలించి భూలోకాన్ని అలంకరించు" - అన్నాడు బ్రహ్మదేవుడు. రాముడు మాట్లాడలేదు -

బ్రహ్మ ఇలా ప్రకటించిన తర్వాత, అగ్నిదేవుడు దివ్యరూపంతో జ్వాలల్లోంచి లేచి సీతాదేవిని యథారూపంగా తీసుకొచ్చి రాముడికి అప్పగించాడు.

**"ఏషాతే రామ వైదేహీ పాపమస్యాం నవిద్యతే"**

"రామా! ఇదిగో నీ సీత. ఈమె నిష్కళంక ! 'పాపం' అంటే ఏమిటో ఈమెకు తెలియదు" అని ప్రకటించాడు. "రావణుణ్ణి తిరస్కరించి నిన్నే ధ్యానిస్తూ కాలంగడిపిన పతివ్రత" అని నిర్ధారణగా చెప్పాడు. "ఇంకోమాట మాట్లాడకు ! ఈమెను స్వీకరించు! ఇది నా ఆజ్ఞ ! **"అహమాజ్ఞ పయామితే"** అన్నాడు.

"లోకమర్యాదలు తెలీని కాముకుడు ఒక స్త్రీని తన స్థావరంలో వుంచుకొన్నప్పుడు, లోకంలో మూర్ఖులు ఎలా ఆలోచిస్తారో, ఎంత నీచంగా మాట్లాడతారో, లోక నైజం ఎలా వుంటుందో తెలుసు కాబట్టే సీత అగ్ని ప్రవేశానికి నేను అంగీకరించాను" అన్నాడు అగ్నికి సమాధానంగా రాముడు.

"సూర్యుడికన్నా అతని వెలుగు ఎలా వేరుకాదో, అలాగే సీతా, నేనూ వేర్వేరు కాదు. ఆమె జన్మశుద్ధిగల సాధ్వి. జగత్పూజ్యులైన మీ మాట నాకు అవశ్యం కర్తవ్యం. ఇదిగో... సీతను స్వీకరిస్తున్నాను" అన్నాడు.

దేవతలంతా ఒక్కరొక్కరే వచ్చి శ్రీరాముని పలకరించారు. శివుడు రావణపీడని వదిలించినందుకు ప్రత్యేకంగా అభినందించాడు. "అదిగో ఆ విమానంలో దేవదేహాన్ని ధరించి వున్న వ్యక్తి నీ తండ్రి దశరథుడు. నీ కారణంగా తరించినవాడు. నువ్వూ నీ తమ్ముడూ ఆయనకు నమస్కారం చెయ్యండి" అని చెప్పాడు శివుడు.

దశరథుడు తన కుమారుడు రాముని కౌగిలించుకొని, నిన్ను వనవాసానికి పంపిన దుఃఖంతోనే నేను మరణించాను. కానీ, రావణవధ కోసం నీ పట్టాభిషేకాన్ని ఆపి నిన్ను అడవులకు పంపడం అనేది దేవతల సంకల్పం అని ఇప్పుడు తెల్సింది. నా జన్మధన్య మైందయ్యా... అన్నాడు దశరథుడు.

చనిపోయి దైవత్వం పొందిన తనతండ్రిని ఇలా కలుసుకోగలగడం ఏ కొడుకుకైనా గొప్ప విషయమే ! రాముడు తనకొక వరం ఇమ్మని కోరాడు తండ్రిని.

"మహనీయా! భరతుడికి పట్టంకట్టి, నన్ను అడవులకు పంపమని అడిగిందని కైకేయీ మాతను "నీ పుత్రుడితో సహా నిన్ను ఇదే త్యజిస్తున్నాను" అని నిందించారు ఆరోజున మీరు. ఆ దోషం కైకేయీ మాతకు తగలకుండా అనుగ్రహించండీ అనడిగాడు రాముడు. దశరథుడు అందుకు అంగీకరించాడు. లక్ష్మణుణ్ణి అన్నగారి సేవలో ధన్యుడివి కమ్మని తండ్రిగా ఆశీర్వదించాడు. సీతను ఓదార్చాడు. ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళమని అన్నాడని మనసులో పెట్టుకోవద్దని, ఆమె పాతివ్రత్యాన్ని లోకానికి చాటడానికే రాముడు ఇలా చేశాడనీ ఆమెకు నచ్చచెప్పాడు.

**"అవశ్యం తు మయా వాచ్య మేషత్ దైవతం పరమ్"**

నీ భర్త పరదైవతం సుమా - నీకు తెలియంది కాదు- అయినా నేను చెప్పాలి కాబట్టి చెప్తున్నాను - అన్నాడు సీతతో దశరథుడు.

దేవేంద్రుడు కూడా వచ్చి రాముణ్ణి పలకరించాడు. రావణుడి చెరనుంచి దేవతలందరికీ విముక్తి కల్గించినందుకు అందరి పక్షాన ధన్యవాదాలు చెప్పాడు. దేవతలందరమూ మహాప్రీతిని పొందాము... నీకు ఏదైనా కోరికవుంటే చెప్పు నెరవేరు స్తాము- అన్నాడు. రాముడు కూడా సంతోషించి వరం అడగాలని నిర్ణయించుకున్నాడు -

"మమ హేతోః పరాక్రాన్తా యే గతా యమసాదనమ్
తే సర్వే జీవితం ప్రాప్య సముత్తిష్ఠన్తు వానరాః ॥

"నాకోసం యుద్ధంలో సహకరించాలని వచ్చి పోరాడి వీరమరణం పొందిన వానర వీరులంతా జీవించాలి... వాళ్ళకు ఎలాంటి అంగవైకల్యం కలగకుండా యథాపూర్వంగా, ఆరోగ్యంగా వుండాలి. వాళ్ళంతా బలసంపన్న స్థితిలో వుండగా చూడాలని వుంది-" అన్నాడు. అక్కడితో ఆగలేదు,

వానరుల పట్ల తన కృతజ్ఞతను శాశ్వతంగా నిలపదలచుకున్నాడు.

"దేవేంద్ర ! ఈ వానరులు ఎక్కడుంటే అక్కడ జలసమృద్ధి, ఫలసమృద్ధి కలుగుతూ వుండాలి... ఇదే నేను కోరే వరం" అన్నాడు.

దేవేంద్రుడి వరప్రభావంతో మరణించిన వానరులంతా నిద్రనుండి లేచిన వాళ్ళలాగా సంపూర్ణ ఆరోగ్యంతో లేచారు.

వానరుల ఆనందానికి అవధులు లేకుండా పోయాయి.

# మానవ ధర్మాన్ని పాటించిన రాముడు

వరగర్వితుడైన రావణుణ్ణి తాను తన దైవీయాంశతో కాక, కేవలం మానవ స్వశక్తితోనే జయించాలనేదే రామసంకల్పంగా కన్పిస్తుంది ! కర్మమార్గాన కర్తవ్య పాలన ద్వారా విజయం సాధించి లోకానికి చూపెట్టాడు శ్రీరాముడు.

రాముడు మానుషధర్మాన్నే పాటించడానికి రెండు బలీయమైన కారణాలు కన్పిస్తున్నాయి.

1. దేవతల వలన మరణంలేని రావణుణ్ణి మానవుడిగానే జయించగలగడం.
2. దైవీయాంసతో మానవాతీతుడిగా ప్రవర్తించివుంటే, మనం దణ్ణం పెట్టి ఊరుకునే వాళ్ళం! కానీ, మర్యాదా పురుషోత్తముడి మార్గాన్ని అనుసరించి జీవించాలనే సంకల్పం మనలో కలగాలంటే రాముడు మానవుడిగానే ప్రవర్తించాలి !

వాల్మీకి రామపాత్రను ఆ విధంగానే చిత్రించాడు. రాముడు దేన్ని ప్రమాణంగా చూపించాడో అది లోకానికంతా ప్రమాణంగా వుంటుంది కాబట్టి !!

భగవద్గీతకూడా ఇదే విషయం చెప్తుంది -

"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।
సయత్ప్రమాణం కురుతేలోకాస్తదనువర్తతే"

– అని ! తను ఏది ప్రమాణంగా చూపుతాడో లోకం దాన్నే అనుసరిస్తుంది ! అది ఉత్తమమైన నాయకుడి లక్షణం !!

# విభీషణా ! త్వరగా వెళ్ళిపోవాలి !!

యుద్ధం పూర్తయిపోయింది.

సీతాదేవి అగ్ని పరీక్ష జరిగిపోయింది.

ఆ రాత్రి అందరూ ప్రశాంతంగా నిద్రించారు. తెల్లవారుతూనే విభీషణుడు వచ్చి, లంకా నగరానికి విచ్చేయవలసిందిగా ఆహ్వానించాడు.

రాముడు విభీషణుడి విజ్ఞప్తిని సున్నితంగా తిరస్కరించాడు. "నా మనసు ఇక్కడ లేదయ్యా ! సుగ్రీవాదుల్ని సగౌరవంగా ఆహ్వానించు..." అన్నాడు. విభీషణుడు ఎదురు మాట్లాడలేకపోయాడు -

పద్నాలుగు సంవత్సరాల వ్రతం తీరిన మర్నాడే భరతుడి దగ్గరకు వస్తానన్నాను. నిన్నటితోనే ఆ వ్రతం పూర్తయ్యింది. ఇవ్వాళ నేను అయోధ్యలో వుండాలి.... అది దగ్గరలోనో దాపులోనో వున్నది కాదు కదా... అంటూ ఆలోచనలో మునిగిపోయాడు రాముడు. "ఈ రోజు నేను అయోధ్యకు వెళ్ళలేకపోతే, రేపు భరతుడు అగ్నిప్రవేశం చేస్తాడు. అన్నంత పని చేసే మనిషే... భరతుడు" - అని బాధపడ్డాడు.

అప్పుడు విభీషణుడు ఓదార్పుగా అన్నాడు - "శ్రీరామ! కుబేరుడి విమానాన్ని రావణుడు దౌర్జన్యంగా తన దగ్గర అట్టేపెట్టుకున్నాడు. నిన్ననే కుబేరుడు వచ్చి దానిని తనకిప్పించమని అడిగాడు. నేను మీకోసం దాన్ని అట్టేపెట్టాను. మీరు ఈ పూట మా ఆతిథ్యం స్వీకరించి, దానిపైన అయోధ్యకు వెళ్ళండి అది వాయు మనోవేగాలతో తీసుకువెళ్తుంది" - అన్నాడు.

రాముడు మాట్లాడలేదు.

"ప్రాజ్ఞమణీ ! మీమీద నా భక్తి నిజమే అయినట్లయితే, నీ అనుగ్రహానికి నేను నిజంగా పాత్రుడినైతే, నిండుమనసుతో నేను అర్చించుకునే పూజకు సీతాలక్ష్మణ సమేతంగా రావాలని కోరుకొంటున్నాను. కాలహరణం అవుతుందని ఆలోచించవద్దు. సకాలంలో మీరు పుష్పక విమానంలో చేరేలా చూసే బాధ్యత నాది !

నా సపర్యల్ని ససైన్య సుహృద్గణంగా గ్రహించాలని వేడుకొంటున్నాను -

రాఘవా !

నా మీద నీకున్న ప్రేమతో నువ్వు నా విన్నపాన్ని కాదనవనే నమ్మకంతో ఈ చొరవతీసుకొని ప్రాధేయపడ్తున్నాను-

ఈ సేవకుడి సాహసాన్ని మన్నించు"- అని మహావినయంతో అడిగాడు.

రాముడు చిన్నగా నవ్వాడు.

"తమ్ముడూ ! విభీషణా ! ఈ యుద్ధంలో నాకు నువ్వందించిన సహాయమే గొప్ప సపర్య ! అంతకుమించి చేయగల సపర్యలు ఇంకేం వుంటాయి... ఇంతకన్నా గొప్ప పూజలు వుంటాయనుకోను -

అక్కడ నాకోసం అఱ్రులుచాస్తోన్న నా తమ్ముడు భరతుడి మీద నా మనసు త్వరపడ్తోందయ్యా !

మా అమ్మ కౌసల్య, మా పినతల్లులు - మా పురజనం నాకళ్ళ ముందు మెదుల్తున్నారు -

నేను చాలా త్వరగా వెళ్ళాలి -

వెళ్ళేందుకు అనుజ్ఞ ఇవ్వు -

ఆ పుష్పక విమానం ఇస్తానన్నావే... అదే గొప్ప సపర్య ! గొప్ప పూజ! ఆ ఉపకారం చెయ్యి చాలు... ఇంకోలా అనుకోకు - విమానాన్ని త్వరగా రప్పించు" - అన్నాడు రాముడు.

విభీషణుడు ఇంకా ఎక్కువ వత్తిడి చేయడం ధర్మం కాదనుకున్నాడు. రాముడి మనసు అర్థం అయ్యింది. ఆయనిప్పుడు తక్షణం అయోధ్యకు వెళ్ళాలి... అంతే !

అప్పుడు రాముడు చెప్పాడు -

"విభీషణా! లంకానగరాన్ని దేవతలే జయించలేకపోయారు. కానీ, ఈ కార్యాన్ని వానరుల సహాయంతో మనం పూర్తిచెయ్యగలిగాము. వానరులే లేకపోతే ఈ యుద్ధ దృశ్యాల్లో ఒక్కటికూడా ఇక్కడ జరిగేది కాదు - ఈ పరిణామాలేవీ జరిగి వుండేవి కాదు కూడా !

ఈ వానర వీరులకు మనం ఏం ఇచ్చినా వారి ఋణం తీరదు. నీ ఇష్టం... ఎలా చేస్తావో... వీళ్ళందరినీ తగురీతిలో సత్కరించు... వాళ్ళంతా కృతజ్ఞతామతులు- నీ సన్మాన గౌరవాలకు వాళ్ళెంతో సంతోషిస్తారు - నువ్వంటే ఇష్టపడతారు.

అందువలన నీ ధాతృత్వం వెలుగులోకి వస్తుంది. నీ మిత్ర సంగ్రహణకరిత్వం మిత్రులతో సన్నిహితంగా మెలిగే నీ మంచితనం బైటకొస్తాయి. నీ దయార్ద్రకృత్యాలు పదిమందికీ వెల్లడౌతాయి" - అన్నాడు రాముడు.

అప్పటికప్పుడు విభీషణుడు రత్నవైఢూర్యాలతో వానర సైనికులందరినీ యథాయోగ్యంగా సత్కరించాడు.

తర్వాత సీతాలక్ష్మణులతో కలిసి రాముడు పుష్పక విమానం ఎక్కి కూర్చున్నాడు.

సుగ్రీవుణ్ణి పలకరించి, "మిత్రమా ! మీ వానరోత్తములంతా ఒక స్నేహితుడిగా, ఒక బంధువుగా నా కార్యాన్ని చక్కగా నెరవేర్చారు. మీ అందరికి ధన్యవాదాలు. ఇంక మీరంతా మీ స్వస్థానాలకు వెళ్ళి ప్రశాంతంగా జీవించండి ! యుద్ధాలు లేని సమాజం కావాలి. రాక్షస పీడలేని సుఖజీవనం కావాలి - అది నీ ప్రజలకు కల్గించు" - అన్నాడు రాముడు. "మీ అందరూ నాకు అనుమతినివ్వండి. మేము తక్షణమే వెళ్ళాలి" - అన్నాడు.

సుగ్రీవుడు, విభీషణుడు ముందుకొచ్చి, అయోధ్యకు మేమూ రావాలనుకుంటు న్నాము. మా పరివారంలో ప్రతిఒక్కరూ మీ పట్టాభిషేక మహోత్సవం చూడాలను కొంటున్నారు.

మా వలన మీ నగరానికి గాని, నగరవనాలకు గాని, జనానికి గాని ఎలాంటి బాధ కలగకుండా జాగ్రత్తగా వుంటాం...

"దశరథాత్మజా ! నిన్ను కన్నతల్లికి మొక్కి నీ పట్టాభిషేకం చూసి వెనక్కి వచ్చేస్తాం..." అని బ్రతిమాలారు...

కాదనలేకపోయాడు రాముడు....

ఈ విమానంలో ఎంతమంది పడ్తారా... అని వెనక్కి చూశాడు రాముడు. 'ఎంతమందయినా పడతారు. ఎంతమంది ఎక్కినా ఇంకొకరి కోసం ఇందులో చోటుంటుంది. ఇదీ ఈ విమానం ప్రత్యేకత" అని వివరించాడు విభీషణుడు. "ఇది దివ్య విమానం" అన్నాడు.

"అయితే, కిష్కింధ ప్రభువు సుగ్రీవా ! లంకా సామ్రాజ్య ప్రభువు విభీషణా... మీ ఇద్దరికీ ఇదే నా ఆహ్వానం. మీరు మీమీ పురజన పరివారంతో సహా అయోధ్యకు రావడం నాకెంతో సంతోషాన్నిచ్చే అంశం. తప్పకుండా రావలసిందిగా కోరుతున్నాను" అన్నాడు.

అందరూ జైజై నినాదాలు ఇస్తూ విమానం ఎక్కడం మొదలుపెట్టారు.

నిన్న సాయంత్రం వరకూ ఒకరికొకరు కత్తులు దూసుకున్న రాక్షస - వానర వీరులు ఇవ్వాళ పుష్పకవిమానం ఎక్కి సరదాగా, సస్నేహంగా, ఆత్మీయంగా పలకరించుకొంటూ, ఒకరినొకరు కౌగిలించుకొంటూ అయోధ్యకు ప్రయాణం కావడమే ఇక్కడ ముఖ్య విషయం !

## కిష్కింధను సందర్శించిన సీత

విమానం రయ్యిన వెడ్తోంది. పైనుంచి వెడుతూ ఒక్కో ప్రాంతాన్ని చూపిస్తూ దాని విశిష్టతనీ వివరించి చెప్తున్నాడు రాముడు...

"వైదేహీ ! ఇదిగో లంకాపురం... అదిగో త్రికూట పర్వతం... కైలాస శిఖరానికి సమానమైన ఈ పర్వతం మీద విశ్వకర్మ లంకానగరాన్ని నిర్మించాడు.

ఇదిగో అది రణభూమి... రావణుడు అక్కడ నేలకొరిగాడు. కుంభకర్ణుడ్ని ఇదిగో ఇక్కడ చంపాను- హనుమంతుడు ధూమ్రాక్షుడ్ని అదిగో అక్కడ చంపాడు- అంటూ పైన ఎగురుతున్న విమానంలోంచి యుద్ధభూమిని చూపించాడు.

ఇదిగో సముద్రతీరం... అదిగో నీలుడు కట్టిన వంతెన ! హనుమంతుడికి విశ్రాంతి ఇవ్వాలని మైనాక పర్వతం పైకి పొడుచుకొచ్చింది – అదిగో... అదే !

సముద్రుడు నాకు ప్రత్యక్షం అయ్యింది... ఇదిగో... ఇక్కడ...

విభీషణుడు శరణు కోరివచ్చింది ఇక్కడ...

అక్కడ పరమశివుడు నాకు కర్తవ్యబోధచేశాడు.

చూస్తున్నావా... అదిగో సుందర నగరం కిష్కింధ. విచిత్రకానన నగరం అది... అదిగదిగో అక్కడ... వాలిని వధించిన చోటు అదే ! అవతలే కన్పిస్తోంది ఋష్యమూక పర్వతం... అదీ కిష్కింధ, సుగ్రీవుడి రాజధాని..." అంటూ వివరంగా అన్నీ చూపించడం మొదలుపెట్టాడు.

సీత కిష్కింధా నగరాన్ని చూసి చాలా ఆనందించింది. ఆశ్చర్యపోయింది. తోటలు ధ్వంసం చేసే వానరుల రాజధాని ఇంతచక్కని తోటలతో నిండిన నగరమా...! అని అబ్బురపడింది.

"నాథా! వానరులు మనకోసం ప్రాణత్యాగం చెయ్యడానికే సిద్ధపడ్డారు. వాళ్ళకు మనం ఎంత ఇచ్చినా, ఏమిచ్చినా ఋణం తీర్చుకోలేము. ఒక్కసారి ఆ త్యాగమూర్తుల భార్యల్ని పలకరించాలని కోరికగా వుంది" వీలైతే వాళ్ళని కూడా మనతో అయోధ్యకు ఆహ్వానిద్దాం..." అంది.

కొద్దిసేపు కిష్కింధలో ఆగడానికి సమ్మతించాడు రాముడు. సుగ్రీవుడు చకచకా విమానం దిగి అంతఃపురంలోకి వెళ్ళి తారకు సీతాదేవి కోరిక గురించి తెలియజేశాడు. క్షణాలలో వానరపత్నులకు కబురుపెట్టడం జరిగిపోయింది.

కిష్కింధా నగరంలోని స్త్రీలంతా విమానం దగ్గరకు చేరిపోయారు. సీతాదేవి వారందరినీ ఆప్యాయంగా పలుకరించింది. కృతజ్ఞతలు చెప్పుకొంది. తమ పట్టాభిషేక మహోత్సవానికి రావలసిందిగా అందరినీ ఆహ్వానించింది. వానరాంగనులంతా విమానం ఎక్కారు. విమానం గాలిలోకి ఎగిరి కిష్కింధానగరం అంతా తిరిగి, రివ్వన ముందుకు దూసుకుపోయింది.

పంపానదీ తీరాన్ని, ఋష్యమూక పర్వతాన్ని చూపించాడు సీతాదేవికి శ్రీరాముడు. శబరి ఆశ్రమాన్ని చూపించినప్పుడు ఆ దివ్య వనితారత్నానికి మనసులోనే నమస్కరించుకొంది సీత !

కబంధుడి చేతులు నరికిన ప్రదేశం, జటాయివు రావణుని ఎదుర్కొన్న చోటు, రావణుడు తనని అపహరించిన తావుల్ని చూపించాడు. ఆకాశంలోంచే వాటిని గమనించింది సీత !

అదిగో గోదావరి నది... ఇదిగో గౌతమి !

అదీ అగస్త్యాశ్రమం

ఇదీ సుతీక్ష్ణమహర్షి ఆశ్రమం

వైదేహీ ... అక్కడ... శరభంగాశ్రమం... ఇక్కడే కదూ.... దేవేంద్రుడు మనకు దర్శనం ఇచ్చాడు... గుర్తున్నదా... ?

అదీ అత్రిమహర్షి ఆశ్రమం... అనసూయామాతని మనం సందర్శించుకున్నాం.

అదిగదిగో చిత్రకూట పర్వతం... భరతుడు ఇక్కడే మనల్ని కలిసి అయోధ్యకు తిరిగిరమ్మని ప్రాధేయపడ్డాడు.

అదిగో ... వచ్చేశాం... యమునా నదీతీరానికి !

భరద్వాజముని ఆశ్రమం అదిగో... ఒక్కక్షణం ఆగుదాం... ఆ మహనీయుడి ఆశీస్సులు తీసుకొందాం... అన్నాడు రాముడు.

సీతారాములిద్దరూ విమానం దిగి నడుచుకొంటూ భరద్వాజముని ఆశ్రమానికి వెళ్ళారు.

## భరతుడి మనసు తెలుసుకునేందుకు వెళ్ళిన హనుమంతుడు

రాముణ్ణి దూరం నుంచి చూస్తూనే ఎదురేగి స్వాగతించాడు భరద్వాజముని. "సరిగ్గా పద్నాలుగేళ్ళక్రితం చైత్రశుద్ధ పంచమినాడు ఇలాగే నారచీరలు కట్టుకొని కాలినడకన సీతాసమేతంగా మీ అన్నదమ్ములిద్దరూ వచ్చారు. ఆ రోజు మిమ్మల్ని ఆ స్థితిలో చూసినప్పుడు నా హృదయం ద్రవించిపోయింది. శత్రునిర్జనం చేసి చరితార్థుడిగా మిత్రగణబాంధవంగా సుఖంగా ఈ రోజున తిరిగి వచ్చావు.. రామా ! నిన్నిప్పుడు చూస్తుంటే నా ఆనందానికి అవధులు లేకుండా పోతున్నాయి అన్నాడు. రాముడు కృతజ్ఞతాపూర్వకంగా భరద్వాజుని ప్రశంసల్ని స్వీకరించాడు.

"మహాత్మా ! అయోధ్యానగరం సుభిక్షంగానే వుందా ? మా తల్లులు సుఖంగా వున్నారా...?" అనడిగాడు రాముడు."మా నగరానికి వెళ్ళేదారిలో వృక్షజాలం అమృతఫలవంతంగానే వున్నాయా... పశుసంతతి క్షీరధారలనందిస్తోన్నాయా... నదీనదాలు జలసమృద్ధినిస్తున్నాయా... అనడిగాడు. ఎన్నడూ ఫలించి ఎరుగని భూరుహాలు కూడా పూలూఫలాలనిస్తున్నాయని సమాధానం చెప్పాడు భరద్వాజుడు ! అయోధ్య సౌఖ్యాన్ని, రాముడి తల్లుల సౌఖ్యాన్ని వివరించాడు.

రాముడు భరద్వాజుని ఆశ్రమంలోనే కూర్చుని హనుమంతుడి కోసం విమానం దగ్గరకు కబురంపాడు.

హనుమంతుడు రాగానే భరద్వాజుడికి పరిచయం చేశాడు. యుద్ధంలో ఆయన పడిన శ్రమని వివరించాడు. "తక్షణం రాజధాని నగరానికి వెళ్ళి మన రాక గురించి నా తమ్ముడికి, నా తల్లులకూ తెలియచెయ్యి. మార్గమధ్యంలో శృంగిబేరపురం తగుల్తుంది. 'గుహుడు' దాని పాలకుడు. ఆయనక్కూడా నా రాక గురించి చెప్పు. ఆయన నా ఆత్మీయుల్లో ఒకడు. ఆత్మసముడు. నేను క్షేమంగా వచ్చానని తెలిసి ఆయన సంతోషిస్తాడు. పట్టాభిషేకానికి ఆయనకు కూడా నా ఆహ్వానాలు చెప్పు –

ఇంకో విషయం...

మా తమ్ముడు భరతుడికి నారాకని చెప్పేటప్పుడు, ఆయన ముఖకవళికల్ని గమనించు.. మారుతీ... తరతరాల పితృపితామహుల రాజ్యం అది... ఆయనకు వారసత్వంగా సంక్రమించింది. పద్నాలుగేళ్ళపాటు అనుభవించి, ఒక్కసారి వదులుకోవాల్సి వస్తుందని ఏమైనా బాధపడ్తున్నాడేమో ఊహించి పరిశీలించిచూడు. అలాంటిది ఏదైనా వుంటే, వెంటనే నాకు తెలియజేయవలసివుంది... గుర్తుపెట్టుకో... మేం అయోధ్యకు రాకమునుపే ఆ విషయం నాకు తెలియాలి... నువ్వు వెంటనే రాలేదంటే, అక్కడ అంతా సానుకూలంగా వున్నదనే నేను అర్థం చేసుకొంటాను" – అన్నాడు.

భరద్వాజుడి ఆశ్రమం నుంచే హనుమంతుడు కామరూపంలో వాయుమనో వేగాలతో అయోధ్యకు చేరిపోయాడు !

# హనుమంతుడికి కానుకగా కన్నెపిల్లలు

అగస్త్యుడి ఆశ్రమం నుంచి రాముడి పరివారం కన్నా ముందే హనుమంతుడు భరతుడి దగ్గరకు చేరుకున్నాడు. అరణ్యవాసంలో జరిగిందంతా ఆయనకు వివరించాడు. యుద్ధంలో సాధించిన విజయాలన్నీ ఏకరువు పెట్టాడు.

భరతుడు హనుమంతుడు తెచ్చిన వార్తకు సంతోషించి

**"ప్రియాఖ్యానస్య తే సౌమ్య దదామి... భార్యాః కన్యాశ్చ**
**షోడశహేమవర్ణాః ... సర్వాభరణ సంపన్నాః కుల జాతిభిః"**

అంటే, కన్యలుగావున్న పదహారు మంది స్త్రీలను కానుకగా ఇస్తానని ప్రశంసించాడు. బంగారు వర్ణం కల్గిన అందమైన ఆడపిల్లలట – మంచికులంలో పుట్టిన వాళ్ళట – సర్వాభరణ సంపదలతో భార్యలుగా ఇస్తానన్నాడు. అతను ఆ మాట అంటూండగానే భేరీభాంకారాలు మ్రోగాయి. శ్రీరాముడు సపరివారంగా పుష్పకవిమానంలో వేంచేశాడని వార్తలొచ్చాయి.

భరతుడు, హనుమంతుడు రాముడికి ఎదురేగి స్వాగతం పలకాలని త్వరత్వరగా బయటకు వచ్చేశారు.

ఈ హడావిడిలో భరతుడు తానిస్తానన్న కన్యకల్ని ఇచ్చే అవకాశం లేకపోయింది. "నాకెందుకయ్యా పదహారుమంది కన్యకలు - నేనసలే బ్రహ్మచారిని..." అని హనుమంతుడు అనే అవకాశం కూడా లేకపోయింది. ఆ విషయం అక్కడితో అలా ముగిసిపోయింది.

వాల్మీకి మహర్షి భరతుడు సుందరాంగుల్ని ఇస్తాననడమే రాశాడుగానీ, ఇచ్చినట్టూ రాయలేదు, హనుమంతుడు వద్దన్నట్లూ రాయలేదు.

ఇంతకీ హనుమంతుడు భరతుడి దగ్గరకు వెళ్ళి తేల్చవలసిన విషయం ఒకటుంది - "హనుమా! ముందుగా నువ్వు భరతుణ్ణి కలిసి, అతను తనే రాజుగా వుండదలచుకున్నాడా- రాజ్యాన్ని అప్పగించదలచుకున్నాడా... అనేది స్పష్టంగా కనుక్కొని ఏ సంగతీ వెంటనే వచ్చి చెప్పు"- అన్నాడు రాముడు. వేగంగా హనుమంతుడు భరతుని దగ్గరకు వచ్చాడు. భరతుడు రామభక్తిని ప్రదర్శించడంతో హనుమంతుడికి ఆ ప్రశ్న అడిగే అవకాశమే రాలేదు. అరణ్యకాండనీ, సుందరకాండనీ, యుద్ధకాండనీ వర్ణించిచెప్పడమే ఆయనకి సరిపోయింది. "మేము అయోధ్య దగ్గరకు వచ్చేలోపే ఏ సంగతీ నాకు చెప్పాలి" - అని ఆదేశించాడు రాముడు.

భరతుడితో కూడా అవసరమైతే యుద్ధానికి సన్నద్ధంగా వుండాలనేది రాముడి భావన. ఆయన ఎంతో ముందుచూపుతో, కీడెంచి మేలెంచాలనే పద్ధతిలో ఆలోచించాడు.

హనుమంతుడికీ ఆ విషయం అర్థం అయ్యింది.

కానీ, అయోధ్యకొచ్చాక ఇక్కడ అలాంటి పరిస్థితి లేదని స్పష్టమైపోయింది. రాముడు ఎప్పుడొస్తాడా - రాజ్యం ఎప్పుడు ఇచ్చేద్దామా... అని చెప్పులు సింహాసనంమీద పెట్టి కూర్చున్నవాణ్ణి నోరు తెరిచి రాముడు అడగమన్న ప్రశ్న అడగలేకపోయినట్లున్నాడు హనుమంతుడు.

హనుమంతుడు అడగకపోవడం గురించి, తిరిగివెళ్ళి అలాంటి వ్యతిరేక పరిస్థితులేమీ లేవని రాముడికి చెప్పకపోవడం గురించి, రాలేదేమని హనుమంతుణ్ణి రాముడు అడగకపోవడం గురించి, రాముడు, హనుమంతుడు ఆ విషయాన్ని ఎందుకు మరిచిపోయారనే విషయం గురించి వాల్మీకి ఏమీ రాయలేదు. హనుమంతుడు "బుద్ధిమతాం వరిష్టమ్" కదా! భరతుడికి రాజ్యకాంక్షలేనప్పుడు తిరిగివెళ్ళి చెప్పవలసినంత అవసరం లేదని అనిపించవచ్చు. "నువ్వు వెంటనే వెనక్కి వచ్చి తెలయజేయకపోతే, అంతా సవ్యంగానే వుందని నేను బయల్దేరి వచ్చేస్తాను-" అన్నాడు రాముడు. అందుకే హనుమంతుడు వెనక్కివెళ్ళలేదు.

# రామా! ఇవిగో నీ పాదరక్షలు

రాముడు రాముడు... అంటూ 'పెల్లురొద' పుట్టింది నగరం అంతా !

ఎక్కడ చూసినా కోలాహలం... నింగినంటుతున్న జయజయధ్వానాలు...

భరతుడు వేగంగా బయటికొచ్చి "అన్నా!" అంటూ రాముడి కాళ్ళను చుట్టేసుకుపోయాడు. మాట ఇచ్చినట్లే సరిగ్గా సమయానికి తిరిగొచ్చి మా ప్రాణాలు కాపాడావు. ఒక్కపూట ఆలస్యం చేసినా మేమంతా ప్రాయోపవేశం చేసేవాళ్ళం... అన్నాడు.

భరతుణ్ణి లేపి, ఆనంద పారవశ్యంతో తల నిమిరి కౌగిలించుకున్నాడు రాముడు. భరతుడు సీతకు నమస్కరించాడు. లక్ష్మణుణ్ణి పలకరించాడు.

రాముడు సుగ్రీవ జాంబవంతాదుల్నీ, విభీషణుణ్ణి పరిచయంచేశాడు. భరతుడు సుగ్రీవుణ్ణి కౌగిలించుకొని, మా ఐదోతమ్ముడివి అన్నాడు. విభీషణుడు తమ కుటుంబానికి చేసిన మేలుకు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. "లంకాధీశ్వరా ! ఇదంతా మా భాగ్యం" అన్నాడు.

అంతలో శత్రుఘ్నుడు కూడా వచ్చి సీతారాములకు, లక్ష్మణునికి మొక్కాడు.

రాముడు కౌసల్యాదేవి పాదాలకు నమస్కరించాడు. కైకనీ, సుమిత్రనూ ఆప్యాయంగా పలకరించి వారి పాదాలనూ స్పృశించాడు.

పురజనులు "కౌసల్యానందవర్ధనా ! రామా !! స్వాగతం !!!" అన్నారు.

అంతలో చెక చెక లోపలికి వెళ్ళిన భరతుడు స్వయంగా తన చేతులతో రాముడి పాదరక్షలు తీసుకొచ్చి- "రాజా ! ఇంతకాలం నా దగ్గర నువ్వుంచిన నీ రాజ్యం ఇదిగో... నీకు అప్పగించేస్తున్నాను"- అన్నాడు. "నీ కోశకోష్ఠాగారాలు, పురాలు, బలాలు అన్నీ పదింతలయ్యాయి - వాటన్నింటినీ నీకే అప్పగిస్తున్నాను" - అన్నాడు.

భరతుడి భక్తి శ్రద్ధలకి, దీక్షాదక్షతలకు కంటతడిపెట్టని వారులేరక్కడ. విభీషణుడు, సుగ్రీవుల కళ్ళలోంచి ఆనంద బిందువులు రాలాయి.

అక్కడినుంచి అందరూ విమానం ఎక్కి భరతుడు నివసించే నంది గ్రామానికి వెళ్ళారు. నంది గ్రామంలో భరతుడి ఇంటదిగిన తర్వాత రాముడు విమానంతో అన్నాడు !" "విమాన రాజమా ! నీవింక నీ అసలు యజమాని కుబేరుడి దగ్గరకు వెళ్ళు" అని.

విమానం రివ్వున ఎగిరి కుబేరుడి వైపు వెళ్ళిపోయింది.

రాముడు తిన్నగా వశిష్ఠుని దగ్గరకు వెళ్ళి ఆయన పాదాలకు మొక్కి భక్తిశ్రద్ధలను ప్రదర్శించాడు.

అంతలో క్షురకులు వచ్చి రామలక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు క్షురకర్మలు చేసి మంగళ స్నానాలు చేయించారు.

మొదట భరతుడికి, తర్వాత లక్ష్మణుడికీ, విభీషణుడికీ, సుగ్రీవుడికీ, చివరగా రాముడికీ స్నానాదులు చేయించారు.

సుగ్రీవ విభీషణులు కూడా ఇన్నాళ్ళూ యుద్ధరంగంలో ఉండిపోవడంతో క్షురకర్మలు లేక తలకాయలు మాసివున్నారు.

రాముడు స్నానం ఆడి తేజోవిరాజమానమైన ఒక సింహాసనంపైన కూర్చున్నాడు. దశరథుడి రాణులు ముగ్గురూ తమ కోడలు సీతాదేవిని తమ చేతులతో అలంకరించారు.

కౌసల్యాదేవి వెళ్ళి విమానంలో వచ్చిన వానరాంగనలందరినీ పలకరించి, వారికి కావల్సిన ఏర్పాట్లన్నీ చేయించింది.

సారథి సుమంతుడు సర్వాంగశోభిత రథాన్ని తీసుకువచ్చాడు. సీతారాములు ఆ రథాన్ని అధిష్టించారు. సుగ్రీవుడు, హనుమంతుడు అయోధ్యానగరం ఊరు చూద్దామని బయల్దేరి వెళ్ళారు.

ఆడవాళ్ళంతా స్నానాదుల ముగించుకొని సరదాగా కబుర్లు చెప్పుకుంటూ చుట్టుపక్కల విశేషాలు చూడాలని వెళ్ళారు.

మంత్రి పురోహితులంతా పట్టాభిషేకానికి కావలసిన సరుకులు సరంజామా ఏర్పాటు చేయడంలో మునిగిపోయారు.

మంగళోక్తులు చెలరేగాయి.

స్వస్తికాలు మార్మోగాయి.

సువర్ణాక్షతల పళ్ళాలతో కన్యకామణులు సిద్ధం అవుతున్నారు. అంతఃపురాన్ని సర్వాంగ సుందరంగా అలంకరించడం ప్రారంభం అయ్యింది.

రాముడు తన వెంట వచ్చిన వానర సైన్యంతోనూ, రాక్షస సైన్యంతోనూ, తన స్వంత చతురంగ బలాలతోనూ కలిసి అయోధ్యానగర ప్రవేశం చేశాడు.

సుగ్రీవుడికి తన మందిరంలో విడిది ఏర్పాటు చేయించాడు. సుగ్రీవుడు వాయుమనోవేగాలతో వెళ్ళగలిగిన నలుగురు వానర ప్రముఖుల్ని పిలిపించి, నలుగురికీ నాలుగు పాత్రలిచ్చి నాలుగు సముద్రాల నుంచి నీటిని పట్టి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. అలాగే జాంబవంతాదులు 50 నదుల్లోంచి నీటిని అప్పటికప్పుడు పట్టి తెచ్చారు.

తెల్లవారేసరికి అభిషేకం కోసం జలాలు సిద్ధం అయ్యాయి.

# రామ పట్టాభిషేక వైభవం

వశిష్ఠుడు సీతారాములిద్దరినీ రత్నమయమైన పీఠంమీద కూర్చోబెట్టాడు. వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు, విజయుడు... మొదలైన మహర్షులందరితో కలిసి ప్రసన్న సుగంధి బంధుర జలాలతో ఆ "మర్యాదా పురుషోత్తముడు"కి అభిషేక మంగళాలు చేయించారు.

ఆహూతులైన లోకపాలక దేవతలు ఆకాశంలోంచే దివ్యౌషధ రసాలతో రాముని అభిషేకించారు.

స్వర్ణఖచిత రత్న సింహాసనంపైన రాముడు సీతాసమేతంగా పట్టాభిషిక్తుడైనాడు. శతృఘ్నుడు, తెల్లగొడుగు పట్టి నిల్చున్నాడు. సుగ్రీవుడు, విభీషణుడు చెరొకవైపు నిలబడి చామరలు వీయసాగారు.

దేవగంధర్వులు పాడ్తున్నారు.

అప్సరసలు ఆడ్తున్నారు.

భూదేవి సస్యవతిగా శోభిల్లింది.

వృక్షరాశులు సంతోషంగా మాధుర్యాన్ని తమఫలాలలో నింపుకోసాగాయి.

నగరం అంతా సుగంధ పుష్ప మనోహరంగా మారిపోయింది.

ఎక్కడ చూసినా పండుగ వాతావరణం అలుముకొంది.

నాలుగు దిక్కుల నుంచి హుటాహుటిన సంకల్పమాత్రంగానే చేరుకోగల మహిమాన్వితులైన ఋషులు తరలివచ్చారు.

రాముడు వాళ్ళందరినీ యథార్హం సత్కరించాడు.

లక్ష గుర్రాల్ని, లక్ష ఆవుల్ని, నూరు ఆబోతుల్ని, మూడు కోట్ల బంగారు నాణాలనీ దానం చేశాడు.

కాంచనమాలని సుగ్రీవుడికి బహూకరించాడు.

వైఢూర్యాలు పొదిగిన బంగారు ఆభరణాన్ని అంగదుడికి కానుకగా ఇచ్చాడు. ఇంద్రుడు తనకు కానుకగా ఇచ్చిన ముత్యాల దండని సీతాదేవి చేతికిచ్చి, "జానకీ! పౌరుషమూ, బుద్ధీ ఎవరికి సహజ అలంకారాలుగా వున్నాయో, ఎవరిని చూసి నువ్వు ఎక్కువ సంతోషిస్తున్నావో ఆ వ్యక్తికి దీన్ని కానుకగా ఇవ్వు" - అన్నాడు.

క్షణం కూడా ఆలోచించకుండా సీత ఆ ముత్యాలదండని హనుమంతుడికి బహూకరించింది.

వానర వీరులందరినీ పేరు పేరున పిలిచి యథారీతిని సత్కరించారు సీతారాములు.

"సుగ్రీవా ! ఈ జాంబవంతుడు, అంగదుడు వీళ్ళంతా నాకోసం ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధపడ్డారు. వీళ్ళని ఎంతో ప్రేమగా నువ్వు చూసుకోవాలి. వీళ్ళ మనసు ఎట్టి పరిస్థితుల్లోనూ కష్టపెట్టకూడదు" - అని హెచ్చరించాడు.

విభీషణుడికి రాముడు ఇక్ష్వాకు కులధనమైన శ్రీరంగరాజ విమానాన్ని కానుకగా ఇచ్చాడు. "ధర్మజ్ఞా ! లంకానగర పాలనలో ధర్మాన్ని మరలనీయకు. ధర్మబద్ధులైన వారి రాజ్యాలు శాశ్వతాలు అవుతాయి" - అన్నాడు.

హనుమంతుడివైపు తిరిగి, "నీ ఋణం తీర్చుకోవడానికి వీలు కుదరని మహోప కారాలు చాలా చేశావు. నీకు ఏదైనా ప్రత్యుపకారం చేయాలని మనసు కోరుతోంది" - అంటూ తన మెడలోని చంద్రహారాన్ని తీసి హనుమంతుడి మెడలో వేశాడు.

హనుమంతుడు సాష్టాంగపడి, "స్వామి! నీ మీద నా భక్తిశ్రద్ధలు సుస్థిరంగా వుండేలా, నీ కథ ఈ భూమ్మీద నిలిచివున్నంత కాలం నేను కూడా నిలిచివుండేలా వరం ఇవ్వండి" - అని వేడుకున్నాడు.

రాముడు హనుమంతుని భక్తికి సంతోషించాడు. "లోకం వున్నంతకాలం నా కథ నిలిచివుంటుంది. నా కథ వున్నంతకాలం నువ్వు జీవించివుంటావు. నువ్వు చిరంజీవివి" అని ఆశీర్వదించాడు.

ఒక్కొక్కరినీ సాగనంపాడు రాముడు.

అందరూ నిష్క్రమించారు.

రాముడు లక్ష్మణుడితో, "తమ్ముడూ ! ఆరోజున మన తండ్రి నాకు పట్టాభిషేకాన్ని ఏర్పాటు చేసినప్పుడు నేను నీతో ఒక మాట అన్నాను 'నువ్వుకూడా నాతో కలిసి ఈ పురాన్ని పాలించు' - అని ! గుర్తున్నదా ! అదేమాట ఇప్పుడు మళ్ళీ అంటున్నాను. ఈ రాజ్యానికి నువ్వు యువరాజుగా నాతో కలిసి ఈ రాజ్యభారాన్ని వహించు" - అని కోరాడు.

అప్పుడు లక్ష్మణుడు చెప్పిన సమాధానం గొప్పది -

"అన్నా! ఈ రాజ్యాన్ని ఇప్పటిదాకా రాజుగా పాలించినవాడు, రాజ్యపాలన భారాన్ని సమర్థవంతంగా నెరవేర్చినవాడు భరతుడు ! అతను మన రాజ్యాన్ని పదింతలు పెంచాడు కూడా ! యువరాజుగా వుండటానికి భరతుడే అర్హుడు. పైగా నాకన్నా పెద్దవాడు. అతనికే యువరాజు పదవిని ఇవ్వడం మంచిది. అదే న్యాయం కూడా!" అన్నాడు వినయంగా !

లక్ష్మణుడి కోరిక మీద భరతుడు బలవంతంగానే యువరాజు పదవి స్వీకరించడానికి అంగీకరించాడు.

భరతుడికి యువరాజ పట్టాభిషేకం జరిపించారు.

ఋషీంద్రులు, రాజర్షులు, బంధుమిత్ర సుహృజ్జనం అంతా తమ స్థావరాలకు తిరుగుప్రయాణం అయ్యారు.

రాముడి పాలనలో ధర్మం నాలుగు పాదాలా నడిచింది. ఆయురారోగ్య భోగభాగ్య సంపదలు వర్ధిల్లాయి !

ప్రజల్లో ఐకమత్యం ప్రబలింది !

రామకథలతో లోకం సుసంపన్నం అయ్యింది !!

